## శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు

(ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రధానపండితులు)

"[illegible] ... [illegible], [illegible] కాలాంశ [illegible] శేషయ్య ఫలమా, కవి [illegible] అనుసరించు [illegible] గ్రంథములలో మీరు రాచ [illegible]."

## శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు

(ఉస్మానియా విశ్వవిద్యాలయ ప్రధానపండితులు)

"... ...ఆంధ్రకవితరంగిణి కల్హణుని రాజతరంగిణివలె సారస్వతములో మైలురాయిగా ప్రకాశింపగలదు... ... ఆధారవస్తువివేచనలో మీ సునిశిత విజ్ఞానమును ప్రామాణీకరణవ్యుత్పత్తియు ద్యోతమగుచున్నది."

**ఆంధ్రపత్రిక:** "... ...శేషయ్యగారు నిష్పక్షపాత బుద్ధితో యదార్థమెంతయో గ్రహించడానికి అత్యధికంగా శ్రమపడ్డారు. అనుమాన ప్రమాణంతో కూడుకొన్న చరిత్రకు యిదమిద్ధమన్న నిర్ణయాలు మొండిగా చేసి చరిత్రకు అపకారం చేయకుండా చారిత్రక వస్తువులనందించి సూచనమాత్రం తన ఊహను చెప్పి పాఠకులకు నిర్ణయాలు సదవకాశమిచ్చారు. వీరి ప్రయత్నం ప్రశంసనీయమే"

**ఆంధ్రప్రభ:** "ఆంధ్రులకు సమగ్రమైన కవులచరిత్ర గ్రంథము లేని లోటు దీనితో తీరినట్లయినది. తక్కిన సంపుటములను కూడ త్వరలో వెలువరించడానికి తగిన ప్రోత్సాహం యివ్వవలసిన భారం ఆంధ్రులపైనున్నది"

## శ్రీ నేలటూరి వెంకటరమణయ్యగారు

(మదరాసు విశ్వవిద్యాలయము రిటైర్డు పండితులు)

"... ...తమ గ్రంథమువలన పూర్వవిమర్శకుల రచనలలో వెదకి [illegible] లేకపోయినది ఆంధ్రకవితరంగిణి యందు [illegible] పద్ధతి ఆధునాతన చరిత్ర రచనాపద్ధతి వంటిది. [illegible] కడు ప్రశంసనీయము."

## శతావధాని శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు:

“ఆంధ్రకవితరంగిణిని చాలభాగము చదివితిని. స్థూలదృష్టులకు మీ పరిశ్రమము గోచరించదేమోగాని తక్కిన యావదాంధ్రకవులతే గాదు. పండితులేకాదు, పామరులేకాదు పిల్లలెల్లరును కన్నుల నద్దుకొందురనియే నా యాశయము. ప్రపంచకమునకు మార్గదర్శీ మహర్షిః అనుచొప్పున శ్రీగురజాడవారీ యుద్యమమునకు పూనిరి. కొంతవఱకే కృతకృత్యులైరి. కానినేను ప్రత్యక్షముగా నెఱుంగుదును. మాకంటె సర్వదా కొంత పెద్దలైనను సమకాలీనులమే వీరేశలింగపంతులు గారారంభించి చాలవఱకు కృతకృత్యులైరి. తరువాత మీరు దీనికి నుపక్రమించిరి. ఇప్పటికి వారిద్దఱిని సూత్రకారులుగను, వృత్తికారులుగను భావించుచో మీకు భాష్యకార స్థానం లభించుననుకొంటిని...... భవతు, ఇప్పటికి భాష్యకారస్థానము మీదే. మీ యుద్దేశము సర్వదా జయప్రదమగుఁగాక! విద్యాశాఖాధికారులు మీ పరిశ్రమను గమనింతురుగాక—ఇంతే స్వస్తి.

## శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు, మద్రాసు.

“...మీ కవితరంగిణి చాలవరకు చదివితిని. అందు మీరు తీసికొనిన శ్రమ అపారము. దాని ప్రయోజన మపరిమితము. వెనుకటి విషయములే గాక ఆయా కవులనుగూర్చి యిటీవలి విమర్శనలమూలముగాను శాసనాదిపరిశోధనల మూలముగాను బయలుపడిన యనేక విషయములనుగూడ పొందుపరచి యాకవుల చరిత్రను సమగ్రము గావించితిరి. ఏవిషయమునను తీవ్రవాదములకు లోనుగాక నిష్పాక్షిక మగు చారిత్రకదృష్టిని నెలకొల్పుటకు మీరు చేసిన ప్రయత్నము మిగుల ప్రశంసనీయము. తక్కిన భాగములుకూడ త్వరలో ప్రకటితములగునని యాశించుచున్నాఁడను...”

# ఏతత్కవి కృతులు.

| | |
|---|---|
| సుగ్రేశనందిని | నవల |
| నవాబునందిని | ,, |
| విశ్వప్రయత్నము | ,, |
| శ్రీ | ,, |
| రాధారాణి | ,, |

హిందూలా (సమిష్టికుటుంబము)

మదరాసు లోకలుబోర్డుల ఆక్టు (రెండుసంపుటములు)

మదరాసు సహకారసంఘముల ఆక్టు

ఆంధ్రకవితరంగిణి (భాగములు)

# విషయసూచిక

# ఆంధ్రకవితరంగిణి



## 63. శ్రీనాథుఁడు

కవిసార్వభౌమబిరుదాంకితుఁడగు నీమహాకవి నియోగి బ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; భారద్వాజగోత్రుఁడు; కమలనాభ పౌత్రుఁడు; మారయామాత్యపుత్త్రుఁడు ఇతనితల్లి భీమాంబ.

—: ఈతని పాండిత్యము :—

ఇతఁడాంధ్రభాషయందు బహుకావ్యములను రచించిన మహామేధావి. తర్క-వ్యాకరణ శాస్త్రములయందు గొప్ప పండితుఁడు. ఆంధ్రకవిత్వమునఁ దిక్కనసోమయాజికిఁ దరువాతఁ బేర్కొనఁదగిన ప్రతిభాశాలి. ఈతనికి శిష్యుఁడును భార్యకుసోదరుఁడు నైన దగ్గుబల్లి దుగ్గనకవి తననాసికేతోపాఖ్యానమున శ్రీనాథునిఁగూర్చి యిట్లు చెప్పియున్నాఁడు.

సీ. సంస్కృత ప్రాకృత శౌరసేనీముఖ్య
భాషాపరిజ్ఞాన పాటవంబు
పన్నగపతి సార్వభౌమభాషిత మహా
భాష్యవిద్యా సమభ్యాసబలము
నక్షపాదకణాదపక్షిలో దీరత
న్యాయకళా కౌశలాతిశయము
శ్రుతిపురాణాగమ స్మృతిసాంఖ్యసిద్ధాంత
కబళనవ్యుత్పత్తి గౌరవంబు
పూర్వకవిముఖ్యవిరచితాపూర్వకావ్య
భావరససుధాచర్వణ ప్రౌఢతయును
గందళింపఁగఁ గాశికాఖండ నైష
ధప్రముఖవివిధ ప్రబంధములొనర్చి.

సీ. కవిసార్వభౌముఁడై కర్ణాటవిభుచేతఁ
గనకరత్నాభిషేకములు గనిన
శ్రీనాథసుకవి కూరిమిచేయుమఱిది
దుగ్గయకవి రాజ దగ్గుపల్లి.

* * *

ఈపద్యములనుబట్టిశ్రీనాథకవి తర్క వ్యాకరణసాంఖ్యాదిశాస్త్రములయందు నిరుపమాన పాండిత్యము గలవాఁడనియు, సంస్కృత ప్రాకృతాది భాషా ప్రపూర్ణుఁడనియు నెఱుంగనగుచున్నది. హరవిలాసమున "నధ్వర్యువేదశాఖాధీతినిష్ణాతు" అని చెప్పుకొనియుండుటచే నీమహాకవి కృష్ణయజుర్వేదమును సాంతముగాఁ బఠించిన వేదవిదుఁడని తెలియుచున్నది. అధ్వర్యువేదశాఖ యనఁగా కృష్ణయజుర్వేదము.

—: ఈ త ఁ డు ర చిం చి న గ్రం థ ము లు :—

ఈకవిశేఖరుఁ డాంధ్రమున రచించిన గ్రంథముల
నీక్రిందఁ బేర్కొనుచున్నాఁడను.

౧ మరుత్తరాట్చరిత్ర
౨ శాలివాహన సప్తశతి
౩ శృంగారనైషధము
౪ భీమేశ్వరపురాణము
౫ కాశీఖండము
౬ హరవిలాసము
౭ పల్నాటివీరచరిత్రము
౮ వీధినాటకము
౯ శివరాత్రిమాహాత్మ్యము
౧౦ పండితారాధ్యచరిత్రము
౧౧ నందనందన చరిత్రము
౧౨ మానసోల్లాసము
౧౩ ధనంజయ విజయము

ఇతఁడు సరస్వతీదేవ్యుపాసకుఁడు. శివభక్తుఁడు, కాని వైష్ణవమతమును ద్వేషించు వీరశైవుఁడు కాఁడు. అద్వైతి. ఈతఁడు రచించిన గ్రంథములలోఁ జాలభాగము శివపరమయినవి. ఇతరగ్రంథములలోఁగూడ విష్ణుకథలు వ్రాయవలసి వచ్చినప్పుడు వ్రాయకవిడిచిపెట్టియు, క్లుప్తీకరించియు, శివకథలను బెంచియు వ్రాసియున్నాఁడు.

## —: ఇ త ని జ న్మ స్థా న ము :—

ఈకవికిఁ బితామహుఁడైన కమలనాభామాత్యుఁడు, కవిపితామహుఁడనియు, సాహిత్యచక్రవర్తియనియు, పద్మపురాణ సంగ్రహమను కావ్యమును రచియించెననియు, శ్రీనాథకవిరచించిన యీక్రింది పద్యములవలనఁ దెలియుచున్నది.

తే. మాతృపితామహుఁ గవిపితామహునిఁ దలఁతుఁ
గలితకావ్యకళాలాభుఁ గమలనాభుఁ
జంద్రచందనమందార సదృశకీర్తి
సరససాహిత్య సామ్రాజ్యచక్రవర్తి. కాశీఖండము.

మ. కనకక్ష్మాధరధీరు వారిధితటీకాల్పట్టణాధీశ్వరున్
ఘనునిన్ బద్మపురాణసంగ్రహ కళాకావ్యప్రబంధాధిపున్
వినమత్కాకతిసార్వభౌముఁ గవితావిద్యాధరుం గొల్తు మా
యనుగుందాతఁ బ్రెదాత శ్రీకమలనాభామాత్యచూడామణిన్.
భీమేశ్వరపురాణము.

ఈకమలనాభామాత్యుఁడు రచించిన పద్మపురాణ మిప్పుడెచ్చటను గానరాదు. ఇతఁడు సముద్రతీరమం దున్నకాల్పట్టణమున కధీశ్వరుడైనట్లు పైపద్యములో నున్నది. కొన్నిప్రతులలో కాల్పట్టణమని యున్నది. కాని యీపట్టణ మేదిగనో తెలియలేదు. బ్రి శ్రీ. వీరేశలింగముపంతులుగారు 'క్రాలు' శబ్దమునకు "ప్రకాశించు" అను నర్థమును గ్రహించి క్రొత్తగాకట్టినపట్టణము ప్రకాశించుచుండును. కావున నెల్లూరు మండలమందు సముద్రతీరమున నున్న క్రొత్తపట్టణమే యీపట్టణమని యూహింపవచ్చునని కవులచరిత్రమున వ్రాసి యున్నారు. కాని యీయూహ సమంజసముగాఁ గన్పట్టుటలేదు. శ్రీనాథమహాకవి క్రొత్తశబ్దమును సూచించుటకు క్రాలు "క్రాలు" అనుశబ్దముల నుపయోగింపఁడు. ఈశబ్దము సంస్కృతపదసమాసమధ్య

మున నున్నది శ్రీనాథునివంటి మహాకవి యట్టిసమాసమును జేయఁడు. కాల్పట్టణమని పేరైనదై యుండవలయును లేదేని గ్రామనామమును సంస్కృతీకరించి సమాసము నైనచేసి యుండవలయును.

బ్రి. శ్రీ. వేటూరి ప్రభాకరశాస్త్రిలుగారు కృష్ణామండల మందలి "కాళీపట్టణము" శ్రీనాథుని జన్మస్థానమైయుండునని వ్రాసి యున్నారు.

శ్రీనాథకవి రచించిన భీమేశ్వరపురాణ కృతిపతియగు బెండపూడి యన్నయామాత్యుఁడు నుడివినట్లు చెప్పఁబడిన యీ క్రిందిపద్యములో నీకవి పాకనాటివాఁడైనట్లున్నది.

సీ. వినిపించినాఁడవు వేమభూపాలున
కఖిలపురాణ విద్యాగమములు
కల్పించినాఁడవు గాఢపాకం బైన
హర్షనైషధకావ్య మాంధ్రభాష
భాషించినాఁడవు బహుదేశబుధులతో
విద్యాపరీక్షణ వేళలందు
వెదచల్లినాఁడవు విశదకీర్తిస్ఫూర్తి
కర్పూరములు దిశాంగణములందుఁ

తే. పాకనాఁటింటివాఁడవు బాంధవుఁడవు
కమలనాభుని మనుమఁడ వమలమతివి
నాకుఁ గృపసేయు మొకప్రబంధంబు నీవు
కలితగుణగణ్య ! శ్రీనాథకవివరేణ్య !

శ్రీకొమర్రాజు లక్ష్మణరావుపంతులుగారు శ్రీనాథుని జన్మస్థానము, కలపటమను గ్రామమై యుండునని యూహించినారు. ఇదియే సత్యము గావచ్చుననియు, నీకలపట మిప్పుడు, సముద్రతీరమున లేక పోయినను పూర్వమది సముద్రతీరమై యుండుననియు, గలపటమునఁ

పాటి దిబ్బలు మొదలగు ప్రాచీనచిహ్నములు గన్పించుచున్నవనియు, వ్రాయుచుఁ "పాకనాఁటింటివాఁడవు" అను వాక్యములోని "పాకనాఁటి"యనునది దేశము కాదనియు, నది గృహనామమై యుండుననియు, గంజాముజిల్లా పర్లాకిమిడి పట్టణములో "పాకనాటి" వారు చతుర్థకులజు లున్నారనియు నట్టి యాయింటి పేరుగలవారు బ్రాహ్మణులలోఁగూడ నుండియుందురనియుఁ గావున శ్రీనాథునియింటి పేరు పాకనాటివారై యుండు ననియు శ్రీ శేకుమళ్లి అచ్యుతరావు పంతులుగారు వ్రాసియున్నారు. "పాకనాఁటింటివాఁడవు" అను వాక్యమునకుఁ బాకనాఁటి నియోగిశాఖా బ్రాహ్మణుఁడవు అనియర్థము చేసికొనవలయునేగాని యాశబ్దము నింటిపేరుగా గ్రహింపరాదని పలువురు పండితులభిప్రాయపడియున్నారు. అదియే సమంజసము

శ్రీ ప్రభాకరశాస్త్రులుగారు కాల్పట్టణశబ్దమును బ్రధానముగాఁ దీసికొని, యాశబ్దమున కించుమించుగా సరిపోవునట్లుచూచి కృష్ణామండలమందలి కాళీపట్నము శ్రీనాథునిజన్మస్థానమై యుండునని యూహించినారు పైజెప్పిన పాకనాఁటిబాధను వదల్చుకొనుటకై శ్రీనాథుని తాత యాపట్టణమం దుండవచ్చుననియు, శ్రీనాథుఁడో, అతని తండ్రియో, తాతయో పాకనాఁటికేఁగియుందురనియు సమాధానమొసంగినారు. అతనితండ్రి తాతలు వెలనాఁటి వారైనప్పుడు శ్రీనాథుఁడు కొంతకాలము పాకనాఁటియందున్నను పాకనాఁటివాఁడనని చెప్పుకొని యుండఁడు కుమారధూర్జటి తండ్రితాతలనుండి కాళహస్తిప్రాంతనివాసులైనట్లు కన్పట్టుచున్నను దాను పాకనాఁటివాఁడననియే చెప్పుకొనియున్నాఁడు శ్రీనాథునిపూర్వులు పాకనాఁటివారై తరువాత శ్రీనాథునితాత కాళీపట్టణమునకు వచ్చియుండెననినఁ గొంతవఱకు సమంజసముగనుండునేమో! ఈవాదములను జూచి—హేళనకొఱకో యేమో—శ్రీనాథుఁడు సింహళద్వీపవాసియనియు, వచ్చటఁ గాల్పట్టణమున్నదనియు శ్రీ కొత్తపల్లి సూర్యారావుగారు పరిషత్పత్రి

కలో వ్రాసియున్నారు. ఈపద్యమునే యుదాహరించుచు శ్రీసోమ శేఖరశర్మగారు సముద్రతీరగ్రామమును బట్టణమందురని భారతిలో వ్రాసియుండిరి.

ఈవాదములన్నియు సందమకులనలె నున్నవని పాఠకు లను కొనకమానరు. పాకనాంటిలోc గాల్పట్టణమో తచ్ఛబ్దార్థసూచక గ్రామమో లభించినcగాని సర్వజనసమ్మతమైన శ్రీనాథజన్మస్థానము స్థిరపడదు. తమనివాసగ్రామము చిన్నదైనను, పేరు సరిసముగాc గాన్పింపకపోయినను దానిని సంస్కృతీకరించి, వాడుచుండుట కవుల కభ్యాసము కంబముమెట్టను స్తంభగిరియనియుc బెనుగొండను ఘనాద్రియనియు కవులు వాడియున్నారు ఇంకను నిట్టియుదాహ రణముల ననేకముగc జూపవచ్చును. కాల్పట్టణ మనcగా నాకాల మున నదియొక పెద్దవర్తకస్థానమైన సముద్రతీర పట్టణమని యూ హించి దానికై వెదకిన లాభములేదు అది ప్రఖ్యాతి పట్టణ మైనచో నాపేరునే శ్రీనాథుc డుదాహరించియుండును దానిచిహ్న ములైన నిప్పుడుండకపోవు అది యొక చిన్నగ్రామమైయుండుననియుc దానికిcగమలానా భామాత్యుcడుకరణమై, పండితుcడై, ప్రజ్ఞావంతుcడై ప్రతాపరుద్రునికాలములో నాచుట్టు పక్కలనున్న కొంతప్రదేశమున కధికారమును సంపాదించియుండుననియుc దలంపవలసి యున్నది. గుంటూరుమండలమునందలి రేపల్లెతాలూకాలో నల్లూరను గ్రామ మొకటియున్నది. ఇది రేపల్లెకయిదుమైళ్ళదూరమునను సముద్రము నకుcబదిమైళ్ళదూరమున నున్నది. అయిదువందల సంవత్సరములకు బూర్వము సముద్రమీగ్రామమున కింకను సమీపమున నుండియుం డును. ఈగ్రామము పాకనాంటిలోనిదే యనవచ్చును. పాకనాcడు వెల నాcడు కమ్మనాcడులకు "పరిహద్దు"ల నిప్పుడు సరిగానిర్ణయింపలేము.

ఈనల్లూరునే శ్రీనాథుcడు కాల్పట్టణమనినాcడనినాయూహ. (నల్ల+ఊరు-నల్లూరు. నల్ల=కాల; ఊరు=పట్టణము. కాల+పట్ట

ణము = కాల్పట్టణము. నల్లత్రాచు = కాలసర్పమువలె) బాపట్ల తాలూకాయందలి దగ్గుబాడీతని యత్తవారినివాస మనియు నది యీ గ్రామమునకు సమీపములో నుండును. ఇదికూడ నూహలమీఁద నాధారపడినదే. ఇంతకంటెను మంచియాధారములమీఁద నాధారపడిన మఱియొక గ్రామము లభించినప్పుడు దీనిని త్యజింతము. అంత [illegible]దియే శ్రీనాథ జన్మస్థాన మనుకొందము. నల్లూరుగ్రామమిప్పుడు దాదాపు రెండువేల యకరములు భూమిపరిమితమును రెండు వేలు జనసంఖ్యయుఁ గలిగియున్నది. ఇది పాకనాటిలోనిది కాదని ఋజువయ్యేనేని దీనిని విడచివేయవచ్చును. ఆచార్య శ్రీవేలటూరి వెంకటరమణయ్యగారు శ్రీనాథుని జన్మస్థానము నెల్లూరు అని (భారతి—ఆంగీరస—మాఘము) వ్రాసియున్నారు. అవచితిప్పయసెట్టి తాత యగు పావాణిసెట్టినివాసము నెల్లూరగుటను శ్రీనాథుఁడు తిప్పయసెట్టికి బాల్యసఖుఁడగుటను నది శ్రీనాథుని జన్మస్థాన మనవొప్పునని వారి యభిప్రాయము. కాని "వారిధితటీకాల్పట్టణాధీశ్వరుఁ" డనువాక్యమునకార్థము వారి వ్యాసమునఁ జర్చింపలేదు. నెల్లూరును శ్రీనాథుఁడు విక్రమసింహపురమనియే చెప్పియున్నాఁడు. దానిని కాల్పట్టణమని వ్రాసియుండఁడు. పావాణిచెట్టి నెల్లూరువాస్తవ్యుఁడైనను అతని కుమారుఁడైన దేవయసెట్టి ప్రోలయవేమారెడ్డికిఁ బ్రాపై యద్దంకి వచ్చియుండును. అనపోతారెడ్డికాలములో రాజధానీనగరము కొండవీటికి మార్పఁబడినప్పు డాతనితోఁ బాటుగఁ గొండవీటికి వచ్చినను టకును నవకాశము కలదు, శ్రీనాథుఁడును తిప్పయసెట్టియుఁ గొండవీట బాల్యసఖులై యుండవచ్చును. ఇదమిత్థమని నిర్ణయింపలేము.

నెల్లూరు శ్రీనాథుని కాలమున "నల్లూరు" అని పిలువఁ బడుచుండెనా ? ద్రావిడకర్ణాటదేశములలో "నల్లూరు" అని పిలువఁబడు గ్రామములు చాలఁగలవు. నల్లూరు అనగా సుందరమైన గ్రామమని యర్థము. నెల్లూరునకు సముద్రమిప్పుడు దూరములోనున్నది. అప్పటి

కది సముద్రతీరమేమో! నెల్లూరు నల్లూరయినచో దానిని కాల్పట్టణమనియెనేమో! ఇవియన్నియు నూహలు—

—: శ్రీనాథుఁడు కన్నడుఁడా? :—

ఈవాదము లిట్లుండఁగా నీతనిజన్మస్థానము కర్ణాటక దేశమనియు, నీతఁడు కన్నడుఁడనియు నొకవాదము బయలుదేరినది. అట్లు వాదించువారికి భీమపురాణమందలి "ఎవ్వరేమన్న నందుర్ గాకేల కొఱఁత నాకవిత్వంబు నిజము కర్ణాటభాష" అనుపద్యపాదమును, కాశీఖండమందలి "కర్ణాటదేశకటకపద్మవనహేళి శ్రీనాథభట్టకవిని" అనుపద్యపాదమును, కర్ణాటప్రభువగు దేవరాయలను జూడఁబోయి నప్పుడెన్నాళ్ళకును నాతని దర్శనము కాకపోఁగా:—

శా. కుల్లాయుంచితిఁ గోక సుట్టితి మహాకూర్పాసమున్ దొడ్గితిన్
వెల్లుల్లిన్ దిలపిష్టమున్ మెసవితిన్ విశ్వస్త వడ్డింపఁగాఁ
జల్లా ( ? ) యంబలిఁ ద్రావితిన్ రుచులు దోసంబంచుఁ బోనాడితిన్
తల్లీ! కన్నడరాజ్యలక్ష్మి! దయలేదా? నేను శ్రీనాథుఁడన్॥

అని శ్రీనాథుఁడు చెప్పినచాటువునందలి తుదిపాదమును నాధారములు. ఈవాదమునందు స్వారస్యము లేదు. కర్ణాటకదేశమున సముద్రతీరస్థమైన కాల్పట్టణమును వారుచూపుటలేదు. కర్ణాటకదేశమున కేఁగినప్పుడు కన్నడరాజ్యలక్ష్మిని "తల్లీ" యని సంబోధించినంతమాత్రమున నాతనిది కర్ణాటకమని నిర్ణయింపరాదు. వెలనాఁటికవియో, పాకనాఁటిపండితుఁడో కర్ణాటకమునకుఁ బోయి కర్ణాటకరాజ్యరమను దల్లీయని సంబోధింపఁగూడదా? శ్రీనాథుఁడు రచించిన గ్రంథములన్నియు నాంధ్రమునందుండఁగా; "హర్షనైషధకావ్యమాంధ్రభాష" "కాశికాఖండమను మహాగ్రంథమేను దెనుఁగుఁ జేసెద" "శివపురాణంబు తెనుఁగుఁగా జేయు మొకటి" అని తనగ్రంథము లాంధ్రమని తెలుఁగని శ్రీనాథుఁడే చెప్పియుండఁగా; "నాకవిత్వంబు కర్ణాటభాష"యని యేదియో సందర్భమునఁ జెప్పినమాటను బట్టి యాతనిని గన్నడుఁ డనియనుట హాస్యాస్పదము.

భీమేశ్వరపురాణమునఁ సుకవినిరాకరణ మను పేరున నాల్గు పద్యములున్నవి. శ్రీనాథుఁడు కుకవినిరసన మని యే గ్రంథమునను బద్యములను వ్రాయలేదు. భీమపురాణమునకు ముందు రచించిన శృంగారనైషధహరవిలాసములలో లేదు. తరువాతరచించిన కాశీఖండమునందును లేదు. భీమేశ్వరపురాణమునఁ గూడ వ్రాయలేదనియు, నాతఁడు రచించిన చాటుపద్యములను విలేఖకులో ముద్రాపకులో యిందుఁ జేర్చిరనియు నాయుద్దేశము. ఈనాల్గుపద్యములలోను మొదటిది దక్క తక్కిన మూఁడుపద్యములలోఁ గుకవినింద యే కానికుకవినిరసనములేదు శివరాత్రి మాహాత్మ్యకృత్యాదిని సుకవి నిరసనము మూఁడు పద్యములయందున్నది. కాని యాకృత్యాది శ్రీనాథునిది కాదు.

భీమేశ్వరపురాణమునందలి నాల్గుపద్యములలోఁ గడపటిపద్యమిది.

తే. ప్రౌఢిఁ బరికింప సంస్కృతభాష యందు
పలుకు నుడికారమున నాంధ్రభాషయందు
నెవ్వ రేమన్న నందు రే గాకలకొలఁత
నాకవిత్వంబు నిజము కర్ణాటభాష.

ఈపద్యమును విలేఖకులు భీమేశ్వరపురాణమునఁ జేర్చిరను కొన్నను, నిందలితుదిపాదముపైఁ జర్చ యవసరమే యగుచున్నది. శ్రీనాథుఁ డేయుద్దేశముతోఁ దనది కర్ణాటభాషయని చెప్పినాఁడను నదియే ప్రశ్న. దీనిపైఁ బండితులలో భిన్నాభిప్రాయ మున్నది. ఇంనుగూర్చి వాదములింకను జరుగుచునే యున్నవి. క్రొత్తవి బయలు దేరుచున్నవి. ఆవాదములన్నిటి నిట వివరముగఁ దెలుపఁజాలను. "కర్-నాట" అని పదచ్ఛేదముచేసి ప్రాగుదీచీ. ప్రాగ్దక్షిణాంధ్ర దేశపుభాషయనియు, కర్నాడు అనగా నల్లనిప్రదేశమనియు, ఆప్రదేశములోనుండుభాషలో నాకవిత్వమున్నదని శ్రీనాథుఁడనియెననియు శ్రీకుందూరి ఈశ్వరదత్తుగారు. "(కర్ణ+అట) కర్ణసమీపమునఁ

జరించు=అనఁగా శ్రవణానందకర మగు భాషయేసుఁడీ" యని శ్రీబులుసు వెంకటరమణయ్యగారు. సంస్కృతమునుగాదు-తెలుఁగును గాదు-నాభాషకర్ణాటకమని తనకవిత్వధోరణినాక్షేపించువారికి శ్రీనాథుఁడు వెక్కిరింపుగాఁజెప్పినసమాధానమని శ్రీవీరేశలింగముపంతులుగారు. కర్ణాటభాషాసాంప్రదాయమును గలిగియుండుటచేతనుసంస్కృతాంధ్రశబ్దమిశ్రమను నందియుండుటచేతను గర్ణాటభాష యనినాఁడని శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు-ఇట్లే యనేకవిధములుగా బండితులు తలంచుచున్నారు మొత్తముమీఁద నీసందర్భమున శ్రీనాథుని యభిప్రాయమును సర్వసమ్మతముగఁ దెలియఁజెప్పుట సుకరమైనకార్యము కాదు ఈపద్యమును శ్రీనాథుఁడు చాటుపుగాఁ జెప్పెనని యోచించి సముచితార్థమును గ్రహింపవలసియున్నది.

శ్రీనాథుని నైషధాంధ్రీకరణమును జూచి ఆంధ్రప్రత్యయములు వినా తక్కినదంతయు సంస్కృతమేయనియు నీ డు-ము-వులు నీవు తీసికొని మానైషధమును మాకిమ్మని సంస్కృత పండితులు శ్రీనాథు నధిక్షేపించిరనియు నొకకథ కలదు. వారికి సమాధానముగా శ్రీనాథుఁ డీపద్యమును జెప్పెనని తోఁచుచున్నది. "శబ్దబోధినిబట్టి యిది సంస్కృతమే యని యనుకొనిన ననుకొనుఁడు మాటచాతురిని బట్టిమాత్రమే (ఆంధ్రప్రత్యయాదులనుజేర్చుట) యాంధ్రమనియనుకొనిన ననుకొనుఁడు. మీరేమనుకొనినను కొఱతలేదు. నాకవిత్వము సంస్కృతాంధ్ర మిశ్రమమయిన కర్ణాటభాషయని శ్రీనాథుఁ డనెనని తలంపవచ్చును. భీమపురాణముననే ఆంధ్రభాషను వేఱుగను కర్ణాటభాషను వేఱును శ్రీనాథుఁడుదలంచియున్నమాటకూడ నిజము-కాని యదలిపితోసంబంధించినది. ఆంధ్రమనినను దెలుఁగనినను అచ్చతెలుఁగని కొందఱియభిప్రాయము. అచ్చతెలుఁగు గాకుండ కేవలము సంస్కృతము గాకుండ సంస్కృత పదసమాసమిళితమై యాంధ్రప్రత్యయవిశిష్టమైనవాక్యజాలముచే నొప్పారుచున్న భాషను గర్ణాటభాషయనియాకాలమునఁ గొందఱు తలంచినట్లు కన్పట్టుచున్నది.

ఎలుగంటి పెద్దనార్యుఁడు, సంస్కృతములో వీరాచార్యులు రచియించిన గణితశాస్త్రమును దెలుఁగుభాషలోనికిఁ బరివర్తనము చేయుచుఁ దనది కర్ణాటకభాషయని యీక్రిందిపద్యములలోఁ జెప్పియున్నాఁడు.

శా. వీరాచార్యులు సంస్కృతాన గణశాల్విఖ్యాతిగాఁజేసెఁదా
నారూఢిం బది పావులూరి కవిమల్లుం డద్ది తెల్గించెనన్
బేరేకాని గుణింపలేరు గణికుల్ భిన్నప్రకీర్ణంబు లీ
తీరైనన్ నెలుగంటి పెద్దన యదిన్ దెల్పెన్ గుణింపన్ ధరన్.

క. హాటక మయిన ప్రకీర్ణము
పాటించి గుణింపఁ జేతు బహుపద్ధతులన్
గాటంబగు లెక్కలు క
ర్ణాటకమున వెలయు సూర్యనారాయణుఁడా!

తనభాషకర్ణాటకమనిచెప్పినయాంధ్రకవియింకొకఁడున్నాఁడు. ఆతని పేరిప్పుడు నాకుస్ఫురణకు వచ్చుటలేదు. శ్రీనాథుని యభిప్రాయముకూడ నదియే యని మనము సమాధానపడవచ్చును.

ఆచార్య నేలటూరి వేంకటరమణయ్యగారు "శ్రీనాథుఁడు కర్ణాటకుఁ డగుట నిస్సంశయము; కాని కన్నడిగుడు మాత్రము కాఁజాలఁడు. శ్రీనాథునికాలమున కర్ణాటక కన్నడ శబ్దములు సమానార్థకములుకావు. ఏనాఁడువిద్యారణ్యస్వామి విద్యానగర రాజ్యమును స్థాపించెనో ఆనాఁటినుండియు దక్షిణాంధ్ర దేశమునకుఁ గర్ణాటక నామమురూఢికెక్కినది. కర్ణాటకమను పేరు ప్రస్తుతపు బళ్లారి, అనంతపురము, కర్నూలు, కడప, చిత్తూరు, నెల్లూరు మండలములకుఁ జెల్లుచుండెను. ఈసందర్భమును జక్కగ గ్రహించిన వారగుటచే శ్రీవీరభద్రరావుపంతులుగారు దక్షిణాంధ్రదేశమునకుఁ గర్ణాట రాజ్యమను పేరుండెనని వ్రాసినారు. పాకనాఁటికి ఉత్తరముననుండు దేశమునకు

కర్ణాటకనామము శ్రీనాథునికాలమున లేదు....కర్ణాటకసామ్రాజ్యములోని కడపటిదైన దేశమునఁ బుట్టి యచ్చటిభాషనే మాటలాడువాడగుటచేతనే శ్రీనాథుఁడు కర్ణాటక రాజ్యలక్ష్మిని 'తల్లి' యనిసంబోధించినాడు. తత్కారణముననే అతనికవిత్వము కర్ణాటభాష యైనది. 'కర్ణాటకజనపద్మవనహేళి' యని చెప్పుకొన్నదియుఁ దమ్మాలమునవే..." అని వ్రాసియున్నారు. ఈవాక్యములనుబట్టి ఉత్తరాంధ్రమండలి భాషయాంధ్రమనియు, దక్షిణాంధ్రమండలిభాష కర్ణాటకమనియు శ్రీనాథునికాలమున వాడుచుండిరని యర్థమగుచున్నది కానియట్టి భేదము కావ్యములలోఁ గన్పట్టుటలేదు లిపియందునులేదు. తిక్కన సోమయాజియుఁ బాకనాటివాఁడే. నెల్లూరి నివాసియే. అతనికవిత్వమునుగూడఁ గర్ణాటభాష యనవలసివచ్చును. శ్రీనాథుని కవిత్వము 'కర్ణాటకసామ్రాజ్యములోనికడపటిదైన దేశమందలిభాష' యైనచో పాకనాటి కుత్తరముననుండు దేశమందలి భాషయేది? ఆభాషలో వెలువడిన గ్రంథములేవి? యను ప్రశ్న రాకమానదు. ఈ ప్రశ్నకుత్తరము గాన్పించుటలేదు. శ్రీవేంకటరాయశాస్త్రులు గారనినట్లు, సంస్కృతాంధ్రపదమిశ్రితమై కర్ణాటక సాంప్రదాయములను గలిగియుండుటవలన శ్రీనాథుఁడు కర్ణాటభాష యనెననిన నందుఁ గొంత యర్థమున్నది. కర్ణాటసాంప్రదాయము లేవియో కొన్నిపదములలోనో పద్యములలోనో యుండినంతమాత్రమున నది కర్ణాటభాష కానేరదు. ఇట్టిసాంప్రదాయములు తిక్కన, సోమన, నన్నచోడాది ప్రాచీనకవుల గ్రంథములలోఁ జాలఁగానున్నవి. అయినను వారెవ్వరును దమ కవిత్వము కర్ణాటభాష యని చెప్పియుండలేదు

సంస్కృతాంధ్రపద మిళితమైన భాషను మిశ్రమ భాషయని యనక శ్రీనాథుఁడు కర్ణాటభాష యనుటేల? యనునదియే ప్రధానమైన కఠిన ప్రశ్న. సంస్కృతశబ్దములును దేశీయములైన కన్నడ శబ్దములును గలిసిన భాషను గర్నాటక మని కన్నడిగులు వాడియున్నారు.

కేవలసంస్కృతముగాక కేవలము నచ్చతెలుఁగుగాక యారెంటికిని మిశ్రమభాషయని సూచించుటకే శ్రీనాథుఁడు కర్ణాటక మనినాఁడని తెలంప నలసియున్నది. ఈసమాధానము నిర్బాధకమైనది కాకపోవచ్చును. కాని పూర్వపక్షము సేయలేని సంశయరాహిత్య మగు నేకసమాధానము గోచరింపలేము. కావున దానినేగ్రహించితిము.

—: శ్రీనాథుని జననకాలము; గ్రంథరచనావయః కాలము :—

శ్రీనాథుఁడు క్రీ.శ. ౧౩౬౫ ప్రాంతమున జన్మించెనని కొందఱును ౧౩౮౦ ప్రాంత మీతనిజననకాలమని కొందఱును తలంచుచున్నారు. ఈ రెంటికిని వ్యత్యాసము విశేషముగా లేదు. కావున నీవిషయమున విశేషచర్చ యవసరము లేదు. దీనిని సరిగా నిర్ధారణము చేయుటకుఁ దగిన యాధారములును లేవు. అయినను. నీతనికృతులను గూర్చి వ్రాయునప్పు డీవిషయమును జర్చింపవచ్చును. ఈతఁ డేవయసున నేగ్రంథమును రచించినదియుఁ గాశీఖండమున నీక్రిందిపద్యము లోఁ జెప్పియున్నాఁడు.

సీ. చిన్నారి పొన్నారి చిఱుతకూఁకటినాఁడు
రచియించితి మరుత్తరాట్చరిత్ర
నూనూఁగుమీసాల నూత్నయౌవనమున
శాలివాహనసప్తశతి నుడివితి
సంతరించితి నిండుజవ్వనంబునయందు
హర్షనైషధకావ్య మాంధ్రభాషఁ
బ్రౌఢనిర్భరవయఃపరిపాకమునఁ గొని
యాడితి భీమనాయకుని మహిమ

గీ. ప్రాయమింతకు మిగులఁ గైవ్రాలకుండఁ
గాశికాఖండ మనుమహాగ్రంథ మేను
తెనుఁగుఁ జేసెదఁ గర్ణాటదేశకటక
పద్మవనహేళి శ్రీనాథభట్టసుకవి.

శ్రీనాథుఁడు చెప్పినయీకాలముల నీక్రిందివిధమున నీతనివయః కాలములుగా నిర్ధారణము చేయవచ్చును

| | | | |
|---|---|---|---|
| చిఱుతనూఁకటి | =౧౫ సంవత్సరములు | - | మరుత్తరాట్చరిత్ర |
| నూనూఁగుమీసాల నూత్నయౌవనము | =౧౭-౨౦ | ,, | - సప్తశతి |
| నిండుజవ్వనము | =౨౫-౩౫ | ,, | - నైషధము |
| ప్రౌఢనిర్భరవయః పరిపాకము | =౪౦-౪౫ | ,, | - భీమపురాణము |
| మిగులఁ గ్రైవాలని ప్రాయము | =౫౦-౫౫ | ,, | - కాశీఖండము |

ఈపద్యమునఁ బండితారాధ్యచరిత్రము లేదు. నైషధమునకుఁ బూర్వమే దీనిని రచించినాఁడు. కావుననది ౨౦-౨౫ నడుమ రచించె నని చెప్పవచ్చును. తక్కినగ్రంథరచనాకాలములవిషయమున వివాద మున్నదికావున వానిరచనాకాలము నాగ్రంథములనుగూర్చి వ్రాయు సందర్భమున జర్చించెదను. బ్ర. శ్రీ. వీరేశలింగముపంతులుగారు, కవు లచరిత్రమున శ్రీనాథుఁడు భీమఖండమును దనకఱువదిసంవత్సరము లు దాఁటినపిమ్మట రచియించెననియుఁ గాశీఖండమును డెబ్బదిసంవత్సర ముల ప్రాయమునఁ జేసియుండుననియు వ్రాసియున్నారు. దీనినిబట్టి ప్రౌఢనిర్భరవయఃపరిపాకమనఁగా ౬౦-౬౫ సంవత్సరములవయసనియు మిగులఁ గ్రైవాలనిప్రాయము ౬౫-౭౦ సంవత్సరములనియు శ్రీపంతు లుగారియభిప్రాయ మైనట్లు కన్పట్టుచున్నది. కానియది నాకు సమంజ సముగాఁ గన్పట్టలేదు.

## —: ఇతని గురువు :—

పన్నయతిక్కనలవలెనే, యీతఁడును దనగ్రంథములయందుఁ దనగురువునుగూర్చి యేమియుఁజెప్పియుండలేదు. కావుననీతనిగురువు

లవిషయములు మనకుఁ దెలియరాలేదు. ఖ్యాతమైన పద్మనాభామాత్యుఁడే యీతని కొకగురువని తలంపవచ్చును. కాశీఖండమున "ఘోడెరాయాంక సద్గురురాయక్షమేశ్వరస్వామి పదసమారాధనంబు" అని చెప్పియున్నాఁడు. గాని యీతఁడు శ్రీనాథునకు విద్యాగురువు కాఁడు. శ్రీనాథుఁడు రాజమహేంద్రవరము వచ్చినపిదప నీభీమగురువు నారాధించినట్లు కన్పట్టుచున్నది. ఈభీమగురువు పుష్పగిరి భద్రారెడ్డికిఁ గూడ గురువై యున్నాఁడు. ఇతనిది పట్టిస గ్రామమని తెలియుచున్నది.

## —: ఇతని జీవిత విధానము :—

ఈమహాపండితుఁడు తనజీవితమంతయు విద్యాగోష్ఠియందును, గావ్యరచనమునందును గడపి ధన్యతఁగాంచెను. ఇతనిజీవితకాలములో జాలభాగముకొండవీటిరెడ్లయాస్థానమునను, రాజమహేంద్రవరపురెడ్ల యాస్థానమునను బండితుఁడుగాఁ, గవిగానుండి తనయశమును దన ప్రభువులకీర్తిని జిరస్థాయిగావించెను. చతుర్విధ పురుషార్థములయందును నీతనికిఁ గాంక్ష మెండు. ప్రభువులనాశ్రయించి కనకాభిషేకము నంది విశేషధన మార్జించి, త్యాగభోగములకై దానిని వెచ్చించి, రెండవ పురుషార్థమునుసాధించెను. పండితుఁడై విద్యాదానమొనర్చి గ్రంథకర్తయై అతిథిపూజాది బ్రాహ్మణధర్మములను జక్కగానెరవేర్చి ప్రథమపురుషార్థమును సాధించెను. దేవతోపాసకుఁడై శివభక్తుఁడై నాల్గవ పురుషార్థమును జూఱగొనియెను. ఈతనినిగూర్చి చెప్పుకొనియెడికథలనుబట్టియు, నీతనికొన్నిరచనములనుబట్టియు, దృతీయపురుషార్థమునఁ గూడ నీతఁడు సంతృప్తుఁడయ్యెననియే చెప్పవచ్చును. మొత్తముమీఁద నితనిజీవితము గడుంగడు ధన్యమైనది. అవసానదినములలో నీతఁడు దారిద్ర్యముచే బాధపడియెను. ఆవిషయమును విడచినచో నీతని జన్మ సుఖమయమైనదనియే యెంచవచ్చును. ఈతనిగ్రంథములలో భగవదంకితమైన దేదియు లేదు.

—: కొండవీటి రెడ్డిరాజులతో నీతని సంబంధము :—

మొట్టమొదట నీతని కాశ్రయదాతలైన కొండవీటి రెడ్డిరాజుల వృత్తాంతమును గొంతయిటఁ జెప్పవలసియున్నది. ఎఱ్ఱాప్రెగ్గడ కవి చారిత్రమున నీరివంశవృక్షము నిచ్చి వీరియుదంతమును గొంత చెప్పి యున్నాడను. ఆవంశవృక్షములోని మూలపురుషుఁడగు ప్రోలయతోఁ గాని యాతనితనయులగు మాచయరెడ్డి మొదలుగా నైదుగురుకుమారులతోఁగాని శ్రీనాథునకు సంబంధములేదు. వారికాలమున నీతఁడు లేఁడు. అందులో మాచయరెడ్డికి, పోతారెడ్డి, పెదకోమటిరెడ్డి, నాగారెడ్డి యనుముగ్గురుకుమారులు. ఇందులో నడిమివాఁడగు పెదకోమటిరెడ్డికి వేమారెడ్డి మాచయరెడ్డియనునిరువురుతనయులు. వీరిలో వేమారెడ్డి పండితుఁడురసజ్ఞుఁడునై యుండెను. కొండవీటిరెడ్లలో మిగులఁ బ్రసిద్ధుఁడైన ప్రోలయవేమారెడ్డి కీతఁడన్నమనుమఁడు ఈయిరువురకును భేదము తెలియుటకై యాతనిని "ప్రోలయవేముఁడనియు, నీతనిని పెదకోమటివేముఁడనియు, దండ్రిపేరులతోఁజేర్చి చెప్పుచుందురు. వేమారెడ్డినామధేయు లింకను గొందఱున్నారు. వారితోఁగూడ నీశ్రీనాథచారిత్రమునకు సంబంధముకలదు. వారినిగూర్చి మున్ముందు చెప్పెదను.

ఈపెదకోమటి వేమారెడ్డిమంత్రులకుఁ గృతులనిచ్చి శ్రీనాథుఁ డీయాస్థానమునఁ బ్రవేశముగల్గించుకొని క్రమక్రమముగా నాయాస్థాన పండితుఁడై విద్యాధికారిగా నిరువదేండ్లు పనిచేసెను. ఈవేమారెడ్డి అమరుకమను సంస్కృతకావ్యమునకు వ్యాఖ్యరచించినవాఁడు అమరుకము పెద్దగ్రంథము కాకపోయినను, శృంగారరసప్రధాన మైనది. దీనికి వ్యాఖ్యలు పెక్కుకలవు. శ్రీశంకరాచార్యులు మండనమిశ్రుని భార్యతోఁ గళాశాస్త్రమున వాదముసేయుటకై పరకాయ ప్రవేశ విద్యచే మృతుఁడైన అమరుకుఁడను రాజుశరీరమునఁ బ్రవేశించి యున్నప్పు డీగ్రంథమును రచియించెనని కొందఱందురు. కొందఱిది

యమరుక కవియే రచించెనని చెప్పవలెను. ఇదియే సత్యమని నాయభి ప్రాయము. ఈయమరుక కావ్యమును నల్లురైదుగురు కవులాంగ్లీక రించి యున్నారు. ఈయమరుక వ్యాఖ్యానమును శ్రీనాథుఁడే రచి యించి, పెదకోమటి వేమారెడ్డి పేరు పెట్టెనని యొక కవదంతికలదు. ఈ వేమా రెడ్డి యాస్థానమున వామనభట్టను సంస్కృతకవి యుండెను. ఇతఁడు సంస్కృతమున "పార్వతీపరిణయ"మను ప్రబంధమును, వేమభూపాల చరితమను సంస్కృత గద్యకావ్యమును నలాభ్యుదయము మొదలుగా మరికొన్ని సంస్కృతకావ్యములను రచియించియుండెను. ఈ వేమ భూపాల చరితమునఁ గోమటిప్రోలయ మొదలుగ నీ వేమారెడ్డివఱకును గల రెడ్డిప్రభువుల చరిత్రములు వర్ణితము లయినవి. ఈవామనభట్టు అమరుకవ్యాఖ్యానమును రచియించి, వేమభూపాలుని పేరు పెట్టెనని కొందఱందురు. పండితుల నాదరించిన పండితప్రభువులందఱి యెడ ల నిట్టివదంతులు బయలువెడలుట సామాన్యవిషయము. అమరుక వ్యాఖ్యా కర్తృత్వముతో సంబంధించిన చర్చ యిటనప్రస్తుతము. ఈ వేమభూపాలుఁడు సాహిత్యచింతామణియను నలంకారగ్రంథమును రచించెను. శాతవాహనభూపతికృతి సప్తశతిలో నొకశతకమునకు టీక వ్రాసియుండెను. ఇంక నీతఁ డెన్నియో గ్రంథములను వ్యాఖ్యాన ములను రచించియున్నాఁడు. ఇతనికి సర్వజ్ఞచక్రవర్తియను బిరుద మున్నది.

శ్లో॥ "చూడామణి ర్నృపాణాం । మన్మథపరిపంథిశిఖరి దంభోళిః
సర్వజ్ఞచక్రవర్తీ! పెదకోమటి వేమభూపతి ర్జయతి॥"

ఆలపాడు శాసనము

ఈతఁడు గ్రంథములను రచించినప్పు డాస్థాన పండితులైన శ్రీనాథాదుల సాహాయ్యమును గైకొనినఁ గైకొనియుండును. ఉభ యుల గ్రంథములయందును సమానభావములుగల శ్లోకములును బద్య ములును గనవచ్చుచుండును. ఒక్కొక్కప్పుడిందలి శ్లోకములందును

నందలి కృతులింకను బహుళయుఁ గలదు. వారదియొక దోషముగాఁ బరిగణించియుండరు. దానినిబట్టి ప్రభువుసామర్థ్యమును శంకించుటయు నా గ్రంథకర్తృత్వము నాస్థానపండితులపైఁ బెట్టుటయుఁదగినంతసాక్ష్యముండినఁగాని యుచితము గాఁజాలదు. వామనభట్ట శ్రీనాథులు తమ గ్రంథములలోని భాగములను బరస్పర ముపయోగించుకొనియు ననుకరించియు గ్రంథరచనమును గావించిరి.

ఈపెదకోమటి వేమారెడ్డి క్రీ. శ. ౧౪౦౦ సంవత్సరప్రాంతమునఁ గొండవీడు సింహాసనమధిష్ఠించి, ౨౦ సంవత్సరములు రాజ్యము చేసెనని చరిత్రకారులు నిర్ణయించియున్నారు. శ్రీనాథుడితని యాస్థానమున విద్యాధికారిగా నింతకాలముండెను, నీతఁ డేగ్రంథమును నాతని కంకితము చేయలేదు. వేమారెడ్డియనంతరమున శ్రీనాథుఁడు రాజమహేంద్రవరమునందున్న దువ్వూరి రెడ్లయాస్థానమునఁ బ్రవేశించి యావంశీయుఁ డగు వీరభద్రారెడ్డికిఁ గాశీఖండము నంకితముచేసెను. ఈదువ్వూరిరెడ్లు కొండవీటిరెడ్లతో సంబంధబాంధవ్యములను నెఱపిన వారు. ఈ రెండువంశవృక్షములను నొక్కచోఁ జూచినఁగాని వీరి బాంధవ్యములు తెలియవు. ఈరెండువంశములతోను బాంధవ్యము గలసిన యింకనొక రెడ్డివంశమున్నది. దానినిగూడ నీక్రిందనిచ్చెదను. ఈమూడువంశములతోను శ్రీనాథచరిత్రమునకు సంబంధముకలదు. అందుచే నీవంశవృక్షముల నిటఁ జూపవలసియున్నది.

# రెడ్డి రాజుల వంశవృక్షము.

(౧)

- దేసటి వేమారెడ్డి
  - కోమటి ప్రోలయ = అన్నమాంబ
    - మాచయ
      - పోతారెడ్డి
        - వేమారెడ్డి (1400–1420
          - రాచవేమన 1421–1424
      - పెదకోమటి
        - వేమారెడ్డి (1400–1420
          - రాచవేమన 1421–1424
        - మాచయ
          - వేమారెడ్డి
          - తిప్పారెడ్డి
      - నాగారెడ్డి
    - (1320–1349) వేమారెడ్డి
      - అనపోతారెడ్డి (1350–1361)
      - కోమటిరెడ్డి
        - కుమారగిరిరెడ్డి (1380–1400)
          - అనపోతారెడ్డి
        - దొడ్డాంబ భర్త కాటయవేముఁడు
          - అనితల్లి
      - అనవేమారెడ్డి (1362–1380)
        - పుత్రిక ప్రోలభీమలింగము భార్య
          - పుత్రిక వేమాంబ అల్లాడరెడ్డి భార్య
      - దొడ్డాంబ భర్త కాటయ
        - కాటయవేముఁడు
        - దొడ్డాంబ భర్త
          - అనితల్లి
    - దొడ్డారెడ్డి
    - అన్నారెడ్డి
    - మల్లారెడ్డి

(౨)

- కాటయ
  - మాచయ
    - కాటయ (పోలయవేమారెడ్డికి అల్లుడు దొడ్డాంబ భర్త)
      - వేమారెడ్డి (అనపోతారెడ్డికి అల్లుడు దొడ్డాంబ భర్త కాటయవేమునికి నియామకుఁడు)
        - అనితల్లి

సంబంధము సులభముగాఁ దెలియుటకై "అనితల్లిని" మూఁడు తావులఁజూపితిని గాని ఈమె యేకవ్యక్తియే. ఈమె తండ్రియైన కాటయ వేముఁడును మూఁడు తావులఁ గన్పట్టుచున్నాఁడు. కాని యాతఁడు నేకవ్యక్తియే. కాటయవేముఁడు తన మేనమామయైన యనపోతారెడ్డి కుమార్తెను బరిణయమైనాఁడు. పైనఁజూపినయనితల్లి తండ్రి కాటయ వేముఁడనుమాట నిశ్చయము. ఆవిషయమున వివాదము లేదు కాని యనితల్లి జననినిగూర్చి యొక్కింత వివాదమున్నది. బ్ర. శ్రీ. వీరేశలింగము పంతులుగారు ఎఱ్ఱాప్రెగ్గడకవిచారిత్రమున నిచ్చిన వంశవృక్షములో ననితల్లిజనని మల్లాంబికయని చూపియున్నారు. శ్రీప్రభాకరశాస్త్రులు గారు శృంగార శ్రీనాథమునఁ గాటయవేమునకుఁ దల్లాంబిక, మల్లాంబిక, దొడ్డాంబికయను మువ్వురు భార్యలనియు, నందుఁ దల్లాంబికకుఁ గుమారగిరిరెడ్డియను కుమారుఁడును, దొడ్డాంబికయం దనితల్లియను కుమార్తెయుఁ గలిగిరని వ్రాయుచు "మల్లాంబికకు సంతానము కలదో లేదో తెలియదు. ఈమె కన్నిభదేవరాయనికుమార్తెయు ముక్కంటి రాజుతోఁబుట్టువునఁట. నాయూహన్యాయ్యమగు నేని కాటయవేమునకు హరిహరరాయలకూఁతు రింకొకతెకూడ భార్య యగును" అని వ్రాసియున్నారు. దీనినిబట్టి యనపోతారెడ్డి కుమార్తె పేరు సంశయాస్పదమగుచున్నది. శ్రీ పంతులువారి యాంధ్రకవుల చరిత్రము ౧౯౧౭ సంవత్సరమునను శృంగార శ్రీనాథము ౧౯౨౩ సంవత్సరమునను ముద్రితములైనవి. అనితల్లి మాతృవిషయమున భిన్నాభిప్రాయము లుండుటచే నిందునుగూర్చి యిటఁగొంత వ్రాయ వలసిన యవసరము గలుగుచున్నది. శ్రీనాథునాదరించినవారిలో నీయనితల్లి భర్తయొకఁడు. అనితల్లియత్తవారు దువ్వూరిరెడ్లు వారి వంశమునుగూడ నిక్రిందఁ గనుపరచి, యాపిమ్మట "ననితల్లి" తల్లి విషయమును బ్రస్తావింతును.

(3)




ఈ రెడ్లు దువ్వూరు వాస్తవ్యులగుటచే వీరిని దువ్వూరు రెడ్లని పిలిచెదరు. కాని వీరియింటిపేరు దేసటి వారయినట్లు నిశ్శంకకొమ్మనకవి దొడ్డారెడ్డి కంకితముచేసిన శివలీలావిలాసమునందలి యీక్రింది పద్యమునం జెప్పియున్నాఁడు.

ఉ. అందుజనించి మించిరి సమగ్రనిరూఢిఁ గ్రమక్రియం బలన్
మందరధీరు లాగతసమస్తపచారులు సంతతప్రజా
నందనకార్యకారులు గుణస్ఫుటహారులు ధర్మరక్షణా
మందవిచారు లంగజితమారులు దేసటు లన్యదారులై.

శ్రీనాథుఁడుకూడ వీరియింటిపేరు దేసటివారని కాశీఖండ తృతీయాశ్వాసాది నిట్లు చెప్పియున్నాఁడు.

క. శ్రీమద్దొంటి వంశ
గ్రామణి! మూర్ధాభిషిక్త కంఠీరవ! సు
త్రామవిభవ నైభవోన్నత!
హేమాహాంబా! ప్రియభద్రేశ్వపాలా!

పై వంశవృక్షమునందలి అల్లాడరెడ్డిభార్యయైన వేమాంబ, మొదటి వంశవృక్షములోని అనవేమారెడ్డికి దౌహిత్రి. అనవేమారెడ్డికిఁ బుత్రసంతతి లేదు. అతఁడు తనకుమార్తెను చోళభక్తిరాజు కుమారుఁడైన భీమలింగమున కిచ్చి పరిణయము చేసెను. ఈభీమలింగము క్షత్రియుఁడు. గోదావరీమండలమందలి యొకచిన్న సంస్థానమునకుఁ బ్రభువు. ఈదంపతులకుమార్తె వేమాంబ. ఈవేమాంబను అల్లాడరెడ్డి పరిణయమాడినట్లు శివలీలావిలాసమున క్రిందిపద్యములోఁ గలదు

మ. "ధరిత్రీనిధి యమ్మహారమణుఁ డొప్పన్ జోళభక్తిక్షితీ
శ్వరసూనుండగు భీమలింగమనుజేశ శ్రేష్ఠు సత్పుత్రి భా
స్వరకారుణ్య దశాజరావన విధాసంధాత్రి వేమాంబికన్
వరియించెం బతిభక్తి గౌరవదృఢవ్యాపార సత్యాంబికన్

దీనినిబట్టి యల్లాడరెడ్డిభార్య వేమాంబ అనవేమునకు దౌహిత్రి యని స్పష్టమగుచున్నది. ఇట్లుండఁగా శ్రీనాథుఁ డీమె యనవేమునకుఁ బౌత్రి యని కాశీఖండమున నీక్రిందిపద్యములోఁ దెలిపియున్నాఁడు.

మ. "అనవేమక్షితిపాలు పౌత్రియగు వేమాంబామహాదేవికిన్
ఘనుఁ డయ్యల్లడభూమిపాలునకు సంగ్రామస్థలీగాండివుల్
తనయుల్ వేమవిభుండు వీరవసుధాధ్యక్షుండు దొడ్డప్రభుం
డును గన్నయ్యయు బాహువిక్రమకళాటోపప్రతాపోద్ధతుల్.

ఈ కుమారుని కుమార్తెను పౌత్రియనియుఁ గుమార్తె కుమార్తెను దౌహిత్రియనియు లోకములో సామాన్యముగా వాడుచుందురు కాని యిచ్చట శ్రీనాథమహాకవి "పుత్రస్య పుత్ర్యావా అపత్యం పౌత్రీ." అనియుండుటచేఁ గుమార్తె కుమార్తెను బౌత్రియని యుపయోగించి

నాఁడని భావింపఁదగియున్నది. అంతియేగాని యనవేమునకుఁ గుమారుఁడుండెనని గాని యల్లాడరెడ్డిభార్య యాతనితనయ యనిగాని తెలంపరాదు. ఆకాలమున రాజవంశములో కన్యల నిచ్చి పుచ్చుకొనుట రెడ్లకును క్షత్రియులకును గలదని యీసంబంధముల వలనఁ దెలియుచున్నది. పైనఁజూపిన మూఁడు వంశవృక్షములను బరికించి చూచినచో నామూఁడు కుటుంబములును, నన్యోన్యసంబంధ బాంధవ్యములతో బీరకాయపీచువలె నలముకొనిపోయిన వనియు, నందులోఁ గోమటి ప్రోలయకుఁ బెద్దకుమారుఁడైన మాచయరెడ్డి శాఖతో మాత్రము నక్కినశాఖలకు బాంధవ్యములు గలియక వేఱుగా నున్నదనియుఁ దెలియఁగలదు. బాంధవ్యము గలియకపోవుట యటుండఁగ నీశాఖకును దక్కినశాఖలకును వైరముగలిగి యుండెను. ఈ మాచయశాఖలోని వేమారెడ్డియొద్దను నాతనికుమారుఁడైన రాచవేమునియొద్దను, శ్రీనాథుఁడు విద్యాధికారిగను నాస్థానకవిగనునున్నవాఁడు. వారియనంతరమున నాతఁడు దువ్వూరి రెడ్లయాస్థానము నందుండి అనితల్లిభర్తయైన వీరభద్రారెడ్డికిఁ గాశీఖండము నంకితముచేసెను అందుచేశ్రీనాథమహాకవికిఁ బైనఁజూపిన వంశవృక్షము లన్నిటితోను వానిశాఖలతోను సంబంధముకలదు. ఈరెడ్డిప్రభువుల చరిత్రమును దెలిసికొనినఁగాని శ్రీనాథుని చరిత్రము బోధపడదు.

—మాచయరెడ్డి శాఖ—

కోమటిప్రోలయ పెద్దకుమారుఁడైనమాచయ్యరెడ్డియొక్కయు నాతనికుమారులైనరెడ్డిపోతి, పెద్దకోమటి, నాగారెడ్డియను వారల యొక్కయు శాసనము లేమియుఁ గనుపడుటలేదు. పెదకోమటిరెడ్డి కుమారుఁడైన వేమారెడ్డిశాసనములైనను క్రీ. శ ౧౪౦౪ తరువాత గానికన్పట్టుటలేదు. దీనినిబట్టి యీమాచయరెడ్డిశాఖవారికి రాజ్యము లేదని కొందఱభిప్రాయపడుచున్నారు. మాచయరెడ్డికిఁ దమ్ముఁడైన వేమారెడ్డియే యద్దంకిపురము రాజధానిగా రెడ్డిరాజ్యసంస్థాపనమొనర్చిన ప్రఖ్యాత పురుషుఁడు. ఈతఁడు తనసోదరులకుఁ గొంతకొంత

ప్రదేశము నొసంగి వానిపైఁ బరిపాలనాధికారము నిచ్చియున్నట్లు మెక్కాన్జీగారి స్థానికచరిత్రమున వ్రాసియుంటిని. ఈశాఖవారల్లు సంప్రాప్తమైనరాజ్యమును పరిపాలించుకొనుచున్నట్లు తలంపవలసియున్నది. వీరిరాజధానినగర మేదియో తెలియలేదు. శాసనాధారము లేకపోవుటచే నీశాఖవారి కాలముకూడ సరిగా నిర్ధారణచేయలేము. ప్రోలయవేమారెడ్డి క్రీ. శ. ౧౩౨౦-౧౩౪౯ నడుమ రాజ్యముచేసినట్లు శాసనాధారములవలనఁ దెలియుచున్నది. రాజ్యసంపాదనము చేసిన ౧౩౨౦ నాఁటికీతని వయసు ౩౦ సంవత్సరము లనుకొంటిమేని యీతని జననము ౧౨౯౦ ప్రాంతమగును. అతఁడు ౬౦ సంవత్సరముల వయసున ౧౩౪౯ లోఁ జనిపోయియుండును. ఆవేమారెడ్డి కన్నగారియైన మాచయరెడ్డిజననము ౧౨౭౫ ప్రాంతమనియు, నితని రెండవ కుమారుఁడైన పెదకోమటిరెడ్డి జననము ౧౩౨౫ ప్రాంతమనియు, నితనితనయుఁడైన వేమారెడ్డిజననము ౧౩౬౦ ప్రాంతమనియు, నిశ్చయింపవచ్చును. కుమారగిరిరెడ్డి చనిపోవునాఁటికి వేమారెడ్డి ౪౦ సంవత్సరముల వయసు నందుండియుండును.

కుమారగిరిరెడ్డికి అనపోతభూపతి యనుకుమారుఁడున్నట్లు లోకల్ రికార్డులలో నున్న యొక యసంపూర్ణ శాసనమువలనఁ దెలియుచున్నది. (శృంగారశ్రీనాథము అనుబంధము. 8 వ పుట) కుమారగిరిరెడ్డి యనంతరమున నాతఁడు రాజ్యముచేసెననుట కాధారములులేవు. బహుశః తండ్రిజీవితకాలములోనే యాతఁడు చనిపోయియుండును. కుమారగిరిరెడ్డితోఁ బ్రోలయవేముని వంశ మంతరించినది. కుమారగిరి యనంతరముఁ గొండవీటిరాజ్యమునకు నుత్తరాధికారులు దాయాదులగు వేమారెడ్డిసోదరుల సంతతివారై యున్నారు. వేమారెడ్డి కగ్రజుఁడగు మాచయరెడ్డియొక్కయు, కనిష్ఠసోదరులగు నన్నారెడ్డి మల్లారెడ్డి యనువారలయొక్కయు, సంతతి యప్పటికిఁ జాలఁగానున్నది కాని యందులోఁ బెదకోమటివేమారెడ్డి పరాక్రమవంతుఁడును, మంత్రి వీరభటాదిసప్తాంగ సంయుతుఁడును నగుటచేఁ గొండవీటిసింహాసన

నాతనివశ మయినది. ఇది క్రీ. శ. ౧౪౦౦-౧౪౦౪ నడుమ జరిగినది. ఈ వేమారెడ్డి మరణకాలము ౧౪౨౦ ప్రాంతము.

కుమారగిరిరెడ్డి యాస్థానమున శ్రీనాథుని కేల
ప్రవేశము కలుగలేదు!

అనవోతారెడ్డికి మూఁడవ కుమారుఁడైన కుమారగిరిరెడ్డి పండితుఁడును బండిత పోషకుఁడునై యుండెను. ఏటేట వసంతోత్సవములు చేయించుచుండుటచే నితనికి వసంతరాయఁ డను నామాంతరము కలిగినది. ఇతనికి నాట్యశాస్త్రమునం దభిరుచి మెండు. ఇతఁడు వసంతరాజీయమను నాట్యశాస్త్రమును రచియించెను. "ఈతని సభయందు 'లకుమ' యను పేరుగల సాని నాట్యమాడుచుండెడిదఁట

శ్లో॥ జయతి సహమానో లోకాతీతః కుమారగిరిప్రభో
స్సదసి లకుమాదేవీ యస్య ప్రియాసదృశీ ప్రియా
నవ మభినయం నాట్యార్థానాం తనోతి సహస్రధా
వితరతి బహూ నర్థానర్థివ్రజాయ సహాశ్రయః

లకుమాదేవి వేశ్యగావచ్చును. వేలతెఱఁగుల నవనవాభినయములు చేయుచు వేలకొలఁదిగా నర్థిజనమునకు నామె ధన మొసఁగుచుండెడిదఁట"

(శృంగార శ్రీనాథము)

కుమారగిరికి బావమఱఁదియు, మంత్రియు, నగు కాటయవేమఁడు కూడఁ బండితుఁడు, బండితపోషకుఁడునై యుండెను. మహాకవి కాళిదాసు సంస్కృతమున రచించిన మూఁడు నాటకములకు నీ వేమారెడ్డి వ్యాఖ్యలను రచియించెను. అభిజ్ఞానశాకుంతల నాటకమునకుఁ గల వ్యాఖ్యలన్నిటిలో నీతని వ్యాఖ్యయే యుత్తమమయినదని ఖండాంతరులు గూడఁ గొనియాడి తమ భాషాంతరీకరణమున కీతని వ్యాఖ్యానమునే యాధారముగాఁ దీసికొనిరని చెప్పుదురు. ఈ వ్యాఖ్యలలోఁ గుమారగిరిరెడ్డి పాండిత్యమును గూర్చియు నాతని భోగలాలసతను గూర్చియు వర్ణించిన శ్లోకములున్నవి. గ్రంథవిస్తర భీతిచే నిందీయ లేదు.

ఇట్టిపండితులతో దాతలతో నిండియుండు నీకుమారగిరిరెడ్డియాస్థానమున శ్రీనాథునకుఁ బ్రవేశము గలుగకపోవుటకుఁ గారణ మాతఁ డప్పటికి పండితుఁడుగాక బాల్యమున నుండుటయేగాని వేఱుకాదు.

కుమారగిరిరెడ్డి రాజ్యకాలము క్రీ. శ. ౧౩౮౩-౧౪౦౦ శ్రీనాథుని జననకాలము ౧౩౮౦ ప్రాంతమని యాతనిగ్రంథములను బట్టి తెలియుచున్నది. కుమారగిరిరెడ్డి రాజ్యాంత వత్సరమున కీతని కిరువది సంవత్సరములకంటె నెక్కువ వయసులేదు అందుచే నీతఁడు కుమారగిరిరెడ్డి యాస్థానమునఁ బండితుఁడు గాలేదు.

-: శ్రీ నా థు ని వి ద్యా ధి కా ర ము :-

పెదకోమటి వేమభూపాలునికడ నిరువదిసంవత్సరములువిద్యాధికారిగా శ్రీనాథుఁ డుండెనని శాసనములవలనఁ దెలియుచున్నది. ఆకాలమున విద్యాధికారిగానుండి శ్రీనాథుఁడొనర్చిన కార్యములేవియో స్పష్టముగాఁ దెలియవు. కాని యీక్రిందివిధుల నాతఁడు నిర్వర్తించెనని యూహింపవచ్చును.

౧. ప్రభువుచేయుదానములకు శాసనములను వ్రాయుట.

౨. రాజసభలోఁ దీరికవేళల విద్యాగోష్ఠి.

౩. రాజసభకుఁ జనుదెంచు పండితులసామర్థ్యమును బరీక్షించి వారి వారికిఁ దగినట్లు బహుమానము లిప్పించుచుండుట.

౪. రాజుచదివెడి గ్రంథములలోఁ గఠినఘట్టముల కర్థవిచారణముచేసి స్పష్టార్థమును నిర్ణయించిచెప్పుట.

౫. రాజే వేనిగ్రంథములను రచించుచున్నచో, నందలితప్పొప్పుల నారసి సవరించుచు సాహాయ్య మొనర్చుచుండుట.

౬. రాజొసంగెడి సమస్యలను బూరించెడికవుల కృతులయందలి గుణాగుణములను దెలుపుచుండుట; స్వయముగా సమస్యలను బూరించుచుండుట.

౭. ప్రాచీనాధునాతన గ్రంథ సముదాయమునకుఁ బ్రతులను వ్రాయించుచు, వానినిబరీక్షించుచు, పుస్తకభాండాగారమును సంరక్షించుచుండుట, రాజునకుఁ బండితులకుఁ గావలసిన పుస్తకములఁ దెప్పించి యిప్పించుచుండుట.

౮. రాజపోషణమున నున్నపాఠశాలలను బరీక్షించుచుండుట. అందుఁ బండితులను నియోగించుచు వారివారి కుచితములగు వేతనముల నిప్పించుచుండుట

ఇత్యాదులు:

ఈయధికారములను నిర్వర్తింపుచు శ్రీనాథుఁడిరువదిసంవత్సరము లేకాధ్వరముగ విద్యాధికారి పదవియందుండి పేరుగాంచెను. ఈకాలమున నితడు నైషధముదక్క వేఱు గ్రంథరచనమును జేసినట్లు గాన్పింపదు. ధనంజయవిజయముకూడ నీకాలమున రచించెనేమో!

—: పెదకోమటివేముని శాసనము. :—

పెదకోమటివేముని శాసనము లింతవఱకుఁ బదుమూఁడు కాన్పించినవి. ఇవి చాలభాగము శ్రీనాథకృతములే. ఇవి యాంధ్రసాహిత్య పరిషత్పత్రికయందు ౫—౭ సంపుటములలోఁ బ్రకటితములైనవి. గ్రంథ గౌరవభీతిచే వాని నిట వ్రాయలేదు. అందలివివరముల నీక్రింద సంక్షిప్తముగ వ్రాసెదను.

౧. కల్వపాముల తామ్రశాసనము. శా. శ. ౧౩౨౬ తారణ సంవత్సర పౌష బ ౩౦ సూర్యగ్రహణకాలమునహారితసగోత్రుఁడును యజుర్వేదియుఁ గృష్ణవేణ్యానదీతీరమున యజ్ఞమొనర్చిన భీమేశ్వర సోమయాజికిఁ బ్రపౌత్రుఁడు మహావిద్వాంసుడు నగు పోతయపండితునకుఁ బౌత్రుఁడును గుండయార్యపుత్రుడును, బ్రహ్మ సూర్యాది సిద్ధాంతవేత్తయు గోదావరితీరమున జన్నమొర్చినట్టి పెద్దియజ్వకు త్రిలింగవిషయమున ఖండవాటియందలి కల్వపాముల యనుగ్రామమును దానమొసఁగ వ్రాయించినది. ఈపెద్దియజ్వ శా. శ. ౧౩౫౬

సంవత్సరమున ననవేమ మహీపాలునిచేఁ బచ్చని తాండిపట్టు గ్రామము నగ్రహారముగా, బడసెనఁట. కృష్ణామండలమున గుడివాడ తాలూకాలో 'కలవపాముల' యను గ్రామమున్నది. అదియే యిదియై యుండును.

౨. కనుకుఱ్ఱు తామ్రశాసనము: ఇదియుగల్వపాముల తామ్ర శాసనమునాఁడే శ్రీనాథుఁడే వ్రాసియుండెను. ప్రతిగ్రహీతృవిషయ మున్న రేకులభింపలేదు. ఈ గ్రామము బాపట్లతాలూకా పొన్నూరు నకు సమీపమున నున్నది.

౩. పొన్నుపల్లి తామ్రశాసనము: ఇదియును కల్వపాముల శాసనమును నొకదినముననే శ్రీనాథుఁడే వ్రాసెను. సూర్యగ్రహణ కాలమగుటచే నీమూఁడు గామములు నొకేసమయమున నీయఁబడి నవి అసిపల్లికలువచేఱు శాసనమునందలి ప్రతిగ్రహీతృ వంశము లోని పూర్వుఁడగు పరహితుని వంశమునందలివాఁ డైనపరహితా చార్యుని కుమారుఁడును, భారద్వాజ గోత్రుఁడును యజుశ్శాఖా ధ్యాయియుఁ బండిత శ్రేష్ఠుండును భూలోకధన్వంతరియు నగుభాస్క రార్యునకు వెలనాఁటి దేశమునఁ గొండపేటి సీమను గృష్ణవేణ్ణానదీ దక్షిణ తీరమునఁగల పొన్నుపల్లి వేమవరమను గ్రామమును దాన మొసంగిన ట్లీశాసనమువలనఁ దెలియును.

౪. పినపాడు తామ్రశాసనము:—దీనినిగూర్చి శ్రీప్రభాకర శాస్త్రులుగారు శృంగార శ్రీనాథమున నిట్లు వ్రాసియున్నారు.

"ఇదికూడ శాసనపరిశోధకులఁ బ్రయత్నమున బయల్పడినదే. కాని యొక్క రేకుమాత్రమే దొరకినది. అందీశ్లోకమున్నది.

శ్లో॥ దాతా కోమటివేమనామనృపతిః పాత్రంగుణశ్శంకరః
స్థానంచే త్పినవాడు రత్రతు కవి శ్రీనాథభట్టారకః
కాలశ్చే చ్ఛివరాత్రిపుణ్యసమయ స్సాక్షీమహాన్ శ్రీగిరి
శ్శ్రేయం కింనతు వర్ణ్యతే సుకవిభి శ్శృణ్వంతుతచ్ఛాసనమ్".

ఇందుఁ బ్రతిగ్రహీతయగు శంకరగురుని వంశమువా రిప్పుడుపినపాడు నందున్నారు. వారిప్పటి నారాధ్య సంతతివారఁట! కొన్నిపురుషాంతరములనుండి వారు లింగధారణము వర్జించినారు. దొరకిన యీశాసనపురేకు పయిఁగల గ్రంథభాగమున శాసనకాలము లేదు. కాని పినపాటిలోఁ బ్రతిగృహీతృపరంపరలోనివారగు మృత్యుంజయారాధ్యుల యింట నొకప్రాచీన తాళపత్త్రగ్రంథమున నీశాసనప్రస్తావము వ్రాయఁబడియున్నది. అందీశ్లోకము గలదు.

"శ్లో॥ శాకాబ్దే గిరినేత్రమూర్తి విధుకే సంవత్సరే పార్థివే
మాఘేఽస్మిన్ శివరాత్రిపుణ్యదివసే శ్రీవీరనారాయణః
తస్మై శ్శంకరదేశికాయ విదుషే ధవ్రాత్రినదీప్రాక్తటే
గ్రామం శ్రీపినపాడు ముత్తమమదాచంద్రమాతారకమ్"

తప్పక యీశ్లోకము మీఁదిశాసనములోనిదే యగును. శా. శ. ౧౩౨౭ అగు పార్థివసంవత్సర మాఘమహాశివరాత్రి పుణ్యకాలమునఁ బెదకోమటి వేమభూపాలుఁడు పినపాడుగ్రామమును శంకరదేశికునకు దానముచేసెనని యీఁదిశ్లోకమున కర్థము. శృంగారనైషధకృతిపతి శ్రీగురుశంకరమహావిద్యాగారవనిత్యవర్ధితాన్వయు యనివర్ణింపఁబడినాఁడు ఆశంకరమహాని యీశంకరదేశికుఁడగునేమో! ఈశాసనకావ్యకర్త శ్రీనాథుఁడే.

౮. శింగిపురశాసనము:—శ్రీనాథకృతము ౨౨ సంస్కృత శ్లోకములును ౩ సీసపద్యములును గలవు. శా. శ. ౧౩౩౧ విరోధి సం॥ ఫాల్గుణ బ ౨ శుక్రవారము శాసనకాలము పెదకోమటివేమారెడ్డి భార్య సూరాంబ యొకగొప్పతటాకమును ద్రవ్వించి, దానికి సంతానసముద్రమని పేరుపెట్టి యీశిలాశాసనమును వ్రాయించెను. శ్రీనాథుఁడు తటాకనిర్మాణమువలనఁ గలుగుపుణ్యమును దెలుపుసంస్కృతభారతానుశాసనికపర్వమందలి యీక్రిందిమూఁడు శ్లోకముల నీశాసనమునఁ జేర్చి తనబహుపురాణజ్ఞతను వెల్లడించినాఁడు.

"దేవా మనుష్యాః పితరో గంధర్వోరగరాక్షసాః
స్థావరాణిచ భూతాని సంశ్రయంతి జలాశయం
తటాకే యాయస్య గావస్తు పిబంతి తృషితాం జలం
మృగపక్షి మనుష్యాశ్చ సోశ్వమేధఫలం లభేత్
ఆస్ఫోటయంతి పితరః ప్రనృత్యంతి పితామహాః
అపినస్సకులేజాతో యస్తటాకం కరిష్యతి"

౬. ఆలపాడు శాసనము:—శ్రీనాథకృతము. శా. శ. ౧౩౩౪ నందన సంవత్సర మాఘమాసమునందు శివరాత్రినాఁడు (క్రీ. శ. ౧౪౧౩ జనేవరు నెల ౩౧వ తేదీ) వెలనాఁటిసీమలో తుంగభద్రానదీ తీరమందున్న యాలపాడను గ్రామము భారద్వాజ గోత్రుఁడైన విశ్వేశ్వరపండితునకు దానముపొందెను. ఈపండితునితండ్రి కవిసార్వభౌముఁడును, లక్ష్మీనృసింహ మంత్రిసిద్ధాంతి నైనమాధవభట్టు. ఇతనితండ్రి మహావిద్వాంసుఁడును వేదవిదుఁడునగు గుండయపండితుఁడు ఇతనితండ్రి మహామేధావియైన మాధవపండితుఁడు. సర్వజ్ఞ సింగమనాయనికిఁ జమత్కారమంజరియను నలంకారసాహిత్యలక్షణ గ్రంథమునుగృతియిచ్చినవాఁడు విశ్వేశ్వరపండితుఁడే... భారద్వాజ గోత్రుఁడే. ఈకాలమువాఁడే అందుచే నీయాలపాడు పరిగ్రహీత యావిశ్వేశ్వర పండితుఁడేమోయని యనుమానము కలుగుచున్నది. ఈవిషయమున నింకనుబరిశోధనమావశ్యకము. చమత్కారమంజరీ కర్తయగు విశ్వేశ్వర పండితుని తండ్రిపేరు తెలిసినచో నీసంశయము కొంత విడిపోవునుగాని నాకదిలభింపలేదు. ఆతఁడేయాతఁడైనచో సర్వజ్ఞసింగమనాయనిని జూచినప్పుడు గలిగిన పరిచయమును బట్టి విశ్వేశ్వర పండితుఁడు పెదకోమటివేముని యాస్థానమునకు వచ్చెననియు శ్రీనాథుఁడు తనప్రభువుతోఁ జెప్పి యాలపాడు నిప్పించెననియుఁ దలంపవచ్చును.

౭. రుద్రవరం తామ్రశాసనము :— శ్రీనాథకృతము శా. శ. ౧౩౪౧ వికారిసం॥ మార్గశిరమాసమున సూర్యుఁడు ధనస్సునందుఁ బ్రవేశించినప్పుడు, పోతియ్యభట్టునకు మనుమఁడును గుండయ భట్టునకుఁ బౌత్రుఁడును, పెద్దియజ్వకుఁ బుత్రుఁడును, గంగాధరజ్యోతిషిన కగ్రజన్ముఁడును బ్రహ్మగుప్తార్యభట్టాది సిద్ధాంతరహస్యైకవేదియునగు రామచంద్రజ్యోతిషికునకుఁ గోలభూమియందలి రుద్రవరమను గ్రామమును దానమొసంగి వ్రాయించినది ఇందలి ప్రతిగ్రహీత కల్వపాముల ప్రతిగ్రహీతయగు పెద్దియజ్వకుఁ బుత్రుఁడే.

౮. నందమూరు తామ్రశాసనము:— శ్రీనాథకృతము. శా.శ. ౧౩౩౩ ఖరసంవత్సర మార్గశిర శుక్లత్రయోదశీనాఁడు త్రిలింగవిషయమందలి కంఠేవాటాఖ్యసీమలోని నందమూరను గ్రామమును కల్వపాముల ప్రతిగ్రహీతయగు పెద్దియజ్వకు దానమొసంగి వ్రాయించినది. ఈశాసనము బాపట్లతాలూకా కోడితాడిపఱ్ఱు గ్రామమున దొరకినదఁట.

౯. పొట్లపాటి తామ్రశాసనము:— శా. శ. ౧౩౩౦ సర్వధారి సంవత్సరాశ్వయుజ మాసమున సూర్యోపరాగ సందర్భమున విసుపాటి రామభద్ర సోమయాజికి పొట్లపాడను గ్రామము నగ్రహారముగానిచ్చి వ్రాయించినది.

౧౦ పొన్నుపల్లిశాసనము:— శ్రీనాథకృతము:— శా.శ ౧౩౩౦ సర్వధారిసంవత్సరాశ్వయుజ మాసమున, పెదవిశ్వయార్యుని ప్రపౌత్రుఁడును, భట్టభాస్కరుని పౌత్రుఁడును, విశ్వయార్యుని పుత్రుఁడును కాశ్యపగోత్రుఁడును, తర్కమీమాంసవ్యాకరణ శాస్త్రములఁ బండితుఁడునగు సింగనార్యునకుఁ ద్రిలింగ విషయమందలి వెలనాఁటిలోని ద్విపిసీమను కృష్ణవేణ్ణానదీ తీరమందలి పొన్నుపల్లియనుగ్రామము నిచ్చి వ్రాయించినది.

౧౧. ముల్లగూరమ్మశాసనము:— ఇది రెండు సీసపద్యములు కలది. దీనిని పైననిచ్చియున్నాఁడను.

౧౨. కుఱుమూఁతుల శాసనము:— శా. శ ౧౩౨౬ శ్రావణ మాసమున చంద్రోపరాగసమయమున నా గ్రామమును దాశరథికి (దేవుఁడు కావచ్చును) దానమిచ్చెనని తెలుపును. ఈ గ్రామము గుంటూరు తాలూకాలో నున్నది. శాసనకృతికర్తపేరు లేదనియు నప్పటికి శ్రీనాథుఁడు విద్యాధికారిత్వోద్యోగమును బడసియుండకపోవచ్చుననియు శ్రీ ప్రభాకరశాస్త్రులుగారు వ్రాసియుండిరి.

౧౩. పుల్లరిబోడు శాసనము.— శ్రీనాథరచితము. శా. శ. ౧౩౩౭ మన్మథసంవత్సరమున జ్యేష్ఠశు ౧౫ నాఁడు పెదకోమటి వేముని కుమారుఁడైన రాచవేముఁడు, తనతల్లియైన సూరాంబ త్రవ్వించిన (ఫిరంగిపురశాసనము) సంతానవారధి యను తటాకమునకు నీరువచ్చుటకై జగనొబ్బగండ కాలువ త్రవ్వించిన ట్లొక సీసపద్యమున వ్రాయఁబడినది. ఆపద్యమిది:—

సీ. శాకాబ్దములు సహస్రంబును మున్నూట
 ముప్పదియేడును నొప్పుమిగుల
మహనీయమైనమన్మథవత్సరంబున
 మధుమాసమునఁ బూర్ణిమాదినమున
హేమాద్రి దానచింతామణి యరిరాయ
 బసవశంకరుఁ డాజి ఫల్గునుండు
సమదారిరాయవేశ్యాభుజంగుండు
 వేమయరాజవేమన త్రివేమనుండు
తల్లిసూరాంబచే సముత్పన్నమగుచుఁ
బరఁగు సంతానవార్ధికి వరుసగాఁగ
నొలయు గిరివాహినుల జగనొబ్బగండ
కాలువ ఘటించె నాతారకంబుగాఁగ.

ఈశాసనకాలమునాఁటికిఁ గోమటివేమయ జీవించియున్నాఁడు. అప్పటి కాతఁడు పెద్దవాఁడగుటచేఁ గుమారుఁడు యువరాజుగానుండి

రాజ్యభారమునువహించియీకాలువత్రవ్వించితనపేరట నీశాసనమును వ్రాయించియుండును. కుద్రవరము తామ్రశాసనమునుబట్టి పెదకోమటి వేమారెడ్డి శా. శ. ౧౩౪౧ తుదివఱకు జీవించి యుండుట స్పష్టము.

౧౪. శా. శ. ౧౩౨౩ వ సంవత్సరమునకు సరియైన క్రీ. శ. ౧౪౦౧ వ సంవత్సరమునఁ బెదకోమటి వేమభూపాలుఁడు సోమోపరాగమహాపుణ్యకాలమునందు, శాండిల్యకౌశికగోత్రసంభవు లగు ఎల్లేపెద్ది లక్ష్మణ దీక్షితులవారికిని షడ్దర్శనాలవల్లభ సోమయాజులు గారికిని పెదపూఁడి గ్రామమునగ్రహారముగానొసంగితామ్రశాసనము వ్రాయించియిచ్చెను.

ఆంధ్రులచరిత్రము.

పండితుఁడును, కవిపండితపోషకుఁడును, ధర్మాత్ముఁడును రాజనీతినిపుణుఁడును నగు నీపెదకోమటి వేమభూపాలుఁడు నిష్కంటకముగను ప్రజారంజకముగను రాజ్యముచేసి క్రీ. శ. ౧౪౨౦వ సంవత్సరమునఁ గీర్తిశేషుఁడయ్యెను. అనంతరమున నీతని తనయుఁడగు రాచవేముఁడు రాజయ్యెను. ఈతనినిగూర్చి యాంధ్రులచారిత్రమున నిట్లుకలదు.

—: రాచ వేమా రెడ్డి :—

"ఇతఁ డేసంవత్సరమున సింహాసనమెక్కెనో, ఏసంవత్సరమున మరణమునొందెనో, నిశ్చయముగాఁ జెప్పఁ జాలము. ఇతఁడునాల్గు సంవత్సరములుమాత్రమే పరిపాలనము చేసెనని కొండవీటిదండకవిలె యందు వ్రాయఁబడినది. మఱియు నాగ్రంథమునుబట్టి యీతని పరిపాలనము జనరంజక మైనదిగాఁ గన్పట్టదు. ఇతఁడు తనపూర్వుల మార్గమునుగాని తండ్రిమార్గమునుగాని యవలంబింపక తానొక క్రొత్త

మార్గమవలంబించి క్రొత్తపన్నులను విధించి ప్రజలను బాధించుచుండెనని సూచరిత్రము వాకొనుచున్నది. రాచవేమన ప్రజలపై పురుటిపన్ను విధించి క్రమముగా రాబట్టుచుండెననియు; తనభృత్యుండగు సవరము ఎల్లయ్యను బలిజనాయకునిపై పురుటిపన్ను వేసి బలాత్కారముగా వసూలుచేసికొనుమన నాతండాగ్రహించి యొకనాడు ముత్యాలమ్మగుడి కడ నాతనిఁ గత్తితోఁ బొడిచి చంపెననియుఁ బైదండకవిలె నుడువుచున్నది. దీనినిస్థిరపరచుటకు ప్రమాణగ్రంథమేమియుఁ గానరాదు. ఇది యెట్లైనను వేమని పరిపాలనము జనరంజకమైనది కాదనియు నత్యల్ప కాలములోనే కడముట్టెననియుమాత్రము మనము విశ్వసింపవచ్చును"

రాచవేమునికాలములో శ్రీనాథుండాతని యాస్థానమున నుండెనని చెప్పుటకు కాధారములులేవు. సమ్మనర్హములుకాని "వంశిపాతరాజు కతారికథ" యొకటి శ్రీనాథుండు రాచవేమునికడ నుండెనని చెప్పుచున్నది. ఎట్లయినను శ్రీనాథుండు పెదకోమటివేముండు గతించినవెంటనే తదాస్థానమును వీడియుండలేదనియు, రాచవేముండు చనిపోవువఱకు నరఁగా క్రీ. శ. ౧౪౨౪ వఱకును నందేయున్నాండనియు మనము విశ్వసింపవచ్చును. మొత్తముమీఁద శ్రీనాథుని యుక్తవయసు వచ్చినది మొదలు, ౨౫ సంవత్సరములు కొండవీడు రెడ్లకడ జీవితమును గడపి, యుండెననుట స్పష్టము. నడుమ నడుమ దేశసంచారము సేయుచున్నను, శ్రీనాథుఁ డీకాలమునఁ గొండవీటియందే నివాస ముండెనని చెప్పవచ్చును.

కొండవీటిరెడ్డిరాజులలో, మాచయరెడ్డిశాఖ రాచవేమునితోను వేమారెడ్డిశాఖ కుమారగిరిరెడ్డితోను నంతరించిపోయినవి. వేమారెడ్డికిఁదమ్ములగు నన్నారెడ్డియొక్కయు మల్లారెడ్డియొక్కయు శాఖలు కొంతయభివృద్ధిచెంది, కర్నాటకరాజులకు సామంతులై కొంతకాలము రాజ్యమునుచేసినట్లు కనబట్టుచున్నది. కాని యాశాఖలతో మనకిప్పుడు ప్రసక్తిలేదు. ఆశాఖలలో నాంధ్రకవులుకీర్తికాయులుగాఁ జేసిన

వారెవ్వరు నన్నట్లుగనృట్టదు. రెడ్డిప్రభువులరాజ్యకాలపరిమాణమును దెలుపు చాటునీసపద్య మొకటియున్నది. కానియది యప్రమాణ మగుటచే నిందీయ లేదు.

శ్రీనాథుఁడు రచించిగ్రంథముల కృతిపతులనుగూర్చి తెలిసికొనినచో నందు శ్రీనాథునిచరిత్రము కొంత గానఁబడును. కావున వారివిషయముల నిట వ్రాసెదను.

—: ఇతని కృతిపతులు :—

(౧) పండితారాధ్యచరితకృతిపతి మామిడి ప్రెగ్గడనామాత్యుఁడు:—ఈ మహాకవి రచించిన పండితారాధ్యచరితము బయలుపడక పోయినను, దీనిని మామిడి పెగడన మంత్రికిఁ గృతియిచ్చినట్లు నైషధమందలి యీ క్రిందిపద్యమువలనఁ దెలియుచున్నది.

క. జగము నుతింపఁగఁ జెప్పితి
ప్రెగడయ్యకు నాయనుంగుఁ బెద్దనకుఁ గృతుల్
నిగమార్థసారసంగ్రహ
మగు నా యారాధ్యచరిత మాదిగఁ బెక్కుల్.

ఈపద్యమునుబట్టి మామిడి ప్రెగడయ్యకుఁ బండితారాధ్య చరిత్రమే కాక మఱికొన్ని కృతుల నంకితము చేసినట్లు గనవచ్చు చున్నది. కాని యాకృతుల పేరులైనను మనకుఁ దెలియుట లేదు. పండితారాధ్యచరిత్రమునకుఁ బూర్వమురచించిన శాలివాహనసప్తశతికూడ నీప్రెగ్గడనకే కృతి యిచ్చెనేమో పెదకోమటివేమారెడ్డి యీసప్తశతియందలి కొంతభాగమునకు వ్యాఖ్యరచియించియుండుట వలన నీయూహకుఁ గొంతబలము కలుగుచున్నది.

శ్రీనాథుఁడు తానురచించిన శృంగార నైషధకావ్యమును మామిడి పెగడన తమ్ముఁడైన సింగనామాత్యునకుఁ గృతియిచ్చెను వీరు నియోగిబ్రాహ్మణులు; ఆపస్తంబసూత్రులు; భారద్వాజగోత్రులు వీరివంశవృక్షమిది:—




ఈవంశమునందలి మామిడిమంత్రినామమే తరువాతి వారికి గృహనామమైనట్లు కన్పట్టుచున్నది. నైషధమందలి పద్యములే, యీవంశవృక్షమున కాధారములు. చిట్టిపెద్దామాత్యుఁడు:—

"మ. కుటిలారాతినరాధిపధ్వజినికా కట్టాకి ధాటీమహా
పటహాధ్యానవిపాట్య మానదశదిగ్భాగుండు త్రైలోక్యసం
పుటపేటీపరిపూర్ణకీర్తి మయ కర్పూరపరికాండుండు శ్రీ
చిటిపెద్దప్రభుఁడొప్పె విక్రమపురీసింహాసనాధ్యాసియై."

యనుపద్యమునుబట్టి నెల్లూరుపట్టణవాసి యైనట్లు తెలియుచున్నది. ఇతనికాలము క్రీ శ. ౧౩౦౦ ప్రాంతము. అప్పుడు నెల్లూరునందు మనుమసిద్ధికుమారుఁడు రాజుగా నుండియుండును.

కృతిపతితండ్రియైన పెద్దనామాత్యుని, నాతనిభార్యయైన తల్లమాంబికను వర్ణించినమూఁడుపద్యముల నీక్రింద నుదాహరించుచున్నాఁడను.

మ. అనతారాతివసుంధరారమణసప్తాంగాపహారక్రియా
ఘనసంరంభవిజృంభమాణపటుదోః ఖర్జూద్వితీయార్జునుం
డనవేమాధిపురాజ్యభారభరణవ్యాపారదక్షుండు పె
ద్దనమంత్రీశుఁడు మామిడన్నసుతుఁ డేతన్మాత్రుఁడే చెప్పఁగాన్.

ఉ. తమ్ములు దన్ను మువ్వురును దైవముఁగా గురుఁగా మహానిధా
నమ్ముఁగ దాతఁగాఁ దమమనంబుల భావనచేసికొల్వ భా
గ్యమ్ముల కెల్ల నెల్లయయి కాంచెఁ బ్రసిద్ధి నృపప్రధానర
త్నమ్మగు మంత్రిపెద్దన యుదాత్తమతిన్ రఘురాము కైవడిన్.

సీ. గౌతమగోత్రవిఖ్యాతుఁ డాపస్తంబ
పరమసంయమిసూత్రపావనుండు
గారాపుపౌత్రుండు గంధవారణుఁ డగు
శ్రీకేతనామాత్యశేఖరునకు
పేషిణిహనుమంతబిరుదాంకుఁ డగు రాచ
వారికి నెయ్యంపు వరసుతుండు
చౌహత్తమల్లుండు దోహత్తనారాయ
ణుండు ఖండియరాయచండబిరుద

తే. మంత్రియల్లాడరాజును మహితపుణ్య
యన్నమాంబయుఁ దనకునత్యంతగరిమఁ
దల్లియును దండ్రియును గాఁగఁ దనరునట్టి
తల్లమాంబికాదేవి నుద్వాహమయ్యె.

ఈపద్యము వలనఁ గృతిపతితండ్రి యైన పెద్దనామాత్యుఁడు ప్రోలయ వేమునికుమారుఁడైన యనవేమారెడ్డికడ మంత్రిగా నున్నట్లు గన్పట్టుచున్నది.

పెద్దనామాత్యునిమామగారైన యల్లాడరాజును, నాతనితండ్రి తాతలును ప్రసిద్ధపురుషులైనట్లు పైసీసపద్యమువలనఁ దెలియుచున్నది. కాని వారివృత్తాంతము నాకుఁ దెలియరాలేదు. వీరినిగూర్చి పరిశోధ

నము గావింపవలసియున్నది. పై పద్యమునుబట్టి పెద్దనామాత్యుఁడు "అనవేమారెడ్డి" యొద్దమంత్రిగానున్నాఁడని తెలియుచున్నది. కొన్ని శాసనములలోను గొన్ని చాటువులలోను "పెద్దకోమటన్నవేమ" అని యుండుటచే పెదకోమటి + అన్నవేమ యని పదచ్ఛేదము చేసి, పెదకోమటి వేమునిఁగూడ "అనవేముఁడని" పిలుచుచుందురనికొంద అనుచున్నారు. కాని పెదకోమటి వేమారెడ్డియను పేరితనికి బహుళముగా వ్యాపకము నందుండుటచేతను, అనవేమారెడ్డియనఁగా ప్రోలయవేమునికుమారుఁడగు ననవేమారెడ్డియనియే వాడుకయుండుటను బట్టియుఁ బెద్దనామాత్యుఁడు ప్రోలయవేమునికుమారుఁడైన యనవేమారెడ్డియొద్దనే మంత్రిగానుండెనని నిశ్చయింతము. ఇతనితమ్ములైన వీరభద్రయ్య మారయ్య నామయ్యలలోఁ గడపటివాఁడగు నామయ్య వేమారెడ్డియొక్క కార్యభారమును వహించినవాఁడని శ్రీనాథుఁడీక్రిందిపద్యములోఁ జెప్పియున్నాఁడు.

శా. స్వామిద్రోహరగండలాంఛనునకున్ సంగ్రామగాండీవికిన్
వేమక్ష్మాపతికార్యభారకలనావిఖ్యాతసచ్ఛక్తికిన్
నామామాత్యున కన్యరాజనిటలాంతర్న్యస్తభాగ్యాక్షర
స్తోమాపాకరణప్రవీణునకు మంత్రుల్సాటియే యెవ్వరున్.

ఈ వేమారెడ్డి యెవ్వరో తెలిసికొనవలసియున్నది. ఈ వేమారెడ్డికి 'అన' శబ్దముచేర్చ లేదు. కావున నితఁడు పెదకోమటికుమారుఁడైన వేమారెడ్డియే యని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. ఈ వేమారెడ్డికిఁ గొండవీటిరాజ్యము కుమారగిరిరెడ్డి యనంతరమున సంక్రమించినను, నంతకుఁబూర్వ మాతనికి రాజ్యము లేకపోలేదు. రెడ్డిరాజ్యసంస్థాపకుఁడైన ప్రోలయవేమారెడ్డి తనయన్నదమ్ములకుఁగొంతకొంతరాజ్యము నిచ్చియున్నట్లు యెఱ్ఱాప్రెగడచారిత్రమున సోదాహరణముగా వ్రాసియున్నాఁడను. అతఁడు తనయన్నయైన మాచయరెడ్డికిఁ గొంతరాజ్యము నిచ్చియుండును. ఆరాజ్యము వంశపారంపర్య

ముగ వేమారెడ్డికి వచ్చియుండెను, కావున నీవేమారెడ్డి యొద్దనే నామయ, మంత్రిగా నుండెనని చెప్పవచ్చును పండితారాధ్యచరిత్ర కృతిపతియైన ప్రెగడనను, నతనికగ్రజుఁడైన వేమనామాత్యుని శ్రీనాథుఁడు నైషధకావ్యమునం దిట్లు వర్ణించియున్నాఁడు.

సీ. కాలకంఠకఠోరకంఠహుంకారంబు
చెవులు సోఁకనినాఁటిచిత్తభవుఁడు
కుపితరాఘవఘన క్రూరనారాచంబు
తనువునాఁటనినాఁటి వననిధిరాజు
క్రుద్ధకుంభోద్భవభ్రూలతాకౌటిల్య
విస్మృతిఁ గ్రుంగనినాఁటి వింధ్యశిఖరి
సింధురోద్దామఘోరవీరావేశ
విహ్వృతిఁగందనినాఁటి తుహినకరుఁడు

తే. చక్కఁదనమున గాంభీర్యసారమున ను
బ్రకటధైర్యకళాకలాపములయందు
దండనాయకచూడావతంస మైన
మంత్రి మామిడివేమనామాత్యుఁ డెలమి.

మ. తెగుఁ గ్రైహార మొనర్ప విక్రమకళాధౌరేయతాశాలి శ్రీ
ప్రెగడన్న ధ్వజినీశుఁ డంబునిధిగంభీరుండు శుంభద్విప
న్నగరద్వారకవాటపాటనవిధానప్రౌఢబాహార్గళా
యుగళుండాహవసవ్యసాచి ధరలో నొక్కండు పేరుక్కనన్.

ఈ రెండుపద్యములనుబట్టి వేమనామాత్యుఁడును, ప్రెగడన్నయు గొప్పదండాధిపులై రణశూరులైనట్లు తెలియుచున్నది. కాని యేరాజు కడ వీరుండిరో తెలియుట లేదు. వీరితండ్రియైన పెద్దనామాత్యుఁ డన వేమ మహీపాలుని యొద్దమంత్రిగా నున్నవాఁడు. కావున వీరుకూడ నన వేముని యొద్దనుండిన నుండవచ్చును. లేదా అనవేమునకుఁబిమ్మట

వేమయనామధారులలో, పెదకోమటివేముఁడే పెద్దవాఁడును ప్రతిభాశాలియుఁ గావున నాతనియొద్ద దండనాయకులుగను మంత్రులుగను నుండియుందురు. శాలివాహనసప్తశతి పండితారాధ్య చరిత్రములను శ్రీనాథుఁడు ౧౪౦౦-౧౪౦౫ నడుమ రచించియుండును.

—: (౭) శృంగారనైషధము—కృతిపతి—మామిడిసింగనామాత్యుఁడు :—

శ్రీనాథుఁడు రచించినశృంగారనైషధకృతిపతి, పండితారాధ్య చరిత్రకృతిపతి యగుపెద్దనమంత్రిసోదరుఁడైన సింగనామాత్యుఁడు. ఇతఁడు పెదకోమటి వేమునియొద్ద మంత్రిగానుండెను. పినతండ్రియైన నామయామాత్యుని యనంతరమున నీతఁడు మంత్రిత్వమును వహించి నట్లు కన్పట్టుచున్నది. ఇతఁడుపండితుఁడును, బండితపోషకుఁడునై యుండెను. ఇతనినిగూర్చి పెక్కుపద్యములను శ్రీనాథుఁడు వ్రాసి యున్నాఁడు. అందు రెండుపద్యముల నిట నుదాహరించెదను.

సీ. గగనకల్లోలినీకల్లోలమాలికా
హాల్లీసకములతో నవఘళించి
చరమసంధ్యాకాలసంఫుల్లమల్లికా
స్తబకపంక్తులతోడ సరసమాడి
శరదాగమారంభసంపూర్ణపూర్ణిమా
విమలచంద్రికలతో వియ్యమంది
బిసరుహాసనవధూపృథుపయోధరభార
హారవల్లరులతో నసఁగి పెనఁగి

తే. వెలయు నవ్వానియభిరామువిమలకీర్తి
యతఁడు త్రిభువనరాయవేశ్యాభుజంగ
కదనగాండీవి జగనొబ్బగండబిరుద
శాశ్వతుం డొప్పు సింగనసచివవరుఁడు.

మ. అనుదార న్వివిధాగ్రహారములతో నాందోళికాచ్ఛత్రచా
మరకల్యాణకళాచికాది బహుసమ్మానార్హచిహ్నంబు లా

దర మొప్పారఁగ వేమభూవరునిచేతం గాంచె సామ్రాజ్యసం
భరణప్రౌఢిమఁ డమాత్యసింగఁడు నయప్రాగల్భ్య గర్వోన్నతిన్.

సింగనామాత్యుని వర్ణించినపద్యములలో రెండుమూఁడుతావులయందీతఁడు "పాండ్యరాయగజకేసరి" యని చెప్పియున్నాఁడు. పెదకోమటివేమారెడ్డి పాండ్యదేశముపైకి దండువెడలిన ట్లాధారములు లేవు. పాండ్యరాజులు తఱచుగా నెల్లూరుగుంటూరు మండలములపై యుద్ధమునకు వచ్చిరని చరిత్రములు చెప్పుచున్నవి. పెదకోమటివేముని రాజ్యకాలములోఁగూడఁ బాండ్యులు గొండవీటిని జయింపఁగోరి వచ్చియుందురు. అప్పుడీసింగనామాత్యుఁడు వారిని జయించియుండును. ఈకాలమెప్పుడో తెలిసినచో నది నైషధరచనాకాలనిర్ణయమున నుపకరించును.

ఈసింగనామాత్యుఁడు జ్యోతిషమున సిద్ధాంత భాగమును బూర్తిగ నెఱింగిన ప్రజ్ఞావంతుఁడనియు. సోమసిద్ధాంతమున కీతఁడు వ్యాఖ్యవ్రాసెననియుఁ జెప్పుదురు. ఇతఁడు శంకరపాణి శిష్యుఁడని నైషధమున షష్ఠాశ్వాసాదిపద్యములవలనఁ దెలియుచున్నది. ఎఱ్ఱాప్రెగ్గడ కూడ శంకరపాణి శిష్యుఁడే కాని యాతఁ డీతఁడు కాఁడు. వీరిరువురి నడుమ నూఱుసంవత్సరముల వ్యత్యాస మున్నది.

"క్లిష్టార్థమగు సోమసిద్ధాంతమున కీతఁడు రచించిన వ్యాఖ్యానము క్రొత్తగా నిప్పు డుపలబ్ధ మైనది. తనవృత్తాంతము నాతఁ డందిట్లు చెప్పుకొన్నాఁడు.

శ్లో. అస్తి శ్రీమద్భరద్వాజగోత్రశ్రోత్రియభూషణమ్
నప్తా శ్రీచిట్టయాఖ్యస్య పౌత్రో మామిడిమంత్రిణః
తనుజః పెద్దనార్యస్య శ్రీనృసింహో మహాయశాః
పెదకోమటివేమేం దమంత్రిణా తేన ధీమతా
జ్యోతిర్విద్యా నిరాఘాట సరస్వత్పారదృశ్వనా
సింగయామాత్యరత్నేన భువిలోకహితైషిణా
క్రియతే సోమసిద్ధాంత వ్యాఖ్యా గూఢార్థదీపికా.

ఈవ్యాఖ్యానము నితఁడు క్రీ. శ. ౧౪౧౫వ సంవత్సరమున రచించి నట్లు చెప్పుకొన్నాఁడు”

శృంగారశ్రీనాథము. పుట ౫౧

—: నైషధరచనాకాలము :—

సీ. తే “పరఁగు శ్రీ వేమమండలేశ్వరునిమంత్రి
యహితదుర్మంత్రిజనవనదావతార
శాసనుఁడు రాయవేశ్యాభుజంగబిరుద
మంత్రి పెద్దయసింగ నామాత్యవరుఁడు.

అనుపద్యమునుబట్టి నైషధరచనాకాలమునాఁటికిఁ బెదకోమటి వేముఁడు మండలేశ్వరుఁడుగానే యున్నాఁడనియు, నప్పటికిఁ గుమారగిరిరెడ్డి చనిపోలేదనియుఁ గొండవీటిరాజ్య మావేమారెడ్డికి సంక్రమింపలేదనియు, నాతనికప్పటికి గొండవీడురాజ్యమువచ్చియున్నచో నాతనిని జక్రవర్తియనియే శ్రీనాథుఁడు చెప్పియుండుననియుఁ గొంద ఱనుచున్నారు. ఇది సత్యమయినచోఁ గుమారగిరిరెడ్డి క్రీ. శ. ౧౪౦౦ ప్రాంతమునఁ జనిపోయెను. కావున నంతకుముందే నైషధ రచనము జరిగియుండునని చెప్పవలసియున్నది. నైషధమునయెచ్చటను గొండవీడు ప్రస్తావము లేదనియుఁ గొండవీడురాజ్యము పెదకోమటివేమునకు సంక్రమింపక పూర్వమాతనికిఁ గొంతరాజ్యము లేకపోలేదనియుఁ గొండవీటిరాజుల కాతఁడు సామంతుఁడైనను గాకపోయినను గుమారగిరిరెడ్డికాలమున నాతఁడొక చిన్నదేశపరిపాలకుఁడుగా నుండినమాట నిజమనియు నందుచే నాతఁడు సామాన్యమండలేశ్వరుఁడుగా నైషధమున జెప్పఁబడియెననియుఁగావున నాకాలముననే నైషధము రచియింపఁబడినట్లు తలంపవలయునని వారివాదము. చక్రవర్తి, రాజాధిరాజు, ఇత్యాదిశబ్దములచే విశేషభూపరిపాలకులను వర్ణించుటయు, సామంతప్రభువనియు, మండలేశ్వరుఁడనియుస్వల్ప భూభాగపరిపాలకులను బిలుచుటయుఁ గలదు. కాని యీనియమమును

సర్వతో ప్రవర్తింపఁజేయరాదు. అవక్రపరాక్రమముచే నాంధ్రదేశము నేకచ్ఛత్రముగఁ బరిపాలించిన ద్వితీయప్రతాపరుద్ర చక్రవర్తిని మండలేశ్వరుఁడని కొన్నిశాసనములలో వ్రాసియున్నారు.

ఇట్టియుదాహరణముల నింకను జూపవచ్చును. అందుచేసి శబ్దమునుబట్టి నైషధరచనాకాలమును నిర్ణయింపలేము. ఇదియుఁగాక నైషధమున సింగనామాత్యుని వర్ణించిన పద్యములలో, "సామ్రాజ్య సంభరణ ప్రౌఢుఁ డమాత్యసింగఁ"డనియు

క. శ్రీరాజరాజవేమ
క్ష్మారమణకృపాకటాక్షసంవర్ధిత ల
క్ష్మీరక్షితబుధలోక! యు
దారగుణాధార! సింగనామాత్యనిధీ!"

యనియు, "వేమభూపతిమహాసామ్రాజ్యరక్షామణి" యనియు

"శ్రీరెడ్డివేమవిశ్వ
క్ష్మారమణకృపావిశేషసమధిగతైశ్వ
ర్యారూఢవిభవశ్రీంగా"

యనియుఁ జెప్పియుండుటచేతను, కొండవీటిరాజ్యగ్రహణానంతరమున వ్రాయించిన వేమభూపాలునిశాసనములలోఁ గూడ నింతకంటె నాధిక్యమును సూచించువిశేషణము లుపయోగింపకుండుటను బట్టియు, నైషధరచనాకాలము నాఁటికి వేమారెడ్డి కొండవీటిసింహాసనమునధిష్ఠించి యున్నాఁడనియే విశ్వసింపవచ్చును పాండ్యచక్రవర్తి, కొండవీటిమహారాజ్యముపైకి దండెత్తివచ్చినాఁ డనుటయు, నాతనిని వేమభూపాలుఁ డెదుర్కొని యోడించినాఁడనుటయు, నారణములో సింగనామాత్యుఁడు పాల్గొని "పాండ్యగజపంచాస్యు" డయ్యెననుటయు సమంజసముగాని, కొండవీటిని విడిచియేమూలనోయున్న యొకచిన్నసామంతునిపైఁ బాండ్యుఁడు దండు వెడలెననిచెప్పుట యుక్తి

యుక్తముగ నుండదు. కావునఁ బెదకోమటివేమారెడ్డి కొండవీడు సింహాసన మధిష్ఠించిన పిమ్మటనే నైషధమును శ్రీనాథుడు రచియించెనని నిశ్చయింపవలసియున్నది. నైషధరచనాకాలము క్రీ. శ. ౧౪౦౫-౧౪౧౦ నడుమనైయుండుననియు, నప్పటి కాతనికి ౨౫-౩౦ సంవత్సరములవయసుండుననియు నాతనిజననము రెండుమూఁడు సంవత్సరము లావలివల ౧౩౭౦ ప్రాంతమైయుండుననియు నాయభిప్రాయము శ్రీనాథునిజననము ౧౩౬౫ ప్రాంతమనియు మరణము ౧౪౪౦ ప్రాంతమనియు శ్రీవీరేశలింగము పంతులుగారు వ్రాసియున్నారు. అదిసత్యమయ్యెనేని, యీమహాకవి యవనాకాలమునాఁటి వయసు ౨౫ సంవత్సరము లగును ఆవయసున నాతఁడు "బొడ్డుపల్లె"ను గుత్తకుదీసికొనునని తెలుపరాదు ఈసందర్భమును బట్టి చూచినను శ్రీనాథునిజననకాలము క్రీ శ ౧౩౮౦ ప్రాంతముననుటయే యొప్పిదమగును. కాని దీనికొక్క ప్రతిబంధకము కల్పించుచున్నది. శ్రీనాథుని తాతయైన కమలనాభామాత్యుఁడు ద్వితీయప్రతాపరుద్రుని కాలమువాఁడని "వినమత్కాకతిసార్వభౌము" అనువాక్యమువలనఁ దెలియుచున్నది. ఆప్రతాపరుద్రుఁడు క్రీ శ ౧౨౯౫ మొదలు ౧౩౨౬ వరకు రాజ్యముచేసినవాఁడు ఈకాలమునుబట్టి చూచినచోఁ దాతకును మనుమనికిని నడుమ వ్యత్యాసము విశేషముగాఁ గన్పట్టుచున్నది. ౧౩౨౦ సంవత్సరప్రాంతమునఁ గమలనాభామాత్యుఁడు తనయిరువదేండ్ల వయసునఁ బ్రతాపరుద్రుని మెప్పించినాఁ డనినచో నాతనిజననకాలము ౧౩౦౦ సంవత్సరమనియు, నాతనిమనుమఁడైన మారయజననము ౧౩౪౦ యనియు నాతనికి నలువదియవయేట శ్రీనాథుఁడు జన్మించెననియుఁజెప్పి యీవ్యత్యాసమును సరిపుచ్చుకొనవచ్చును. ఇందు విరుద్ధముండదు. కమలనాభామాత్యునకు మారయ యెన్నవసంతానమో మారయకు శ్రీనాథుఁడెన్నవ సంతానమో మనకుఁ దెలియదు. ఆలెక్క తెలిసినచోఁ బైనఁజెప్పిన వ్యత్యాసము

లేకుండఁబోవుట కవకాశముండవచ్చును మొత్తముమీఁద నాలో చించిచూడఁగా శ్రీనాథుని జననకాలము క్రీ. శ. ౧౩౮౦ ప్రాంత మనుటయే సమంజసముగాఁ గాన్పించినది.

—: (3) హరవిలాసము:—కృతిపతి అవచి తిప్పయసెట్టి :—

ఈకావ్యమును శ్రీనాథుఁడు తన బాల్యసఖుఁడగు, అవచితిప్ప యసెట్టియను వైశ్యున కంకితముచేసెను. ఈతిప్పయ్యనే త్రిపురాంత కుఁడని కూడనందురు. ఈతిప్పయతండ్రి దేవయ; దేవయ తండ్రి పావాణిసెట్టి. ఈతనినివాసము నెల్లూరుపట్టణ మైనట్లీపద్యములోఁ గవి చెప్పియున్నాఁడు.

గీ. సింహవిక్రమ పట్టణ శ్రేష్ఠుఁడైన
సెట్టి జగజెట్టి పావాణిసెట్టి విభుఁడు.
ఘనుఁడు నగరీశచంద్రశేఖరపదాబ్జ
వందనానందితాత్ముఁడు వంశకరుఁడు.

ఈపావాణిసెట్టి తనయుఁడైన దేవయశెట్టి, శ్రీశైలమునకు సోపానములు కట్టించిన వేమారెడ్డికాలములో నున్నట్లీక్రింది పద్యము వలనఁ దెలియుచున్నది.

క. శ్రీపర్వతసోపాన
స్థాపకుఁడగు రెడ్డివేమజగతీపతికిన్
బ్రాపైన యవచిదేవయ
యాపావాణికి జనించె నభ్యుదయముతోన్.

ఈపద్యములోఁ జెప్పఁబడిన వేమారెడ్డి రెడ్డిరాజస్థాపకుఁడును క్రీ. శ. ౧౩౮౫ వరకు నారాజ్యమును బరిపాలించినవాఁడును, ఎఱ్ఱాప్రెగ్గడచే రామాయణ, హరివంశములను గృతినందినవాఁడు నగుప్రోలయ వేమా రెడ్డియేగాని యన్యుఁడుకాఁడు.

ఈ దేవయకు సూచాంబ యందుఁ దిప్పురాజయు, తిరుమలనాథుం డును, జామిసెట్టియు ననుమువ్వురు తనయులు గలిగిరి. ఈతిప్పురాజదే హారవిలాసకృతిపతియైన తిప్పయసెట్టి. ఈతిప్పయసెట్టి కొమరగిరి భూపాలునకు చీనిచీనాంబరాదులు ద్వీపాంతరములనుండి తెప్పించియిచ్చి యతనిచేత ఛత్రచామరాందోళికాదులను బడసినవాఁడని యీక్రింది వచనములోఁ జెప్పియున్నాఁడు.

"కొండవీడుపురంబు రాజధానిగాఁ గీర్తిలతాధిష్ఠితాష్టాదశద్వీ పాంతరాళుండునగు కొమరగిరి వసంతనృపాలునలన నాందోళికాఛత్ర చామరతురంగాది రాజ్యచిహ్నములు వడసియున్మహారాజునకుం బ్రతి సంవత్సరోత్సవమునకుం దగినకస్తూరీకుంకుమ ఘనసార సంకుమదహి మాంబుకాలాగురు గంధసారప్రభృతి సుగంధద్రవ్యంబులొడఁగూర్చి యుఁ జీనసింహళతెనాయి హురుముంజిజలనోంగి ప్రభృతి నానాద్వీప నగరాకరంబులగు ధనకనకవస్తువాహనమాణిక్యగాణిక్యంబులు తెప్పిం చియుఁ గవి నైగమికవావిదాంశిక వైతాళికాదులగు నర్థిజనంబులకు నర్థంబులు గుప్పించియు..."

ఈకొమరగిరి భూపాలుఁడు పైఁ జెప్పిన వేమారెడ్డికిఁ బౌత్రుఁడు. అనవోతారెడ్డికిఁ గుమారుఁడు. అత్యంతవిలాసప్రియుఁడు. ప్రతి వత్సరవసంతోత్సవములలో నాతఁడు మహావైభవముతో జరుపుచుం డెడివాఁడు. ఆయుత్సవములకుఁ గావలసిన వస్తుసామగ్రిని దేశదేశ ములనుండి తెప్పించియిచ్చుచు నీతిప్పయసెట్టి యావస్తుభాండాగార ధ్యక్షుఁడై తనచేతిమీఁదుగా నాయుత్సవములను నిర్వహించుచుండె నని శ్రీనాథుఁ డీక్రిందిపద్యములలోఁ జెప్పియున్నాఁడు.

చ. హరిహరరాయ ఫేరొజసహాసురధాణ గజాధిపాదిభూ
వరులు నిజప్రభావ మభివర్ణనసేయఁ గుమారగిర్య ధీ
శ్వరుని వసంతవైభవము సర్వమునొక్కఁడ నిర్వహించు మా
తిరుమలనాథసెట్టికిని ధీగుణభట్టికి నెవ్వ రీడగున్.

గీ. తమ్ములిద్దరుఁ దనయాజ్ఞఁ దల ధరించి
యన్నిదీవులఁ దెచ్చు లాభార్థకోటి
యర్థులకు నిచ్చి కీర్తి చేకూరమాడు
నవచిత్రిపురాంతకుండు వంశాబ్ధివిధుఁడు.

సీ. పంజాబుఁ గర్పూరపాదపంబులు తెచ్చి
జలనోఁగి బంగారు మొలక తెచ్చి
సింహళంబున గంధసింధురంబులు తెచ్చి
హురుమంజి బలుతేజి హరులు తెచ్చి
గోవసంశుద్ధసంకుమదద్రవము తెచ్చి
యాంపగట్టాణిముత్యాలు తెచ్చి
జోటంగిఁ గస్తూరికాటంకములు తెచ్చి
చీనిచీనాంబర శ్రేణి తెచ్చి

గీ. జగదగోపాళరాయ వేశ్యాభుజంగ
పల్లవాదిత్య భూదానపరశురామ
కొమరగిరిరాజ దేవేంద్రకార్యసహాయుఁడు
జాణజగజెట్టి! దేవయజామిసెట్టి!

మ. తరుణా, సీరి, తవాయి, గోవ, రమణాస్థానంబులం జందనా
గరుకర్పూర హిమాంబుకుంకుమ రజఃకస్తూరికాద్రవ్యముల్
శరధిం గప్పలిజోగులన్ విరివిగా పావానఁ దెప్పించు నే
ర్పరియై వైశ్యకులోత్తముం డవచితిప్పం డల్పుఁడే యుమ్మహిన్

గీ. పంచువా ఢిల్లిరాడాది పట్టణముల
యధిపతులు మాళిఁ దాల్చురత్నాంకురంబు
లవచి త్రిపురాంతకానీతయానపాత్ర
సింహళద్వీపమండల క్షేత్రజములు.

ఈపద్యములయం దుదాహృతములైన పట్టణములను శ్రీసోమశేఖర శర్మగారును, శ్రీకొమరవోలు సుబ్బారావుగారును శ్రీప్రభా

కర శాస్త్రులుగారును గుర్తించియున్నారు. వాని వివరముల నీదిగువ క్లుప్తముగా నుదాహరించెదను. (హారవిలాసపీఠికనుజూడుఁడు)

"తరుణాసీరి=(Tarnassari, మలయద్వీపకల్పమున నొకరాష్ట్ర ప్రధాననగరము; తవాయి: మలయద్వీపకల్పమునఁ గలరేవుపట్టణము. గోవ = పశ్చిమసముద్రతీరమున నున్నగోవాపట్టణమే కావచ్చును! చీని=చీనాదేశము, పంజార = సుమత్రాద్వీపమున పజ్జార్ కలదు. బోర్నియోద్వీపము పంజాక్ మాసిక్ అనుపేరుగలది కలదు ఈ రెండును కర్పూరవృక్షనములకు ప్రసిద్ధములే యఁట; జలనోఁగి= తెలియదు చిట్టగాంగు అని శ్రీసుబ్బారావుగారు భావించిరి. సింహళము ప్రసిద్ధము. హురుమంజి=హూర్మజ్ (పారసీకసముద్ర తీరమందలిది) యాంప=జాఫ్నా (ఇదిముత్యములకుఁ బ్రసిద్ధము.) చోటంగి=చోణంగి మలబారు తీరమునగల చిన్నద్వీపములలోని పట్టుకాఁదగును." చోటంగి అనిపాఠాంతరము. బోట=బూటాన్. ఇదికస్తూరికిఁ బ్రసిద్ధము; బంగారు మొలకలు శ్రీమల్లంపల్లిసోమశేఖరశర్మగారుఆస్ట్రేలియాది దేశములందు 'బంగారుమొలకలు' (మొలకలు=పలుకులు ఈయర్థమునవదొరకు దేశములందు వ్యవహారము కలదఁట దొరకుచుండినట్లు గ్రంథస్థమాయి యున్నదనిరి. మొలకబంగారు అనుపదమునకు శబ్దరత్నాకరమున "ఘట్టలలో పురుగులవల్ల కలిగెడు బంగారు' అనియర్థము కలదు

ఈపద్యములనుబట్టి యాకాలమున విదేశవ్యాపారము విరివిగా జరుగుచుండెనని తెలియుచున్నది. హారవిలాసకృతిపతి యైనతిప్పయ సెట్టిపూర్వులు దాతలు దైవభక్తికలిగినవారు నైన ట్లీక్రిందిపద్యము వలనఁ దెలియుచున్నది.

సీ. కట్టించె నొకతాత కంచిహర్మ్యంబులు
హరిణాంకమౌళి కేకామ్రపతికి
బాలార్కమనియెడిపద్మరాగముఁదాచె
నొకతాత కంచినాయకునినాభి

నొకతాత గట్టించె యోజనత్రయదీర్ఘ
తరతటాకాంభోధి తిరువభూరఁ
గావేరిఁ గట్టించెఁ గార్పాసరాసుల
నబ్బిచోడఁడు మెచ్చ నొక్కతాత

తే. ప్రతిదినమ్మును గర్పూరదీపములు వేయు
వ్రతముగా నొక్కతాత యీశ్వరున కొసఁగె
నఖిలలోకప్రసిద్ధవాణిజ్యవంశ
ధరులు మాతాత లుభయగోత్రములయందు.

తే. శైవవైష్ణవసమయదీక్షావిశేష
ధన్యమానసు లుభయగోత్రములవారు
నాయభీష్టంబు గదుఁ జిన్ననాటినుండి
పరమమాహేశ్వరాచారభక్తిపరత.

ఈతిప్పయసెట్టి కాళహస్తీశ్వరునకుఁ బ్రాకారపాతాళసుహాను నిర్మించినట్లు సప్తమాశ్వాసాంతపద్యమువలనఁ దెలియుచున్నది. ఈవంశమువారు చేసినదానములను దెలుపుశాసనములకై శోధించితినిగాని నాకవి లభింపలేదు. ఈతిప్పయసెట్టిభార్యయన్నమ్మ. ఆశ్వాసాంతాదిపద్యములలో నీతనిని "కావేరీశా! కావేరీవల్లభ" యని సంబోధించియున్నాఁడు. ఈకావేరియెవ్వరో తెలియదు. నిఘంటువులలో కావేరీశబ్దమునకు "వేశ్య" యని యర్థమున్నది. తిప్పయసెట్టి కావేరియను వేశ్యాప్రియుఁ డయియుండునా?

వైశ్యులలో నాల్గుతెగ లున్నట్లును నందుకావేరీవల్లభులనునదియొక శాఖయయినట్లును హంసవిలాసములోని "ఇది కావేరీవల్లభులును, నుభయద్రావిడులును గిష్కింధాచలక్రీడావినోదులు నయోధ్యాపురవాసులును నగు వైశ్యకులంబులవారలకుం గూటస్థుం డయిన చిఱుతొండ నంబిచరిత్రింబిది" యనువాక్యములవలనఁ దెలియనగుచున్నది. అందుఁదిప్పయసెట్టి కావేరీవల్లభకులమునకుఁజెందినవాఁడను

టకై, "కావేరీవల్లభ" యనిసంబోధించెనా? అయినచోఁ గృత్యాదిని తిప్పయసెట్టిని వర్ణించుసందర్భమున "గిష్కింధాచల క్రీడావినోదుండును, నుభయ ద్రావిళుండును, కౌండిన్యగోత్ర పవిత్రుండును, నయోధ్యానగరస్వామియు" నని యుపయోగించిన మాటలకర్థమేమి? తెలిసికొనవలసి యున్నది. ఈవిషయమునుగూర్చి పరిశోధింపఁగా "కావేరీవల్లభ" యనునది యొకబిరుద మని తేలినది.

—: హ ర వి లా స ర చ నా కా ల ము :—

హరవిలాసము నేవయసున రచించినదియు శ్రీనాథుఁడు చెప్ప లేదు. ఈకావ్యరచనా కాలమునుగూర్చి పండితులలో భిన్నాభిప్రాయములున్నవి. క్రీ. శ. ౧౪౦౦ ప్రాంతమని కొందఱును ౧౪౪౦ ప్రాంతమని కొందఱును, శ్రీనాథుని రచనములలో నిది తుదికావ్యమని కొందఱును దలంచుచున్నారు. హరవిలాసమునుబట్టి యీగ్రంథ మెప్పుడు రచించినదియుఁ దెలియదు. హరవిలాస కృత్యాదియందలి—

సీ. కమలనాభునిపౌత్రుఁ గవితామహారాజ్య
భద్రాసనారూఢుఁ బరమపుణ్యుఁ
బాత్రునాపస్తంబసూత్రు భారద్వాజగోత్ర
సజ్జనమిత్రుఁ గులపవిత్రు
భీమాంబికా మారనా మాత్యనందను
నఖిలపురాణ విద్యాప్రవీణు
నధ్వర్యువేదశాఖాధీతి నిష్ణాతు
నంధ్రభాషానైషధాబ్జభవుని

గీ. నుభయభాషా కవిత్వప్రయోగకుశలు
బాల్యసఖు గారవించి తాత్పర్యమొప్ప
నవచి దేవయత్రిపురారి యక్షరాజు
హితమితోక్తులు వెలయంగనిట్టులనియె.

ననుపద్యమునుబట్టి నైషధమునకుఁ దరువాత నీకావ్యమును రచియించెననుట సుస్పష్టము. "కవితామహారాజ్య భద్రాసనారూఢు" అను వాక్యముచేఁ "గవిసార్వభౌమ" బిరుదమును సూచించినాఁడనుట నిశ్చయము. అందుచే హరవిలాసమును క్రీ. శ. ౧౪౧౦ సంవత్సరమునకుఁ బిమ్మట రచియించెనని చెప్పుటకు సంశయింప నక్కఱలేదు. కృతిపతికిఁ గవి బాల్యసఖుఁడని యీపద్యమునందున్నది. తిప్పయసెట్టి శ్రీనాథునికంటెఁ జాలపెద్దవాఁడనియు, శ్రీనాథుఁడు తనబాల్యమునుండియు నాతనికి స్నేహితుఁడుగా నుండియుండుటచే బాలసఖుఁడని యిందు వ్రాసినాఁడు. ఈ సంతమాత్రముచే వారిరువురు సమవయస్కులు కారనియు శ్రీవీరేశలింగముపంతులుగారియభిప్రాయము. కాని యీయూహ యంతసమంజసముగాఁ గన్పట్టదు. డెబ్బదియేండ్లముదుసలి ముప్పదేండ్లవానిని బాల్యసఖుఁడని పిలువఁడు. బాలసఖుఁడనఁగాచిన్ననాఁటిస్నేహితుఁడనియర్థము తిప్పయసెట్టికంటె శ్రీనాథుఁడు దాదాపు పదేండ్లచిన్నవాఁడై యుండినను వారిరువురును బాల్యస్నేహితులని యంగీకరింపవచ్చును కాని యంతకెక్కువ వ్యత్యాసమున్నచో వారిరువురును బాల్యసఖులనిపించుకొనరు. కావున వారిరువురి నడుమ నామాత్రపు వ్యత్యాసమున కంగీకరించి గ్రంథరచనా కాలమును నిర్ణయింప వలసియున్నది.

బాల్యసఖుఁడను శబ్దమును పైపద్యములో మాత్రమేకాకుండ, నీక్రిందిపద్యములోఁగూడ నుపయోగించియుండుటచేనామాట కెక్కువ గౌరవమీయఁదగియున్నది.

తే. అగమజ్ఞాన నిధివి తత్త్వార్థఖనివి
బహుపురాణజ్ఞుఁడవు శుభభవ్యమతివి
బాల్యసఖుఁడవు శైవప్రబంధ మొకటి
యవధరింపుము నాపేర నంకితముగ.

హరవిలాసముద్రిత ప్రతిలో "బాలసఖు" అనియున్నది. కొన్నితాళపత్రప్రతులలో "బాల్యసఖు" అనియున్నట్లు తెలియు

చున్నది. ఈబాలత్వమేనాఁటిది? హారవిలాస రచనమునాఁటిదా! కాదు. శ్రీనాథుఁడు శృంగారనైషధరచనము నాటికే నిండు యౌవనమున నున్నవాఁడు. శ్రీనాథుఁడు బాలుఁడుగానుండి తిప్పయసెట్టి పెండ్లు గడచినవాఁడుగా నున్నప్పుడు వారికిరువురకు సఖ్యము గలిగెననియు దానినిబట్టి బాలసఖుఁడని శ్రీనాథుఁ డీగ్రంథమున నుదాహరించెననియుఁ దలంచుటలో స్వారస్యములేదు. బాల్యసఖుఁ డనుటయందే యెక్కువ స్వారస్యమున్నది అందుచే "బాలసఖ" శబ్దమపపాఠముగా నెంచి దానిని త్యజించివేయుదము.

హారవిలాసమునందుశ్రీనాథునితోఁదిప్పయసెట్టిపలికినట్లున్న

క. కంటినివిశుద్ధసంతతి
విఁటిఁ బురాణములు పెక్కు విశ్వము వొగడన్
మఁటి బహువత్సరంబులుఁ
గొంటి యశోధనము సుకవికోటి నుతింపన్

అను పద్యములోని "బహువత్సరంబులు" అనువాక్యమును బట్టియు,

ఉ ధీచతురు ల్సహోదరులు తిమ్మలసెట్టియుఁ జామిసెట్టియు
న్మాచన విశ్వనాథ చినమల్లకుమారులు వీర లాత్మజుల్
శ్రీ చెలువంబు గైకొనినచేడియ యన్నమదేవి భార్యగా
గోచరమే నుతింప నయకోవిదునిం దిప్పురాంతకాధిపున్.

అనుపద్యమునఁ దిప్పయసెట్టికి ముగ్గురుకుమారులుండిరని చెప్పఁటంబట్టియుఁ బౌత్రు లుండిరని చెప్పకుండుటవలనను, హారవిలాస రచనమునాఁటికిఁ దిప్పయసెట్టికి దాదాపుగ నేఁబది-ఏఁబదియైదు సంవత్సరము లుండునని యూహింపఁదగియున్నది. తిప్పయసెట్టికి వ్యాపారమునఁ దమ్ములు తోడ్పడిరని చెప్పెనేకాని, కుమారులవిషయమున నేమియు హారవిలాసమునఁ జెప్పలేదు. అందుచే వా రాకాలమునాఁటికి వ్యాపారమునకుఁ దోడుపడుటకుఁ దగినవయసులో లేరని యూహిం

పఁ దగియున్నది కావున నైషధ్యములో "బహువత్సరము" లనిచెప్పి నను, నప్పటికిఁ దిప్పయవయసు ౫౦-౫౫ కంటె నధికముగ నుండదని నిశ్చయింపవచ్చును.

తిప్పయసెట్టితండ్రి యైనదేవయసెట్టి ప్రోలయవేమని కాల మున నున్నట్లీక్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

క. శ్రీపర్వతసోపాన
స్థాపకుఁ డగురెడ్డివేమజగతీపతికిన్
బ్రాపైనయవచిదేవయ
యాపావాణికి జనించె నభ్యుదయముతోన్.

ప్రోలయవేముఁడే శ్రీశైలమునకు సోపానములను గట్టించిన వాఁడు. క్రీ. శ. ౧౩౨౦-౧౩౫౦ నడుమ నున్నవాఁడని పైన వ్రాసి యుంటిని. ఈపద్యమునుబట్టి దేవయవయసును నిర్ణయింపలేము. వేమా రెడ్డిరాజ్యాంతవత్సరములలో నిరువదేండ్లవయసునుండి వేమా రెడ్డిపరిచయము గల్గించుకొని యుండవచ్చునని తెలుపుట కవకాశ మున్నది. దేవయతండ్రియైన పావాణిసెట్టి నివాసము నెల్లూరు. వీరి మూలపురుషుఁడైన చిరుతొండనంబి కాంచీపురవాస్తవ్యుఁడు. వీరి పూర్వులు కంచివాస్తవ్యులైనను వర్తకమునకై పావణసెట్టి నెల్లూరున నివసించియుండును. అతనికుమారుఁడైన దేవయసెట్టి కొంతకాలము వేమారెడ్డికి రాజధానియైన యద్దంకియం దుండియుం డును. అతనికుమారుఁడైన తిప్పయసెట్టి కుమారగిరిరెడ్డి కాలములోఁ గొండవీటియం దుండిన నుండవచ్చును. కాని హరవిలాస రచనము నాఁటికీతని నివాసము కాంచీపురమని యాకావ్యమునఁ బెక్కుపద్యము లలో శ్రీనాథుఁడు వ్రాసియున్నాఁడు. కుమారగిరిరెడ్డి వసంతోత్స వములలో దిప్పయసెట్టి పాల్గొని, తానొక్కఁడే యాయుత్సవములను నడపియుండెనని వ్రాసియున్నను,

క. కొమరగిరి వసంతనృపా
గమకవివరగంధసార కస్తూరీకుం
కుమకర్పూర హిమాంభ
స్సముదంచిత బహుసుగంధిశాలాధ్యక్షా

యని సంబోధించియున్నను, నివియన్నియు నాతఁడు కొండవీట నివసించియున్నాఁడని నిశ్చయించుటకాధారములుకావు. కుమారగిరిరెడ్డి సంతతవిలాసప్రియుఁడగుటచే నాతనికిఁ గావలసిన వస్తుసముదాయము నెప్పటికప్పుడందించుచుండుటకై కొండవీటియందే నివసించియుండెనని యంగీకరించినను, నాకాలములో ననఁగా కుమారగిరిరెడ్డి జీవితకాలములో శ్రీనాథుఁడు హరవిలాసమును రచియింపలేదనియుఁ దిప్పయసెట్టి కంచియందు స్థిరనివాస మేర్పరచుకొనిన పిమ్మటనే యది రచితమైనదనియు నిస్సంశయముగాఁ జెప్పవచ్చును.

దేవయసెట్టిజననము క్రీ. శ. ౧౩౩౦ ప్రాంతమనియు, సావాణిసెట్టి యనంతరము ప్రోలయవేమారెడ్డి చరమకాలములోనే దేవయసెట్టి యాతనివ్యాపకము సంపాదించెననియు, నాతనికుమారుఁడైన తిప్పయసెట్టి జననము ౧౩౬౦ ప్రాంతమనియు నాయభిప్రాయము. హరవిలాస తృతీయాశ్వాసాదిని

"క. శ్రీపర్వతసోపాన
స్థాపక వేమక్షితీశ సామ్రాజ్యశ్రీ
వ్యాపారిముఖ్య! యన్వయ
దీపక! యలకాధిరాజ! దేవయతిప్పా!"

యని యున్నదనియు, దీనినిబట్టి తిప్పయసెట్టి ప్రోలయవేమునికాలములోనే వ్యాపారము చేయుచున్నట్లు స్పష్టమగుచున్నదనియు బ్రి శ్రీ. వీరేశలింగము పంతులుగారి యభిప్రాయము. అదిసత్యమయ్యెనేని యథమ మాతని జననకాలము క్రీ. శ. ౧౩౩౦ వ సంవత్సరప్రాంతమగును. శ్రీపంతులుగారి లెక్కప్రకారము శ్రీనాథునకు నీతనికివయో

వ్యత్యాసము ముప్పదియైదేండ్లగును. వారియూహ ననుసరించి హార విలాసరచనమునాఁటికి డెబ్బదేండ్ల ముసలిగానున్న తిప్పయసెట్టి శ్రీనాథునిఁ జిన్ననాఁటిసఖుఁడని పిలిచినట్లగును. ఇంతవయోవ్యత్యాస మున్న వానిని సఖుఁడనుట తటస్థింపదు. "శ్రీనాథుఁడు బాలుఁడయి యుండునప్పుడు సఖ్యము కలుగుటచేతనే తిప్పయసెట్టికి శ్రీనాథుఁడు బాలసఖుఁడయ్యెను గాని యుభయులును బాలురయి యుండినప్పుడు కలిగినమైత్రిచేతఁగాదు" అని నాగేశ్వరరావుగారి వయోవ్యత్యాస మును సమర్థింపఁ జూచిరికాని యది యంగీకరింపఁ దగినదిగా నాకుఁ గన్పట్టలేదు. తిరుమలసెట్టిని వర్ణించిన "హరిహరరాయ... అనుపద్య ములోనుదాహరింపఁబడిన" ముబ్బరిలో (రెండవ) హరిహరరాయలు ౧౩౭౭ మొదలుకొని ౧౪౦౪ వ సంవత్సరమువఱకును రాజ్యపాల నము చేసెను. ఫిరోజిసహా ౧౩౯౭ మొదలుకొని ౧౪౨౨ వ సంవత్సరమువఱకును రాజ్యపాలనముచేసెను. కుమారగిరిభూపాలుఁడు ౧౩౮౩ మొదలుకొని ౧౪౦౦వ సంవత్సరమువఱకును రాజ్యపాలనము చేసెను. అందుచేత నీముగ్గురునుండి రాజ్యపాలనము చేయుచుండిన కాలము ౧౩౯౭, ౧౩౯౮, ౧౩౯౯, ౧౪౦౦ సంవత్సరములుకాబట్టి ౧౩౯౭ నకును ౧౪౦౦ లకును నడిమికాలములో నవఁగా ౧౪౦౦ వ సంవత్సరప్రాంతమున హరవిలాసము రచియింపఁబడెను. అప్పటికి శ్రీనాథునకు ముప్పదినాలుగు ముప్పదియైదు సంవత్సరములవయస్సుండును" అనివారు వ్రాసియున్నారు. శ్రీపంతులుగా రాపద్యములోని "గజాధిపాదిభూవరుల (గజపతి మొదలుగాగల ప్రభువులు) నేలోనో విడచిపెట్టిరి. ఆపద్యములోఁ దిప్పయసెట్టిని నుతించినప్రభువుల నేక రువుపెట్టినేగాని వారందఱును గొమరగిరిరెడ్డి వసంతోత్సవములోఁ బాల్గొనుటకై కొండవీటికి వచ్చిరనిగాని యాకాలముననే డా నాకా వ్యము రచించినగాని శ్రీనాథుఁడు చెప్పలేదు.

శ్రీకొమర్రాజులక్ష్మణరావుపంతులుగారువీరేశలింగంపంతులుగారి యభిప్రాయముతో నేకీభవింపుచుహరవిలాసముకుమారరెడ్డిజీవితకాల

మునందే వ్రాయబడెనని తలంచుటకుఁ దగినయాధారములు హారవిలాసమునందే కలవని వ్రాసియున్నారు. చారిత్రకవిజ్ఞాన నిధులగు శ్రీలక్ష్మణరావుగారితో నీవిషయమున నే నేకీభవింపఁ జాలను. కుమారగిరిరెడ్డి జీవితకాలములో నైషధమే రచియింపఁ బడలేదని నాయుద్దేశము. కావ్యములలోఁ గవులంతకుఁబూర్వ మెప్పుడో గతించిన పుణ్యపురుషునుగూర్చి యప్పుడు జీవించియున్నవారిని పొగడినట్లే నుతించుచుందురు. అతిక్రాంతకాల చారిత్రములను ప్రత్యక్షప్రదర్శనీయములుగాఁ జేయుచుండుటయే వారివృత్తి. మనుమసిద్ధి యనంతరము తిక్కనసోమయాజి కెవ్వాడైన నొకగ్రంథము నంకితముజేసినచో నందు మనుమసిద్ధిని యాతనిచేఁ దిక్కనవడసిన మన్ననలను వర్ణించుటతప్పుగాదు అట్లువర్ణించినంతమాత్రమున నాకావ్యము మనుమసిద్ధి కాలములో రచియింపఁబడియుండునని నిర్ణయించు టుచితము కాదు. అట్లు నిశ్చయించుటకుఁ జాలసాక్ష్యము కావలసియుండును. అట్టిసాక్ష్యమును హారవిలాస మిచ్చుటలేదు.

తిప్పయసెట్టి, ప్రోలయవేముని కాలములో నున్నట్లు తోపింపఁ జేసెడి పైపద్యమునకు, వేమారెడ్డి సామ్రాజ్యవ్యాపారిముఖ్యుల వంశదీపకుఁడనియే యర్థమును గ్రహింపవలసియుండును. అట్టియర్థమును జెప్పుటకు వ్యాకరణ మంగీకరింప దనుమాట నిజమే. ఈయసందర్భమును గ్రహించి హారవిలాసమునకుఁబీఠిక వ్రాసిన శ్రీపోలవరసంస్థానపతి, యాపద్యమందలి "యన్వయ" యనుపదమునకు బదులుగా 'సత్కుల' యని దిద్దవలయునని వ్రాసియున్నారు. "సత్కుల" యని కాకపోయిన మాని 'య' యను నక్షర మున్నచోటనతి యొకయక్షర ముంచి సవరింపవచ్చును. కాని యిట్టిదిద్దుబాటులను జేయుటకు ముందుఁ దగినంతకారణమును జూపవలసియుండును. ఏది యెట్లున్నను, దిప్పయసెట్టి ప్రోలయవేమారెడ్డి కాలములో నున్నాఁడనుట కవకాశములేదు. ఆవేమారెడ్డికాలములోనే తిప్పయయున్నాఁడను నెడల, బాల్యసఖుఁడను పదమునకు సందర్భశూన్యమైన యర్థ

మును జెప్పవలసియుండును. శ్రీవీరేశలింగము పంతులుగారు చెప్పిన బాలశబ్దమున కర్థము చెప్పవలయునని తలంచితిమేని శ్రీనాథుఁడు బాల్యసఖశబ్దము ననాలోచితముగాఁ బ్రయోగించినాఁడని చెప్పవలసి వచ్చును. తిప్పయసెట్టికిఁ స్నేహితుఁ డగుటకు శ్రీనాథునకు ఇరువది యేండ్లయిన నుండవలయునుగదా! శ్రీపంతులువారి లెక్కననుసరించి యప్పటికిఁ దిప్పయకు నలువదియైదు సంవత్సరములుండును. శ్రీనాథునిజననము ౧౩౮౦ వ సంవత్సరము కావున వీరిద్దరికిని వయోవ్యత్యాస మేఁబదియేండ్లయి, వారిరువురు స్నేహితులగు నప్పటి కావ్యత్యాస మఱువదేండ్లగును. ఇట్టివానిని శ్రీనాథుఁడు బాల్యసఖుఁడని నాఁడనుటకంటె విపరీతముండదు. బాల్యసఖుఁ డనినందువలనవచ్చెడి విశేషగౌరవము లేదు. బాల్యసఖశబ్దమున కిట్టి యర్థము చెప్పుటకంటెఁ బై పద్యములోని "వ్యాపారిముఖ్య యన్వయదీపక" యనువాక్యమున కనుకూలమైన యర్థము చెప్పుకొనుటయే మేలు. శ్రీ ప్రభాకరశాస్త్రులుగారి పీఠికతోఁ బ్రకటితమైన హరవిలాసమున నీశబ్దము "సాన్వయ" యని యున్నది. శ్రీశాస్త్రులుగారు దీనిని సవరించిరో వారుపరిశీలించిన తాళపత్రప్రతిలో నాపాఠమున్నదో తెలియదు.

శ్రీనాథునకుఁ గొండవీటి ప్రభువుల యనంతరమున రాజాశ్రయ లాభము లేనికాలములో ననఁగా రాజమహేంద్రవరము రెడ్డిప్రభువుల యాదరము లభించులోపల నీ హరవిలాసమును రచించి తనబాల్యసఖుఁడగు తిప్పయసెట్టి కంకితము చేసియుండెనని నాయభిప్రాయము. ఆకాలము క్రీ. శ. ౧౪౨౫ ప్రాంతము. అప్పటికి శ్రీనాథునకు నలువది నలువదియైదు సంవత్సరముల ప్రాయమును, దిప్పయ కేఁబది, యేబదియైదు సంవత్సరముల వయసును నుండి యుండును.

సంస్కృతభీమఖండముననున్న—

శ్లో. "గ్రసతేస్మజగత్త్రాతా । విషభృద్భూషణోవిషమ్
ఘుటికాం ఘుటికాంసిద్ధో । బద్ధ్వారసమయీమివ"

౧ అధ్యా ౭.

అనుశ్లోకము

క. కటుక మగువిషము విషధరు
కటకం బగు కేలఁ బూని కౌతూహలియై
ఘుటికాసంసిద్ధుఁడు వివ
ఘుటికయునుం బోలె మృడుఁడు గుటుకున మ్రింగెన్.

అని యాంధ్రీకరించి భీమేశ్వరపురాణమునఁ జేర్చెననియు, హరవిలాసమునఁ గూడ నీ పద్యము కలదనియు, నందుచే భీమేశ్వరపురాణ రచనానంతరమున ననఁగా క్రీ. శ. ౧౩౩౦ ప్రాంతమున హరవిలాసమును రచియించెననియు, బ్రి. శ్రీ. ప్రభాకరశాస్త్రులుగారు వ్రాసియుండిరి. పైననేనుజూపినకాలమునకును వారు చెప్పినదానికిని నైదుసంవత్సరముల వ్యత్యాసముమాత్రమె కలదు. రాజమహేంద్రవరపు రెడ్ల యాస్థానమునం దాశ్రయము దొరికిన పిమ్మట నాతఁడు కంచికిఁ బోలేదనియు, ఏ రాజాశ్రయమును లభింపని కాలములో ధనార్జన కొఱకు తనబాల్యసఖుఁడును, దాతయు, ధనవంతుఁడునగుతిప్పయసెట్టి కడకేఁగి హరవిలాసము నాతని కంకితము చేసియుండుననియు నాయభిప్రాయము. భీమేశ్వరపురాణ కాశీఖండములసంగతి హరవిలాసమున నెత్తక నైషధమును మాత్రమే స్మరించియుండుటకూడ నాయూహకు బలమొసంగుచున్నది. సంస్కృతభీమఖండమును గూడ శ్రీనాథుఁడే రచియించెనని యొకవాదమున్నది. దానిమాట యటుండ నిందు, బహుపురాణజ్ఞుఁడగు శ్రీనాథుఁడు భీమఖండమును జదివియుండును. అందలిశ్లోక మాకథాసందర్భమున స్మరణకురాఁగా దానినాంధ్రీకరించి హరవిలాసమున వేసియుండును. హరవిలాస రచనాకాలముననే తాను

రాజమహేంద్రవరపురెడ్డి నాశ్రయించు తలంపుఁగొని యారెడ్లును, వారి మంత్రియగు నన్నయామాత్యుఁడును భీమఖండనివాసులై భీమేశ్వర సేవాపరాయణులై యుండుట నెఱింగి భీమేశ్వరపురాణ రచనమును దలపెట్టియుండును. హరవిలాసమునందలి పద్యమే మఱలభీమపురాణమునఁ జేర్చియుండునని తలంచుట కవకాశమున్నది. అందుచే హరవిలాస రచనాకాలము నేననినట్లు క్రీ. శ. ౧౪౧౫ ప్రాంతము కావచ్చును.

ఈతిప్పయసెట్టికి పిల్లలమఱ్ఱి పెద్దన్న గురువైనట్లు హరవిలాసమునందలి —

ఉ. పిన్నలనాఁడు సత్కరుణఁ బిల్లలమఱ్ఱి మహాప్రధాని పె
ద్దన్న గురూత్తముండు తగ నక్షరశిక్షయు దైవమార్గసం
పన్నతయున్ వివేకపరిపాటియునుం గృప సేసె నర్థి నే
యన్నకు నట్టిసెట్టి త్రిపురాంతకునిం దగుఁ బ్రస్తుతింపఁగన్.

అను పద్యమువలనఁ దెలియుచున్నది. జైమినిభారతకృతికర్తయగు పిల్లలమఱ్ఱి పినవీరన్న కీతఁడన్నయో, పినతండ్రియో యగునని కొందఱనియుండిరి. ఈబాంధవ్యమును స్థిరపఱచు నాధారములు లభింపలేదు. అందుచేఁ గాలనిర్ణయమున కీ పద్యము సహకారి కానేరదు. కేవలము నూహలపై నూహలనల్లి సిద్ధాంతములను జేయుటవలనఁ బ్రయోజనముండదు.

—: (౪) భీమేశ్వరపురాణము కృతిపతి బెండపూడి అన్నమంత్రి. :—

ఆఱాశ్వాసములుగల యీ భీమేశ్వర పురాణమును కాశ్యపసగోత్రుఁడు, నాపస్తంబసూత్రుఁడు నియోగిబ్రాహ్మణుఁడు నగు బెండపూడి అన్నయమంత్రి కంకితముచేసెను. అన్నయమంత్రి వంశవృత్తము నీ క్రింద నిచ్చుచున్నాఁడను.




మొదటి అన్నమంత్రి కాకతీయరాజులవద్ద గజసేనాధ్యక్షుఁడై తొమ్మిదిలక్షల సైన్యమున కధికారియై, ఆంధ్రభూమండ లాధ్యక్ష సింహాసన ప్రతిష్ఠాపనాచార్యబిరుదమును వహించినట్లీ క్రిందిపద్యము వలనఁ దెలియుచున్నది.

సీ. కాకతిప్రోలపాల గంధదంతావళ
　　ధ్వజినీ మహాధురంధరుఁ డనంగ
నవలక్షకోదండనాథ రాజ్యాంభోధి
　　సంపూర్ణ పూర్ణిమాచంద్రుఁ డనఁగ
నంధ్రభూమండలాధ్యక్ష సింహాసన
　　సంప్రతిష్ఠాపనాచార్యుఁ డనఁగ

వీరరుద్రావతార విశ్వంభరాధీశ
    పృథుల దక్షిణ భుజాపీఠ మనఁగ
తే. యవనసంహార విలయకాలాగ్ని యనఁగ
ధాటి విఘటితకమ్మశోద్ధ్యానుఁ డనఁగ
విశ్వలోకప్రశస్తుఁడై వినుతి కెక్కె
నతులబలసీరి! పోలయయన్న శౌరి!

ఈయన్నమంత్రి ప్రతాపరుద్రమహారాజుచే నియమితుఁడై రేచర్లసింగమ నాయనితోఁ గలసి కంపిల దేశమునకేఁగి యాప్రభువును జయించెను. ఇంక నెన్నియో యుద్ధములలోఁ బాల్గొని జయము సంపాదించెను ఇందులూరి యన్నయదేవుని పెదతండ్రికుమారుఁడైన కొలని రుద్రదేవుఁడును, ఈ యన్నమంత్రియు సమకాలికులు. ఇరువురును బ్రతాపరుద్రుని రాజ్యసంరక్షకులు.

కొలని ప్రతాపరుద్రునిచే నీయన్నయమంత్రి యొక గ్రామము నగ్రహారముగాఁ బడసినట్లు భీమేశ్వర పురాణమందలి యీక్రింది పద్యమువలనఁ దెలియవచ్చుచున్నది.

చ. కొలనుఁ బ్రతాపరుద్రనృపకుంజరుచేత నరేంద్రసారణీ
సలిలవివర్ధమాన బహుసస్యసమాకుల మగ్రహారమై
వెలయ విభాకరగ్రహణవేళఁ దగంగఁ బరిగ్రహించె బం
ధుల భరియించె నన్నవిభుతో సరి యెల్లు ప్రధానులెవ్వరున్.

ఈపద్యమునుబట్టి ప్రతాపరుద్రచక్రవర్తి, కొలను గ్రామమును, అన్నమంత్రి కొసంగెనని యర్థమగుచున్నది. "కొలను" అనఁగా ప్రస్తుతమున "ఏలూరు" అని పిలువఁబడుచున్న పట్టణమే. ఆపట్టణము రాజధానిగాఁ గల ప్రదేశ మాకాలమునఁ బ్రతాపరుద్రచక్రవర్తి యేలుబడిక్రింద నుండెడిది. అందుచే నాపట్టణమును బ్రతాపరుద్రుఁడన్నమంత్రికిచ్చెనన్నమాట సత్యమే యనితోఁచును. కాని యదిసత్యము కాదు. ఆకాలమున నా పట్టణమునకును దత్ప్రాంతప్రదేశములకును

బై నఁజెప్పిన యిందులూరి యన్నయ దేవుని పెదతండి కమారుఁడగు రుద్రదేవుఁడు బ్రిధానాధికారిగ నుండెను. అతనినిదొలఁగించి యాపట్టణము నీ యన్నమంత్రికిఁ బ్రతాపరుద్రుఁడు దెట్టిచ్చునా ? కావున దానమిచ్చినవాఁడు ప్రతాపరుద్రచక్రవర్తియుఁ గాఁడు. దానమిచ్చిన గ్రామము కొలనును గాదు

ఈపద్యమునందు రెండు తప్పులున్నవి. 'కొలను' శబ్దమును 'కొలని' అనియు 'నరేంద్ర' శబ్దమును 'నరేడు' అనియును జదువవలయును. కాకతీయ ప్రతాపరుద్ర మహారాజునొద్ద దండనాయకుఁడుగను మంత్రిగనునుండి మహాప్రతాపవంతుఁడై ఏలూరు రాజధానిగా నా ప్రాంతమున కంతకును బరిపాలకుఁడై మహాప్రధాని యని పేరుగాంచిన కొలని ప్రతాపరుద్రుఁడను నియోగి బ్రాహ్మణుఁడు కలఁడు. ఈతనిని గూర్చి కొలని గణపతిదేవకవి చారిత్రమున వ్రాయనున్నాఁడను ఈకొలని ప్రతాపరుద్రుఁడును బెండపూడి (మొదటి) అన్నమంత్రియు సమకాలికులని పైనఁ జెప్పియుంటిని ఈ యన్నమంత్రి 'అరేడు' అను గ్రామమును కొలని ప్రతాపరుద్రునివలన నగహారముగాఁ బడసెనని పై పద్యములోఁజెప్పబడియున్నది 'అరేడు' అనుశబ్దమున కర్థమును గ్రహింపఁజాలక యెవ్వరో దానిని 'నరేంద్ర' అని మార్చినారు. ఈగ్రామము నగ్రహారముగాఁ బడసినకారణముచే వీరు అరియేటివారనికూడఁ బిలువఁబడఁ జొచ్చిరి. ఈవిషయము మీఁదక్రింద నుదహరింపఁబోవు "ఝూడేశ" "వాహ్యాళి" అను సీసపద్యములవలనను "అరబీభాష" యను మత్తేభవృత్తమువలనను స్పష్టపడుచున్నది. శ్రీనాథునికాలము నాఁటికి గ్రామము బెండపూడివారిక్రింద నున్నదని నిస్సంశయముగాఁజెప్పవచ్చును. 'అరేడు' అనుగ్రామమొకటి భీమవరముతాలూకా (పడమటి గోదావరిమండలము) యందున్నది అదియే యీగ్రామము.

ఈయన్నమంత్రికూడఁ గాకతీయప్రతాపచక్రవర్తికడ దండనాయకుఁడై పేరుగాంచినవాఁడే కదా ! ఈతఁడు కొలని ప్రతాప

రుద్రుని యొద్దనుండి యగ్రహారమును గ్రహించుటెట్లని కొండఱను కొనవచ్చును. కాని కొలని ప్రతాపరుద్రుఁడు మహాప్రధానియై కొంత దేశముపై రాజప్రతినిధిగనుండి వ్యవహరించుచున్న వాఁడు. అన్నమంత్రికంటె నెక్కుడ యధికారమును గలిగియుండి పరిపాలకుఁ డుగా నెన్నఁబడియుండును. అందుచే నీదానప్రతిగ్రహము లీమహా పురుషులనడుమ జరిగియుండునని తలంపవచ్చును. కాకతీయప్రతాప రుద్రునిజయించియాంధ్రరాజ్యమునపహరింపవలయునని అల్లాయుద్దీన్ చక్రవర్తికాలములో మహమ్మదీయులువరంగల్లుపైకిజరిపినదండయాత్ర లెనిమిదింటియందును, ప్రతాపరుద్రునకు బాసటయై నిలిచి దేశము తురుష్కుల స్వాధీనముకాకుండఁ గాపాడుటలోఁ గొలనిప్రతాపరుద్రు నితో పాటుగనుండి యీయన్నమంత్రి "యాంధ్రభూమండలాధ్యక్ష సింహాసన సంప్రతిష్ఠాపనాచార్యుఁడను" బిరుదము నువహించి "యవ నసంహార విలయకాలాగ్ని" యని పేరుగాంచియుండెను.

కొలనిరుద్రదేవునకుఁ బ్రతాపశబ్దము లేదనియు, నియోగిబ్రా హ్మణుఁడగు సీతనిని నృపకంజరుఁడనుట పొసగదనియు నందుచేనగ్ర హారమిచ్చినవాఁడు ప్రతాపరుద్రచక్రవర్తి యనియే భావింపవల యుననియు నెవ్వరైన ననవచ్చును. రుద్రదేవుని యౌన్నత్యమును సూచించుటకై యీ రెండువిశేషణములును శ్రీనాథుఁ డీతనికిఁ జేర్చి యుండెను. రుద్రదేవుని వంశీయుఁడగు కొలనిగణపతిదేవుఁడు తనశివ యోగసారమున సీతనిని నరేంద్రుఁడనియే యీక్రిందిపద్యములో వర్ణించియున్నాఁడు.

క. అనుపమచరితుం డగు రు
ద్రనరేంద్రుకరాళ వారి ధారలచేతన్
మనియని భూపతిసుతులును
దనియని ధరణీసురులును ధరణిం గలరే.

గావున దానకర్త కొలని ప్రతాపరుద్రుఁడనుట నిశ్చయము. ఈ యన్నమంత్రికిఁ దరువాత నితని వంశములోఁ బ్రఖ్యాతి వహించిన దీతని పౌత్రుఁడైన లింగమంత్రి ఇతఁడు కాశీఖండకృతి పతియైన వీరభద్రారెడ్డికిఁ దండ్రియగు నల్లాడరెడ్డియొద్ద నమాత్యుఁడుగను దండనాయకుఁడుగ నుండి కర్ణాటాంధ్రకటక దేశములను జయించి తనప్రభువుచేఁ బరిపాలింపఁ జేసినట్లీ క్రిందిపద్యము వలనఁ దెలియుచున్నది.

సీ. ఝూడేశ వనస్త హమ్మీర బాహువాహోత్రి
వంతునాదిక్షితీశ్వరులఁ గెలిచి
యొడ్డాది మత్స్యవంశోదయార్జునుచేతఁ
బల్లవాన్వయుచేత నలచ మంది
దండకారణ్యమధ్య పుళిందరాజగం
భాహివంశజులకు నభయ మొసఁగి
భానుమత్కుల వీరభద్రాన్న దేవేంద
గర్వసంరంభంబు గట్టికట్టి
తే. యవన కర్ణాటకటకభూధవులతోడఁ
జెలిమి వాటించి యేలించెఁ దెలుఁగుభూమిఁ
దన నిజస్వామి నల్లాడధరణినాథు
భళిరె యనమేటి లింగనప్రభువరుండు.

ఈలింగమంత్రి శౌర్యధైర్యాదులు నీక్రిందిపద్యములో శ్రీనాథకవి మనోహరముగా వర్ణించియున్నాఁడు.

సీ. వాహ్యాళి భూమి రేవంతకైవసధులట్లు
హయరత్నములు నెక్కి యాడ నేర్చుఁ
గవిబుధశ్రేణికిఁ జెవులు పండువులుగా
నాస్థానమున మాటలాడ నేర్చు

శక్తిత్రియంబునఁ జతురుపాయంబుల
షాడ్గుణ్యముల బుద్ధి జరుపనేర్పుఁ
గైసేసి ప్రత్యక్షకందర్పమూర్తియై
నిర్వికారంబున నిలువ నేర్పు

తే. నిష్ఠురాటోపవిస్ఫూర్తి నృహరికరణి
నతికఠోరకుఠారధారాంచలమున
వైరివక్షస్థ్సలము వ్రచ్చివైవ నేర్చు
సంగరార్జునుఁ డరియేటి లింగవిభుఁడు.

పై పద్యములనుబట్టి యాంధ్రదేశమునకు మహమ్మదీయ ప్రవాహము రాకుండ నరికట్టి కర్ణాటకటకాది సంపర్కము గలుగకుండ నాంధ్రదేశమాంధ్రప్రభువుల యేలుబడిలో నుండునట్లు చేయుటకై తమజీవితములను ధారవోసిన నియోగిబ్రాహ్మణులలో నీబెండపూడి వారును ఇందులూరివారును మిగులఁ బ్రసిద్ధిఁ గాంచియుండి రని స్పష్టమగుచున్నది.

ఈలింగమంత్రి పైనఁజెప్పిన యల్లాడరెడ్డికుమారుఁడైన వేమారెడ్డి యొద్దగూడ మంత్రిగను దండనాయకుఁడుగ నుండి బోడసకుర్తి యొద్ద అన్నచోడవర మను నగ్రహారమును గైకొనిన ట్లీక్రింది పద్యములోఁజెప్పఁ బడియున్నది.

చ॥ అవుర! ప్రితాపవేమవసుధాధిపుచే నృపపట్టభద్రుచే
భువనమనోహరం బయిన బోడసకుర్తి మహాస్థలంబునన్
దివిరి పరిగ్రహించె మన దేవయ లింగనమంత్రి యన్నచో
డవరమహాగ్రహారముఁ గడంకఁ గవిద్విజబంధుఁడౌటకై.

ఇప్పు డన్నచోడవర మనున్నగహారము కనబడుటలేదు. కాని బోడసకుర్తియను గ్రామమున్నది. అది గోదావరిమండలమున వైన తేయమునదికి దక్షిణపుటొడ్డున నున్నది. బోడసకుర్తిన కత్యంత సమీపమున దొడ్డవర మనుచిన్నగ్రామ మొకటియున్నది. అదియే

యీయన్నచోడవరము యుండునేమో. ఈలింగనమంత్రి ప్రతి ద్వాదశినాఁడును బ్రాహ్మణసంతర్పణము చేయుచుండువాఁడఁట!

భీమేశ్వరపురాణకృతికర్తయైన యన్నమంత్రి యీలింగమంత్రికి సోదరుఁడు. ఈతఁడనేక భాషలలో వ్రాయుటకు నేర్పు కలవాఁడనియు వేమారెడ్డికిని వీరభద్రారెడ్డికిని గారాముమంత్రియనియుఁ గవి యీక్రిందిపద్యములలో వ్రాసియున్నాఁడు.

మ. ఆరబీభాషఁ దురుష్కభాష గజకర్ణాటాంధ్రగాంధార ఘూ
ర్జరభాషల్ మళయాళభాష శకభాషా సింధుసౌవీర బ
ర్బరభాషల్ కరహాటభాష మఱియుం భాషావిశేషంబుల
చ్చెరువై వ్రాయ నశేటియన్ననికి గోష్ఠీసంప్రయోగంబులన్.

ఉ. అన్నయమంత్రిశేఖరుఁ డహర్నిశసేవనశాన్యభూమిభృ
త్సన్నిధికిన్ స్వదేశ సనుచితంబుగ వేమమహీశురెడ్డిరా
జ్యోన్నతి సంతతాభ్యుదయ మొందఁగఁ బారసిభాష వ్రాసినం
గన్నులపండువై యమరుఁ గాకిత ముందలి వర్ణపద్ధతుల్.

సీ. అఖిలదిగ్దంతి దంతాగ్రఫాళంబుల వ్రాయుఁ
నధిపదిగ్జయశాసనాక్షరములఁ
గువలయాక్షుల మించుగుబ్బచన్నుల వ్రాయుఁ
గుంకుమపత్త్రభంగాంకురముల
గర్వితారాతివక్షస్స్థలంబుల వ్రాయు
నయకార్యసరణిఁ గిణాంకములను
నర్థిసందోహఫాలాంచలంబుల వ్రాయు
లక్ష్మీప్రదము లైనలక్షణములఁ
బసిఁడికంటాన భూపాలుభాగ్యసీమ
వ్రాయు నయకావ్యసరణి కేవలము కాదు
వేమధాత్రీశమంత్రి గారాముమంత్రి
యతులగుణహారి! బెండపూఁడన్నశౌరి!

వైపద్యములలోఁ గాగితమును గంటమునుగూడఁ జెప్పియుండుటచే శ్రీనాథునికాలమున నీరెండును వాడుకలో నున్నట్లూహింపఁదగియున్నది. ఈపద్యములోఁ జెప్పఁబడిన అహమ్మదుసేను, బహమనీ రాజులవంశములోనివాఁడై, అహమ్మదుషాహావల్లి యని తోఁచుచున్నది. ఇతఁడు క్రీ. శ. ౧౪౨౨ మొదలు ౧౪౩౫ వఱకు రాజ్యము చేసినవాఁడు

కృతిపతియైన యన్నమంత్రి చేసిన దానములను శ్రీనాథుఁడీ క్రిందిపద్యములో వర్ణించియున్నాఁడు.

సీ. రాజమహేంద్రదుర్గమునఁ గావించె శ్రీ
  భీమనాథునకుఁ బ్రాకారరేఖ
నిలిపె మార్కండేయునిలయంబు మ్రోల
  రామేశుఁదమవల్లి నామకముగ
సంగమేశ్వరదివ్యశంభులింగమునకు
  గల్పించెఁ గల్యాణగర్భగృహము
దక్షవాటికయందుఁ దక్షేందుమౌళికి
  మొగిలివాకిట ధామమును రచించె
ప్రాగ్దిశాపగోపురప్రాంగణమున
సత్త్రమునిలిపి ఘనసోపానసరణి కెలనఁ
దీర్ఘభవనంబు భీమయదేవనగర
మంత్రి దేవయయన్నయామాత్యవరుఁడు.

మొట్టమొదట వీరిగృహనామ మేదియో మనకుఁ దెలియదు. భీమేశ్వరపురాణమున శ్రీనాథుఁడు కాశ్యపగోత్రులని యారంభించినాఁడే కాని యింటిపేరు చెప్పలేదు. అరేటుగ్రామమును నగ్రహారముగాఁ గైకొనిన యన్నమంత్రి మొదలుగా నాతనివంశీయులను 'అరియేటి' వారని శ్రీనాథుఁడు చెప్పియున్నాఁడు. భీమేశ్వరపురాణకృతిపతియైన అన్నమంత్రిని 'అరియేటి' వారనియు, "బెండపూడి" వారనియు

గూడ నీక్రిందిపద్యములలోఁ జెప్పియుండుటచే, నీ 'బెండపూఁడి' నామ మీయన్న మంత్రికాలములోనే వచ్చియుండునని యూహింపఁదగి యున్నది

క. సిరి యేలిక యగునరకే
సరి యేమోకాని గర్వసంరంభము నై
సరియే పౌనరుఁగ నితరులు
సరియే యరియేటియన్నసచివాగ్రణికిన్.

శా. కాంచీకంకణతారహారకటకగ్రైవేయభూషావళుల్
లంచం బిత్తురు దూతికాతతికి లీలన్ బెండపూఁడన్ననిన్
బంచాస్త్రోపముఁ దార తార కవయన్ బ్రార్థించి లోలోపలన్
బంచారామములందుఁ బల్లవపురిన్ బ్రౌఢేందుబింబాననల్.

గోదావరిమండలములోఁ దునికిసమీపమున బెండపూడి యను గ్రామమున్నది అచ్చట పూర్వమొక గొప్పదుర్గ ముండెడిదఁట. దానిచిహ్నము లిపుడు నున్నవి. ఈదుర్గమును సాధించినట్లు కొండటు రాజులచరిత్రములలోఁ జరిత్రకారులు లిఖించియున్నారు. ఈయన్న మంత్రియో యీతనియన్నయైన లింగమంత్రియో రెడ్డిపరిపాలనమున నీబెండపూడి దుర్గపరిపాలకులుగా నియమింపఁబడుటచేనప్పటినుండియు వీరికి బెండపూడి వారనిపేరు వచ్చినదని తలంపవచ్చును.

ఈయన్నమంత్రి ద్రాక్షారామ భీమేశ్వరస్వామియాలయ తూర్పుద్వారమున గోపురమును సప్తగోదావరిలో మండపమును గట్టించి యుండెనని పైపద్యములోఁ దెలుపఁబడినది. ఈవిషయములను దెలుపు శాసనమొకటి యాయాలయమునందున్నదాని నీక్రింద, వ్రాయుచున్నాఁడను. ఈశాసనము క్రీ. శ. ౧౪౨౦ వ సంవత్సరమునాఁటిది. దీనిని బట్టి భీమేశ్వరపురాణ మాపిమ్మట ౧౪౩౦ సంవత్సరప్రాంతమున వ్రాయఁబడినదని తలంపవలసియున్నది.

(న. హిం. శా. సం. ర సంఖ్య ౧౩౮౧)

"అస్తి ప్రశస్తమతి రల్లయ వేమభూపో రాజ్యే స్వకీయ జగతి రాజమహేంద్రపుర్యాం మంత్రీ హి తో స్వమతిః ద్విజదేవ మంత్రీ దివ్యశ్రియా జయతి దేవయ అన్నమంత్రీ ॥౧॥ శాకే పక్షి బాణవిశ్వగణితే సంవత్సరే కీలకే కార్తిక్యాం శనివాసరేసు కృతకృతిః శ్రీయన్నము క్రీశ్వరః। బాల్యాత్ రామజ భీమలింగపురతః శ్రీసప్తగోదాతటే ప్రాచీనో గ్రాస మండపం సమకరో దమ్యంశిలానిర్మితం ॥౨॥ ద్వ్యాదశసంఖ్యా స్తంభేపదా బహిర్ద్వారమండపే మహాసరకతు భీమేశో యం శ్రీదేవయయన్నసచివ మాకల్పం ॥౩॥ ఈశాసనరచయిత శ్రీనాథుఁడై యుండును.

గుంటూరుమండలమందలి బాపట్లతాలూకా ఉప్పుటూరులో నున్న బెండపూడివారు వీరివంశీయులే యని శ్రీకోన వెంకటరాయశర్మగారు "ఆంధ్రవాణి" పత్రికలో వ్రాసియున్నారు. కానియది, సత్యములేదు. ఆ బెండపూడివారు యాజ్ఞవల్క్య నియోగిబ్రాహ్మణులు. భారద్వాజగోత్రులు. శ్రీనాథుని బెండపూడివారు కాశ్యపగోత్రులు. ఆపస్తంబసూత్రులుకావున వారికిని వీరికిని సంబంధము లేదు. యాజ్ఞవల్క్యులలో ఆపస్తంబసూత్రులు లేరు.

—: ౫. కాశీఖండము : కృతిపతి వేమటి వీరభద్రారెడ్డి. :—

ఈవీరభద్రారెడ్డిని బైన 3వ వంశవృక్షములోఁజూపియున్నాఁడను భీమేశ్వరపురాణ కృతిపతి యగు బెండపూడి యన్నయామాత్యుఁ డీవీరభద్రారెడ్డి యొద్దనే మంత్రిగనుండెను. ఇతఁడు పై రెండవ వృక్షములోఁ జూపిన కాటయ వేమున కల్లుఁడు. రాజమహేంద్రవర రాజ్యము కొండవీటి రెడ్ల క్రిందనే యుండెడిది. కాటయవేముఁడు తన బావమఱఁదియైన కుమారగిరిరెడ్డికడ మంత్రిగానుండి రాజ్యభారమును దక్కగాఁ నిర్వహించినందులకు మెచ్చి రాజమహేంద్రవరరాజ్యమును కుమారగిరి యాతనికిచ్చివైచెనని కొందఱును, కాటయవేముని భార్య

తనకు సోదరియగుటచే నామె కరణముగా నిచ్చెనని కొందఱు నను కున్నారు. కాశీఖండరచనమునాఁటికి రాజమహేంద్రవరరాజ్యము వీరభద్రారెడ్డిచేఁ బాలింపఁబడుచున్నను, నారాజ్యాధికారిణినిజముగా నాతనిభార్యయైన యనితల్లి యని కాశీఖండమందలి పద్యముల వలన స్పష్టముగాఁ గాకపోయినను, గంభీరముగా సూచిత మగుచున్నది. అనితల్లికీ రాజ్య మెట్లులభించినదియుఁ గాశీఖండమునుబట్టి తెలియదు. ఈవిషయమును దెలిసికొనుటకు ముఖ్యముగా ననితల్లిజనని నామ మేదియో, ఆమెకుమారగిరిరెడ్డికి సోదరియగునో కాదో, రాజమహేంద్రవరరాజ్యము కాటయవేమున కెట్లువచ్చినదో, అది యనితల్లి కెట్లు సంక్రమించినదో యెఱుంగవలసియున్నది. ఈసంగతు లనితల్లి "కలువచేఱుశాసనము" వలనఁ గొంతవఱకుఁ దెలియును.

గ్రంథవిస్తరభీతిచే నాశాసనమంతయు నిటవ్రాయలేను. ప్రస్తుతచరిత్రమునకు సంబంధించిన శ్లోకముల (33-42) నిక్రిందనిచ్చుచున్నాఁడను 42 మొదలు 24 వఱకుఁగల శ్లోకములుప్రతిగ్రహీతృవిషయములు. ఈశాసనమునందును మఱికొన్నితామ్రములను గుమారగిరిరెడ్డి (కొమరగిరిరెడ్డి) పేరులు తఱచుగా వచ్చుచుండును. ఈ పేరుగలవారు లిరువురున్నారు. ఒకరు, కాటయవేమునకు బావమఱఁది (భార్యసోదరుఁడు) రెండవయాతఁడు కాటయవేమునకుఁ దల్లసానమ్మ యను భార్యయందుఁ గలిగిన కుమారుఁడు. ఈభేదమును బాఠకులు గమనింపవలసియుండును.

తేషాం వేమనరేశ్వరః క్షితిభుజాం ధర్మాత్మనా మగ్రిణీ
శ్శశ్వ ద్భారతదివ్యపూరుషకథా ధౌతాంతరంగస్సుధీః
శ్రీమత్పంటకులోద్భవ శ్శివపదద్వంద్వైక సేవాపరో
విప్రశ్రీవ్యచనోన్నతో జితరిపు స్సూర్యోర్జ(?)ప్రతాపోద యః 33
ప్రాహైః పాతాళగంగయా యార్పితా వేమభూభుజా
సా సోపానావళీ చిత్రం స్వర్గం గాప్యధిరోహిణీ 34

పుత్రా ధాత్రీపతే స్తస్య త్రిమూర్తయ ఇవ త్రయః
అన్నవో తాన్నమా చాన్నవేమ నామవిభూషణాః ౩౫
అన్నపోతవిభోః పుత్రః కుమారగిరి రున్నతః
శివావాసతయా భాతి భూభృత్కుల శిరోమణిః ౩౬
అస్తి ప్రశస్తగుణభూ రరిజి ద్వజకీర్తిః
కీర్తిప్రియో జగతి కాటయవేమభూపః
భక్త్యా కుమారగిరిభూమిపతే ర్య ఆసీ
ద్భ్రాతృవ్రజాను జపహృత్సచివాదిరూపః ౩౭
శ్రీమత్కాటయభూపతే ర్భుజభృతో నప్తా ప్రతాపోన్నతేః
పౌత్రో మారమహీశ్వరస్య తనయ శ్శ్రీకాటయోర్వీవిభోః
జామాతా ప్రభు రన్నపోతనృపతే ర్వేమక్ష్మాధీశ్వరో
య స్యాసీ త్సకుమారగి ర్యధిపతిన్యాసః పతిర్దైవతం ౩౮
మాలా మమ్లానపుష్పా మివ శిరసి వహ న్యస్య భూభర్తు రాజ్ఞా
మూర్వీం ఖర్వీకృతారిక్షితిపతి నగరా మప్రతీపప్రతాపః
జిత్వా సామ్రాజ్యలక్ష్మీ మనుపమవిభవాం జృంభయ స్సంభృతశ్రీ
కీర్తి స్సేనాపరోభూ త్కుమరగిరివిభోః కాటయాధీశవేమః ౩౯
వేమవిభు ర్లక్ష్మీనా నంగీకృతసర్వమంగళో జిష్ణుః
ప్రద్యుమ్నం శక్తిధరం జయంత మయతి స్మసుతకుమారగిరిం ౪౦
జాతమా త్రేణ జాతోఽపాస్యసర్వం సహేశ్వరః
ఆదిగర్భేశ్వరః ఖ్యాతః కుమారగిరి భూపతిః ౪౧
యస్యా వేమనృపాలో జనకో దొడ్డాంబికాను జనయిత్రీ
సా దీవ్య త్యనితల్లీ సమూర్తి రివ దేవభూమి దేవశ్రీ,
వేమక్షితీశతిలకే ఘకథావశేషే భ్రాత్రా కుమారగిరిరస్య సుతో భువో భూత్
పశ్చా ద్ధరాధిపతి భావజుగుప్స యేవ
ప్రస్థానవేవ స కుమారగిరీశ్వరోపి ౪౩

అథ వేమేశ్వరబంధు ర్విలసతి భువనప్రశస్తగుణసింధుః
దొడ్డయఅల్లాడరేంద్రః ప్రథితమహాసమరకేళినిస్తంద్రః ౪౪
స్వామిద్రోహపరాయణకున్నృపతిజలరాశిజలనిమగ్నధరాం
దొడ్డయ యల్లాడరేంద్రో హరిరివ సాకల్యత స్సముద్ధృతవాన్ ౪౫
గురుతరహితచిత్తో దొడ్డయాల్లాడభూపో
భువ మరిజనవశ్యాం భూయసా హ్యాత్మదోష్ణా
విమలగుణయుతాయాం వేమభూపాత్మజాయాం
మనసిసురసుధాయాం మన్నితల్ల్యాం న్యదత్త. ౪౬
భూలోకభాగ్యోదితకల్పవల్లీ, శిష్టాశ్రితానిష్టవిభేదభల్లీ,
పవిత్రచారిత్రవధూమతల్లీ వేమక్షితీశస్య సుతాన్నతల్లీ. ౪౭
తస్యాః పతిః పతిరశేషమహీపతీనాం
వేమాంబికాల్లయనృపాలవరేణ్యసూనుః
శ్రీవీరభద్ర ఇతి సర్వగుణైకభద్రః
కీర్తిప్రతాపతులితేశ్వరవీరభద్రః ౪౮
తస్యాగ్రజో జయతి వేమయభూతలేంద్ర
శ్రీకామినీవివిధచారువిలాససాంద్రః
అన్యానభిజ్ఞ సముపాశ్రితరామచంద్రః
ప్రఖ్యాతివంశకమలాకరపూర్ణచంద్రః ౪౯
వినతనరపాలపాళీ కనదురుమౌళిప్రసగుదితగంధపదాబ్జా
అనితల్లీ పతిదైవా ఘనసచివీభూతభావుకాభువమవతీ. ౫౦
శాకే శరయుగవిశ్వే వైశాఖే మాసి భువ మవత్యనితల్లీ
సుకవిపక్షేత్రకరం మార్కండేయేశసన్నిధౌ త్యక్తవతీ ౫౧
జగతి సదుపకర్తా జాహ్నవీశుద్ధిభర్తా
సతతసుకృతకర్తా సత్యవాక్యోపహర్తా
కృతపరశివసఖ్యః క్షితిసత్తాశేషసౌఖ్యః
ప్రథితపరహితాఖ్యః పావనో వైద్యముఖ్యః ౫౨

—: కలువచేరు శాసనము ! :—

ఆ తేయుపగో! తెలుంగుపరహితాచార్య బిరుదాంచితుఁడును వేద విద్యుఁడును, వైద్యశ్రేష్ఠుడగు నొక బ్రాహ్మణునకు "కలువచేరు" అను గ్రామమును, శా. శ. ౧౩౨౭ శ్రీభవసంవత్సర శ్రావణ బహుళ కాడశీదినమున దానమొసంగి యుసిత్రల్లి యీ శాసనమును వ్రాయించెను. ప్రతిగృహీతి పూర్వులందరును బహిహితమునకై వైద్యము చేయుచుండుటచే వీరికిఁ బహిహితాచార్యబిరుదము వంశానుగతముగా వచ్చుచుండెను. వీరి మూలపురుషుఁడు తనమాన్యమునొద్ద నున్న యొకపుట్ట సమీపమున నొకసర్పమునకు రెండుదవడలకు నొక యెముక గుచ్చుకొని బాధపడుచుండగాఁ జూచి దయార్ద్రుఁడై యా యెముక నూడదీసి యీగాయము మానుటకై మందువేసి దానిని గాపాడెను. వారివంశీయులు సర్పములకు వ్యాధులువచ్చినప్పుడు చికిత్స చేయుచుండెడివారు. ఆవంశమున కాశీనాథభట్టు అనునాయన జన్మించి ప్రఖ్యాతిగాంచుటచే వారు "కాలనాథభట్టు" వారైరి. ఈ శాసనము వారియింటనే లభించినది. దానమిచ్చిన "కలువచేరు" కృష్ణామండలమందున్నదని కొందఱును, మరియెచ్చటనో యున్నదని కొందఱును వ్రాసియున్నారు. ఇది గోదావరిమండలమున రామచంద్రపురము తాలూకాలో ఆలమూరునకు తూర్పున నొకమైలుదూరమున "కల్వచర్ల" అను పేరున నిప్పుడున్నది. తూర్పుసీమ మాఢపుంతయున్నదని శాసనమునందున్నది. ఇప్పుడాపుంతను మడతపుంతయనియు దానినంటియున్న భూములను మడతపొలమనియు వాడుచున్నారు. ఇంక నొకదిశగానున్నదని శాసనమునందుదాహృతమైన ప్రపికేరయనది యిప్పుడు పెనికేరని పిలువఁబడుచున్నది. ఈ గ్రామమునఁ గాలనాథభట్ట వారిప్పుడు లేరు. కానిపూర్వముండెడివారని తెలియుచున్నది. ఈ గ్రామమిప్పుడు దొరతనము వారికిఁజెందియున్నది ఈకల్వచర్లయే దానమిచ్చిన కలువచేరనుటకు సందియము లేదు. ఇది మానివాసగ్రామమైన కపిలేశ్వరపురమునకు నాలుగుమైళ్ళదూరములో నున్నది.

ఈశాసనమునందనితల్లికిఁ "దండ్రి కాటయవేముఁడనియుఁదల్లి దొడ్డాంబిక" యనియు 2వ శ్లోకమునందున్నది. మఱియుఁగాటయ వేముఁడు, అనపోతారెడ్డి కల్లుఁడనియుఁ కుమారగిరిరెడ్డికి స్యాలకుఁడనియు. 3వ శ్లోకమునందున్నది. కాని దొడ్డాంబిక యనపోతారెడ్డికుమార్తె యనిగాని కుమారగిరిరెడ్డికి సోదరియనిగాని చెప్పలేదు. ఈశాసనము వలన ననితల్లి తండ్రి కాటయవేముఁడనియుఁ దల్లి దొడ్డాంబిక యనియు స్పష్టపడినది. కాని యీదొడ్డాంబిక, యనపోతారెడ్డి కుమార్తెయని ధ్రువముకాలేదు. కాటయవేమునకు దొడ్డాంబికదప్ప వేఱుభార్యలు లేరనియు నీశాసనము ధృవపరచలేదు. కాటయవేమునకు మల్లాంబిక తల్లాంబికయను మఱియిద్దఱు భార్యలున్నమాట వాస్తవము. అందులకు శాసనాధారము లున్నవి. (A. R. 84 of 1915) మల్లాంబిక వ్రాయించిన దొకశాసనముకలదు. ఆశాసనమునందలి ముఖ్యభాగము నీక్రిందవ్రాయుచున్నాఁడను. దానినితోఁ తరమూడి శాసనమందును.

"కుమారగిరిభూపో భూదనపోత విభోస్సుతః
జయంతో వాసవస్యేవ ప్రద్యుమ్న ఇవశార్ఙ్గిణః
కొండవీడు రితిఖ్యాతే పురే స్థిత్వా కులాగతే.
కుమారగిరిభూపోయం చిరంభూమి మపాలయత్.
తులాపురుషరత్నస్య శ్రీకుమారగిరేః కుతః
తులాపురుషముఖ్యాని మహాదానాని యోతనోత్
ఆసీదమాత్యరత్నం కాటయవేమప్రభుస్తస్య
అతిసురగురు భార్గవమతి రతిభార్గవ విజయవిఖ్యాతిః
సింహాసనే నిధాయాసౌ కుమారగిరిభూవరం
అతేజయన్మహాతేజా శ్రీకృష్ణ ఇవ ధర్మజం
కుమారగిరి సూనాథో యస్మైవిక్రమతోషితః
ప్రాదాత్ ప్రాచీభువం రాజమహేంద్రినగరీముఖాం

నప్తా కాటమహీభుజో గుణగణోదారస్య మారప్రభోః
పౌత్రః కాటయవేమభూమిరమణః శ్రీవేమపృథ్వీపతేః
దౌహిత్రః పునరన్నపోతనృపతే ర్ధాత్రీశచూడామణే
ర్జామాతా జయతి క్షితౌ చిరమవన్ దొడ్డాంబికానందనః
కాటయవేమకటాక్షే ప్రభవతి సదయే చ నిర్దయే చ తదా
గజముఖనృపతీనాం చిత్రముక్తాతపత్రతా భవతి.
భూపాలాన్నమయన్ ప్రజాస్నియమయన్ కాంతాజనం కామయన్
భూదేవాన్ రమయన్నరీన్విరమయన్ మిత్రాణి విశ్రామయన్
కీర్తిం విభ్రమయన్నఘాని శమయన్ ధర్మాన్సమాయామయన్.
సోయం వేమమహీపతిర్విజయతే కాటావనీశాత్మజః
అభూత్కాటయవేమస్య జాయా మల్లాంబికా సతీ
అశేషగుణసంపూర్ణ పాతివ్రత్యధురంధరా
రాజద్రాజమహేంద్రనామనగరే గోదావరీతీరగం
మార్కండేయశివాలయం పతిహితా మల్లాంబికా ధార్మికా
కృత్వా శుద్ధసువర్ణరత్నఖచితం బ్రహ్మప్రతిష్ఠాం తదా
సత్రాణ్యధ్వని చ ప్రపాదిజయతే నేనాన్తటాకానపి
శ్రీశాకే గుణరామవిశ్వగణితే కార్త్తిక్య హేబ్దేఖరే
ప్రాదా త్కాటయవేమయస్య వనితా మల్లాంబికా నామతః
గ్రామం మల్లవరం నృసింహవిదుషే కాణ్వద్విజాయాదరా
దా చంద్రార్కముదర్కలాలసమితే సైశ్వర్యభోగాష్టకం
కోనదేశే గ్రహారోయం భాతి మల్లవరాభిధః
తీరే చ వృద్ధగౌతమ్యాః పూర్వే ముక్తేశ్వరాంతికే.

ఈశాసనము శా. శ. ౧౩౩౩ నాఁటిది. దానమిచ్చిన గ్రామము గోదావరిమండలమందలి యమలాపురము తాలూకాలో వృద్ధగౌతమీ నదీతీరమున ముక్తేశ్వరము నంటియున్న తోత్తరమూడి. మల్లాంబిక

తన పేరుతో మల్లవరమని దానికినామకరణ మొనర్చి నృసింహపండితున కొసంగినది. కాని యాగ్రామమిప్పుడు తొత్తరమూడి యను పేరుతో దొంతనమువారికిక్రింద నున్నది. ఈశాసనమునుబట్టి కాటయవేమునకు మల్లాంబికయను భార్య యున్నదనుటకు సంశయము లేదు.

—: అనవేమ జనని యెవ్వరు? :—

కుమారగిరిరెడ్డి సింహాసనమునకు వచ్చి, కాటయవేముడే రాజ్యాధికారమును నిర్వహించుచున్నందున నందులకు సంతుష్టచిత్తుడై కుమారగిరి రాజమహేంద్రవరము మొదలుగాగల తూర్పుదేశమును గాటయవేమున కిచ్చివేసెనని యీశాసనము చెప్పుచున్నది. దీనికే రాజమహేంద్రవర రాజ్యమని చెప్పుదురు. ఈ రాజ్యమును కుమారగిరిరెడ్డి తనసోదరి (కాటయవేముని భార్య) కరణముగా నిచ్చెనని జనశ్రుతులను కాని యందుల కాధారములు కన్పట్టవు. తనబావమైన కాటయవేమున కిచ్చినను, దనసోదరి కిచ్చినను నొకటియే. ఈ రాజ్యము కాటయవేమున కెట్టును బూర్వార్జితము కాదు. అతని కిచ్చినను నాతనిభార్యకిచ్చినను కుమారగిరిరెడ్డి యిచ్చినదియే. అరణమనగా వివాహకాలమున నిచ్చినది. కాటయవేముని వివాహము కుమారగిరిరాజ్యకాలములో నైనది కాదు. అనవేముని కాలముననో అనపోతారెడ్డికాలముననో జరిగియుండును కావున కుమారగిరి యిచ్చిన దరణమనిపించుకొనదు. ఇంత చర్చించినను కుమారగిరి సోదరి పేరు మల్లాంబికయో దొడ్డాంబికయో మనకు దెలియలేదు. తొత్తరమూడిశాసనమున మల్లాంబిక, కుమారగిరిరెడ్డికి సోదరియని చెప్పలేదు చెప్పకపోయినను, దనపుట్టింటియాస్తి యనునట్టే యొక గ్రామమును మల్లాంబిక దానమీయగలిగెననియు, నాకారణమున మల్లాంబికయే కుమారగిరిరెడ్డి సోదరియనియు దలంపవచ్చును కాని యదిబలవత్తరమైన కారణము కాదు భర్తసంపాదించినయాస్తియందాకాలమున రాణుల కట్టిస్వాతంత్ర్యముండెడిదనుట కనేక శాసనా

ధారము లున్నవి. ఏదియెట్లున్నను కొమారగిరిరెడ్డి సోదరీనామనిర్ధారణమునకీరెండుశాసనములునుగూడ దోహదములులేవు. కుమారగిరి సోదరికి, మేనత్తపేరుంచిరని తలంచుట యొకవిధముగా సమంజసమగుటను, అనితల్లికి సవతితల్లి పుట్టింటియాస్తి వచ్చెనని చెప్పుటకంటెఁ దల్లియాస్తి వచ్చెననిచెప్పుటయే యుక్తియుక్తము చేతను కలువచేఱు శాసనములోఁ గుమారగిరిరెడ్డి గాటయవేమునకు శ్యాలకుఁడనియు, నాతనిభార్య దొడ్డాంబికయనియు, నామెయే తనకుఁ దల్లి యనియు స్పష్టముగాఁ జెప్పియుండుటచేతను, అనితల్లిజనని దొడ్డాంబయనియు నామె కుమారగిరిరెడ్డికి సోదరియనియు నిశ్చయించుటయే సముచితము.✓ అనితల్లి కలువచేఱుశాసనమున 'దొడ్డాంబిక' అను నామము లేఖకనిపొరబాటనియు, శాసనములోఁ గాటయవేముని తల్లి దొడ్డాంబికయుండుటచేఁబొరపాటున నానామమే యనితల్లితల్లికిఁ గూడ నుపయోగించినాఁడనియు, నిచట మల్లాంబికయని యుండవలయునవియు నొకరనిరి. కాని తగినంత సాక్ష్యములభింపనిదే, శాసనాక్షరములను మార్పుచేయరాదు అనితల్లిభర్తయైన వీరభద్రారెడ్డి తండ్రి యల్లాడభూపతి స్వామి దోహదరాయనుఁగు వైరినృపతు లనిమొనజలరాశిలో మునిఁగిపోయిన భూమిని శ్రీహరివలె నీ యల్లాడభూపతి యుద్ధరించినాఁడనియు సురితాహితచిత్తుఁడైన యాతఁడు శత్రువశమునుండి తప్పించి యారాజ్యాధికారమును గాటయవేమ భూపతి కుమార్తెయైన యనితల్లి యందుంచినాఁడనియుఁ గలువచేఱుశాసనమునందలి ౨౫-౨౭ శ్లోకములలోఁజెప్పియుండుటచే,ననితల్లికి రాజమహేంద్రవరరాజ్యము తల్లిమూలముగా వచ్చియున్నదని భావింపవలయునని శ్రీనాథచారిత్రమునందుఁ శ్రీవీరేశలింగముపంతులుగారు వ్రాసియు నందే యొకతావున దొడ్డాంబికయనితల్లికి సవతితల్లియనియు, సవతితల్లినుండి యారాజ్యమామెకు సంక్రమించినదనియుఁజెప్పియున్నారు. రాజమహేంద్రవరరాజ్య మనితల్లిదనుట నిశ్చయమే కాని, యది

యెవరిమూలమున వచ్చినదనుటలోనే వివాదమున్నది. ఆరాజ్యమును కోమటిగిరిరెడ్డి, కాటయవేమునకిచ్చెనని తొత్తరమూడిశాసన మను చున్నది. అదిసత్యమైనచో నావేమారెడ్డి కనితల్లితప్ప యప్పటికివేఱు సంతానములేదు. కావునను ఆరాజ్యమున కుత్తరాధికారిణి అనితల్లి తప్ప మఱియొకరు లేనందునను, అల్లాడరెడ్డి యారాజ్యభారము నని తల్లియందుంచి తనయుదారాశయమును గనుపఱచి యుండును. దీనిని బట్టి యనితల్లిజనని యెవ్వరైననుతగవులేదు. తల్లిమూలముననే వచ్చి నదని యందురేని యామెతల్లి దొడ్డాంబిక యనుట యే సమంజసము.

—: తిరుపతిశాసనము. —

ఈసందర్భమున గోదావరి మండలము నందలి పెద్దాపురము తాలూకాతిరుపతి గ్రామములోని శృంగారరాయస్వామి వారి యాలయ మండపమునందున్న శాసనమును గనుపింపవలసి యున్నది. ఆ శాసన మిది ( ద. హిం. శా సం. ౪ సంఖ్య ౧౦౩ )

"శ్రీశకవరుషంబులు ౧౩౩౦ అగునేంటి సర్వధారిసంవత్సర మార్గశిరశు౧సో॥ కోమటిగిరిపురపు శ్రీంగారాయునికిముక్కంటి రాజుం గారుకాటమరెడ్డి వేమారెడ్డింగారి దేవులైతమతోడంబుట్టువెనకొమా రుని వృద్ధవతారువు మల్లసానమ్మంగారికిని తమతండ్రి కన్నిబోరాజుం గారికిని సుకృతముగాను నగిరికిం గాలోచితమూల్యం సమర్పించి పెట్టిం చిన శ్రీబృందావనము తిరుపతిదగ్గరిన పడుమరను తోంటపట్టుఖ ౧ న ౧౦ యి శ్రీబృందావనముసేసి వారికి క్షేత్రము ఖ ౨ యి కైంకర్యం శ్రీంగారరాయండు ఆచంద్రార్కముగాను అవథరించువారు మంగ ళంమహాశ్రీశ్రీశ్రీ. పర్వతాచార్య లిఖితం"

ఈదానమొసంగిన ముక్కంటిరాజెవ్వరో ఈతనితండ్రియైన కన్నిబోరాజెవ్వరో తెలియదు. వీరు భూపరిపాలకులుకారని సామాన్య గృహస్థులయియుందురనియు పేరులనుబట్టి క్షత్రియులైయుందురనియు దోచుచున్నది. కాటయవేమునిభార్యయైనమల్లసానమ్మ యీముక్కం

టిరాజునకుఁ దోబుట్టువైన ట్రీశాసనమువలనఁ దెలియుచున్నది. ఈమల్ల నానమ్మయే తొత్తైమూడి శాసనము వ్రాయించిన మల్లాంబిక. ముక్కంటిరాజు తండ్రి జీవించియుండఁగాఁ దాను శాసనము వ్రాయుట కేమిహేతువో తెలియదు. అప్పటికితండ్రి లేఁడనియు నందుచేతనేసుక తమునకుగాను అని వ్రాసెననియుఁ దలంచితిమేని మల్లనానమ్మనుగూడ నాతిపతితోఁజేర్చి వ్రాయుటచే నామెకూడ గతించినదనియే చెప్పవలసి వచ్చును ఆమెతొత్తైమూడి శాసనకర్త్రియైన మల్లాంబికయే యగుచో నామెశాసనము శా. శ ౧౨౩౩వ సంవత్సరమునాఁటిది. కావున నప్పటికామె జీవించియున్నట్లు చెప్పవలసియున్నది. అప్పటికిఁ గాల యవేమారెడ్డియు జీవించియున్నాఁడు. ఈశాసనములోని "కొమారునిగ్భద్రవతారువు" అనువాక్యమున కర్థము తెలియుటలేదు. ఇదిమల్ల నానమ్మకు విశేషణముగాఁగాన్పించుచున్నది దీనినిబట్టి మల్లనానమ్మ అనపోతారెడ్డి కుమార్తె కాదని స్పష్టమగుచున్నదికదా!

— : కాటయ వేముని కొడుకు కొమరగిరిరెడ్డి : —

పై శాసనములోఁ బేర్కొనఁబడినదేవుఁడు కొమరగిరిపురపు శృంగారరాయఁడు. దానమిచ్చిన భూమితిరుపతి ప్రక్క నున్నది. శాసన మున్నస్థానము తిరుపతియందలి శృంగారరాయని యాలయమండపము. దీనినిబట్టి మానాటికి కొమరగిరిపట్టణము వేరుగానున్నను నిప్పుడా పేరు పోయి తిరుపతియనియే వాడఁబడుచున్నట్లు తోఁచుచున్నది కాటయ వేముఁడు కృతజ్ఞతాసూచకముగఁ దనకుమారునకుఁ దనబావమఱఁది యైన కుమారగిరిరెడ్డి పేరుంచెనని యనుకొనుచున్నాము శ్రీశైల సమీపమునఁగల కుమారగిరియను పర్వతము పేరే కుమారగిరిరెడ్డి పేరు. కాటయవేముని కుమారుని పేరు కొమరగిరిరెడ్డి. శృంగారరాయ స్వామియున్న గ్రామనామము కొమరగిరియని పైశాసనము వలనఁ దెలియుచున్నది. ముక్కంటిరాజు కొమరగిరియందున్న దేవునకు దాన మిచ్చియుండుటచే నాతని నివాస మాగ్రామమైయుండును. ఆతని

శ్రీమహాదేవరకు ఆస్థానశిలామండపము కట్టించి సమర్పణచేసెను. స్వస్తిశ్రీశకవరుషంబులు ౧౩౩౬ అగునేటి జయసంవత్సర కార్తిక శు ౧౫ భానువారం"

ఈశాసనకాలమునాఁటికి కాటయవేముఁడు జీవించియున్నాఁడు. ఇతని శాసనములు శా. శ. ౧౩౩౭ మన్మథసంవత్సరమునాఁటివి కూడఁ గన్పడుచున్నవి. (A. R. 443/1893; A. R. 422/189) పై శాసనమున దానమిచ్చినవాఁడు కాటయవేముని భృత్యుఁడు. అతఁడు తన ప్రభువునకు అక్షయసుకృతమున కని వ్రాయక, కొమరగిరిరెడ్డికిని వారిదేవులకును అక్షయ సుకృతమునకని వ్రాయుటచేత ఈశాసనకాలమునాఁటికిఁ గొమరగిరిరెడ్డి చనిపోయి యుండునాయని సంశయము కలుగును. కాని యాతఁడు తండ్రియనంతరము వఱకు జీవించియున్నాఁడు. కావున నా సంశయమునకుఁ దావులేదు. వారిదేవు లనఁగాఁ గొమరగిరిరెడ్డిదేవులో వేమారెడ్డిదేవులో తెలియుటలేదు. కొమరగిరిరెడ్డి దేవులనినచో నాతనికిఁ బరిణయ మయినట్లు చెప్పవలసియున్నది. కొమరగిరిరెడ్డికి వివాహమైనట్లు తెలిపెడి యితరాధారములు లభింపలేదు. వేమారెడ్డి దేవులనినచో నామెపేరెవరో తెలియదు. ఆమె కొమరగిరిరెడ్డి తల్లియైన తిల్లసానమ్మయై యుండును. మల్లాంబికతో త్రాముడి శాసనము శా. శ. ౧౩౩౩ వ సంవత్సరమునాఁటిది. కావున నాశాసనమునకుఁ బిమ్మట శా. శ. ౧౩౩౬ లోపున నామె చనిపోయియుండునేమో తెలియదు. కాటయవేమారెడ్డిభార్యయైన దొడ్డాంబిక ఎప్పుడు గతించెనో యదియును దెలియదు. ఇఁక నీచర్చను విడిచి అనితల్లిశాసనమునందుఁ గాటయవేమునికుమారుఁడైన కొమరగిరిరెడ్డినిగూర్చి వ్రాసిన ౨౦-౨౬ శ్లోకములలో నీకొమరగిరిరెడ్డి తనతండ్రియైన కాటయవేముని యనంతరమున రాజ్యభారమువహించెనని చెప్పియుండుటచే నీతఁడు శా. శ. ౧౩౩౭ వఱకు జీవించియుండె ననియుఁ దండ్రిగతించిన

పిమ్మట కొండవీటిదేశములో మాసములో రాజ్యముచేసి చనిపోయె ననియు నంతటనుపాతి రాజ్యమునకు కర్త్రాధికారిణి యనితల్లియని నిశ్చయించి, యల్లాడరెడ్డి తనకొడుకులైన యామెయందే రాజ్యాధి కారమునుంచి యామె కుమారుని నామమున పరిపాలనాభారమును వహించె ననియు నిశ్చయించితిమి. అనితల్లి జనని దొడ్డాంబిక యను నామె అనపోతారెడ్డికిఁ గుమార్తెయుఁ గొమరగిరిరెడ్డికి సోదరియు. గాటయవేము నకు భార్యయనియుఁ గూడ నిశ్చయించితిమి.

పద్మవనములోనే శిథిలమయిన యొకనొక శాసనమున్నది. (ద-హిం శా. సం ౫ సంఖ్య ౭౩) ఇందు కాలమున్న భాగము శిథిలమై పోయినది. శిథిలము కాకుండ నున్న భాగములో యీ క్రింది వాక్యములు కనబడుచున్నవి.

"...ల మహీపాలనందనో లోకచందనః
కుమారగిరిభూపాలో జీయా దాచంద్రతారకం ॥౧॥
కోటయవ్య ..రనప్తా వేమమానమహీశమౌళి మణిపాత్రః
కొడ్డయనరపతి తనయో జీయాదల్లాడభూపతి స్సుచిరం ॥౨॥"

ఈశ్లోకములనుబట్టి కాటయవేమునకుఁ బిమ్మట నాతని కుమారుఁడైన కుమారగిరి రాజ్యముచేయుచున్నట్లును అల్లాడరెడ్డికూడ ఆకాలము లోనున్నట్లును స్పష్టమగుచున్నది. కాలము తెలిసియున్నచో కొమర గిరిరెడ్డి యెంతవఱకు జీవించియున్నది, తెలిసియుండును. అల్లాడరెడ్డి తనకొడలికి రాజ్యమువచ్చునను నుద్దేశముతోఁ గుమారగిరిరెడ్డిని రహస్యముగాఁ జంపించెనని యొక వదంతికలదు. కాని దానికాధార ములులేవు. కావున నందుసత్యము లేదని నిశ్చయించితిమి. పైనఁజెప్పిన బాంధవ్యములలో నొకయసంగతమైన విషయము గన్పట్టుచున్నది. అల్లాడరెడ్డియత్తగారు, అనవేమారెడ్డికిఁ గుమార్తె. కాటయవేముని భార్యయగు దొడ్డాంబిక, అనపోతారెడ్డికిఁగుమార్తె. కావున వీరిరు వురు నన్నదమ్ములబిడ్డలు. (ఈదొడ్డాంబిక కుమారైన యనితల్లియు

మునచే అల్లాడరెడ్డి శాసనమున్నది. ఇది అల్లాడరెడ్డి అడపం పెద్దన వ్రాయించినది. పలివెల కొప్పేశ్వరస్వామి ఆలయములో నున్నది. (ద. హిం. శా సం ౫ సంఖ్య ౧౧౩) శాసనదినము శా. శ ౧౩౩౭ మన్మథసంవత్సర పుష్యబహుళపంచాదశి భానువారము. అప్పటికిఁగాటయవేముఁడు చనిపోయిన ట్లీక్రింది శ్లోకమునఁ జెప్పియున్నాఁడు. "గతేదివం కాటయవేమభూపే॥ నిరున్మాల్యత ద్రోహికులం సమస్తం॥ అచంచలశ్రీకమసౌ తనోతి॥ తత్సంతతే రాజ్యమరాత్యఘస్మరః॥" దీనినిబట్టి కాటయవేముఁడు దుర్ముఖిలోఁ జనిపోవుటయు ఆసంవత్సరముననే అల్లాడరెడ్డి రాజ్యభారము వహించుటయు సత్యమని దోఁచుచున్నది. పైన వ్రాసిన సంబంధమునుబట్టియు ననితల్లి తనకోడలగుటయుఁ గారణములుగా నల్లాడరెడ్డి రాజమహేంద్రవర రాజ్యభారమును వహించుట సంభవించెను. కాటయవేముని రాజ్యకాలములోనే యాతనియొద్ద నల్లాడరెడ్డి సైన్యాధిపతిగానుండెనని కొందఱనుచున్నారు అది సత్యమైనఁ గావచ్చును.

రాజమహేంద్రవరరాజ్యము నాక్రమించుకొనవలయునని యానాఁడు పెదకోమటివేముఁ డొకపక్కను, ఒడ్డెరాజు లొకవంకను, మహమ్మదీయు లొకత్రోవను, కర్ణాటరాజు లొకపార్శ్వమునను గాచుకొనియుండిరి. అల్లాడరెడ్డి పరాక్రమవంతుఁడును, రాజనీతినిపుణుఁడు నగుటచే యవనకర్ణాటకటకాధిపతులతో మైత్రిగావించుకొని పెదకోమటివేముని రామేశ్వరమునొద్ద యోడించి రాజమహేంద్రవర రాజ్యమును నిష్కంటకముచేసిన యల్లాడరెడ్డి పెద్దకుమారుఁడైన వేమారెడ్డి వ్రాయించిన కోరుమిల్లి శాసనములోని యీక్రిందిశ్లోకమువలనఁ దెలియుచున్నది.

"తేషాం కనిష్ఠోపిచ జన్మనాభూత్ జ్యేష్ఠోగుణైరల్లధరాతలేంద్రః
చండోద్రిప్యద్దోషాకరతాముపేతస్సౌమ్యోపిభూనందనతాముపన్నః
జితాన్యనల్పవికల్పకల్పిత బలంతంచాల్పభానుంరజే

మిత్రీకృత్యసమాగతం గజబలం కర్ణాటభూపం చ తం
హత్వా కోమటివేమసైన్యనికరం భూయోపి రామేశ్వరాత్
రాజ్యం రాజమహేంద్రరాజ్యమకరో దల్లాడభూమీశ్వరః.

ఈవిషయమునే నిశ్శంకకొమ్మన్న శివలీలావిలాసమున "పెద్దకోమటి వేమపృథివీశు వెనుకొచ్చి యతనిసంపదలెల్ల నపహరించె" అని చెప్పి యున్నాఁడు. శ్రీనాథుఁడుకూడ భీమేశ్వరపురాణమున :—

సీ. యవనకర్ణాటకటకభూధవులతోడఁ
జెలిమి వాటించి యేలించె దెలుఁగుభూమిఁ
దననిజస్వామి నల్లాడధరణినాథు
భళిరె యరియేటిలింగన ప్రభువరుండు.

అనియును కాశీఖండమున, "యుత్కల కర్ణాటతురుష్కరాట్పరమమిత్రా!" యనియు వ్రాసియుండుటచే నల్లాడ భూపతియు, నాతని కుమారులునుగూడ యవనకర్ణాటకటక భూపతులతో మైత్రి కలిగి యున్నారని చెప్పవచ్చును. పెదకోమటివేమన నల్లాడరెడ్డి జయించినట్లు శ్రీనాథుఁడు చెప్పలేదు. అందులకుఁ గారణమాతఁడు చిరకాలమా ప్రభువు నాశ్రయించియుండుటయై యుండును. పెదకోమటి వేమనకును నల్లాడరెడ్డికిని జరిగినయుద్ధస్థలమయిన రామేశ్వరము గోదావరి మండలమందలి తుని తాలూకా నత్తారామేశ్వరమని చెప్పుచున్నారు. అల్లాడరెడ్డి చనిపోయిన సంవత్సరమేదియో స్పష్టముగాఁ దెలియదు కాని భీమేశ్వర పురాణరచనము నాఁటికాతఁడు లేఁడని యందు వ్రాసిన సంగతులనుబట్టి తెలిసికొనవచ్చును. కావున నల్లాడరెడ్డి క్రీ. శ. ౧౪౨౩ ప్రాంతమున స్వర్గస్థుఁ డయ్యెనని నిశ్చయింతము. ఈయల్లాడరెడ్డిని వర్ణించినపద్యములో "భానుమత్తులవీర భద్రాన్న దేవేంద్రగర్వ సంరంభంబు గట్టిపెట్టి" యనియున్నది. కోరుమిల్లిశాసనమునఁగూడ "భానుమంరణే" అనియున్నది.

—: అన్నదేవచోడుని శాసనము :—

ద్రిపస్థానమందలి యన్నదేవచోడుడే. ఈ తామ్ర శాసనము రాజమహేంద్రవరము మ్యూజియము (వస్తుప్రదర్శనశాల) నందున్నది. ఇది యించుమించు ద్రితిమైనట్లు కన్పట్టును. ఈశాసనము నందలి కొన్ని రేకులుపోయినవి! ఈతనినిగూర్చి యాంధ్రులచరిత్రము నందిట్లున్నది

"చోడవంశమున జనించిన యొక రాజు అన్నమాంబను వివాహము చేసికొన, వారికి చేబురభీమరాజు జనించెను. అతఁడు ప్రోలాంబికను వివాహముచేసికొనియెను. అతని మారిమనుమఁడు గంగాధరుఁడు. అతనికి అరిగండరగండఁ డనుబిరుదముకలదు. అతనికుమారుఁడు కామరాజు. అతనికి భక్తీశ్వరుఁ డను నామాంతరము కలదు. భక్తీశ్వరుఁడు బాలుఁడుగా నున్నప్పుడే గుల్లపూండి పురసమీపమున బాగ్గరాడియధిపతు లైన మహమ్మదీయ నాయకులను జయించెను. పంచధారకడ గజపతినోడించి కొప్పులభూపతికి పట్టముగట్టెను. భరణిపాడు సమీపమున సింగనాయకునిఁ జంపెను. పెదకొండాపురము కడ దబరుఖాను మొదలగు తురుష్క నాయకుల నోడించెను. సూరవరపటణమునందు రణశూరుఁ డైన అనపోతనాయని సులభముగా నాశనము గావించెను కామభూపాలుఁ డన్నమాంబను వివాహముఁ జేసికొని యాంధ్రదేశములోఁ దనపేరిట కామపురియని యొకపట్టణమును నిర్మించెను. కామభూపాలుని పుత్రుఁడే అన్నదేవచోడుఁడు. సూర్యవంశమున జన్మించిన పిన్నుండిరాజుయొక్క సోదరియగు ఇరుగాంబికను వివాహముచేసికొనియెను.... ........వీరికిసంతానము లేనిహేతువుచేతి వీరభద్రు డనువానిని దత్తుచేసికొన్నట్లు గన్పట్టుచున్నది. అన్నదేవచోడుఁడు బహుమనీసుల్తానగు అల్లాఉద్దీన్ షాహాతో నొడంబడిక చేసికొని తురుష్క సైన్యసాహాయ్యముతో రాజమహేంద్రపుర రాజ్యములోఁ గొంతభాగ మాక్రమించుకొనియెను.

………ఈమహాసంక్షోభ కాలమునందు అన్నదేవచోడుడు తురుష్క సైన్యముల సాహాయ్యముతో నొకపక్క గజపతుల సైన్యమును మఱియొక పక్కనుండి కర్ణాట సైన్యములను నెదుర్కొని త్రిలింగమ్ము నను గౌతమీతీరమునం గాకరపర్తికడను మహాఘోరసంగ్రామమును సల్పెను హతశేషమైనకాలబలము నేమియు నిల్పుబలము లేక గుర్రపుకాళ్ళపైఁ బడి శరణువేడఁగా గీర్తికాముఁడనై సంరక్షించితినని అన్నదేవచోడుఁడు తనశాసనమునందు వ్రాయించెను కాటయవేమునిపక్షము వారు పదివేలమందికి నభయహస్తమిచ్చి కాపాడెనఁట. ఈ యుద్ధమునందు దనకుఁ దనమఱఁది యగు పిన్నండిరాజు తోడుగానుండెనట. కపిలేంద్రగజపతి సైన్యములనోడించి తఱిమెను. కర్ణాటసైన్యముల హతము గావించుటయే గాక సైన్యాధీశులను కాకరపర్తి యుద్ధమున సంహరించెనఁట. ఎట్లయినను ఈయుద్ధములయం దన్నదేవుఁడు విజయములను గాంచెను. రెడ్లతరువాత పదిసంవత్సరము లీతఁడు రాజ్యపరిపాలనము చేసినట్లు గన్పట్టుచున్నది గౌతమీతీరమున నున్నముమ్మిడి పోలవరమాతనికి రాజధానిగ నుండెను. గౌతమీతీరమునఁ భట్టిసవీరభద్రేశ్వరుని సమ్ముఖమున ననేక గోదానములను గావించెను. మఱియును షోడశమహాదానములలో నొక్కటియగు సప్తసాగరదానములను గావించెనఁట గోముఖగిరిలోని వీరభద్రుని దేవాలయమును సువర్ణముతోఁ గప్పెను. దక్షారామభీమేశ్వరుని యాలయమునకు సువర్ణకలశము నెత్తించి యాంధ్రదేశకిరీటమున కొకయలంకారముగా నుండునట్లు గావించెనఁట. గంగతీరమున (గోదావరి) వీసరినాడులో పిన్నసానిగంగకు సమీపమున ఉత్తమగండచోడన్నదేవ వరమను గ్రామమును బ్రాహ్మణులకు దానముచేసెనని శాసనముయొక్క ప్రధానాంశమై యుండెను. అన్నదేవుఁడు విశేషకాలము రాజ్య పరిపాలనము చేయకపూర్వమే యీదేశమంతయును కపిలేంద్ర గజపతిచే యింపఁబడి పరిపాలింపఁబడినట్లు శాసనములు సాక్ష్యమిచ్చుచున్నవి.

ఈవాక్యములలో వీరభద్రరావుగారి యభిప్రాయములేవియో, శాసనము నందున్న విషయములేవియో తెలియుటలేదు. శాసన కాలము లేదు. అత్తిలి, కాకరపర్తియుద్ధము లేనాఁడు జరిగెనో తెలియదు. కాటయవేముఁడు క్రీ. శ. ౧౪౧౬ దుర్ముఖసంవత్సరమునఁ గాలధర్మమునందియుండుటచే, నాకాలముననో, అంతకుఁబూర్వమో జరిగియుండవలయును. అల్లాయుద్దీన్ షాహా సాహాయ్యముతో నన్నదేవుఁడు రాజమహేంద్రవర రాజ్యమునఁ గొంతభాగము నాక్రమించుకొనియెనని పైన వ్రాసియున్నాను. అల్లాయుద్దీన్ క్రీ. శ. ౧౪౩౫-౧౪౫౭ నడుమ రాజ్యము చేసినవాఁడు. ఈతని కాలమునఁ గాటయవేముఁడు లేఁడు. అన్నచోడదేవుఁడు కాటయవేముని కాలములో నొకమాఱును, అల్లాడవేమారెడ్డి చనిపోయినపిమ్మట నొకమాఱును రెడ్డిరాజులతో యుద్ధమొనర్చెనా? యని సంశయము కలుగుచున్నది. మొదటియుద్ధమున నన్నచోడునకు ముప్పదిసంవత్సరముల వయసున్నదన్నచో రెండవయుద్ధమునాఁటికి దాదాపుగ నఱువది సంవత్సరముల వయసుండును. ఆవయసున మఱల యుద్ధమొనర్చెనని చెప్పవీలులేదు ఈయన్నదేవుని శాసనములు ద్రాక్షారామమున క్రీ. శ. ౧౪౦౪ (ద. హిం. శా. సం ౪ సంఖ్య ౧౩౪౭) పాలకొల్లునందు క్రీ. శ. ౧౪౦౩ లోనుకలవు దీనినిబట్టి క్రీ. శ. ౧౪౩౫ నాఁటి కీతని కఱువది సంవత్సరము లుండుననుటకు సంశయములేదు. ఏదియెట్లున్నను నీయన్నచోడదేవునిఁ గూర్చి యింకను పరిశోధనము గావలసియున్నది. ఈతనివిషయమున నాంధ్రులచరిత్రమందలి పైవాక్యములు పరస్పరవిరుద్ధములుగాఁ గన్పట్టుచున్నవి. అల్లాడరెడ్డి, అన్నచోడదేవుని వీరభద్రుని జయించినట్లు పైనసీసపద్యపాదమునఁ జెప్పియుండుటచేఁ గాటయవేమునితో జరిగినయుద్ధము క్రీ. శ. ౧౪౧౬ సంవత్సరముననై యుండుననియు, నందుఁగాటయవేముఁడు చనిపోయి యుండుననియుఁ బిమ్మట నల్లాడరెడ్డి, వారినిజయించి రాజమహేంద్రవర రాజ్యమును బునరుద్ధరించె ననియు నూహింపఁ దగియున్నది.

ఈవిషయమును గలువచేరు శాసనమందలి ౪౪-౪౫ శ్లోకములు బల పఱచుచున్నవి.

అన్నచోడదేవుని తండ్రి చోడభక్తీశ్వరుఁడు (కామరాజు) ఇతఁడన వేమభూపాలుని వియ్యంకుఁడగునో కాదో చెప్పఁజాలము. అయినచో నన్నచోడదేవునకు భీమలింగము సోదరుఁడుండవలయును. ఉన్నచో, నీభీమలింగము భార్య యనవేమునకుఁ గుమార్తెయు, గాటయవేమునకు మేనమామకుమార్తెయు, నల్లాడరెడ్డికి నత్తగారునై వీరి నడుమ బంధుత్వమల్లుకొనిపోయి యుండెనుకదా! యుద్ధము లెట్లు జరిగినవని సంశయము గల్గుచున్నది. రాజ్యకాంక్ష బంధుత్వమును బరిగణింపదని సమాధానమును దోఁచుచున్నది. భక్తిరాజుశాసనములోఁగాని అన్నచోడఁదేవుని శాసనములలోఁ గాని భీమలింగము పేరు లేదు. ఈవిషయమున నింకను బరిశోధనముచేసి రాజమహేంద్రవరపు రెడ్డిరాజ్యమెప్పుడెవరివలననంత మొందింపఁబడెనో, మఱియొకతావున వ్రాయఁ బ్రయత్నించెదను. అల్లాడరెడ్డియు, నాతని కుమారులును రాజ్యముచేయుచున్న కాలములో నీయన్నచోడదేవుఁడు రాజమహేంద్రవరరాజ్యములో నడుగిడలేదు. అన్నచోడదేవునకు సాహాయ్య మొనర్చినది ఫిరోజు అనుమహమ్మదీయ ప్రభువుగాని, ఆంధ్రులచరిత్రము చెప్పినట్లు అల్లాయుద్దీనుకాఁడు. అన్నచోడదేవుఁడల్లాడరెడ్డిచే నిహతుఁడయ్యెనని కొందఱు చరిత్రకారు లనుచున్నారు. కాని కాశీఖండమున "అన్నదేవేంద్రగర్వసంరంభంబుఁగట్టిపెట్టి" అనిమాత్రమే యుండుటచే నన్నచోడదేవుని మరణమున కల్లాడరెడ్డి కారకుఁడు గాఁడేమో! యని యనుమానము కల్గుచున్నది. అల్లాడరెడ్డి క్రీ. శ. ౧౪౩౧ వఱకు జీవించియుండెనని కొందఱుచరిత్రకారులనుచున్నారు. కాని యాతఁడు ౧౪౨౬ ప్రాంతముననే చనిపోయినట్లు కనుపట్టుచున్నది.

## —: అల్లాడ వేమా రెడ్డి :—

ఇతఁడల్లాడరెడ్డికుమారుఁడు. తండ్రివలెనే పరాక్రమవంతుఁడును రాజనీతినిపుణుఁడును బుద్ధిశాలియునై తనతమ్ములు ముగ్గురితో గలసి యుండి యనితల్లినే రాజ్యాధికారిణిగానుంచి యామెభర్తయైన వీరభద్రారెడ్డిచేత రాజ్యమేలించెననియుఁ గటకమువఱకునుగల యావద్రాజ్యమును స్వాధీనము చేసికొనెననియు, నీతఁడు శివపూజాధురంధరుఁడనియు, శ్రీనాథుఁ డీతనిని బెక్కుపద్యములలో వర్ణించియున్నాఁడు. అనితల్లియు వీరభద్రారెడ్డియుఁ బేరునకుఁ బ్రభువులైనను రాజ్యభారమంతయు నీతనిదే. పాండవులవలె నీయన్నదమ్ముల సౌజన్యము శ్లాఘనీయమైనది. ముఖ్యముగా వీరియైకమత్యమువలన నానాఁడు రాజమహేంద్రవరరాజ్యము పరిచేతులనుండి జాఱిపోలేదు, వేమారెడ్డిని వర్ణించిన పద్యములు చాలఁగలవు. గ్రంథవిస్తరభీతి నిందీయలేదు.

### —: అల్లాడ వేమారెడ్డిభార్య హరిహరాంబ :—

ఈవేమారెడ్డికి భార్యలెందఱో వారెవరియాఁడుపడుచులో తెలియదు. శ్రీనాథుఁడు భీమపురాణకాశీఖండములలో నీవిషయము నెత్తలేదు. కాటయవేముని కుమార్తెయైన హరిహరాంబ యీతనిభార్యయనియు, నామెతల్లి తల్లాంబికయనియు నాతల్లాంబిక హరిహరరాయలకుమార్తెయనియు శ్రీప్రభాకరశాస్త్రులుగారు శృంగారశ్రీనాథమున నూహించి వ్రాసియున్నారు. వారియూహ కాధార మీవేమారెడ్డి వ్రాయించిన కోరుమిల్లిశాసనమునందలి యీక్రిందిశ్లోకము.

శ్లో. పౌత్రీం కాటయవేమయక్షితిపతేః పుత్రీంచ కాటప్రభోః
దౌహిత్రం చతురర్ణవీం హరిహరక్షోణీపతే శ్శాసితుః
తన్నామ్నావిదితాహ్వయాంహరిహరాంబాంచారుమగ్రాహయ
త్ప్రాణౌ వేమమహీశమల్లనృపతి స్సామ్రాజ్యలక్ష్మ్యాసమం.

ఈశాసనమును అల్లాడరెడ్డియే వ్రాయించెనని కొందఱనుచున్నారు. కాని యదినిజముకాదు. ఈశాసనపురేకులు సీమకేఁగినవఁట! ప్రాచ్య

లిఖితపుస్తకభాండాగారములో నొకవ్రాఁతప్రతియున్నదఁట! దానిని బట్టి శ్రీచిలుకూరి వీరభద్రరావుగా రాంధ్రులచరిత్రమునఁ జైశ్లోకము నుదాహరించినారు. దానిననుసరించి శ్రీవీరేశలింగము పంతులుగా రాంధ్రకవుల చరిత్రమున నుదాహరించియున్నారు ఇది బార్నెటు దొరగారిచే నిటీవల సవ్యాఖ్యానముగాఁ బ్రకటితమైనట్లు శ్రీవేటూరి ప్రభాకర శాస్త్రిలువారు శృంగారశ్రీనాథమున వ్రాసియున్నారు. బార్నెటుపండితుఁడు ఎపిగ్రాఫియా ఇండికా (సం 13 పుట 237) లో నొకశాసనమును బ్రకటించియున్నాఁడు. అది అల్లాడవేమారెడ్డి వ్రాయించినదే. ఆతామ్రశాసనప్రతులు బ్రిటిషుమ్యూజియమునకు వెళ్ళినమాటయు నిజమే అందుచేఁ బ్రభాకరశాస్త్రిలుగారు కోరుమిల్లి శాసనమని వ్రాసినదిదియే యని నిశ్చయింపవచ్చును కాని బార్నెటుపండితుఁ డీశాసనమునకు వేమవరపుశాసనమని పేరిడి యున్నాఁడు. చరిత్రకారులు కొందఱుదీనిని వేమవరపు శాసనమనియే వాడియున్నారు. ఈశాసనకార్యము అల్లాడవేమారెడ్డి గోదావరి మండలమందలి రామచంద్రపురం తాలూకాలోని వెదురుపాక, మహేంద్రవాడయను గ్రామములను అల్లాడ వేమవరమను పేరుపెట్టి బ్రాహ్మణులకు దానమిచ్చినట్లు తెలుపుటయై యున్నందున దీనికి వేమవరపు శాసనమని పేరుపెట్టుట సమంజసమే యగును. కాని వీరభద్రరావుగారు మొదలయినవారు కోరుమిల్లిశాసనమని యేలపేరు పెట్టిరో తెలియదు. బహుశః యీతామ్రశాసనము కోరుమిల్లిగ్రామములో లభించియుండును. అందుచేఁగోరుమిల్లిశాసనమని పేరిడియుందురు. శ్రీప్రభాకరశాస్త్రిలుగారును, వీరభద్రరావుగారును, వీరేశలింగముపంతులుగారును, ఉదాహరించిన "జిత్వా" "పాత్రీం" అను మొదలుగాగల శ్లోకము లీవేమవరపుశాసనమునం దుదాహృతములై యున్నవి. కావున నిదియే కోరుమిల్లిశాసనమని నిశ్చయింతము. అట్లుగాక అల్లాడవేమారెడ్డి వ్రాయించిన కోరుమిల్లిశాసనము వేఱుగా

మన్నను అంకలిశ్లోకములును నినియేకావున మనచర్చ కీశాసననామ మక్షరముగాదు. ఈశాసనము శా. శ. ౧౩౪౯ ఆనంద సంవత్సర జ్యేష్ఠ బహుళ అమావాస్యా సోమవారము. (క్రీ. శ. ౧౪౩౪ జూన్ నెల 2 వ తేదీ) సూర్యగ్రహణమునాఁడు పుట్టినది. బార్నెటు పండితుఁ డీశాసనవ్యాఖ్యానములో నొకవంశవృక్షము నిచ్చుచు నందుఁ గాటయ వేముని భార్య మల్లాంబిక కుమారగిరిరెడ్డికి సోదరియని చూపియున్నాఁడు. కానియందుల కాధారమునీయలేదు. మల్లాంబికముక్కంటిరాజునకు సోదరియని తిరుపతి శాసనమువలన మనకుఁ దెలిసినది. కావున బార్నెటు వ్రాసిన దంగీకార్యముకాదు.

పైశ్లోకములో రెండుతప్పులున్నవి. "పుత్త్రిం" అనుశబ్దమును "పుత్త్రీం" అనియును, "దౌహిత్రిం" అనుశబ్దమును "దౌహిత్రీం" అనియును జదువవలసియున్నది. లేనిచో నన్వయము కుదురక యర్థశూన్యమగును కావున నాశబ్దములను సవరించుటలోఁదప్పులేదు.

ఈమార్పును చేయకుండ శ్రీచిలుకూరి వీరభద్రరావుగారీశ్లోకమును దాహరించుటయేగాక పైశ్లోకార్థము నిట్లు వ్రాసియున్నారు. (ఆంధ్రులచరిత్ర మూఁడవభాగము ౧౫౪-౧౫౫పుటలు)

"కాటయవేమారెడ్డి ప్రబలుఁడనియు, కుమారగిరిరెడ్డికిమంత్రియు, సేనాపతియు, రాజమహేంద్రవర రాజ్యమున కధిపతియునైయున్నవాఁడని యెఱింగి యాతనితోమైత్రిగనున్నయెడలగజపతులవలన నేహానియుఁ దనసామ్రాజ్యమునకు సంభవింపదని తలంచి రాజాధిరాజరాజపరమేశ్వరుండను బిరుదాభిధానము గల హరిహర దేవరాయలు తనకుమార్తె హరిహరాంబ యనునామెను కాటయవేమారెడ్డి పుత్త్రుఁడగు కాటయప్రభునకిచ్చి వివాహముఁజేసెను. ఈవివాహవిషయము అల్లాడరెడ్డి కోరుమిల్లిశాసనములో వక్కాణింపఁబడినది." ఆగ్రంథములోనే మఱియొక తావునఁగూడ హరిహరాంబ కాటయవేముని కొడుకగు కాటయప్రభునిభార్యయని వ్రాసియున్నారు. ఇది

పొరపాటు. హరిహరాంబ హరిహరరాయలకుమార్తె కాదు. పొహి. త్రి. కాటయ ప్రభునకు భార్యయునుగాదు. కుమార్తె. (బ. శ్రీ. వీరేశలింగముపంతులుగారు "కాటయవేమారెడ్డి ౧౩౧౫ వ సంవత్సరప్రాంతమునఁ గాలధర్మము నొందెను. ఇతనిజీవితకాలములోనే యీతనిపుత్రుఁడును హరిహరరాయనియల్లుఁడు నైన కాటయవేమారెడ్డి మరణము నొందెను. ఈవివాహమునుగూర్చి యల్లాడరెడ్డి కోరుమిల్లిశాసనములో చెప్పియున్నది." అని వ్రాసి పైశ్లోకమును దోషములు సవరింపకుండ నుదాహరించియున్నారు. ఇదియును పొరపాటే. ఈవివాహమునుఁగా నేమియో పంతులుగారు చెప్పలేదు. కాని కాటయరెడ్డి వివాహమే యని యర్థమగుచున్నది. పైశ్లోకములో హరిహరాంబ వివాహప్రశంస యున్నది. కాని కాటయరెడ్డి వివాహప్రశంస లేదు.

శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారు పైశ్లోకమునఁగలపుత్త్రీదౌహిత్త్రీశబ్దములను సవరించి శృంగారనైషధమునఁ బ్రకటించుచు నందింకను రెండుతప్పులు గలవని తలంచి వానిని గూడదిద్దిరి. ఆసందర్భమున వారు వ్రాసినవాక్యములివి (284-288 పుటలు )

"కొంచమూఁగి యందలి యసంగతిని దెల్పెదను. అల్లాడరెడ్డి పెద్దకుమారుఁడగు వేమారెడ్డికి హరిహరాంబయను నామెభార్య యనియు, నాహరిహరాంబ కాటయవేమునకుఁ గొమరుఁగూఁతురనియు గాటయకుఁ గూఁతు రనియుఁ జతుస్సముద్రములను నేలుచున్న హరిహరక్షోణిపతికిఁ గూఁతుఁకూఁతు రనియుఁ బయిశ్లోకమున కర్థము ... ... ఆశ్లోకమిప్పుడున్నట్లే యుండునేని, కాటయవేమునకుఁ గాటయయని కుమారుఁడు కలఁడనియు నాతఁడు హరిహరరాయల యల్లుఁడనియు, నాకాటయకూఁతురు హరిహరాంబయనియు నేర్పడును. హరిహరాంబను బెండ్లియాడిన వేమారెడ్డి యల్లయ్యకుమారుఁ డగుట వీరభద్రారెడ్డి యన్నయగుట, మనమింతకు ముందెఱుఁగుదుము. మరియు నావీరభద్రారెడ్డి, కాటయవేమునికూఁతురగు వనితల్లికి భర్తయని కూడ

నెఱుఁగుదుము. కాటయవేమారెడ్డి తనయల్లునియన్నకుఁ దనకొడుకు కూఁతునిచ్చి వివాహము చేసినవాఁడగును. ఇట్టిది యెక్కడనేని సంగతముగా నుండునా ? అనితల్లికి మేనగోడలగు హరిహరాంబ తోడి కోడలయినట్లు, అల్లయవేముని సంబంధమునుబట్టి చూడఁగా ననితల్లి వీరభద్రారెడ్డికిఁ బినతల్లియగును. తల్లివరుసతలఁపరాదందురు. ఈశ్లోకమింత యసంగతముగా నున్నది... ......

"కాటయవేమునకుఁ గాటయయను కొమారుఁడున్నట్లుగా నేశాసనమందుఁగాని యే గ్రంథమందుఁగాని కానరాదు. ఆతఁడేమో బాల్యముననే చనిపోయి యుండవచ్చు ననుటకును గుదరదు. ఆతఁడు హరిహరరాయని యల్లుఁడట ! హరిహరాంబయనుకూఁతునుగనెనఁట... ఈశ్లోకముననొక చిన్నతప్పిదము దొరలినదని నేనుదలంచుచున్నాను. అదిశాసనము చెక్కువారివలనఁ గాని దానిని జదివివ్రాసినవారివలనఁ గాని ప్రసక్తించియుండును. శ్లోకమందలి ప్రథమచరణ మీక్రిందివిధమున నుండఁదగును.

"పుత్రీం కాటయవేమయ క్షితిపతేః పౌత్రీంచ కాటప్రభోః" హరిహరరాయని యల్లుఁడే కాటయవేమనయని దీనివలన నేర్పడును. హరిహరాంబ కాటయపౌత్రి, కాటయవేమునిపుత్రియగును. కాటయవేముని వంశక్రమమిది—

శ్లో॥ నప్తా కాటయశౌరేః పౌత్రోమారస్య కాటనృపసూనుః వీరాన్నపోతనృపతే ర్జామాతాజయతి వేమభూపాలః॥ కాటయవేముఁడు తనకుమార్తెల నిద్దఱను వేమవీరభద్రారెడ్లకిచ్చి పెండ్లిచేసెను. అక్కచెల్లెండ్రనన్నదమ్ములకిచ్చి వివాహముచేయఁ గూడదను నాక్షేపమున్నది. దానికిఁదగిన సమాధానముకూడ నున్నది. ఒక్కతల్లికడుపునఁబుట్టిన యక్కసెల్లెండ్రనొక్కతల్లికడుపునఁబుట్టినయన్నదమ్ముల కిచ్చి పెండ్లిచేయరాదుగాని వైమాత్రేయులయున్నప్పుడదితప్పుకాదు"

ఇవిశ్రీప్రభాకరశాస్త్రిలుగారి వాక్యములు. కోరుమిల్లిశాసనము నందలి పైశ్లోకమునుబట్టి హరిహరాంబభర్త కాటయరెడ్డియని వీరభద్ర రావుగారును వీరేశలింగముగారును దలంచియుండగా శ్రీశాస్త్రిలు వారు హరిహరాంబభర్త అల్లాడవేమారెడ్డియనియు హరిహరరా యలయల్లుఁడు కాటయవేముఁడనియు నాతనికుమార్తెయైన హరిహరాం బను అల్లాడవేమారెడ్డి పెండ్లాడెననియు నిర్ణయించినారు. హరి హరాంబభర్త అల్లాడవేమారెడ్డి యనుమాటనిశ్చయమే కాని కాటయ వేముఁడు హరిహరరాయల యల్లుఁడగుట మాత్రము వాస్తవము కాదు.

శాసనాక్షరములను సవరించుటకు శ్రీశాస్త్రిలువారు చెప్పిన కారణములు రెండు. మొదటిది. ఆవివాహమువలన వీరభద్రారెడ్డికి "అనితల్లి" తల్లి వావియగుట. రెండవది కాటయవేమునకుఁ గాటయ యను తనయుఁడున్నట్లాధారము గన్పడకపోవుట. శాసనాక్షరములను సవరించుట కీరెండును తగినకారణములు కావని నాయుద్దేశము. వీర భద్రారెడ్డికి అనితల్లియెట్లును దల్లివావియే యైనదని పైనవ్రాసియుం టిని. శాస్త్రిలుగారుచేసిన మార్పుమూలమున అల్లాడవేమారెడ్డికి హరివారాంబకూడదల్లి వావియైనది. యెట్లందు రా? కాటయవేముఁడును జోడభీమలింగమును, పినతండ్రి పెదతండ్రుల కుమార్తెల భర్తలు. కాఁగా వీరిరువురు తోడియల్లుండ్రు. ఇందులో భీమలింగముకుమార్తె వేమాంబ, అల్లాడవేమారెడ్డికిఁ దల్లి. కాటయవేమునికి హరిహరాంబ కుమార్తెయైనచో, నల్లాడవేమారెడ్డికి, ఆమెపినతల్లియగునుగదా! వీర భద్రారెడ్డి కనితల్లి కానివావియైనదని శాసనాక్షరములను సవరించి నందువలనఁ బ్రయోజనము లేకపోఁగా నింకనొకయసంగతమైనబాంధ వ్య మేర్పడుచున్నది. కావుననీమార్పు అనవసరము. హరిహరాంబ, కాటయవేమునికుమారుఁడైన కాటయకుఁ గుమార్తెయని యంగీకరించి నప్పుడీయసంగతమైన వావియుండదు. కానియీపక్షములోనే యసం గతమైన వావియున్నదని శ్రీశాస్త్రిలువారియుద్దేశము. ఇందెంతవఱ

కసంగతమున్నదో పరిశీలింతము. "కాటయవేమారెడ్డి తనయల్లుని యన్నకుఁ దనకొమరుకుమార్తెనిచ్చి వివాహము చేసినవాఁడగును ఇట్టిది యెక్కడనైన సంగతముగా నుండునా? అనితల్లికి మేనగోడలగు హరిహరాంబతోడికోడలయినట్లు కాదా?" అని శ్రీశాస్త్రులుగారు ప్రశ్నించుచున్నారు. ఇం దసంగతమేమియున్నది? అనితల్లికి మేనకోడలయిన హరిహరాంబ వారికి వీరభద్రారెడ్డికిని అల్లయవేమునకుఁ గూడ మేనగోడలేయగును గదా! మేనగోడలినిపరిణయమాడుటదోషము లేదు. ఇట్టివివాహములు లోకములో విశేషముగ జరుగుచున్నవి.

ఈసందర్భమున అనితల్లిపరిణయము ముందు జరిగెనా? హరిహరాంబ పరిణయము ముందు జరిగెనా? యను ప్రశ్న ముదయించుచున్నది. అనితల్లి వివాహమే మొదట జరిగెనందుమేని యేది సంగతమైన వావియే యయి యాక్షేపణముండదు. ఇఁక హరిహరాంబ వివాహము ముందుజరిగిన దనుకొన్నచో వీరభద్రారెడ్డికి అనితల్లి పినతల్లి వావిలో నుండి యసంగతమగును. కాటయవేముని కనితల్లి పుత్రి. హరిహరాంబపౌత్రి. పౌత్రికంటెఁ బుత్రి పెద్దదగుట సామాన్యధర్మము. పెద్దదానికి వివాహముచేయకుండఁ జిన్నదానికిఁ బరిణయముజరుపరు. కావున ననితల్లివివాహమే ముందు జరిగినదని తలంపవచ్చును

అనితల్లివివాహము కాటయవేముని జీవితకాలములో జరిగి యుండునని పైనఁ జెప్పియుంటిని. హరిహరాంబను తనకుమారుఁడైన వేమారెడ్డికిప్పించి యావివాహమును అల్లాడరెడ్డిచేయించెనని పైశ్లోకములోని "హరిహరాంబాంచారు మగ్రాహయత్ప్రాణో వేమమహీశ మల్లనృపతిః" అనువాక్యములవలన స్పష్టమగుచున్నది. ఇట్టి యర్థమిచ్చు వాక్యములు అనితల్లి కలువచేరుశాసనమునలేవు. కావున ననితల్లివివాహమే ముందుజరిగినదనియు నందుచే హరిహరాంబ వేమారెడ్లదాంపత్య మూలమునఁ గ్రొత్తగా ననితల్లి వీరభద్రుల నడుమ తల్లివావియేర్పడదనియు నందుచే శ్లోకమునందలి యక్షరములను సవ

రించుట యనవసరమనియుఁ దలంపవలసియున్నది. పెద్దవాఁడైన వేమారెడ్డికంటెఁ జిన్నవాఁడైన వీరభద్రారెడ్డికి ముందుగఁ బరిణయమయ్యెనా ? యని యెవ్వరైనఁ బ్రశ్నింపవచ్చును. అల్లయ వేమునకు మల్లసానమ్మయను నిఁక నొకభార్యకలదు. మాచిమాంబ రెండవభార్య. అల్లాడరెడ్డి కాటయవేముని కుమార్తెను తన రెండవకుమారునకును కాటయవేముని కుమారునికుమార్తెను తనపెద్దకుమారునకు రెండవ భార్యగను జేసికొని వారిలో నంతఃకలహములు కలుగకుండ వారి బాంధవ్యమును దృఢపరచెను.

ఇఁకను శ్రీశాస్త్రిలువారు చెప్పిన రెండవ కారణమునుగూర్చి యోచింతము.

—: కాటయవేమునకుఁ గాటయయను కుమారుఁడున్నాఁడా ? :—

శ్రీప్రభాకరశాస్త్రిలు గారీవిషయమున సంశయమును జూపినారు. కాని గోదావరిమండలములోని పర్వవరము నందున్న యొక శాసనమువలనఁ (ద. హిం. శా. సం ౫ సంఖ్య ౨) గాటయవేమునకుఁ గాటయయను తనయుఁడున్నట్లు స్పష్టమగుచున్నది. ఈశాసనము నందలి యెడమభాగమునఁ గొంత గోడలో నేటవాలుగఁ గట్టబడియుండుటచే దానినివిడచి కనఁబడుచున్న కుడిభాగమును మాత్రమే ప్రకటించినారు. దాని నీక్రిందనిచ్చుచుఁ గోడలోఁ గట్టబడిన భాగమును నేను బైనుదాహరించిన శా.శ. ౧౩౩౨ శాసనమునుబట్టియును కడియం మాచినేనింగారి శక౧౩౩౬ సంవత్సరము శాసనమును బట్టియును బూర్తిచేసితిని. ఈశాసనములకును పర్వవరపు శాసనమునకును బోలికయుండుటంబట్టియు, అందలిశ్లోకమే యిందుదాహరింపఁబడుట వలనను నేను పూరించినమాటలు సరియైనవేయని నాయుద్దేశము. పైనవ్రాసిన మాచినేనింగారి శాసనమును ఇదియు నొకదినమునఁ బుట్టినవే.

సప్తాకాటయ శౌరేః పౌత్రోమాక / స్యకాటనృప సూనుః వీరా ౧
న్నపోత స్సుతేః జామా / తాజయతి వేమభూపాలః ౨
స్వస్తి శక వరుషంబులు / ౧౩౩౬గు నేంటిజయసంవత్సర ౩
కార్తిక శు ౧౫ భానువారం / వేమారెడ్డింగారి నిజభృత్యుం ౪
హైన మాచిరేడింగా / డు తనకు స్వామియైన కాటమ ౫
రెడ్డిం గారి వే / మరెడ్డి. వేమారెడ్డింగారి కుమా ౬
పండయిన / కాటమరెడ్డి వేమారెడ్డింగారి ౭

అసంపూర్తి

తుదను "దేవులు"... అనుమాటలును యింకనుగొన్ని పంక్తులును నుండియుండును. గోడలోc గట్టcబడిన భాగముగాక కనcబడుచున్న భాగమువలననే కాటయవేమునకుc గుమారుcడు కాటయ యున్నట్లు స్పష్టమగుచున్నది. కావున శ్రీశాస్త్రులువారి సవరణ యనవసరమను మాట నిశ్చయము. దీనినిబట్టి హరిహరరాయల యల్లుcడు కాటయయేగాని కాటయవేముcడు కాcడనుట స్పష్టము. కాటయవేమునకు తల్లాంబికయను భార్యయుండుట నిశ్చయమేకాని యామె హరిహరరాయల కుమార్తెకాదు. కాటయభార్య పేరేదియో మనకుc దెలియదు. హరిహరరాయల యల్లుcడైన కాటయ యెప్పుడు చనిపోయెనో, యాతనితల్లి యెవ్వరో తెలియదు అనితల్లిశాసనమునc గాని మల్లాంబిక తోత్తరమూడి శాసనమునగాని తల్లాంబికశాసనమునcగాని యీతనిపేరు లేదు. ఇతcడు దొడ్డాంబిక తనయుcడనియు, శా. శ. ౧౩౩౦ ప్రాంతమునc జనిపోయెననియు నితరసాక్ష్యము లభించువఱకు ననుకొందము. అల్లాడరెడ్డికుమారులు నలుగురును శా. శ. ౧౩౩౨ పరీధావి సంవత్సర మాఘమాసమువఱకు జీవించియున్నట్లు ద్రాక్షారామములోని యొకశాసనము చెప్పుచున్నది. (ద. హిం. శా. సం. ౫ సంఖ్య ౧౩౫౧)

—: అల్లయవేమారెడ్డి భార్య మల్లసానమ్మ :—

అల్లయవేమారెడ్డికి జియ్యమల్లసానమ్మ యనునామె భార్యయైనట్లు చాళుక్యభీమేశ్వరస్వామి యాలయమునందున్న శాసనమును

బట్టి తెలియుచున్నది. (ద. హిం. శా. సం. ౫ సంఖ్య 3౮) ఆశాసన మిది. "స్వస్తిశ్రీ శకవరుషంబులు ౧3౫౬ అగునేంటి ఆనందసంవత్సర పుష్య బ ౧3 బు ఉత్తరాయణ మకరసంక్రాంతి పుణ్యకాలమందున శ్రీమత్కుమారా రామచాళుక్యభీమేశ్వర శ్రీమన్మహాదేవరలకు అల్లాడభూపాలుని కుమారుండు వేమారెడ్డింగారి దేవులు జియ్యమల్లసానమ్మ తమకు నక్షయసుకృత జనావస్తుగాను వీరారెడ్డింగారి ఆనతిక్రమానను కుమారా రామచాళుక్యభీమేశ్వరస్థాన సమ్మతిని ......జియ్య మల్లసానమ్మ సమర్పించెను."

ఈశాసనము క్రీ. శ. ౧౪3౪ సంవత్సరమునాఁటిది. ఈమల్లసానమ్మకు వీరభద్రారెడ్డి మఱఁదియైయున్నాడు. "ఆతనియానతిక్రమానను" అని వ్రాసియుండుటచేత నప్పటికి వేమారెడ్డి చనిపోయెనని తోఁచుచున్నది. కాశీఖండరచనమునాఁటి కీతఁడు జీవించియున్నట్లందలి పద్యములనుబట్టి తెలియుచుండెను గావునఁ గాశీఖండము క్రీ. శ ౧333 సంవత్సరప్రాంతమున రచియింపఁబడెనని చెప్పవచ్చును అప్పటికి శ్రీనాథునకు దాదాపు ౫౫ సంవత్సరముల ప్రాయముండును.

—: అల్లయ వేమారెడ్డి యెప్పుడు చనిపోయెను :—

అల్లయవేమారెడ్డి శాసనమొకటి సింహాచలము నందున్నది. అది యాతఁడు స్వయముగాఁ దనరాజ్యాభివృద్ధిని ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధినిగోరి వ్రాయించినది. ఆశాసనకాలము శా. శ. ౧3౫౬ ఆనందసంవత్సర శ్రావణ శు ౧౮ (ద. హిం శా. సం ౬ సంఖ్య ౧౧౬౨) ఇతఁడు ఆనందసంవత్సరములో శ్రావణ శు ౧౮ పుష్య బ౧3 నడుమఁజనిపోయినట్లు నిశ్చయింప వచ్చును. (క్రీ.శ. ౧౪3౪) అల్లయవేమారెడ్డి క్రీ. శ. ౧౪3౭ వఱకు రాజమహేంద్రవరరాజ్యమును బరిపాలించుచున్నట్లు విజయనగర సామ్రాజ్య చరిత్రకారులు

(Further sources of Vizianagara history Page 102) వ్రాసి అందులకాధారము (A R. 424 and 426 of 1893)ను జూపినారు. కాని యీశాసనము లల్లాడవేమారెడ్డి వ్రాయించినవికావు. అల్లాడవేమారెడ్డి తనకిచ్చిన వృత్తిలోనుండి తానీధర్మమును గావించితినని మఱియొక బ్రాహ్మణుఁడు వ్రాయించినవి. కావున నల్లాడ వేమారెడ్డి ౧౪౩౨ వఱకు జీవించియున్నట్లీశాసనములు ఋజువు సేయవు.

ద్రాక్షారామసత్రమునకు అల్లాడరెడ్డి కుమారులైన వేమారెడ్డి, వీరభద్రారెడ్డి, దొడ్డారెడ్డి అనువువ్వురును గలసి పంద్రెండు వేలపలముల యెత్తుగల కంచుఘంటయొకటి శా. శ. ౧౩౫౬ ఆనంద నామ సంవత్సర వైశాఖ బ ౧౩ బుధవారము నాఁడొసంగి నట్లొక శాసనమున్నది. (భారతి సం ౧౬ భా ౨) దీనినిబట్టి యానాఁటి కీముగ్వురు నున్నారనుట స్పష్టము. వీరి కనిష్టసోదరుఁడైన అన్నయరెడ్డి శాసనము లేవియుఁ గన్పట్టుటలేదు. ఈఘంటశాసనములో నీతని పేరు లేకుండుటచే నితఁడంతకు పూర్వమే చనిపోయెనని తోఁచుచున్నది.

కాశీఖండములో శ్రీనాథుఁ డన్నయరెడ్డిని రెండుపద్యములలో వర్ణించియున్నాఁడు. అందొకటియిది.

మ. సరి లే రీజలరాశివేష్టిత మహీచక్రంబున న్విక్రమా
 పరగాండీవికిఁ జక్రవాళమహీభృత్పర్యంత విశ్వంభరో
 ద్ధరణ ప్రౌఢభుజాభుజంగమునకున్ ధాత్రీశునల్లాడ భూ
 వరు నన్నయ్యకకుంఠవాఙ్మయకళా వైకుంఠరాట్సయ్యకున్.

కాశీఖండమున నల్లాడరెడ్డికుమారులు నలుగురిని వర్ణించివారికాయురారోగ్యైశ్వర్యములు గలుగునట్లు శ్రీనాథుఁ డీక్రిందిపద్యమునఁ జెప్పియుండుటచేఁ గాశీఖండరచనము క్రీ. శ. ౧౪౩౦–౧౪౩౩నడుమ రచితమయ్యెనని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును.

శా. మార్కండేయమహేశ్వరుం డఖిలసామ్రాజ్యంబుఁ బాలింపఁగా
　నర్కేందు ల్గలయంతకాలము తదీయాంఘ్రిద్వయీభక్తి సం
　పర్కాదంచితభాగ్యసంపదల నాత్మీయమండలీ వల్లభుల్
　కోర్కుల్మీఱఁగ సేవకత్వమునఁ గైకొం డాయురైశ్వర్యముల్.

దీనినిబట్టి అన్నారెడ్డి క్రీ. శ. ౧౪౩౩ లోఁ జనిపోయినట్లు నిశ్చయింప వచ్చును.

—: వీరభద్రారెడ్డి; రెడ్డి రాజ్యాంతము :—

ఇతఁడే కాశీఖండకృతిపతి. అనితల్లిభర్త. ఇతఁడు గోదావరి, విశాఖపట్టణము, గంజాము మండలములనుగూడఁ బాలించినట్లు కాశీఖండమునందలి యీక్రిందిపద్యములవలనఁ దెలియుచున్నవి.

ఉ. ప్రాకటవిక్రమస్ఫురణ రాజమహేంద్రము రాజధానిగా
　నేకసితాతపత్రమున నేలెను వీరనృపాలుఁ డుత్తమ
　శ్లోకుఁడు వేమశౌరియనుజుండు సమున్నతవైభవాఢ్యుఁడున్
　చీకటియున్ గళింగయును జిల్కసము దను సింహశైలమున్.

ఉత్సాహ. అసమబాణనిభవిలాస ! యాజిగాండివాయుధా !
　బసవశంకరా ! విశుద్ధపంట శేఖరాన్వయా !
　కసిమికోట వెంకటాయ కప్పకొండ కిల్లెదా
　ద్యసు హృదవనిపాంతరంగ హాలహాలవిషానలా !

ఇతఁడు శివభక్తుఁడు ధర్మాత్ముఁడు నైనట్లు కాశీఖండమునందలి పద్యములు చెప్పుచున్నవి. ఇతఁడెప్పుడు చనిపోయెనో తెలియదు. క్రీ. శ. ౧౪౩౪ వఱకు నీతఁడు జీవించియున్నమాట వాస్తవము. ౧౪౩౭ వఱకును జీవించియుండునని యూహింప వచ్చును. ఈతని సోదరులుకూడ ఈ ప్రాంతముననే చనిపోయియుందురు. రెడ్డిరాజులకుఁ దరువాత రాజమహేంద్రవరరాజ్యము అన్నదేవచోడుని వశమయ్యెనని కొందఱును గజపతుల వశమయ్యెనని కొందఱును దలంచుచున్నారు.

దా ద్రాక్షారామములోని యీ క్రింది శాసన మీసందర్భమునఁ జదువవలసియున్నది. "స్వస్తిశ్రీశకవరుషంబులు ౧౩౬౭ అగు రక్తాక్షి సంవత్సర మాఖశు ౫ గు శ్రీమన్మహామండలేశ్వర రాజాధిరాజ శ్రీవీరప్రతాప ప్రౌఢదేవరాయ మహాప్రధాన రాజమహేంద్రపురవరాధీశ నాగభూపాలపుత్ర కోటిశంకర బిరుదాంకిత మూరురాయరగండ మల్లభూపాల శేఖర నిజహిత శ్రీమత్పులియ మాక్రోల్కొండ పంచములగోత్ర పెద్దినాయక మారమాంబికాపుత్ర దేవాంబికామనః కమలమిత్ర జలంజె ధర్మపరిపాలకుండైన కృష్ణనాయటిం...... గార్త్రైన అంక తెలుంగరి సెట్టి గారున్నా ......... ".

ఈశాసనమునుబట్టి క్రీ. శ. ౧౪౪౪ రక్తాక్షిసంవత్సరములోఁ గర్ణాటకాధీశ్వరుఁడైన ప్రౌఢదేవరాయల మంత్రియగు మల్లభూపాలుఁడు రాజమహేంద్రవరపురాధీశుఁడై యున్నట్లు తెలియుచున్నది. రాజమహేంద్రపురాధీశుఁడని చెప్పుటచే నప్పటికి, రెడ్డిరాజ్యము రాజమహేంద్రవరమున నంతరించినదని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. ప్రౌఢ దేవరాయల నామముదాహరింపఁ బడుటచే నాతఁడే యీ రెడ్డిరాజులను జయించి, యీ రాజమహేంద్రవరరాజ్యము నాక్రమించుకొనియెననికూడ నిశ్చయింపవచ్చును. అల్లయ వేమారెడ్డి శా. శ. ౧౩౩౪ లోఁ జనిపోయెనని పైన వ్రాసియుంటిని. అన్నారెడ్డియంతకు ముందే గతించినట్లు కన్పట్టుచున్నది. అదికారణముగా రెడ్డిరాజ్యము కొంతవఱకు బలహీనముకాఁగాఁ దరుణమును వేచియున్న ప్రౌఢదేవరాయలు అదివఱకు స్నేహితులుగానున్నను, నా స్నేహమును బాటింపక రాజమహేంద్రవర రాజ్యముపైకి దండెత్తివచ్చి రెడ్డిరాజుల నోడించి రాజ్యమును గైకొనియుండెను. అదివఱకుఁ జాలకాలము క్రిందటనే కొండవీటిరెడ్డి రాజ్యమును ప్రౌఢదేవరాయలు స్వాధీనము చేసికొనియుండెను. ప్రౌఢదేవరాయల యనంతరమున ననఁగా క్రీ. శ. ౧౪౪౬ ప్రాంతమునఁ గపిలేంద్రగజపతి రాజమహేంద్రవరరాజ్యమును

గర్ణాటమునఁ గొంతభాగమును జయించి, యందు గజపతుల రాజ్యమును నెలకొల్పెను.

ప్రౌఢదేవరాయలు రెడ్డిరాజులను జయించిన సంవత్సరమేదియో పరిశోధించి నిర్ధారణ మొనర్పవలసియున్నది. క్రీ. శ. ౧౪౩౪ సంవత్సరమునకుఁ దరువాత రెడ్డిశాసనములు నాకుఁ గన్పట్ట లేదు. ౨-౩ సంవత్సరములు శత్రురాజులతోఁ బోరుసల్పుటలో మునిఁగియున్న కారణమున దానమిచ్చుటకుగాని శాసనము వ్రాయించుటకుఁ గాని యవకాశము లేదని తలంచినను క్రీ. శ. ౧౪౩౭ నాఁటికి రెడ్డి రాజ్యమంతరించి పోయియుండునని తలంపవచ్చును.

పైనపేర్కొన్న రాజమహేంద్రవరశాసన మసంపూర్ణమైనదనియు నది గోడలోఁ గట్టకపూర్వము మెకంజీదొరగారి యుద్యోగస్థుఁడు దానిని జూచియుండెననియు నందీశాసనదానము అల్లాడ వేమారెడ్డి యాజ్ఞానుసారముగాఁ జేయఁబడినట్లు వ్రాసియున్నదని యాయుద్యోగస్థుఁడు వ్రాసి యుంచెననియు విజయనగర సామ్రాజ్య చరిత్రకారులు (Further sources of Vizianagara history Foot note in page 102) వ్రాసియున్నారు. ఆశాసన మసంపూర్తిగాఁ బ్రకటితమయిన మాటవాస్తవమే. కాని వేమారెడ్డి యాజ్ఞానుసారముగా వ్రాసియున్నచో నందు రాజమహేంద్రపురవరాధీశ అని వ్రాయుటతటస్థింపదని నాయభిప్రాయము. కర్ణాటకులు రాజమహేంద్రవరపు రెడ్లతో స్నేహము కలిగియున్నట్లు కాశీఖండాది గ్రంథములలో నున్నమాటనిజమే. కాని యీమైత్రి సర్వదా యుండె ననుట కాధారములు లేవు. గజపతులుకూడ నొకప్పుడు రెడ్లతో స్నేహితులని కాశీఖండము నందే యున్నది. రాజుల మిత్రత్వ శత్రుత్వములు తాత్కాలికములు. బుద్బుదప్రాయములు. అవి విచ్ఛిన్నమగుటకు హేతువు లక్కఱలేదు. అల్లాడ వేమారెడ్డి క్రీ. శ. ౧౩౪౪ వఱకు జీవించి యుండెననుట కాధారములు లేవు. కావున నా యుద్యోగస్థుఁడు వ్రాసినది సత్యమని విశ్వసింపఁజాలము.

అల్లాడరెడ్డి జ్యేష్ఠసోదరుఁడైన (పోలారెడ్డికుమారుఁడగు నన పోతారెడ్డి శాసనములు కొన్ని (C. P. 11 of 1938, S. I. I. Vol V. No. 104) కనబడుచున్నవి. ఆశాసనములలోఁ గాని వారిచారిత్రములోఁ గాని మనకిటఁ బ్రసక్తి లేదు. వారును అల్లాడరెడ్డి కుమారులతోఁ గలిసియుండిరని తోఁచుచున్నది. వారిశాసనములు కూడ క్రీ శ. ౧౩౩౫ తరువాతఁ గన్పడుటలేదు.

ధనంజయవిజయము :—కృతిపతి దంతులూరి గన్నభూపాలుఁడు. ఈవిషయమున శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రులుగారు శృంగారశ్రీనాథమున నిట్లు వ్రాసియున్నారు.

శ్రీనాథుఁడు ధనంజయవిజయ మనుపేరుగల గ్రంథమును దంతులూరి గన్నభూపాలునిపేర రచించినట్లు మూర్తిత్రయోపాఖ్యాన మను ప్రబంధమునఁ గలదు. మూర్తిత్రయోపాఖ్యానము దంతులూరి పాపిరాజు రచించినది. ఆతఁ డిప్పటికి నూఱేండ్లవాఁడు.

సీ. అహితదుర్గాధ్యక్షు లద్భుతం బందంగఁ
గ్రీడి కైవసి విల్చెఁ దాడినాడ
అక్షుద్రదానవిద్యాపాత్రములచేతఁ
బ్రతి యెవ్వరును లేక ప్రతిభ గాంచె
తనకీర్తి దశదిగంతరంగీయమానమై
కనుపట్టు ధర్మమార్గంబు నెఱపె
శ్రీనాథసుకవీంద్రుచే ధనంజయవిజ
యం బనుసత్కావ్యమునను వెలసె

గీ. నృపతిమాత్రుండె నిజపాదనీరజాత
ఘటితకోటీరవైరిభూకాంతమాన
సాంతరభయాపహార శ్రీ దంతులూరి
గన్నభూపాలమౌళి! దోర్గర్వశాలి!

ధనంజయవిజయమునఁ గిరాతార్జునకథ వర్ణితమై యుండు నేమో! పయిమూర్తిత్రయోపాఖ్యానమందే గన్నభూపాలుని పూర్వుఁడు మాచిసీమకృష్ణుఁడు ధాన్యవాటీపురాధిపతిగా వర్ణింపఁబడినాఁడు. గన్న భూపాలుఁడు ధనంజయగోత్రుఁ డగుటచే

మ. కురియించెన్ బహుధాన్యవర్ష మఖిలక్షోణీప్రదేశంబునన్
మాఱియించెన్ విమతాంధకారములు బాహాగ్రాభిసూర్యప్రభన్
సిరిమించెన్ నృపవర్యు లెంచ ఘనుఁడై శ్రీధాన్యవాటీపురీ
చిరసామ్రాజ్య రమాపరాశ్రయ రమాసింహాసనాసీనుఁడై.

గన్నభూపాలుఁడు కూడ ధాన్యవాటీపురాధిపతిగా నుండవచ్చును. "క్రీడిక్రైవడి సల్పెఁ దాడినాడ" నని కలదు కాని యచ్చట నిల్చుట యుద్ధకార్యార్థమయి కావచ్చును. తాడినాడ కైకలూరు తాలూకాలో నున్నది. పూర్వులు ధాన్యవాటీపురాధిపతు లగుటచే నక్కడ నుండకున్నను దర్వాతివారికి "ధాన్యవాటీపురాధిపతి బిరుదము పరంపరాగతముగా నుండవచ్చును. ఒరయూరి పురవరాధీశ్వరేత్యాది బిరుదము లిట్టివి యితరరాజుల కున్నవి ... ... ...

శ్రీనాథుని కాలమున ధాన్యవాటీ పురాధిపతి యనఁబడు గన్న భూపాలుఁ డొకఁడు మన కింతకుఁ బూర్వ మెఱుకపడినాఁడు. అతఁడు పెదకోమటి వేమారెడ్డికి మామ. సంతానసాగర శాసనమున "శుక్రవారంబున శుభముహూర్తంబున శ్రీధాన్యవాటీపురాధిపతియుఁ గృష్ణవేణ్యా జలక్రీడావినోదుండు నగు గన్నభూపాలునకుఁ బుత్రి వీరనారాయణుఁ డు వేమవిభుని దేవి, భూరిసద్గుణ నికురుంబసూరమాంబ" అని కలదు. ధనంజయ విజయ కృతిపతి గన్నభూపాలుఁ డీతఁడు కావచ్చునేమో! అగుననుటకు ధాన్యవాటీపురాధిపతిత్వము శ్రీనాథ సమకాలీనత్వము సరిపోవుట సాధకము. దంతులూరివారు క్షత్రియులుగాను, రెడ్లు శూద్రులుగాను నుండుట బాధకము. కాని సాధకము బలవంతముగాను, బాధకము దుర్బలముగాను నున్నట్లు నేను

దలంచుచున్నాఁడను. కోమటి వేమారెడ్డి యాస్థాన కవి యగుటచే శ్రీనాథుఁ డాతనిమామకుఁ గృతియిచ్చుట సంగతమగును. శ్రీనాథుని కాలమున రాజ్యమేలుచున్న రెడ్డిరాజులకు క్షత్రియులతోఁ జుట్టరికములు నడచినట్లు తెలియవచ్చుచున్నది. ఇందులకు వ్యతిరేకముగ బలవత్తరములగు సాక్ష్యమేదేని లభించినచో తప్ప శాస్త్రిగారి యభిప్రాయ మంగీకార్యమని నా యభిప్రాయము. ఈయూహ సత్యమయ్యెనేని, పెదకోమటి వేమభూపాలుఁడు జీవించియున్నకాలములో నీ గ్రంథము రచితమై యుండునని తలంపవచ్చును.

—: శివరాత్రి మాహాత్మ్యము కృతిపతి పువ్వులపు శాంతయ్య :—

ఇతనితండ్రి ముమ్మడిదేవయ్య; తల్లి బొమ్మసానాంబ. వీ రేకులమువారో కృత్యాదిని దెల్పలేదు. కాని జంగములని తోఁచుచున్నది. శ్రీశైలమున జంగమ మఠ మొకటియున్నది. దానికిభిక్షావృత్తిమఠమని పేరు. ఈమఠమునకు జంగములే పరిపాలకులుగా నుందురు. వారి నామమునకుఁ దుదను భిక్షావృత్తి యనుశబ్దమును జేర్చుచుందురు. శ్రీనాథుని కాలమున నీమఠమును బరిపాలించువాఁడు శాంతభిక్షావృత్తి యతీశ్వరుఁడు. గౌరనకవిచే నవనాథచరిత్రమును శ్రీమల్లికార్జున స్వామిపేర గృతియిప్పించిన దితఁడే. ఆంధ్రకవిత్వమునం దితని కెక్కువ ప్రీతి కలదు. ఈతఁ డాంధ్రుఁడై యుండుటయే దీనికిఁ గారణము పువ్వులపు శాంతయ్య యీతనికి మూలభృత్యుఁడు. శాంతభిక్షావృత్తి యతీశ్వరుఁడు. శివరాత్రి మహాత్మ్యమును రచించి పువ్వులపు శాంతయ్యకుఁ గృతియిమ్మని శ్రీనాథునిఁ గోరెను. (ఇది వివాదాస్పద విషయము) ఆతఁడు యతియగుటచేఁ దాను స్వయముగాఁ గృతిపతి యగుట కిష్టపడక యుండును. పువ్వులపు శాంతయ్యకు ముత్తాత యగు పోలిదేవయ్య ప్రోత్సాహముచేసి శ్రీశైల మల్లికార్జునునకు నిచువత్తుగండనిచే "ఉత్పల" మను గ్రామమును కోలని రామారెడ్డి వలన లింగాల యనుగ్రామమును భక్తిరాజుచే నాతుకూరనుగ్రామమును రాయవేశ్యాభుజంగుచేత నాముదాలపల్లె యను గ్రామమును

నిష్పించినట్లు కృత్యాదిపద్యమువలనఁ దెలియుచున్నది. భక్తిరాజు అనవేమారెడ్డి వియ్యంకుఁడేమో! తక్కినవారెవ్వరో తెలియదు. చోడ భక్తిరాజు ౧౩౭౦ ప్రాంతమువాఁడు. ఈతఁ డాతఁడైనచో శ్రీనాథుఁడును శాంతయ్యయు సమకాలికులుగాన యీకృతిప్రదాన మసత్యమగును.

శివరాత్రిమాహాత్మ్యము నాలుగాశ్వాసములు మాత్రమె యిప్పుడు కన్పట్టుచున్నది. గ్రంథాంతమున నున్న:—

సీ. పరమమునులు సూత్యాహాసంభవుని సూతు
భక్తిఁ బూజించి యధికతాత్పర్యగరిమ
భటులు ప్రమథులచే భంగపడుట చూచి
చిన్నఁబోయి యతఁ డేమిచేసెఁ బిదప!

అనుపద్యమునుబట్టి యింకను గొంత గ్రంథ ముండవలయు నని తోఁచుచున్నది. శ్రీనాథుఁడు శేషభాగమును రచింపలేదో, రచించినను నది మనకు లభ్యముకాలేదో తెలియదు. శ్రీనాథుఁ డింతియే వ్రాయఁ దలపెట్టెనని కొందఱనుచున్నారు. కాని యీయూహ సమంజసమైనది కాదు. శ్రీనాథుఁడు నాల్గాశ్వాసములే వ్రాయఁ దలఁచినచో సంతటితో ముగించివేయును గాని, ఏమిచేసెఁ బిదప? అని ప్రశ్నించి దానితో నంతము సేయఁడు. శ్రీనాథున కవసానము తటస్థించుటచే నీగ్రంథమాగిపోయెనని కొందఱి మతము. అదియే సత్యము కావచ్చును. తరువాతి భాగముకూడ రచించియున్నను నది కాలగర్భమునఁ బడిపోయి యుండునని కొంద ఱందురు. కాని యీయూహ కాధారము లేదు

—: శివరాత్రి మాహాత్మ్య రచనా కాలము :—

ఈగ్రంథరచనాకాలమునుగూర్చి శ్రీనాథుఁ డేమియుఁ జెప్పలేదు. హరవిలాస నైషధములకుఁ బిదప భీమఖండమునకు మునుపు

దీనిని రచించెనని బ్ర. వీరేశలింగముపంతులుగారును, ఇయ్యది శ్రీనాథుని బాల్యకవితయని బ్ర. నాగపూడి కుప్పుసామయ్యగారును నీకృతియే శ్రీనాథుని యంత్యకృతియని బ్ర. కట్టి సాంబమూర్తిశాస్త్రిగారును, శ్రీ ప్రభాకరశాస్త్రులుగారును వ్రాసియున్నారు. శ్రీనాథునకుఁ గొండవీటిరెడ్డిరాజుల ప్రాపకము పోయినపిదప, రాజమహేంద్రవరపు రెడ్డి ప్రభువుల యాశ్రయము లభించకపూర్వము, హరవిలాసమున కించుకపూర్వమో యించుక పిమ్మటనో రచియించియుండుననియు, కాశీఖండమే యితని యంత్యకృతి యనియుఁ గొందఱనుచున్నారు. కాని యది నిశ్చయమని నిరూపించుటకుఁ దగినయాధారములు నాకులభింపలేదు. అట్టి వేవయిన లభించువఱకు శ్రీశాస్త్రిగారి యభిప్రాయమే సత్యమని నిశ్చయింపవలసియున్నది

—: శివరాత్రి మాహాత్మ్యకృత్యాది శ్రీనాథునిదేనా ? :—

ఈవిషయమున భిన్నాభిప్రాయములున్నవి. వీనినిగూర్చి శివరాత్రిమాహాత్మ్యమునకుఁ బీఠిక వ్రాసిన శ్రీకట్టి సాంబమూర్తిశాస్త్రిగారికిని శ్రీబండారు తమ్మయ్యగారికిని ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలలోను ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికలోను వాదోపవాదములు జరిగినవి. ఇందలి వివాదాంశములు మూఁడు (౧) శివరాత్రి మాహాత్మ్యమునకు మూలాధారమేది ? (౨) శ్రీనాథుఁడు నాల్గాశ్వాసములు మాత్రమే రచియించెనా ? (3) శ్రీనాథుఁడు పువ్వులపుశాంతయ్యకుఁ గృతియిచ్చెనా ? లేక శ్రీనాథుని యనంతరము శాంతయ్య యెవరిచేతనో కృత్యాదిని దనకంకితమైనట్లు వ్రాయించుకొనియెనా ?

ఈ గ్రంథమునకు మూలము శంకరసంహిత యనియు దీనినే యీశానసంహిత యందురనియు శ్రీతమ్మయ్యగారివాదము. ఈగ్రంథములు రెండును వేఱనియు, నీశానసంహితయే యీగ్రంథమునకాధారమనియు, శాస్త్రిగారియభిప్రాయము. శివరాత్రిమాహాత్మ్యమున:-

"అనవుఁడు నమ్మహీసురాగ్రగణ్యుండు కమలనాభమా హాత్మ్యంబును మాఘమాహాత్మ్య పఠించుచునగు శ్రీనాథకవిచంద్రుం డును సంతుష్టమానసుండై శాంతస్వామి యొసంగిన కర్పూరతాం బూలజాంబూనదాభరణాంబరంబులు స్వీకరించి స్వస్థానంబున కీశానసం హితం జెప్పంబడ్డ యురలింగోద్భవంబును ... ..." అనియొక చోటను;

ఉ. "తాపససార్వభౌములు సదాశివరాత్రి మహావ్రతంబు నా
పాపహృతిక్రియాంబు వినుఁడాదరణంబునఁ గేనసద్గురు
శ్రీపదపద్మము ల్దలఁచి చెప్పెద శంకరసంహితాకథా
దీపితభవ్యమార్గమును దేటపడ న్మెఱలింటిపుండియున్"

అనియొక చోటను నుదాహరింపఁబడియున్నది.

ఈశానసంహిత మూలశ్లోకములలో వేఱుగా నున్నదనియు, దానినే శ్రీనాథుఁడు గ్రహించి పెంచి శివరాత్రిమాహాత్మ్యమును వ్రాసెననియు నింకను గొంతగ్రంథము మిగిలియున్నదనియు, నీశాన సంహిత తమకడఁ గలదనియు శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రులుగారు తమపేర నుత్తరము వ్రాసిరని శ్రీసాంబమూర్తిశాస్త్రిగారు వ్రాసియు న్నారు. దీనినిబట్టి శివరాత్రిమహాత్మ్యమునకు మూలాధార మీశాన సంహితయనియు, గ్రంథ మసమగ్రమనియుఁ దేలినది. శ్రీసాంబ మూర్తిశాస్త్రిగారు మొదటనిది సమగ్రగ్రంథమేయని పీఠికలో వ్రాసి యుఁ దరువాతఁ దమ యభిప్రాయమును మార్చుకొనిరి.

ఇఁకఁ గృత్యాది విషయమున్నది. ఈగ్రంథమందలి కృత్యాదిని జదివినవారెవరు నిది శ్రీనాథకృతమని తలంపరు. ఈశానసంహిత శంకరసంహితల నొకే గ్రంథముగా శ్రీనాథుఁడు తలంచెనని చెప్పరాదు. కృత్యాదిపద్యములు పేలవముగా నున్నవనియు శ్రీనాథుఁడు రచించిన కృత్యాది పూర్ణముగనో కొంతభాగమో యుత్పన్నమైపోఁగా కృతి పతియైన శాంతయ్యయో ఆతనివంశీయులో తాము స్వయముగ రచించియో యితరులచేఁ జేయించియో యుందురనియు శ్రీతమ్మయ్య

గారును నంగీకరించుచున్నారు. కృత్యాదియంతయు శ్రీనాథునిది కాద నియే నాయభిప్రాయము. ఈవివాదమంతలోను శాంతయ్యకు శ్రీనాథుఁడు కృతియిచ్చెనా? లేక శ్రీనాథుని యనుమతిలేకుండ నాతని యనంతరము శాంతయ్య తాళపత్ర ప్రతిని సంపాదించి, తనపేరఁగృతి యిచ్చినట్లు వ్రాయించుకొనెనా? యనునదియె వివాదాంశము. ఈ గ్రంథరచనాకాలము క్రీ. శ. ౧౪౫౦ ప్రాంతమని యుభయపక్షములవారునునంగీకరించుచున్నారు. శ్రీనాథుఁడీ గ్రంథమును వ్రాయుచుఁ జనిపోయెనని గ్రంథమునందు గనుగా నుండుటనుబట్టి యూహింప వచ్చును. గ్రంథము పూర్తియైన పిమ్మటఁ గృత్యాది వ్రాసి కృతి నిచ్చి సమర్పించుట కలదు. ఆయుద్దేశముతోడనే శ్రీనాథుఁడు కృత్యాది వ్రాయలేదని యాతఁడు చనిపోవుటచే శ్రీనాథుఁడు వ్రాసినట్లుగనే మరియొకనిచే నిక్కృత్యాదిని శాంతయ్యయో నాతనివంశీయులో వ్రాయించియుందురని యూహింపవలసియున్నది. ఆశ్వాసాద్యంత పద్యములవిషయమున శ్రీనాగమూర్తిశాస్త్రిగారు పీఠికలో నేమియు వ్రాయలేదు. కాని తరువాతి చర్చలలో నాపద్యములుకూడ శ్రీనాథునివి కావనియు నవతారిక యాతనిది కాదనిపీఠికలో వ్రాసి యుండుటవలన నీయాశ్వాసాద్యంత పద్యములుకూడ నవతారికా భాగమే యగునని తమయుద్దేశమనియు శ్రీశాస్త్రులుగారు వ్రాసి యున్నారు. అవతారికయున్నంత యప్రౌఢముగా నాశ్వాసాంతపద్యములు లేవు. ఇతరకావ్యములలోని పద్యములకివి తీసికట్టుగానున్న వనుమాటసత్యము. ఐన నితరసాక్ష్యమువలన వేఱువిధమున ఋజువయిననేతప్ప నీపద్యములు శ్రీనాథునివని యంగీకరించి, గ్రంథమును శ్రీనాథుఁడు శాంతయ్యకుఁ గృతి యీఁదలఁచినమాట వాస్తవమనియు శాంతయ్య యక్రమముగాఁ గృతిని దొంగిలించి తనపేర వెలయించినాఁడని దలంపరాదనియుఁ గొంద ఱనవచ్చును.

శ్రీశైలమున క్రీ. శ. ౧౫౧౧ లో ప్రజాపతి సం॥ మాఘ బ ౧౪ సోమవారం (శా. శ. ౧౪౩౩ A. R. 16 of 1915) నొకశాసనమున్నది. శాసనకర్త శాంతలింగము. ఇతఁడు శివరాత్రి కృతిపతియగు

శాంతయయే యని శ్రీనాంబమూర్తిశాస్త్రిగారి యభిప్రాయము. అది సత్యమయ్యెనేని యూహింపఁబడు శ్రీనాథునకు గ్రంథాంతరములేదనఁ స్పష్టమగును. శాసనస్థ శాంతయ్యకొడుకు లింగయ్యయని తిమ్మయ్యగారి వాదము. ప్రాంతిసమువారి శాసనపరిశోధక శాఖవారు శాంతయ్యకొడుకు లింగయ్యయనియే వ్రాసిరి. ఈశాసనము ప్రతి కొఱకు ప్రయత్నించుచున్నాఁడను. లక్ష్యమైనచో నందువలనఁ దెలియు విశేషములను విపులముగ వ్రాసెదను.

ఈగ్రంథము శ్రీనాథుఁడు క్రీ. శ. ౧౪౩౦ ప్రాంతమున రచియించెననికదా యనుకొనుచున్నాము. అప్పటికి శాంతయ్యకు 30 సంవత్సరముల వయసుండి యుండుననియు నాతని కేఁబదియవయేట లింగయ జన్మించెననియు నాతని యేఁబదియవయేటఁ బైశాసనమును వ్రాయించెనని కాలమును సరిపెట్టుకొనవచ్చును. ఇది యస్వాభావికముగనే కన్పట్టునుగాని యసంభవముకాదు కావున నంగీకరింతము. ఈశాంతయ్యదే తాడిపత్రియం దొకశాసనమున్నది. (ద. హిం. శా. సం ౪ సంఖ్య ౭౯౯) "పరీధావిసంవత్సర అశ్వీజ ... స్వస్తిశ్రీ పరువత శ్రీస్వయంభు శ్రీలింగచక్రవర్తి శ్రీమల్లికార్జున మహాలింగదేవదివ్య శ్రీపాదపద్మారాధకులయిన శ్రీకయిలా సంపాంది దేవాపృథివి మహాంతుముఖ్యమయిన సిద్ధభిక్షావృత్తి అయ్యంగారి అజ్ఞాధారులయిన కెమి దేవని శాంతయ్యగారు తాడిపత్రి రామయలింగమును పూజ చేసిదండసమర్పించి ... ... .. ".

ఈశాసనమునందలి శాంతయ శివరాత్రిమహాత్మ్య కృతిపతియే యని నిశ్చయింపవచ్చును. ఇతనితండ్రిపేరు దేవయయే 'కెమి' యను శబ్దమునకర్థమేమో? పరీధావి సంవత్సరము శా. శ. ౧౩౯౪ (క్రీ. శ. ౧౪౭౨) ఈశాసనమునుబట్టి యీతఁడు సిద్ధభిక్షావృత్తియొద్ద యుద్యోగిగా నుండెనని తెలియుచున్నది. గ్రంథమునందున్న యీతఁడు శాంతభిక్షావృత్తిగాని సిద్ధభిక్షావృత్తికాఁడు. శాంతభిక్షావృత్తికిఁ

బిమ్మలు నీతఁడధికారమునకు వచ్చినట్లు కన్పట్టుచున్నది. కాని యెన్ని
మీఁదఁ డధికారము వహించెనో తెలియదు. ఈశాసనమునాఁటికి శాంత
య్యకు నలువది సంవత్సరముల వయసున్నదన్నచో నీతనికుమారుఁ
డైన లింగము తన నలువదవయేఁటఁ బైన వ్రాసిన శ్రీశైలశాసనము
వ్రాయించెనని తలంచుట స్వాభావికముగా నుండును. కాని యీ
పక్షములో శ్రీనాథుఁడు శాంతయ్యకుఁ దన గ్రంథమును కృతియియ్య
లేదనియు నాతనియనంతరము శాంతయ్య తనపేర నీకృతిని వెల
యించుకొనెననియు స్పష్టమగును. భీమేశ్వరపురాణ, హరవిలాసాది
గ్రంథములలో గద్యలయందు "సుకవిజనవిధేయ శ్రీనాథనామధేయ"
అని యుండఁగా నైషధమందున్నరీతిగా "సకలవిద్యాసనాథ శ్రీనాథ"
యని శివరాత్రి మహాత్మ్యము నందుండుటచే నిమార్పును గమనింపని
వారెవరో మఱల వెనుకకుఁ నైషధము దగ్గరకుఁ బోయి యందలిగద్య
ననుకరించి వ్రాసియుందురని తేలుచున్నది. దీనినిబట్టి చూచినచో
నీగద్యయు దానితోఁ బాటుగా నాశ్వాసాంతాది పద్యములును గూడ
శ్రీనాథునివి కావని యనుమానించుట కవకాశము గలిగి పైయూహకు
బలము చేకూరుచున్నది.

తాడిపత్రిశాసనమును శాంతయ్య డెబ్బది యేండ్లుదాఁటిన
వయసున వ్రాయించెనని సమాధానముచెప్పుట కవకాశమున్నది.
కావున నిట్టిసందేహ సందర్భములలో శాంతయ్యపైన దోషమారో
పించుట న్యాయముకాదని యెంచి సంశయలాభమును శాంతయ్య
కొసంగి పైనఁజెప్పినట్లే యితరాధారములు లభించువఱకు శ్రీనాథుఁడే
శాంతయ్యకుఁ గృతియీఁదలంచెనని నిర్ణయింతము.

—: శ్రీనాథునకుఁ గనకాభిషేకము చేసిన రాయలెవ్వరు ? :—

—: అతనిని గౌరవించిన సింగమన్నృపతి యెవ్వరు ? :—

కర్ణాటమహారాజ్యమును బరిపాలించెడి సంగమవంశజుఁడైన
దేవరాయలు శ్రీనాథమహాకవిని గనకాభిషేకము చేసియుఁ గవిసార్వ

భౌమ బిరుద మొసంగియు సన్మానించియుండెను. దేవరాయ నామములిరు వుర ప్రభువులచే నీసన్మానముఁ జేసిన యాతఁడాయిరువురిలో నెవ్వరు? అనువిషయమునఁ బండితులు భిన్నాభిప్రాయులగుచున్నారు. నిజాము రాష్ట్రమునందలి రాచకొండ సంస్థానాధిపతియు వెలమ ప్రభువునగు సింగమనాయఁడు శ్రీనాథుని గౌరవించి సన్మానించి యుండెను. కాని దేవరాయలవలెనే సింగమనీఁడులు నిరువురుండుటచే నీవిషయమునను భిన్నాభిప్రాయమున్నది ఎవరో యొకరు సన్మానించుట వాస్తవమే కదా! ఈయిరువురిలో నెవ్వరను విషయమున విశేషచర్చ చేయు టేల? యని యడుగవచ్చును. శ్రీనాథునివంటి మహాకవిని గౌర వించి యాతనిచేఁ బొగడ్తనందిన పుణ్యపురుషుఁడెవ్వరో నిశ్చ యించి యాతనికీర్తిని విస్తరింపఁజేయుట చరిత్రకారుల ధర్మము. ఆ విధిని నిర్వర్తించుటలో నీచర్చ యత్యావశ్యకమగుచున్నది. ఇంతే కాదు బమ్మెరపోతరాజ కృత భాగవతమును భూమిలోఁ బాతిపెట్టించె నను నపకీర్తి సర్వజ్ఞసింగమనాయనిపై నున్నది. అం దెంతవఱకుసత్య మున్నదియుఁ దేల్చవలసిన యవసరమొకటి కలదు. అదిసత్యమై నచో నాసర్వజ్ఞుఁ డెవ్వరో నిర్ణయింపవలసి యున్నది. అందుకొఱకుఁ గూడ నీచర్చ యావశ్యకమైనది.

పైనవ్రాసిన ప్రశ్నలు రెండును నొకదానిపైనొకటి యాధార పడియున్నవి. దేవరాయ లెవ్వరో నిర్ణయించుటకు, సింగమనీనిసాహా య్యమును, సింగమనాయని నిర్ణయించుటకు దేవరాయల సాహాయ్య మును గావలసి వచ్చుచున్నది. ఏసింగభూపతి శ్రీనాథునిఁ బూజిం చెనో తెలిసికొంటిమేని దానినిబట్టి దేవరాయలు సులభముగాఁ బయటఁబడును. కావున ముందుగా సింగమనాయనిఁ దెలిసికొను టకుఁ బ్రయత్నించెదను. దీనివలన బమ్మెరపోతరాజు చరిత్రమునకుఁ గావలసిన సంగతులుకూడఁ దెలియఁగలవు. ఈవిషయమునఁబండితులును జరిత్రకారులును భిన్నాభిప్రాయమును గలిగియున్నారు. వారిభావ ముల నాయాసందర్భములయం దుదాహరించెదను.

శ్రీనాథుఁడు రచియించిన యీ క్రిందిపద్యమువలన సింగమనాయనిని దర్శించుటకు ముందు కనకాభిషేకము జరిగినదనియు, నాంధ్ర నైషధ కావ్యము రచితమై యుండెననియుఁ దెలియ వచ్చుచున్నది

సీ. దీనారటంకాలఁ దీర్థమాడించితి
        దక్షిణాధీశు ముత్యాలశాలఁ
    బలుకు తోడై తాంధ్రభాషా మహాకావ్య
        నైషధగ్రంథసందర్భమునకుఁ
    బగులఁ గొట్టించి తుద్భటవివాద ప్రౌఢి
        గౌడడిండిమభట్టు కంచుఢక్కఁ
    జంద్రశేఖరక్రియాశక్తి రాయలయొద్దఁ
        బాదుకొల్పితి సార్వభౌమబిరుద
    మెటుల మెప్పించెదో నన్ను నింకమీఁద
    రావుసింగ మహీపాలు ధీవిశాలు
    నిండుకొలువున నెలకొనియుండి నీవు
    సకలసద్గుణనికురంబ! శారదాంబ!

—: సింగమనేని వంశవృక్షము :—

వివాదవిషయము సులభగ్రాహ్య మగుటకై యవసరమయినంతవఱకు సింగమప్రభువు వంశము నీక్రింద నిచ్చుచున్నాఁడను.



మల్లా నాయఁడు
దామా నాయఁడు
ప్రసాదాదిత్య నాయఁడు
౨వ తరము
పెన్నమ నాయుడు
౩వ తరము
యఱ్ఱదాచ నాయఁడు
౪వ తరము
సింగమ నాయఁడు
=
కేసమాంబిక
పెన్నమ నాయఁడు
సింగమాంబ
యాచమ నాయఁడు
౫వ తరము
అనపోత నాయఁడు = భార్య
(మొదటి) కనకలక్ష్మమ్మ
మాదా నాయఁడు
నాగా నాయఁడు
౬వ తరము
పెదవేదగిరి నాయుడు
(సర్వజ్ఞ) సింగమ నాయఁడు
(మొదటి) = భార్య
అన్నమాంబ
ధర్మా నాయడు
౭వ తరము

ఈవంశవృక్షములో సింగమనామధేయులు మువ్వురున్నారు. బేతాళరెడ్డిని మొదలు లెక్కించినచో ౨వ తరములో నొకసింగమనాయఁడును, ఏడవతరములో నొకసింగమనాయఁడును, పదియవ తరములో నొకసింగమనాయఁడును. కలరు. ౨వ తరములోని సింగభూపతికి సర్వజ్ఞబిరుదములేదని కొందఱును, ౧౦వ తరములోని సింగనృపతికి సర్వజ్ఞబిరుదములేదని కొందఱును నుడుచున్నారు. ఇది వివాదవిషయమగుటచే సర్వజ్ఞశబ్దము నిరువురకును జేర్చి మొదటిసర్వజ్ఞుఁడని రెండవసర్వజ్ఞుఁడని చేసి వ్రాయుచున్నాఁడను. సింగమనాయని కుమారులని చెప్పఁబడు మాధవనృపాలురు ౩వ తరములో నొకఁడును ౮వ తరములో నొకఁడును కలరు. మన వివాదము సింగమనృపాలురతోడను, మాధవనృపాలురతోడను సంబంధించియున్నది. ఇరువురు సర్వజ్ఞసింగమనృపాలుర నందనులును అనపోతానాయకులే యగుటను ఇరువురు మాధవనృపాలుర జనకులును సింగయనామధారులే యగుటను ఈవిషయాంశము మఱింత గహనమైనది.

పై వంశవృక్షములోఁ గనుపరచిన బేతాళరెడ్డి, ప్రస్తుతము బొబ్బిలి, పిఠాపురము, వెంకటగిరి, జటప్రోలు సంస్థానాధిపతులుగా నున్న వెలమప్రభువులకు మూలపురుషుఁడు. రేచర్లగోత్రుఁడు. ఈవంశీయుల చరిత్రములు వెలుగోటివారి వంశచరిత్రము, వెలుగోటివారివంశావళి, రావువారి వంశచారిత్రము, పిఠాపురసంస్థాన చరిత్రము, సురభివారి వంశచారిత్రము, బొబ్బిలిసంస్థానచరిత్రము మొదలగు గ్రంథములలో వ్రాయఁబడియున్నవి. కాని వీనిలోఁ గొన్ని తావులఁ బరస్పర విరోధములు గన్పట్టుచున్నవి. కావున వీని నటుండనిచ్చి శాసనముల మూలమునను, ఆనాఁటి గ్రంథసాహాయ్యమునను, మనప్రస్తుతపు వివాదవిషయములనునిర్ణయించుటకవకాశముగలుగునేమో చూడవలసియున్నది. సర్వజ్ఞసింగమనాయకు లిరువురు నేకాలమందుండిరో, మాధవనృపాలు రిరువురు నేకాలమందుండిరో తెలిసికొనఁ

గలిగితిమేని, మన వివాదాంశ నిర్ధారణమున కది మిగులఁ దోడ్పడఁ గలదు.

—: అయ్యనవోలు శాసనము :—

" ఈ క్రిందిశాసనము ఏకశిలానగర దక్షిణభాగమున నున్న అయ్యనవోలు దేవస్థానములో నున్నది. శాసన స్తంభము భగ్నమైనందున గొంత పోయినది "

గ్రంథవిస్తరభీతిచే నాశాసనమునం దవసరమైన భాగమును మాత్రమే యుదాహరించి వ్రాయుచున్నాఁడను.

"తస్యాగోత్రా ణ్యనేకాని ప్రసిద్ధా న్యాంధ్రమండలే
రేచర్లగోత్రం తే ష్వేకం కాకతీయనృపార్చితమ్.. ౬
పూర్వ స్మృధాంబుధివ వేన్నమనాయకోభూత్
తస్మాదజాయత జగత్త్రయజైత్రశౌర్యః
శ్రీదాచినాయక ఇతి ప్రథితః ప్రదీపః
శాకాబ్దే శశిఖండభాస్కరమితే సౌమ్యాఖ్య సంవత్సరే
శ్రావణ్యాం గురుయోగభాసి విజయ శ్రీసింగభూపాత్మజః
నిత్యశ్రీ రనపోతభూపతి రయం దేవాయ మైలార్యే
మోదా దయ్యనవోలు సంజ్ఞముదితగ్రామం నభోగాష్టకమ్.

స్వస్తి శ్రీమన్మహామండలేశ్వర రేచర్లగోత్ర చింతామణి, గజదళ విభాళ, భుజబలభీమ, ఖడ్గనారాయణ, చేకోలుగండ గాయగోవాళ, పాండ్యరాజ గజదళవిభాళ, చలమర్తిగండ, ధరణీవరాహ, దుష్టరాజగజాంకుశ, ప్రతికూలరాయ భయంకర, ప్రతిగండభైరవ, రాయమీసజాల, రాయదేవేంద్రవల్లభ, జాణరాయకులగురు, సమరమహేశ్వర, ఇనుమర్తిగండగోవాళ, కేళాదిరాయ, జగనొబ్బగండ, రాయగండభేరుండ, రాయబందీవిమోచక, రాయబిరుదవిభాళ, శరణాగత వజ్రపంజర, బల్లరగండ, వివేకనారాయణ, సమస్తసమరవిజయలక్ష్మీ సమాగమ సముచితపల్లవతోరణావళీ ప్రకాశిత నిత్యకల్యాణ, సత్య

ప్రతిష్ఠ, సోమకుల పరశురామాది జగత్ప్రసిద్ధ. వినుత నామధేయ ప్రశస్తిసహితులైన శ్రీసింగమనాయని అనపోతానాయనింగారు ఓరుగల్లు, శ్రీభువనగిరి, రాజుకొండ సింగపురము మొదలైన తెలుంగు దేశ మాచంద్రతారక ముత్తరోత్తరాభివృద్ధిగాను ధర్మరాజ్యము చేయుచును దిగ్విజయ యాత్రాప్రసంగాసను ఒరుగంటికి పశ్చిమాన అయ్యనవోలి తీర్థస్వామియైన శ్రీమైలారదేవరను దర్శించి, ఆఅయ్యనవోలు అనెడిగ్రామము శ్రీమైలారదేవరకు అంగరంగభోగాది సకల సమారాధన నామకగా యెల్లకాలంనున్ను సమర్పించినట్లుగాను, శక వర్షంబులు ౧౨౯౧ అగుచున్న సౌమ్యసంవత్సర శ్రావణ శుద్ధపంచదశీ శనివారమునాండు పవిత్రారోహణ మహోత్సవ పుణ్యసమయమందు అష్టభోగసహితముగాను సమర్పించి చేసినదిగ్విభాగ మెట్లన్నను ఇతిశ్రీకౌశిక బ్రహ్మర్షి గోత్రజమునా పసుపతి పండితపుత్రేణ నాగనాథకవినా లిఖిత మిదం శాశ్వతప్రతిష్ఠమస్తు" ✓

మైలారదేవునకు అయ్యనవోలు గ్రామమునిచ్చి యీశాసనము వ్రాయించిన యనపోతానాయఁడు పైవంశవృక్షములో ౬వ తరములో నున్న యాతఁడేకాని యున్యుఁడుకాఁడు. అనపోతనాయఁడను పేరుగలవారు ౬-౮-౯ తరములలో మాత్రమేకలరు. అయ్యనవోలు శాసనకర్త ౫వ తరములోనివాఁడనియెవ్వరైన ననుమానింతురేమో! అట్లనుకొనరాదు.

ఈయయ్యనవోలుశాసనము, శా. శ. ౧౨౯౧లో, వ్రాయఁబడినది. అనపోతానాయని దానశాసనములు శా. శ. ౧౨౮౭, ౧౩౦౨ సంవత్సరములలోని వింకను నాల్గుగలవు. కాలమునుబట్టి వీనియన్నిటిలో నుదాహరింపఁబడిన యనపోతానాయఁ డొక్కఁడే కాని భిన్న వ్యక్తులుకారని స్పష్టముగాఁ జెప్పవచ్చును. ౬వ తరములోని యనపోతానాయకునకును ౫వ తరములోని యనపోతానాయకునకును దాదాపుగ నేఁబదిసంవత్సరములు వ్యత్యాస ముండవలయును. అంత

వ్యత్యాసము లేదు. కావున ౧౨౮౭, ౧౨౯౧, ౧౩౦౨ సంవత్సరములలోని యనపోతనాయఁ డొక్కఁడే యనుటకు సంశయము లేదు. ౧౨౭౭, ౧౩౦౩ సంవత్సరపు శాసనములలో నీయనపోతానాయఁడు దాచినాయని సింగమనాయని వరసుతుఁడు, అనపోతానాయఁ డని యున్నది. వంశవృక్షమును బట్టి దాచినాయఁడు నాల్గవతరమువాఁడు. సింగమనాయఁ డైదవ తరమువాఁడు అనపోతానాయఁ డారవతరమువాఁడు. వంశవృక్షములో దాచనాయనామము గలవారింకొకరు లేరు. కావున ఐయ్యున్నగోలు శాసనములోని యనపోతానాయఁ డారవ తరమువాఁ డనుట నిస్సంశయము. సంశయనివారణము కొఱకీ యనపోతానాయని నాలుగు శాసనములను గ్రంథవిస్తరభీతియున్నను క్రింద వ్రాయుచున్నాఁడను

—: మొదటి యనపోతని శాసనము :—

రాచకొండ యాగ్నేయభాగమున భైరవ

గండియనుప్రదేశమునను్న శిలాశాసనము.

"స్వస్తిశ్రీ మన్మహా మండలేశ్వర, ఆంధ్రదేశాధీశ్వర, గజదళ విఫాళ, రాయగాయగోవాళ. పంచపాండ్యదళవిఫాళ, ప్రతిగండ భైరవ, భుజబలభీమ, ఖడ్గనారాయణ, కాకతిరాజ్యస్థాపనాచార్య, అష్టదిక్కురాయమనోభయంకర, రేచర్లవంశోద్భవ, దాచినాయని సింగమనాయని వరసుతుండు సోమకులపరశురామ, అరిరాయవిఫాళ, అప్రతిమాతప్రతాపుండైన అనపోతానాయనింగారు రాజగిరినివాసులయి సకలభూవలయమున్ పరిపాలిస్తున్ శకవర్షంబులు ౧౨౮౭ అగు విశ్వావసు సంవత్సర శ్రావణ బ ౧ ఆ॥ అనపోత సముద్రములోన సర్వభూతహితార్థముగాను తమబిరుదాంకితమై చేసెను. ప్రతిగండ భైరవప్రతిష్ఠ రాయగాయ గోవాలుని కరణము చిలుమరాజుతిప్పన వ్రాలు—మంగళమహా శ్రీ శ్రీ శ్రీ (అనియున్నది)

రాచకొండదిగువ నుత్తరభాగమున

భైరవుని చెంతనుండు చెఱువుకట్టకొమ్మున నున్నది.

శ్రీభైరవాయనమః స్వస్తి శ్రీమన్మహా మండలేశ్వర ఆంధ్ర దేశాధీశ్వర, గజదళవిభాళ, రాయగాయగోవాళ, పంచపాండ్యదళవిభాళ, ప్రతిగండభైరవ, భుజబలభీమ, ఖడ్గనారాయణ, కాకతీయరాజ్యస్థాపనాచార్య, అష్టదిశారాయ, మనోభయంకర, రేచర్లవంశోద్భవ ఎఱ్ఱ, దాచినాయని సింగమనాయని వరసుతుండు సోమకులపరశురామ, అరిరాయవిభాళ, అప్రతిహతప్రతాపుండైన అనపోతనాయనింగారు రాజగిరినివాసులయి సకలభూవలయమున్ పరిపాలిస్తూ శకవర్షంబులు ౧౨౭౭ అగు విశ్వావసు సంవత్సర శ్రావణ బ ||౫|| ఆ|| అనపోతసముద్రము దక్షిణాన రాజు కొండమీందికలుకోటలు భావులు మర్గసపుంరక్షణ సేయించి, ఆచెరువు వుత్తరాన నాగానాయని కొండమీంది కలుకోటలు భావులు సర్వమైన మర్గసపుంరక్షణ సేయించి ఆపడమట భూమికోటలు సేయించి రెండుకొండలనడుమ అనపోతసముద్రము సర్వభూతహితార్థముగాను తమబిరుదాంకితము సేసి పరగంగ చేయించిరి. ప్రతిగండభైరవ ప్రతిష్ఠ రాయగాయగోవాళుని కరణము చిలుమరాజు తిప్పనవాలు మంగళం మహా శ్రీ శ్రీ శ్రీ "(అనియున్నది)"

పై రాచకొండ రామస్వామియాలయము
తూర్పున ఆంజనేయవిగ్రహసమీపమున నున్నది.

స్వస్తిశ్రీ మన్మహామండలేశ్వర, ఆంధ్రదేశాధీశ్వర, గజదళవిభాళ, రాయగాయగోవాళ, పంచపాండ్యదళవిభాళ, ప్రతిగండభైరవ, భుజబలభీమ, ఖడ్గనారాయణ, కాకతిరాజ్యస్థాపనాచార్య, అష్టదిశారాయమనోభయంకర, రేచర్లవంశోద్భవ, ఎఱ్ఱదాచినాయని సింగమనాయనివరసుతుండు సోమకులపరశురామ, అరిరాజవిభాళ, అప్రతిహతప్రతాపుండైన అనపోతానాయనింగారు రాజగిరినివాసులు సకల

భూవలయమును పరిపాలింపుచు శకవర్షంబులు ౧౨౮౭ అగు విశ్వావసు సంవత్సర శ్రావణ బ౮ ఆదివారం అనపోతసముద్రము దక్షిణాన రాచకొండకూ నికిలుపోటులు బావులు మగ్గసవుంకతటాకము సేయించి రాయగాయగోవాలుని కరణము చిలుమరాజు తిప్పనవ్రాలు”
(అనియున్నది)

నల్లగొండకు రాచకొండ ప్రాగ్భాగమున
గన్నెకల్లైరవుని సమీపమున నున్నది.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శకవర్షంబులు ౧౩౦౨ అగు రౌద్రిసంవత్సర శ్రావణశుద్ధ౧ స్వస్తి శ్రీమన్మహామండలేశ్వర, ఆంధ్రదేశాధీశ్వర, గజ వెళవిభాళ, గాయగోవాళ, పంచపాండ్యదళవిభాళ మేదినీ... ...అంకుశప్రతిగండభైరవ. భుజబలభీమ, ఖడ్గనారాయణ, నిరంతర శివ దేవతారాధన, అనవరత హేమాద్రి దానసంతోషిత విప్రసమూహ, సేవాలబ్ధ సకలవిభవ సంపన్న, ఆశ్రితపారిజాత, కాకతీయ రాజ్యస్థాపనాచార్య, రేచర్లవంశోద్భవ, దాచినాయని సింగమనాయని వరసుతుండు ప్రతాపవిదితుండు అప్రతిహతప్రతాప, అరిరాయవిభాళ, సోమకులపరశురామ, వీరశ్రీరాయ రావు అనపోతానాయనింగారు రాజగిరివాసులై సకలభూవలయమును పరిపాలింపుచున్న రాయసముద్రము సర్వభూతహితార్థముగాను తమబిరుదాంకితము సేయించిన ప్రతిగండ భైరవప్రతిష్ఠ అరిరాయగాయగోవాలుని కరణము చిలమరాజు తిప్పరాజు వ్రాలు

ఈ యనపోతనాయని భార్య అయిన కనకలక్ష్మమ్మ శా. శ. ౧౩౦౨ శ్రావణశుక్ల ద్వితీయ ఆదివారమునాఁడు సింహాచలమందలి నరసింహస్వామికి ధూపసమయమునఁ గోలవెలిగించుట కేర్పాటు గావించి వ్రాయించిన శాసన మొకటికలదు. (ద. హిం. శా. సం. ౬ సంఖ్య ౧౦౮౧)

ఈశాసనములనుబట్టి యిందుదాహరింపఁబడిన యనపోతానాయఁడు వంశవృక్షములో ఆఱవతరములోని యాతఁడనుటకు లేశమాత్రమును సంశయింపఁబనిలేదు. పైఁగనుపరచిన అయ్యనవోలు శాసనరచయిత పరమశివపండితుఁడైన నాగనాథుఁడని శాసనాంతమున వ్రాయఁబడియున్నది. ఈనాగనాథుఁడాంధ్రమున విష్ణుపురాణమును రచియించియుండెను అగ్రిగిది యిప్పుడు కానవచ్చుటలేదు. ఈనాగనాథుఁడే మదనవిలాసమను బాణమును సంస్కృతమున రచియించి యీ యనపోతానాయనికంకితముచేసెను. ఇందునాగనాథకవి తన్నుఁగూర్చి యిట్లుచెప్పుకొనినాఁడు.

“రేచర్లవంశ రత్నాకరేణ .. శ్రీసింగభూపాల పూర్వాచల ప్రభాకరేణ...... రేచమాంబికా కల్పవల్లీసూన గుచ్ఛేన... శ్రీయనపోతభూపాలేన సతతసన్నిధీకృత కల్యాణ నారాయణస్య వసంతోత్సవ... ..భారద్వాజాన్వయ పరిపూర్ణరత్నాకరస్య గురువిశ్వేశ్వర కవిచంద్రస్య ప్రియశిష్యో నాగనాథకవిః...

దీనినిబట్టి నాగనాథకవి విశ్వేశ్వరకవిచంద్రుని శిష్యుఁడైనట్లును విశ్వేశ్వరకవిచంద్రుఁడు, అనపోతానాయని యాస్థానపండితుఁడైనట్లును స్పష్టమగుచున్నది. ఈగురుశిష్యులిరువురును గూడ పదునాల్గవశతాబ్ది యుత్తరార్థమున నున్నవారని అయ్యనవోలు శాసనము నందీయఁబడిన కాలమునుబట్టి విదితమగుచున్నది.

—: మా దా నా య ని ఉ మా మ హే శ్వ ర శా స న ము :—

ఈ యనపోతానాయని తమ్ముఁడైన మాదానాయని శాసనమొకటి మహబూబు నగరజిల్లా అమరవాది తాలూకాలోఁ జేరి శ్రీశైలోత్తరద్వారమైన ఉమామహేశ్వరములో నున్నది. దానివలనఁ గూడ నీ యనపోతానాయనికాలము నిర్ధారణము కాఁగలదు. గ్రంథవిస్తరభీతిచే నందుండి యవసరమైన భాగములను మాత్రమే యాకిందనిచ్చెదను.

శ్రీగణపతయేనమః స్వస్తిశ్రీ మన్మహామండలేశ్వర, రాయ రాయగోపాళ, గజదళవిభాళ, భుజబలభీమ, ఖడ్గనారాయణ. సోమ కులపవిత్రరామ, సత్యహరిశ్చంద్ర, శౌచగాంగేయ, అప్రతిహత ప్రతాపోదయ, సతతహేమాద్రిదాన నిరత, దాచయసింగభూపతి సుతుండైన మేదినీరూపనారాయణ, సింగమాంబా గర్భపుణ్యో దయ రేచర్లవంశ దుగ్ధాబ్ధి సుధాకరుండైన శ్రీమాధవేంద్రుండు దేవ నగదక్షిణ ప్రాంతమందుల స్వనామాంకితమైన మాధవపురమందు పాశ్చాత్యాజ్యోపవిష్టుండై శ్రీపర్వతోత్తర ద్వారమైన మహేశ్వర దేవరమంటపము మహాచ్ఛిలాసమూహాలను రమ్యముగా రచియిం పించి పదవాక్యప్రమాణజ్ఞులైన మాయిభట్టోపాధ్యాయులను తన్ని మిత్తంబై శాసనంబు చెప్పుమని పనిచినందు దుక్తశాసనంబు.

శ్రీమత్ స్తేషు గరిష్ఠపుణ్యమహిమా రేచర్లవంశోదధిః ౭
అస్మిన్వంశేతు సంభూత స్సంతాన స్సర్వకామదః ౯
తత్రాజని జనానందీ జేతా జన్యేషు వైరిణామ్
విక్రమే విజయీకారో వీరో వేన్నమహీపతిః ౧౦

తస్మాదావిరభూ దగణ్యమహిమా క్షోణీభృతా మగ్రణీ
శ్రీమాన్ దాచయనాయకో విజయశ్రీ నిరంధితాశాంతరః ౧౧

అభూత్తస్మా దుగ్రప్రతిమరిపురాజద్విపఘటీ
* * * * జగతివిజయీ సింగనృపతిః ౧౪

పుత్ర స్తస్య నృసింహస్య భాతి సుత్రామవి క్రమః
అమిత్రో ఘతిమోరాశిర్మిత్రో మాధవనాయకః ౧౬

అనుజో మనుజేంద్రస్య దనుజారాతిసంపదః
అన్నపోతమహీశస్య సన్నతారిమహీపతేః ౧౭

దంత్యబ్ధింశార్కశకాబ్దశాలిని శివే వర్షే వలే ఫాల్గునే
మాసే దాచయసింగభూపతిసుత శ్రీమాధవో భూధవః

శ్రీశైలోత్తరసింహకర్ణే ఘవి మహేశస్యాలయం నూతనం
పాపాత్రైస్సుకృతం సురాసురనుతం గమ్యం మన్మదాచీకరత్ ౨౮
మాధవో వర్ణ్యతే కేన దలితసకలనాహుపైః
అకృతం సుకృతం యేన కృతా సుకృతి నాకృతమ్ ౨౯
పదవాక్యప్రమాణేషు పారీణేన విరిఞ్చినా
శాసన మ్నాయిఘధియా స్థేమా వాచం గ్రత్నాకరమ్ ౩౦
శ్రీమత్తో మాధవేంద్రస్య రాజ్యం త్ర్యైకమకంటకః
మంత్రి పోతననామా సీత్సర్వశాస్త్ర విశారదః ౩౧
యస్యామాత్యశిఖామణేః కవివర స్తోత్రైకవా తీకృతాం
మత్వా పాకృతి రిద్ధకీర్తిసుభగాం వాగ్దేవ్యఖర్వీం లజ్జతే
సోయం పెద్దనమంత్రినస్యతనయః శ్రీపోతరాజోన్వహం
దేవస్యాస్య మహోపకారరచనాం సమ్యక్సుమదాచీకరత్ ౩౨
శ్రీశ్రీశ్రీ పెద్దిరాజుకొడుకు పోతురాజువ్రాలు.

ఈశాసనము శా. శ. ౧౨౯౮ (క్రీ. శ. ౧౩౭౬ సంవత్సరము నాఁటిది.) ఈశాసనకర్తయైన మాధవనృపాలుఁడు (మాదానాయుఁడు) పైవంశవృక్షమునందలి యాఱవతరములోని యాతఁడు. ఇతఁడు పైఅనపోతానాయునికిఁ దమ్ముఁడని ౧౨ వ శ్లోకమందున్నది ఈశాసనాంతమున వ్రాలుచేసినయాతఁడు ౩౨వ శ్లోకమున నుదాహృతుఁడైన పోతురాజే. ఇతఁడే గౌరనమంత్రికిఁ బెదతండ్రి).

ఈయనపోతనృపాలుని యనంతరమాతని పెద్దకుమారుఁడైన సింగమనాయఁడు ప్రభుత్వమునకు వచ్చెను. పైవంశవృక్షములో నేడవతరమందీతఁడు చూపఁబడియున్నాఁడు. ఇతఁడే సర్వజ్ఞసింగను బిరుదాంచితుఁడు. ఇతఁడే "రసార్ణవసుధాకర" మను నలంకారగ్రంథమును, "రత్నపాంచాలిక" యను సంస్కృతనాటకమును, మఱికొన్ని సంస్కృతగ్రంథములను రచియించి పేరొందినవాఁడు. కవిపండితపోషకుఁడు. విశ్వేశ్వర కవిచంద్రుఁడు "చమత్కారమంజరి"

యుఁడు నలంకార సాహిత్యలక్షణ గ్రంథము రచియించి యీసర్వజ్ఞసింగమ నాయునికే కృతి యొసఁగెను. రసార్ణవసుధాకరముకూడ విశ్వేశ్వర కవిచంద్రుఁడే రచియించి సర్వజ్ఞసింగమనాయని పేరుపెట్టెనని కొందఱనుచున్నారు. కాని యీవివాదముతో మనకిటఁ బనిలేదు. సర్వజ్ఞసింగమనాయఁడు గొప్పపండితుఁడును కవియునగుటకు సందియము లేదు. బ్రి. శ్రీ. వీరేశలింగము పంతులుగారు, విశ్వేశ్వర కవిచంద్రునిచే నలంకార గ్రంథము కృతినందిన దీసర్వజ్ఞసింగమ నృపాలుఁడు కాఁడనియు, పదియవతరములోని సర్వజ్ఞనృపాలుఁడనియు నభిప్రాయపడి యున్నారు. కాని యదిసత్యముకాదు. ఈవిశ్వేశ్వర కవిచంద్రుఁడు ౩వ తరములోని యనపోతనాయని యాస్థానపండితుఁడైనట్లు పైన్వ్రాసిన శాసనము చెప్పుచున్నది. ఇతఁడు ౭ వ తరములోనివాఁడైన సర్వజ్ఞసింగమ నాయనికాలమునాఁటికే, యేఁబదియేండ్లు మించినవయసు కలవాఁడగును. పదియవతరమునాఁటికీవిశ్వేశ్వరచంద్రుఁ డున్నచో ౧౪౦ సంవత్సరముల వయసునందుండి యుండవలయును. ఇది యసంభవము. రెండవసర్వజ్ఞ సింగమనాయఁడు పదియవతరమువాఁడు గాక త్రొమ్మిదవ తరమువాఁడని యెంచినను, అప్పటికి విశ్వేశ్వరచంద్రుఁడు నూఱుసంవత్సరములకు మించిన వయసుకలవాఁడగును. ఇదియు నసంభవమే. కావున విశ్వేశ్వర కవిచంద్రునిచే రసాలంకార సాహిత్యలక్షణగ్రంథము కృతినందినది పైవంశవృక్షములోని ౭ వ తరములోనున్న సర్వజ్ఞసింగమ నాయఁడే కాని యన్యుఁడు కాఁడు ౯వ తరములోనున్నను పదియవతరములో నున్నను రెండవయనపోయనాయని కుమారుఁడైన రెండవ సర్వజ్ఞసింగమనాయనికిని రసాలంకారసాహిత్యలక్షణ గ్రంథమునకును సంబంధము లేదు రసార్ణవసుధాకరమును రచియించిన యాతఁడు పైవంశవృక్షములోఁ జూపఁబడిన ౭వ తరములోని సర్వజ్ఞసింగమనాయఁడే యని యెల్లరు నంగీకరించుచున్నారు. ఇది నిర్వివాదవిషయము. అందుచే నావిషయమును ధృవపఱచుచు రసార్ణవ సుధాకరములోని కృత్యాది

రాజా సర్వజ్ఞనామధేయః
ముఖ్యాస్తే వంశే శ్రీమాన్ రాజధానీమ్
సత్తాంచకర్త మహత్తాంచకీర్తిం
వ్యాఖ్యాం సుధాకరోన్నామ రసార్ణవస్య 3౯

రసార్ణవసుధాకర రచనమునాఁటికి, సర్వజ్ఞసింగమనాయనికి దాదాపు తొంబది సంవత్సరముల వయసుండునని తలంపవచ్చును.

శ్రీసింహాచలస్వామివారి దేవాలయమునందు దనపోతానాయని కుమారుఁడైన సింగమనాయఁడు శా. శ. ౧౩౦౯ (అనఁగా క్రీ. శ. ౧౩౮౭) అగు కార్తికశుద్ధ పంచమిగురువారమునాఁడు స్వామిని దర్శించి ధర్మముచేసినట్లు వ్రాయించిన శిలాశాసన మొకటి యున్నది. (ద. హిం. శా. సం ౪ సంఖ్య ౧౦౯౬) అనపోతానాయని శాసనములు శా. శ. ౧౩౦౨ (క్రీ. శ ౧౩౮౦) వఱకు మనకులభించినవి. అందువలన నీశాసనములోని సింగమనాయఁడు ౭ వ తరములోని సింగమనాయఁ డనుటకు సంశయింపఁ బనిలేదు. క్రీ. శ. ౧౩౮౦–౧౩౮౭ నడుమ ౬ వ తరములోని యనపోతానాయఁడు కాలధర్మము నొందియుండును.

—: రెండవమాదానాయుని భార్య నాగాంబిక శాసనము :—

ఈసర్వజ్ఞసింగమనాయుని కనిష్ఠపుత్త్రుఁడైన మాదానాయుఁడు (మాధవప్పాలుఁడు) వాల్మీకిరామాయణమునకు వ్యాఖ్య రచించి యుండెను. ఈతనిభార్యయైన నాగాంబిక, “నాగార” మను గ్రామమున నొకతటాకమును ద్రవ్వించి దానికిఁ దనపేరుతో నాగసముద్ర మను పేరుంచి యొకశిలాశాసనమును వ్రాయించినది. ఆశాసనము కూడ నీసందర్భమున నుపయోగపడునది కావున నందలిముఖ్యభాగముల నీక్రింద నిచ్చుచున్నాఁడను.

ఇది పైరాచకొండకు త్తరమున నాగారమను గ్రామమునొద్ద నాగసముద్ర మను తటాకముపై నున్నది.

"తత్రో ద్దభూ త్ప్రథమతి ప్రహోత్మా
ధర్మైక నిష్ఠో ఝిలాచభూపః
పీయోవిహంస్త్రోదయ సత్యసాంద్రో
చేతస్య వంశాంబుధి పూర్ణచంద్రః ౫

తస్యాభవ త్సూను రహార్కతేజా
స్సింగక్షితీశో జయభానుసూనుః
కృపానిధి ర్యోగుణరత్నసాను
ర్యథార్థతో యాచక కామధేనుః ౬

తతో భవ ద్యాపతి రన్నపోత
నామా మహిమ్నా వసుధామహేంద్రః
ప్రసంగతోం తస్సుమనోమనాంసి
ప్రోథే వయత్కీ ర్తిసుధాధినోతి ౭

తస్మా దభూ త్సంగత సౌకుమార్య
శ్రీసింగభూపో వరవంశదీపః
యస్య ప్రతాపార్చిషి దీప్యమానే
శత్రుప్రవీరా శ్శలభా ఇవాజౌ. ౮

సూను స్సింగనృపస్య తస్య శుభధీ సూర్యోపమ స్తేజసా
కాంత్యా చంద్రమసః కలాభి రనిశం సన్మార్గసంపత్తిభిః
రమ్యో రాజత రావుమాధవనృపో రాజన్యచూడామణి
ర్యేన శ్రీనిధిరాయరావుబిరుదం లోకే నిరూఢీకృతమ్. ౯

శాకాఖ్యే నిధివార్ధిరామశశిగే వృద్దే ప్లవంగే శుభే
మాసే వ్యాశ్వయుజే రఘూద్వహపదే యోరాఘవీయాహ్వ
యామ్
టీకా మర్థపటుప్రబోధఘటనా మాణిక్యపుష్పాంజలిం
కృత్వా రాజతి రావుమాధవనృపో రామాయణస్య శ్రియే. ౧౦

చారిత్రైం జగతాం పవిత్ర ముదయ స్సచ్చిత్రసంపన్మయః
పాత్రైః కల్పమహీరుహాగ్రపదైః ప్రస్థానవజ్రాత్రిషు
సంశ శ్రుతసితకీర్తిశోభితగుణప్రాంశు స్సయస్యావనౌ
మన్యౌ రాజతి రావుమాధవవిభు స్సంసేవిత శ్రీవిభుః ౧౮

ఏతస్య నాగమాఖ్యా దేవీ శ్రీమాధవేంద్రస్య
యాకశి ... పవాప్తా శక్త్యా ముక్తేన శుభగుణోత్పన్నా ౧౯

శ్రీరాజశైలకటకే నాగాంబికయా తయా తటాకోయః
ఖనితో నాగసముద్రసోయం నాధో విబాత్యగాధజలైః. ౨౦

శాకే శశాంక శరకృశ్వయుతే తతో సౌమ్యే
సంవత్సరే శుభదినే వరమీనచైత్రే
నాగాంబయా స్ఫురతి నాగసముద్ర ఏష
స్సాన్వన్యః ప్రతిష్ఠిత ఇహా స్థిరధర్మవృద్ధ్యై ౨౧

నాగాంబికయా సోయం నాగసముద్రః ప్రతిష్ఠితో జీయాత్
అనాగర మాహిమకర మారామచరిత్ర మాజగన్మిత్రమ్. ౨౨
రాఘవసత్రా మాధవనృపాత్మజ భ్రాతేన సోమపాతేన
శ్రీశంభునాథకవినా రచిత మిదం ధర్మశాసనం జయతు ౨౩

శ్రీరామచంద్రాయనమః.

ఈశాసనము శా. శ. ౧౩౪౧ (అనఁగా క్రీ శ ౧౪౧౯) సంవత్సరము నాఁటిది. ఈశాసనకర్త్రియగు నాగాంబికభర్త వాల్మీకిరామాయణమునకు రాఘవీయ మనువ్యాఖ్యను రచించిన మాధవనృపాలుఁడు ఇతఁడా వ్యాఖ్యను శా. శ. ౧౩౪౯ (క్రీ. శ. ౧౪౨౭)లోఁ పూర్తిచేసి శ్రీరామచంద్రున కర్పించినట్లున్నది.

—: మాదానాయని తామ్రశాసనము :—

ఈమాధవనృపాలుని తామ్రశాసన మొకటి శా. శ. ౧౩౪౩ ప్లవ (క్రీ. శ. ౧౪౨౧) లోఁగన్పట్టుచున్నది. (ఎపిగ్రాఫియాఇండికా

సం ౧౩ పుట ౨౩౬) సింగభూపాలాన్నమాంబల తనయుఁడైనట్లును, రామానుజాచార్యుని కుమారుఁడైన వేంకటాచార్యుని శిష్యుఁడైనట్లును గలదు. ఈశాసన కాలమునాఁటి కాతనికి ముప్పదియేండ్లు వయసుండునని తలంచితిమేని యాతనిజననము క్రీ. శ. ౧౩౭౨ సంవత్సరప్రాంతమగును. ఈతనిజననము నాఁటికి సర్వజ్ఞసింగమనాయని కేఁబదియేండ్లు (మొదటికుమారునిజననము సింగమనాయనికి ముప్పది యేండ్లవయసున నైనచోఁ నాల్గవకుమారునిజననము నాఁటికి ఏఁబది యేండ్లుండవచ్చును) వయసుండెనని యెంచితిమేని. యాతనిజననము క్రీ. శ. ౧౩౪౬ ప్రాంతమగును. ఈతనికంటెఁ బెద్దైన యనపోతానాయఁడు క్రీ. శ. ౧౩౧౬ ప్రాంతమునఁ జనియించి దాదాపు డెబ్బది యేండ్లు జీవించి, ౧౩౮౬ ప్రాంతమునఁ గాలధర్మమునొంది యుండును. దీనినిబట్టి సర్వజ్ఞసింగమనాయఁడు దాదాపు తననలువది యేండ్లవయసున రాజ్యపాలనమును వహించియుండునని తలంపవలసి యున్నది. ఇందు విరుద్ధమేమియు లేదు. ఈకాలనిర్ణయము సత్యమునకు సమీపముగనే యుండునని నానమ్మకము.

దీనిననుసరించి యేడవతరములోనివాఁడైన సర్వజ్ఞ సింగమనాయని జ్యేష్ఠకుమారుఁడగు ననపోతానాయని జననము క్రీ. శ. ౧౩౭౬ ప్రాంతమని చెప్పవలసియున్నది. ఆసర్వజ్ఞసింగమ నాయని నాల్గవకుమారుఁడైన వేదగిరిస్వామి జననము ౧౩౮౬ ప్రాంతమునను, ఆతనికుమారుఁడైన యనపోతనాయని (౯వ తరము) జననము క్రీ. శ ౧౪౧౬ ప్రాంతమునను, ఆతనికుమారుఁడైన (రెండవ) సర్వజ్ఞ సింగమనాయని (౧౦వ తరము) జననము క్రీ. శ. ౧౪౪౬ ప్రాంతమునను అయియుండుననుటకు సంశయములేదు. అతనికి యుక్త వయస్సు వచ్చునప్పటికి క్రీ. శ. ౧౪౭౦ ప్రాంతమగును.

పైనవ్రాసిన శాసనములను వర్తింపఁజేసి చూడఁగా వంశవృక్షములో నుదాహరింపఁబడిన పురుషులయొక్క కాలము పైవిధముగా

నిర్ణయమైనది. ఇఁక శ్రీనాథుని గౌరవించిన సర్వజ్ఞసింగమనాయఁడెవ్వఁడో నిర్ణయింపవలసియున్నది.

వాచకుల సౌకర్యముకొఱకుఁ బైనచేసిన చర్చనుబట్టి ఆయా ప్రభువుల కాలముల పట్టికగా నీ క్రింద నిచ్చుచున్నాఁడను.

| ప్రభువు పేరు | సంబంధము | జననము | మరణము | శాసనముల లోనికాలము క్రీ. శ. |
| --- | --- | --- | --- | --- |
| ౧ ఎఱ్ఱదాచానాయఁడు | ౪ తరము | | | |
| ౨ సింగమనాయఁడు | ౫ మొదటి యాతనికుమారుఁడు | | | ౧౨౮౫ |
| ౩ అనపోతానాయఁడు | ౬ రెండవ యాతని పెద్దకుమారుఁడు | ౧౩౧౫ | ౧౩౮౫ | ౧౩౬౫ ౧౩౬౯ ౧౩౮౦ |
| ౪ మాదానాయఁడు | ౬ రెండవ యాతని రెండవ కుమారుఁడు | ౧౩౨౦ | ౧౩౯౦ | ౧౩౭౬ |
| ౫ మొదటిసర్వజ్ఞసింగమనీఁడు | ౭ మూఁడవ యాతనికి పెద్ద కుమారుఁడు | ౧౩౪౫ | ౧౪౧౨ | ౧౩౮౭ |
| ౬ అనపోతానాయఁడు | ౮ ఐదవ యాతని పెద్దకుమారుఁడు | ౧౩౭౫ | | |
| ౭ వేదగిరిస్వామి | ౮ ఐదవ యాతనినాల్గవకుమారుఁడు | ౧౩౮౦ | | నాగాంబ |
| ౮ మాదానాయఁడు | ౮ ఐదవ యాతని ఆఱవ కుమారుఁడు | ౧౩౮౫ | ౧౪౨౯ | ౧౪౨౨ ౧౪౨౯ |
| ౯ అనపోతానాయఁడు | ౯ ఏడవ యాతనికుమారుఁడు | ౧౪౧౫ | | |
| ౧౦ రెండవసర్వజ్ఞ సింగమనీఁడు | ౧౦ తొమ్మిదవ యాతనిపెద్దకుమారుఁడు | ౧౪౪౫ | | |
| ౧౧ వసంతనాయఁడు | ౧౦ తొమ్మిదవ యాతని మూఁడవకుమారుఁడు | ౧౪౫౦ | | ౧౪౩౭ |

ఇందు ౩-౯-౧౦ సంఖ్యలు గలవారలు సింగమనాయకులు. రెండవసంఖ్యగల సింగమనాయని కాలమునకు శ్రీనాథుఁడు జన్మింప లేదు. ౧౦వ సంఖ్యగల సింగమనాయని నాఁటికి శ్రీనాథుఁ డిహలోకము విడిచిపోయెను. కావున నిఁక శ్రీనాథుని గౌరవించినది ౯వ సంఖ్య గల సర్వజ్ఞసింగమ [illegible]. ఇతఁడే వంశ వృక్షము లోని ౨వ తరమునందలి మూఁడవాఁడు. ఈ గ్రంథములోని కాలములు సత్యమునకు సమీపముగనుండునని నానమ్మకము. అనుమానమున్న వారు వారికాలములను ముందునకు వెనుకకు జరిపిచూడవచ్చును. నేనట్లు పరీక్షించి చూచితిని కాని శాసనకాలములును మరికొన్ని విషయములును అట్లు జరుపుట కాలాంకమును గలుగఁ జేసినవి అందుచే నవి సత్యము లనియే నా విశ్వాసము. ౨వ తరములోనున్న సర్వజ్ఞసింగమనాయఁడు క్రీ. శ. ౧౩౪౯ సంవత్సర ప్రాంతమున జన్మించియుండునని పైనఁ జెప్పియుంటిని. తండ్రివలెనే దాదాపు డెబ్బదియేండ్లు జీవించి యుండెను క్రీ. శ ౧౪౧౨ సంవత్సరమువఱకు నుండియున్నాఁడనుటలో విరుద్ధమేమియు లేదు. శ్రీనాథుఁడు కనకాభిషేకము నొందినది ౧౪౦౫వ సంవత్సరమనినచో నాసంవత్సరములోనో అటుపిమ్మట ౧-౨ సంవత్సరముల లోపలనో సర్వజ్ఞ నిర్యాణముఁ జేసి యుండవచ్చును. అందుచే శ్రీనాథుని గౌరవించినది ౨వ తరములోనివాఁడగు సర్వజ్ఞుఁడే కాని ౧౦వ తరములోని సర్వజ్ఞుఁడు కాఁడు. ౧౦వ తరములోని రెండవ సర్వజ్ఞ సింగమనాయని జననము ౧౪౪౯ ప్రాంతమయియుండునని పైనఁ జెప్పియుంటిని. అప్పటికి శ్రీనాథుఁడు కాలధర్మమునొందియున్నట్లు శ్రీపంతులుగారు వ్రాసియున్నారు. అది సత్యముకూడనై యున్నది. అదిగాక ౨వ తరములోని సర్వజ్ఞసింగమనాయఁడే గొప్పపండితుఁడును గవియుఁ గవిపండితపోషకుఁడునై యున్నాఁడు. విశ్వేశ్వర కవిచంద్రునివంటి పండితులాతని యాస్థానమునఁ బెక్కురున్నారు అట్టివాని యాస్థానమునకుఁ బోవునప్పుడే "ఎటుల మెప్పించెదో"... రావుసింగ మహీపాలు... నిండు కొ

వున..." యని శ్రీనాథుఁడనుకొని యుండునుగాని అట్టివేవియును లేని పదియవశతకములోని నామమాత్రసర్వజ్ఞునికడకుఁ బోవుటకు సరస్వతిని ప్రార్థింపవలసిన యవసర మా శ్రీనాథున కుండదు.

—: శ్రీనాథుని గౌరవించినది మొదటి సర్వజ్ఞ సింగమనాయఁడే :—

కావున నెన్నివిధములఁ జూచినను శ్రీనాథుని గౌరవించినది, మొదటి (౭వ తరము) సర్వజ్ఞసింగమనాయఁడేయనియు, నది క్రీ. శ. ౧౪౧౦ ప్రాంతమైయుండుననియు స్పష్టపడుచున్నది. అయిన నప్పటికి శ్రీనాథుఁడు రెడ్డియాస్థానమునందు విద్యాధికారిగా నుండినట్లు శాసనముల వలన స్పష్టపడుచున్నదికదా! కర్ణాటకాస్థానమున కాతఁ డెట్లు వెళ్ళియుండునని సంశయము కలుగవచ్చును. ఒకయాస్థానమున నున్న పండితులు తమపాండిత్యమును బ్రదర్శించి గౌరవము నందుట కితరప్రభువుల యొద్దకుఁబోవుటకు వారికాటంకములు లేవు. పుష్పంధయములొక పుష్పోద్యానము నాశ్రయించియుండి యచ్చటనే పట్టు పెట్టుకొనినను మధుసంపాదనమున కెంత యోదూరమేగి యెన్ని వృక్షములనో యాశ్రయించి వానినుండి మకరందమును గ్రోలి తమ పట్టులకుఁ దెచ్చుకొనునట్లె పండితులును అన్యప్రభువుల కడ కేఁగి వారిచే నాదరింపఁబడుచుఁ దమ్మేలినవారి యశశ్చంద్రికల నటఁ బ్రశంసింపఁజేయుచుందురు. కావున నిదియొక యాక్షేపణము కాఁజాలదు.

—: రెండవ సర్వజ్ఞ సింగమనాయఁడు కాఁడుకదా ! :—

ఈసందర్భమున నీఁకనొక్క విషయమును జెప్పవలసియున్నది. పైన నిచ్చిన వంశవృక్షములో ౯వ తరమున ననపోతానాయఁడు గన్పడుచున్నాఁడు. ఇతఁడు వేదగిరినాయని కుమారుఁడు. ఈ వేదగిరికి చినసింగమనాయఁడను నామాంతరమున్నదని కొందఱందురు. కొందరీనామాంతరమునుగాని ఈయనపోతానాయఁడు వేదగిరినాయని కుమారుఁడనిగాని యంగీకరింపరు. వేదగిరికి అనపోతానాయఁడను తనయుఁడు లేనేలేఁడనియు, నెనిమిదవ తరములోఁ జూపిన యనపోతా

నాయఁడే యీతఁడనియు నాతనికే సర్వజ్ఞసింగమనాయఁడు అన్నమ నాయఁడు వసంతనాయఁడను వారుముప్వురును గుమారులనియు నీరెండవపక్షమువారి వాదము. శ్రీప్రభాకరశాస్త్రిలుగారి వాద ముతో నేకీభవించిరి. శ్రీప్రీశైలింగముపంతులుగా రీయభిప్రాయ ముతో నేకీభవింపక యీసర్వజ్ఞుని పదియవతరమువాఁడనిరి. పదియవ తరమువాఁడనినచో శ్రీనాథునితో సంబంధించిన యీతఁడీతఁడు కాఁడని ఘంటాపథముగాఁ జెప్పవచ్చును. కాని యీతఁడు తొమ్మి దవతరమువాఁడగునా? అయినచో పైనఁజెప్పిన సిద్ధాంతము మాఱి పోవునా? యనువిషయముల నిట విమర్శింపవలసియున్నది. పరిశీ లించి చూడఁగా ననపోతానాయఁడెనిమిదవ తరమువాఁడను వాదము నందు సత్యమున్నది యని తోఁచుచున్నది. కంచియందు అరులాల పెరుమాళ్ళ దేవాలయమునకు రెండుద్వారపాలక విగ్రహములను జేయించి యిచ్చినట్లు రేచర్ల వసంతరాయఁడు వ్రాయించిన శాసన మొకటి యున్నది. (A. R. 634 of 1919) అందాతఁ డనపోతా నాయనికిఁ గుమారుఁడును సింగమనాయనికి సోదరుఁడునై నట్లువ్రాయ బడియుండెను. ఈవిషయమున భిన్నాభిప్రాయములేదు. రేచర్లవారి వంశవృక్షములో నాకాలమున వసంతరాయనామధారి యింకొకఁడు కన్పట్టుటలేదు. ఆశాసనము క్రీ. శ. ౧౪౩౭ నాఁటిది. ఈవసంతరా యఁడు, వంశవృక్షములోఁ జూపినట్లు వేదగిరిస్వామి మనుమఁడని నచోఁ బైనజూపిన శాసనములనుబట్టి క్రీ. శ. ౧౪౩౭ నాఁటికి యాత నికి దానమీయఁదగిన వయసులేదు సరికదా యీతఁడు జన్మించియే యుండఁడు. కావున నీవసంతరాయని తండ్రియైన యనపోతానాయఁ డెనిమిదవ తరమువాఁడనియే యని నిశ్చయించి యీవసంతరాయఁడు తొమ్మిదవతరమువాఁడేయని నిర్ణయింతము. అప్పుడీతని కగ్రజుఁడైన రెండవసర్వజ్ఞసింగమనాయఁడును దొమ్మిదవ తరమువాఁడేయగును. ఆపక్షములోఁగూడ శ్రీనాథుఁడు సందర్శించిన సింగభూపాలుఁడు పైనఁ జెప్పినట్లీతని తాతయగు నేడవతరములోని సింగభూపాలుఁడే

గాని యీతఁడు కాఁడు. ఆసింగభూపతి ౧౪౧౦వ సంవత్సరమువఱకు జీవించియుండెననియు నప్పటికాతనికి దాదాపు డెబ్బదియేండ్ల వయసుండెననియు నాతనిజననము క్రీ. శ. ౧౩౪౨ ప్రాంతమనియుఁ బైన వ్రాసియుంటిని. దానినిబట్టి యాతనిమనుమఁడైన రెండవసర్వజ్ఞసింగమ ప్రభువు జననము ౧౪౦౨ ప్రాంతమును నాతని రెండవతమ్ముఁడైన వసంతరాయనిజననము ౧౪౧౭ ప్రాంతముననై కంచిశాసనము నాఁటికి ౨౫ సంవత్సరముల ప్రాయముండును. ఇందువిరుద్ధమేమియు లేదు. ఈరెండవసర్వజ్ఞభూపతి పెద్దవాఁడై పండితుఁడై కవిపండితపోషకుఁడని పేరుగాంచుట కథమము ముప్పదియైదు నలువది సంవత్సరములైన నుండవలయునుగదా! ఆకాలము క్రీ. శ. ౧౪౪౦ ప్రాంతమగును. అప్పటికి శ్రీనాథుఁడు రాజమహేంద్రవరపు రెడ్లయాస్థానమును వీడి శ్రీశైలమునకో బొడ్డుపల్లికో పోయి యుండును. గాని రాచకొండకేఁగి సర్వజ్ఞుని దర్శించెననుట కవకాశము లేదు. ఇంతకును ఈరెండవ సర్వజ్ఞుఁడు పండితుఁడుగాని కవియనిగాని యితని యాస్థానమునఁ బండితులు కవులున్నారనిగాని చెప్పుటకాధారములు లేవు. భోగినీదండకము తప్ప నితనిపేర వ్యాఖ్యాతమైన గ్రంథము గానరాదు. సంశయరాహిత్యముగా నితని యాస్థానమున నున్నాఁడనియెడు పండితుఁడుగాని కవిగాని లేఁడు. శ్రీనాథుఁడు తన చరమవయసున నితని యాస్థానమునకుఁ బోవుచు, ''దీనారటంకాల'' యనుపద్యమును రచించి సరస్వతీదేవిని ప్రార్థించినాఁడనుట కంటె నసమంజసమింకొకటియుండదు. ఈవసంతనాయుఁడు నాగాంబిక భర్తయైనమాధవనృపాలుని కన్నకుమారుఁడు నాగాంబిక శాసనసంవత్సరము ౧౪౨౯.

మాధవనృపాలుని జననము ౧౩౯౭ ప్రాంతమని పైనవ్రాసి యున్నాఁడను. ఈతనికిని వసంతనాయనికిని వయసున ౧౪ ఏండ్లు మాత్రమే భేదమున్నదని పై చర్చవలనఁ దేలినది. ఇది సంభవమేనా! యని కొందఱనుగవచ్చును కాని యనవోతానాయని క్రీ

మాధవనృపాలుఁ డయిదవ తమ్ముఁడు. వయసునం దనపోతానాయకునికి మాధవ నృపాలునకును దాదాపు పదియేండ్లు వ్యత్యాస ముండును. ఆవ్యత్యాసమును పై ౧వ పంక్తిలోఁ గలిపిచూచినచో తేడాయేమియు గనఁబడదు

—: సర్వజ్ఞ సింగభూపాల కాలనిర్ణయము :—

శ్రీనాథుఁడు దర్శించిన సర్వజ్ఞ సింగభూపాలుఁడు పదియవ తరములోని (ఆరవ తరముననే జెప్పఁబడెను) వాఁడయిన రెండవ సర్వజ్ఞుఁడగు దేవనాయని యనుచు నిశ్చయింపఁబడుట కవకాశమిచ్చెడి యింకొక గాథకలదు. దానినిగూడ విమర్శించిచూచినఁగాని, పైనఁ జేసిన సిద్ధాంతము నిర్బాధకము కాఁజాలదు. కావున దానినిగూర్చి గూడ నిందుఁ జర్చించెదను. ఇందుకొఱకు పాఠకులు వంశవృక్షము నింకొకమాఱు చూడవలసియున్నది

ఇందు ౫వ తరములోని సింగమనాయనికి, అనపోతనాయఁడు మాదానాయఁడు అను నిరువురు కుమారులున్నారు. వారిలో ననపోతానాయని శాఖను గూర్చి యింతవఱకుఁ జర్చించియున్నారము. రెండవ కుమారుఁ డైన మాదానాయని శాఖలోఁ దనరు ౧ సూరానాయఁడు ౨ పినవేదగిరి 3 లింగమనాయఁడు అను మువ్వురున్నారు. ఇందులోఁ బినవేదగిరిని పెదకోమటి వేమభూపాలుఁడు చంపె ననియు, అప్పటికిఁ బండ్రెండేండ్ల వయసులో నున్న లింగమనాయఁడు తరువాత నా కోమటి వేమునిఁ జంపి యాతనికడనుండెడి "నందికంతపోతరా" జను కఠారిని గొనిపోయెననియుఁ బెదకోమటి భూపాలుని కుమారుఁ డైన రాచవేమభూపాలుఁడు, శ్రీనాథమహాకవిని, లింగమనాయనికడకుఁ బంపి యాకఠారిని దెప్పించెననియు నొకగాథ కలదు. ఈకథ వెలుగోటివారి వంశావళి యను గ్రంథములో నున్నది. తరములనుబట్టి చూచినచో లింగమనాయఁడును, రెండవ సర్వజ్ఞసింగమనాయఁడును గూడ సమకాలికులవలెఁ గన్పట్టుచున్నారు. శ్రీనాథుఁడు లింగభూపతి

సార్వభౌముఁ డని చెప్పినట్లు ఆతనితో సమకాలికుఁ డైన రెండవ సర్వజ్ఞ సింగమనాయని యొద్దకే శ్రీనాథుఁడు వెళ్ళియుండెనని యేల నిర్ణయింపరాదు? అట్లనినచో తప్పు! శ్రీనాథుఁడు పెదకోమటి వేమభూపాలుని యొద్ద ఇరువది సంవత్సరములు విద్యాధికారిగా నుండెను. తరువాత నాతని కుమారుఁడైన రాచవేమారెడ్డికడ నాల్గు సంవత్సరము లుండెను. అంతటితోఁ గొండవీటి రెడ్లకును, శ్రీనాథునకును గల సంబంధము తెగిపోయినది. అటుపిమ్మట నాతఁడు రాజమహేంద్రవరపు రెడ్లనాశ్రయించెను. వారిలో మొదటివాఁడు అల్లయ రెడ్డి. ఇతనికి అల్లాడరెడ్డి యనియు పేరు. ఇతఁడు, కొండవీటి రెడ్డిరాజులలో మిక్కిలి ఖ్యాతి గడించిన అనవేమారెడ్డికి దౌహిత్రియైన వేమాంబకు భర్త. అల్లాడరెడ్డికిని వేమాంబకును వేమారెడ్డి, వీరభద్రారెడ్డి, దొడ్డారెడ్డి, అన్నారెడ్డి కుమారులు. ఈ విషయము లీకవిచారితము నందే పైన వ్రాసియున్నను, పాఠకుల సౌకర్యమునకై మరల నిట వ్రాసితిని

శ్రీనాథుఁడు రావుసింగభూపతిని గాంచి కొలువుచూచిన దెప్పుడో మనము తెలిసికొనవలసియున్నది. పెదకోమటి వేమభూపాలుఁడు క్రీ. శ. ౧౪౦౦ మొదలు ౧౪౨౦ వరకు రాజ్యముచేసినట్లును, అతని కుమారుఁడు రాచవేముఁడు ౧౪౨౦ మొదలు ౧౪౨౪ వఱకును రాజ్యముచేసియున్నవాఁడని చరిత్రకారులు నిర్ణయించియున్నారు. పైనఁ జెప్పినకథ సత్యమయ్యెఁ నేని శ్రీనాథుఁడు క్రీ. శ. ౧౪౨౦-౧౪౨౪ నడుమ సింగభూపతిని జూచి యుండవలయును.

రాజమహేంద్రవర రాజ్యమును కాటయవేముఁడు క్రీ. శ. ౧౪౧౪వ సంవత్సరమువఱకును బరిపాలించెననియు, నాతని తరువాత ౧౪౧౬ మొదలు ౧౪౨౬ వరకు అల్లాడరెడ్డి రాజమహేంద్రవర పరిపాలకుఁడుగా నుండెననియు, అటుపిమ్మట నల్లాడరెడ్డి కుమారులైన వేమారెడ్డి వీరభద్రారెడ్డి అనువారలు రాజ్యమునకు వచ్చిరనియు, చరిత్రకారులు నిర్ణయించియున్నారు.

"ఆలింగమహీపతిచేత శ్రీనాథుఁడు నందికంతపోతరాజనువానిని గొంతుకోయిన పద్యము" అని యుదాహరించిన పద్యమును వెలుగోటివారి వంశావళిలో నిచ్చియున్నారు. దీనినిబట్టి యుదాహరించిన పద్యము శ్రీనాథకృతమని తెలియుచున్నది.

సీ. జగనొబ్బగండాంక సంగ్రామనిశ్శంక
జయలక్ష్మి రాయవేశ్యాభుజంగ
ఖండకోటలగొంగ యరిరాజమదభంగ
మేటిందు ఖండేశ మహితజాల
మూరురాయరగండ మూరియురాజులమిండ
యభివృద్ధిరాయ చౌహత్తుమల్ల
ఘనరాయగోవాళ కామినీపాంచాల
బ్రహ్మాయ శశివంశపరశురామ
గండపెరుకాల సుకవితాగుండెదివ్వెల
ఖళిర యల్లయవేముని పసగుమిండ
సమరమింపించిన మెనసిరావుబిరుద
సంగరాటోప! మాదయ లింగభూప!

కవిత్వశైలినిబట్టి యీపద్యము శ్రీనాథకృతమైనది గాదనుట నిశ్చయము. అదియటుండనిండు. ఈపద్యమున లింగమనీఁడల్లయ వేమునిఁ జయించినట్లున్నది అల్లయవేముఁడనగాఁ బైనఁజెప్పిన యల్లాడ రెడ్డికుమారుఁడైన వేమభూపతియేగాని యితరుఁడుకాఁడు. ఈవేమభూపతి క్రీ. శ. ౧౩౭౯వ సంవత్సరమునఁగాని రాజ్యమునకు రాలేదని పైన వ్రాసియుంటిమి. అంతవఱకును అల్లాడరెడ్డియే యున్నాఁడు. అల్లాడ రెడ్డిని జయించినట్లుచెప్పక అల్లయవేమునని చెప్పుటచే నీపద్య మా తరువాతఁ గొంతకాలమునకు రచియింపఁబడియుండుననుట స్పష్టము. అప్పటికి, రాచవేముఁడులేఁడు. అందుచేనీకథయందు సత్యములేదని తేలుచున్నది. శ్రీనాథుఁడు అల్లాడరెడ్డి కుమారులైన వేమ, వీరభద్ర

భూపతులఁగొనియాడుచున్నట్టిపద్యమును రచించెననుటకు వీలులేదు. వీలనన, వానికిఁ గాంచిపోఁ బనిలేదు. పెదకోమటివేముఁడు వీరికి శత్రువు. శ్రీనాథుఁడు తన కాశ్రయదాతలైనవారిని జయించినట్లు లింగభూపతిపైఁ బద్యమును జెప్పియుండెను. ఇంతేకాదు. రాచవేముఁడుకూడఁ దన తండ్రిని జయించి కటారిని పట్టుకొనిపోయిన శత్రువు కడకా కటారిని యాచించి తెమ్మని శ్రీనాథునంతటివానిని బంపెననుటయుఁ గూడ స్వారస్యము లేదు. కావున నీకథ విశ్వాసార్హమైనది కాదు. దీనినిబట్టి కాలనిర్ణయము చేయఁబూనుట వృథాయాసము. అదివఱకనేక కారణములచే నిర్ణయమైన సిద్ధాంతము నీకథ పూర్వపక్షము సేయఁజాలదు. ఈలింగమనాయనికిఁ దాతయైన పెదవేదగిరి, పెదకోమటివేమునితో సమకాలికుఁడని విజయనగర సామ్రాజ్య చరిత్రకారులు వ్రాసియున్నారు. అట్టివానిని లింగమనాయఁడు చంపుట యసంభవము. ఇంక నీవిషయమును గూర్చి వ్రాయఁబనిలేదు

ఈచర్చనుబట్టి శ్రీనాథుఁడు చూచినది మొదటిసర్వజ్ఞప్రభువు నేయనియు నది క్రీ. శ. ౧౪౧౦ ప్రాంతమైయుండుననియుఁ దేలినది. ఇది నిశ్చయమైనప్పుడు శ్రీనాథునకుఁ గనకాభిషేకము చేసినది మొదటిదేవరాయలే యని తప్పక నిశ్చయమగును. అయిన నిందితరేతరాశ్రయదోషము గలుగకుండఁ గనకాభిషేకకాలమును స్వతంత్రముగఁ గూడ విమర్శించిచూతము.

శ్రీనాథుఁడు సర్వజ్ఞసింగమనాయనిఁ జూచుటకును గనకాభిషేకమునకును సంబంధములేదు. కనకాభిషేకాది కార్యములు, సర్వజ్ఞని దర్శనమునకుఁ బూర్వమయియుండెనని తెలుపునంతవఱకు మాత్రమే యవి యుపయోగించును. సార్వభౌమబిరుదమును బడసిన పిమ్మట నెంతకాలమునకు శ్రీనాథుఁడు సర్వజ్ఞప్రభువును దర్శించెనో చెప్పఁజాలము కాని "దీనారటంకాల" యనుపద్యమును జదివినప్పుడందుదాహృతమైన కనకాభిషేకనైషధరచనాది కార్యములు నాల్గును

నంతకుఁ బూర్వము స్వల్పకాలము క్రిందటనే జరిగియుండినట్లును నిశ్శేషకాలము గడువలేదనియుఁ దోఁచును.

పైనుదహరించిన "దీనారటంకాల" యను సీసపద్యములో పేర్కొనఁబడిన నాల్గుకార్యములలోను, నైషధకావ్యరచనము దక్క-తక్కిన మూఁడు కార్యములును అనఁగా కనకాభిషేకమును, డిండిమభట్టు కంచు ఢక్కను బగులగొట్టించుటయు, సార్వభౌమబిరుదమందుటయు, నేకకాలమున రాయలయాస్థానమున జరిగినవి. నైషధరచనమునకుఁ బూర్వము జరిగినదే. ఇందుఁ జెప్పఁబడిన రాయలు కర్ణాటకరాజ్యమును బరిపాలించిన సంగమవంశపు దేవరాయలని యందఱు నంగీకరించుచున్నారు. కర్ణాటకమును బాలించిన సంగమవంశరాజులలో దేవరాయనామధారులు నలుగురున్నారు. అందు మొదటి దేవరాయలు క్రీ. శ. ౧౪౦౬ మొదలు ౧౪౨౨ వఱకును, రెండవ దేవరాయలు క్రీ. శ. ౧౪౨౨ మొదలు ౧౪౪౬ వఱకును రాజ్యము చేసియుండిరి. తక్కిన యిరువురు దేవరాయ ప్రభువులును శ్రీనాథుని కాలమువారు కారు. కావున వారితో మనకుఁ బని లేదు

బ్ర. శ్రీ. కందుకూరి వీరేశలింగము పంతులుగారు శ్రీనాథునకుఁ గనకాభిషేకముచేసిన యాతఁడు రెండవ దేవరాయలనియు నాతఁడు కవిపండితపోషకుఁ డనియుఁ దలంచి కనకాభిషేకకాలము క్రీ. శ. ౧౪౨౫ ప్రాంతమని నిర్ణయించినారు. బ్ర. శ్రీ. వేటూరి ప్రభాకర శాస్త్రులుగారు రెండవ దేవరాయల వలననే శ్రీనాథుఁడు కనకాభిషేకగౌరవము నందెననియు నది క్రీ. శ. ౧౪౩౫ ప్రాంత మనియు శృంగారశ్రీనాథమున వ్రాసియున్నారు. శ్రీచిలుకూరి వీరభద్రరావుగారు సంవత్సరమును జెప్పలేదు. కాని మొదటి దేవరాయల కాలమునఁ గడపటిభాగమునై యుండునని యాంధ్రులచరిత్రమున మూఁడవ భాగమున నుడివియున్నారు.

"చంద్రభూషక్రియాశక్తి రాయలయొద్దఁ బాదుకొల్పితి సార్వభౌమబిరుద"మని చెప్పిన పద్యపాదములోని చంద్రశేఖర క్రియా

శక్తిపిటాకా శాసనవాఙ్మయసాహాయ్యమును గొని విమర్శించి శ్రీనేలటూరి వేంకటరమణయ్యగారు. "(౧) కొండమూరు వేగట శాసనముల వలన మొదటిబుక్క, రెండవహరిహరరాయుల కాలములలో చంద్రభూషణ క్రియాశక్తి యుండినట్లు తెలియవచ్చుటచేతను (౨) పెక్కు శాసనములయందు చంద్రభూషణ క్రియాశక్తియొక్క బిరుదులే గల క్రియాశక్తి యొడయఁ డొకఁడు విజయనగరరాజులకు కులగురువని చెప్పియుండుటచేతను (౩) ప్రౌఢదేవరాయలు చంద్రభూషణాచార్యుల బిరుదావళినే కలిగినక్రియాశక్తి గురువరచరణపరిచరణ ప్రసాదాసాదిత మహిత సామ్రాజ్య వైభవుఁడనని చెప్పుకొనియుండుటచేతను (౪) శ్రీనాథుఁడు 'చంద్రభూష క్రియాశక్తి రాయలకడఁ బాదుకొల్పితి సార్వభౌమబిరుదు' అని వచించియుండుటచేతను (౫) రెండవ దేవరాయల కాలమున చంద్రభూష క్రియాశక్తియను పేరుగలవా రెవ్వరును లేకపోవుటచేతను శ్రీనాథుఁడు దర్శించిన దేవరాయలు మొదటి దేవరాయలే యనియు, నతనిసన్నిధినే యతని గురువర్యుఁడగుచంద్రభూషక్రియాశక్తి యొడయల యాధిపత్యము క్రిందనడచిన విద్వత్సభలో శ్రీనాథుఁడు డిండిమభట్టారకు నోడించి సార్వభౌమపదమును, కనకాభిషేకమును బడసెననియు నమ్ముచున్నాను" అని వ్రాసియున్నారు. (భారతిసంపుటము ౨౨ సంచిక ౧౦) శాసనప్రామాణ్యముకలదియగుటచే వేంకటరమణయ్యగారు వ్రాసినది సత్యమని యంగీకరింపకతప్పదు ఇదియే సత్యమని నా యభిప్రాయము. ఆచార్య వేంకటరమణయ్యగారి సిద్ధాంతము సరికాదని శ్రీబండారు తమ్మయ్యగారు భారతిపత్రికలోనె యొక వ్యాసమును వ్రాసియున్నారు. ఆయన చంద్రభూషక్రియాశక్తి రెండవదేవరాయల యాస్థానమున నుండి యుండునని యూహించిరేకాని అట్టివానిని జూపలేదు. అట్టిదొక శాసనమున్నదని శ్రీసోమశేఖరశర్మగారు తమతోఁ జెప్పిరని శ్రీ తమ్మయ్యగారు వ్రాసినారు. కాని యది యింతవఱకు బయల్పడలేదు.

అదియే సత్యమైనచో దేవరాయలిచ్చిన యీబిరుదమునం దాతఁడు విశేషలక్ష్యమును గనఁబరప లేదనుటయే యుక్తముకదా! అందుచే ఆచార్య వేంకటరమణయ్యగారి సిద్ధాంతము న్యాయమై నిలువఁదగినదే యగును

—: ఒంటిస్తంభము మేడకథ :—

పెదకోమటివేమభూపాలుఁడు ఒంటి స్తంభముమేడ యొకటి కట్టించెననియు, నది యాకాలమునఁ బ్రజలచే నత్యద్భుతముగాఁ జెప్పుకొనఁబడుచుండెననియు, శ్రీనాథుఁడు ప్రస్తావవశమున నామేడను గూర్చి దేవరాయలసభలో ముచ్చటింపఁగా నట్టిది తానొకటి నిర్మింపఁ దలంచి దానిని జూచివచ్చుటకై దేవరాయలు కొందఱు పని వారలను గొండవీటికిఁ బంపెననియు నొకకథగలదు. ఈవృత్తాంతము కొండవీటికైఫియ్యతులం దున్నది. అస్వాభావికములైన కొన్ని యద్భుతకథ లీవిషయమునఁ బ్రచారములో నున్నవి. అవి శృంగార శ్రీనాథమునను నాంధ్రులచరిత్రమున నుదాహృతములైనవి. అందలి యద్భుతముల నటుండనిండు. సౌధనిర్మాణము మాత్రము వాస్తవ మయినట్లు "మించికట్టిరి గృహరాజుమేడఁ గొండవీట" అనుచాటువు బట్టియు, శ్రీనాథుఁడు రచించిన ఫిరంగిపురశాసనమందలి యీక్రింది ౧౨వ శ్లోకమునుబట్టియు నిశ్చయింపచ్చును.

"అశ్రాంతం గృహరాజసౌధ నివస ల్లక్ష్మీకరాభ్యంతర
క్రీడాంభోరుహతాళవృంతపవనప్రస్తారవిస్తారితః
నాయం కేసరవాసనాసురభితో యస్యార్థిచింతామణే
ర్ద్రాగా చామతి దానకేళిజనితం స్వేదాంభసాం జాలకమ్."

ఈశాసనము శా. శ. ౧౩౩౧ క్రీ. శ. ౧౪౦౯ నాటిది. శ్రీనాథుఁ డీయపురూపసౌధనిర్మాణవిషయమును దేవరాయల సన్నిధిని జెప్పియుండెననియు, దేవరాయ లట్టిసౌధనిర్మాణమునకు, గుతూహలుఁ డయ్యెననుటయు స్వాభావికములు. కావున నంతవఱకు కాకథను

మనము విశ్వసింపవచ్చును. ఈ ప్రస్తావన మహాసౌధనిర్మాణమునకు సమీపకాలమున జరిగియుండునుగాని ముప్పదిసంవత్సరములకుఁ బిమ్మట సౌధనిర్మాతగతించినవెనుక జరిగియుండదు. దీనినిబట్టి శ్రీనాథుఁడు మొదటిదేవరాయల సభలోనే క్రీ. శ. ౧౪౦౭ ప్రాంతమున నీసౌధ వృత్తాంతమును జెప్పియుండునని తలంచుట సమంజసము.

—: డిండిములకథ :—

పైనుదహరించిన "దీనారటంకాల దీర్థమాడించితి" యను పద్యములోని "బగులగొట్టించి సుస్ఫుటవివాదప్రౌఢి గౌడడిండిమభట్టు కంచుఢక్క" యనుపాదమునందలి డిండిమభట్టెవ్వరో తెలిసికొనఁగలిగినచో, శ్రీనాథుఁడేదేవరాయలను దర్శించెనో సులభముగాఁ దెలియును. డిండిమ మొకవాద్యవిశేషము. దానినిగలిగియుండువాఁడు డిండిముఁడు అనఁగా డిండిమబిరుదమును సంపాదించినపండితుఁడు. రాజసభకేఁగునపు డాతనికి ముందఱీవాద్యమును వాయించుచుందురు ఈడిండిమ బిరుదమును వహించినవారు పల్వురున్నారు. వీరి చారిత్రమును వీరిగ్రంథముల నిటఁజెప్పి విసువుజనింపఁజేయను. ఆకథనమంతయు నవసరమునుగాదు ఆడిండిములలో మొదటి, మూడవ, నాల్గవడిండిములు శ్రీనాథునికాలమువారు కారనియు రెండవ డిండిముఁడే శ్రీనాథునిచే నోడింపఁబడినవాఁడనియు నందఱు నంగీకరించుచున్నారు. ఈవిషయమున భిన్నాభిప్రాయములేదు. కాని యీరెండవ డిండిమభట్టారకుఁ (ఇతనిపేరరుణగిరినాథుఁడు) డేకాలమున నెవరియాస్థానమున నున్నవాఁడను నదియే తేల్చవలసిన విషయము. రెండవ దేవరాయల కాలమున నున్నవాఁడని యందఱు నంగీకరించిరి. అందు భిన్నాభిప్రాయములేదు. శ్రీవీరేశలింగము పంతులుగారును వీరభద్రరావుగారును నీరెండవడిండిమభట్టు మొదటి దేవరాయల కాలమునఁగూడనుండవచ్చుననునభిప్రాయమును వెలిబుచ్చియున్నారు. శ్రీప్రభాకరశాస్త్రులుగారు శృంగారశ్రీనాథమునఁ బ్రథమదేవరా

యల కాలమున నీ రెండవదేవరాయలభట్టు నున్నాఁడని స్పష్టముగాఁ జెప్పక పోయినను నితఁడు రచించిన యోగానంద ప్రహసనమున భరితవాక్యముగానున్న "క్షిత్యామద్దేవరాయో౽వతు వసుమతీచక్రమాచంద్రతారకమ్" అను వాక్యము నుదాహరించి, యీ దేవరాయలు ప్రౌఢదేవరాయలయి యుండునని యూహించిరి. కాని యితఁడు మొదటి దేవరాయలు కాఁడని చెప్పలేరు.

మొదటిదేవరాయలు క్రీ. శ. ౧౪౦౬ మొదలు ౧౪౧౩ వఱకు రాజ్యముచేసినవాఁడు. ఇతనికి రెండవదేవరాయలు మనుమఁడైనను క్రీ. శ. ౧౪౨౨ మొదలు ౧౪౪౭ వఱకు రాజ్యముచేసెను. కొందఱు ౧౪౧౯ సంవత్సరమీతని రాజ్యప్రారంభవత్సరమని చెప్పియున్నారు. అరుణగిరినాథుఁడు ముప్పది సంవత్సరములు తన పాండిత్యమును బ్రకటించెనని యనుకొనినచో నాతఁడీ యిరువురు దేవరాయల కాలములోనుగూడ నున్నాఁడనియు, ౧౪౦౬ వ సంవత్సర ప్రాంతమున మొదటి దేవరాయల యాస్థానమునఁ బ్రవేశించి ౧౪౪౦ ప్రాంతము వఱకును రెండవ దేవరాయల యాస్థానమున నున్నాఁడనియుఁ జెప్పినచో నందు విరుద్ధమేమియు లేదు.

శా. శ. ౧౨౯౬ న సంవత్సరమున అనవేమ మహీపాలునిచే నగ్రహారమును బడసిన పెద్దియజ్వయను పండితుఁడు ఆ యనవేమ మహీపాలునియన్న మనుమఁడైన పెదకోమటివేమారెడ్డిచే శా. శ. ౧౩౨౬ వ సంవత్సరమున వేఱొక యగ్రహారమును బరిగ్రహించెనని శాసనాధారమునఁ బైనవ్రాసియుంటిని. పెద్దియజ్వవంటివాఁడే యీడిండిమఁ డనుకొనినచో మొదటిదేవరాయల కాలమున క్రీ.శ. ౧౩౦౪ వ సంవత్సరమున శ్రీనాథుఁడు కనకాభిషేకము నొందెనని నిర్ణయించుటకు మనకీ డిండిమఁ డభ్యంతరమును గలుగఁజేయఁడు.

—: ప్రౌఢశబ్దము మొదటి దేవరాయలకు లేదా ? :—

మొదటిదేవరాయలను దేవరాయలని మాత్రమే యందురనియు రెండవదేవరాయలను, దేవరాయలు, ప్రౌఢరాయలు, ప్రౌఢ

దేవరాయలు, ప్రతాపదేవరాయలు, అను నామాంతరములచేఁ బిలిచెదరనియు, శ్రీనాథుఁడు తనపద్యములు కొన్నింటిలో ప్రౌఢశబ్దము నుపయోగించుటచేఁ గనకాభిషేకమును జేసిన యాతఁడు రెండవదేవరాయలే యని నిర్ధారణ మొనర్పవలయుననియుఁ గొందఱనుచున్నారు. ఈయిరువురి నామములనుగూడ మొట్టమొదట దేవరాయలనియే చెప్పవలసియున్నది. తెలుఁగు శాసనవాఙ్మయములలో నిరువురను సామాన్యముగా దేవరాయలనియే వాడుచుందురు. వీర, ప్రతాప, ప్రౌఢశబ్దములను విశేషణములనుగాఁ జేర్చి యప్పుడప్పుడు చెప్పుచుందురు. మొదటి దేవరాయలకు ప్రౌఢ, వీర ప్రతాపశబ్దము లుపయోగించిన శాసనములుకొన్నియున్నవి. (నె.శా. సం పుట ౧౨ A. R. 399 of 1926 శ్రీనాథుఁడు 'దేవ'శబ్దమును విడచి ప్రౌఢరాయయనియు ప్రౌఢదేవేంద్రరాయ యనియు, దేవరాయ యనియు వివిధవిధముల నుపయోగించి యున్నాఁడు. అనేక కారణములచేఁ గనకాభిషేకముచేసినది మొదటిదేవరాయలని నిర్ధారణ మైనప్పుడు. ప్రౌఢశబ్దమునుబట్టి దానినిత్రోసి వేయరాదు.

ఇంతేకాక ప్రౌఢశబ్ద ముపయోగింపఁబడి యున్నపద్యములు చాటువులుగాని యొక గ్రంథములోనివి కావు. ఆచాటువులు శ్రీనాథునివని నిశ్చయముగాఁజెప్పుట కాధారములులేవు. అవియాతనివే యైనను శ్రీనాథుఁడు రెండవదేవరాయలను జూడలేదనికూడఁ జెప్పలేము. ఆతనిరాజ్యకాలములో మొదటి యిరువది సంవత్సరములు శ్రీనాథుఁడు జీవించియున్నాఁడు. ఆకాలములో నెప్పుడైన శ్రీనాథుఁడు ప్రౌఢ దేవరాయలపై బద్యములను జెప్పియుండెనని తలంచినను దలంపవచ్చును. కాని యంతమాత్రమున రెండవదేవరాయల కాలములోఁ గనకాభిషేకము జరిగెనని తలంచుట కిసుమంతయు నవకాశములేదు.

శ్రీప్రభాకరశాస్త్రులుగారు శ్రీనాథుఁడు ప్రౌఢ దేవరాయలను జూడఁబోయినప్పుడు ముమ్మడికవిని గూర్చి చెప్పిన పద్యమిది యని వ్రాసినారు.

సీ. పంపావిరూపాక్ష బహుజటాజూటికా
రగ్వధప్రసవ సౌరభ్యములకు
తుంగభద్రాసముత్తుంగ వీచీఘటా
గంభీర ఘుమఘుమారంభములకు
కళశాపుర ప్రాంత కదళీవనాంతర
ద్రాక్షాలతాఫల స్తబకములకు
కర్ణాటకామినీ కర్ణహాటకరత్న
తాటంకయుగ ధాళధళ్యములకు
నిర్నిబంధనిబంధమై నెనయు కవిత
తెలుఁగునను సంస్కృతంబునఁ బలుకనేర్తు
ప్రౌఢదేవేంద్రరాయ భూపాలవరుని
సమ్ముఖంబున దయఁజూడు మమ్ముసుకవి!

ప్రౌఢరాయలదర్శనము కాకపోఁగాఁ గోపించి శ్రీనాథుఁడీ క్రింది పద్యమును వ్రాసి ప్రభువున కంపె నఁట!

సీ. డంబుసూపి ధరాతలంబుపైఁ దిరుగాడు
కవిమీఁదఁగాని నా కవచమేయ
దుష్ప్రయోగంబులఁ దొరకొనిచెప్పెడు
కవిశిరస్సునఁగాని కాలుచాఁప
సంగీతసాహిత్యసరసపద్యాలనేర్పు
కవులజోమ్ములుగాని కాల్చివిడువ
చదివి చెప్పఁగనేర్చి సభయందు విలసిల్లు
కవినోరు గాని వ్రక్కలుగఁ దన్న
దంటకవులకు బలువైరయింటిమగఁడఁ
గవులవాదంబు వినవేడ్కఁగల్గెనేని
నన్నుఁ బిలిపింపు మాస్థానసన్నిధికిని
లక్షణోపేంద్ర! ప్రౌఢరాయక్షితీంద్ర!

ప్రౌఢరాయల సంకీర్తనమైనట్టిమ్మడి సభలో బాలను యువతిని, ప్రౌఢను. ప్రోలను నాల్గుసీసపద్యములలో వర్ణింపుమని శ్రీనాథుని రాయలు కోరెనఁట—శ్రీనాథుఁ డాసందర్భమున రచించిన పద్యము లన్నియు లభింపలేదని యొక్క—పద్యముమాత్రము ప్రభాకరశాస్త్రిలుగారు చాటుపద్యమణిమంజరిలోఁ బ్రకటించి యున్నారు.

సీ. కమనీయకరపల్లవము మేను గదియంగ
నొయ్యన చాఁచిన పులికిపడును
ఆలింగనమునకు నక్కునఁ జేర్చిన
జేదోయి యురముపైఁ జేర్చికొనును
చుంబనమ్మున కోష్ఠబింబంబు గమకింప
వదన మొయ్యన నొకింత వంచుకొనును
గిలిగింత సేతకుఁ గినుకయు సిగ్గును
మొలవంగఁ గన్నులు మోడ్చుకొనును

గీ. అట్టిబాలింతి క్రీడ ననువు పఱుప
నేర్పుగల్గునె పతులకు నేకకాల
రాజపరమేశ ! రాజాధిరాజవిభవ !
లక్ష్మణోపేంద్ర ! ప్రౌఢరాయక్షితీంద్ర !

ఈపద్యము లన్నియుఁ బ్రౌఢదేవరాయలపైఁ జెప్పిన మాట వాస్తవమే కావచ్చును అయిన నితఁడు కనకాభిషేకమును గావించె నని చెప్పుటయెట్లు? అదివఱకు మొదటి దేవరాయలవలనఁ గవిసార్వభౌమబిరుద మందియున్నయెడల నావిషయ మీపద్యములలో నేల చెప్పియుండఁడు ? అనునది యొకయాక్షేపణము. దీనికి సమాధానము శృంగార శ్రీనాథమునందే యున్నది.

("అయ్యా ! మీరు రెడ్డిరాజులయాస్థానమున విద్యాధికారిగా నుంటిరిగదా ! మీబిరుదులేమి తెలుపరైతిరే" యని ముమ్మడికవి యడిగెను) అప్పుడు శ్రీనాథుఁ డీక్రిందిపద్యమును జెప్పెనఁట !

"చ. తనువున గాండివం బెడఁడె ధర్మజునానఁ గిరీటి, యేనువా
క్స్వనిజకే త్రియానతివిచారము వొప్పిన గర్వహీనతన్
మఱలి తెనుంగుభూమి కసమానగతిన్ గొనిపోవువాఁడనై
బిరుదులు నారివాగుకడఁ బెట్టితి సత్కవిసార్వభౌముఁడన్."

పైనఁ గుండలీకరించిన వాక్యములు శ్రీశాస్త్రిలు గారివి. ముమ్మకవి "దేవరాయలకడ గ్రహించిన బిరుదమును బద్యములోఁ దెలుపలేదేమని యడిగె"నని మనమనుకొనినచో శ్రీనాథుఁడు చెప్పిన సమాధానము సరిపోవును. రెడ్డిరాజులు శ్రీనాథునకెట్టి బిరుదులను నీయలేదు. సార్వభౌమబిరుదము నొసఁగినది దేవరాయలే. ఆబిరుదమును గ్రహించినపిమ్మటకూడ శ్రీనాథుఁ డద్దానిని సర్వత్ర యుపయోగింపలేదు. ఒక్క కాశీఖండమున మాత్రమే యుపయోగించినాఁడు. శ్రీనాథుఁడు జగమెఱింగిన బ్రాహ్మణుఁడు. బిరుదు నుపయోగించినఁగాని తన ప్రతిభ లోకమెఱుంగదని తలంచువాఁడు గాఁడాఁతడు. ఆతఁడాబిరుదు నుపయోగించుటలో నుపేక్ష వహించుటచేతనే చరిత్రకారుల కార్యము క్లిష్టతరమైనది. ముమ్మకవి యడిగినప్పుడు "కవిసార్వభౌముఁడ" నని ప్రత్యుత్తరమిచ్చినాఁడు. కాని యాయా స్థానమునందున్న పండితులతో స్పర్ధకొఱకై యాశబ్దము నుపయోగింపలేదు. దేవరాయలకుఁ బూర్వమెవరును నీయని బిరుదును దనకుఁ దానే పెట్టుకొనెనని తలంచుట సమంజసము కాదు. ప్రౌఢదేవరాయలను జూడఁబోవుటకుఁ బూర్వమె కవిసార్వభౌమ బిరుదమును మొదటి దేవరాయలవలన నాతఁడు గ్రహించి యుండెననియు, దానినే ముమ్మకవితోఁ జెప్పినట్లున్న పైపద్యములో నుపయోగించినాఁ డనుటయుఁ దలంచుటయే సమంజసము.

శ్రీనాథుఁడు తనబిరుదులను నారివాఁగు (ఒకసెలయేఱు) కడఁ బెట్టవలసిన యవసర మేమివచ్చిన దను విషయముకూడ నిట విమర్శనీయమే. మొదటి దేవరాయలకాలములో శ్రీనాథుఁ డుచ్ఛస్థితిలో

నున్నాఁడు. కొండవీటి రెడ్డిరాజుల యాస్థానమున నత్యంతగౌరవము నందుచున్నాఁడు. ఆకాలమున నీపద్యమును జెప్పవలసిన యవస్థ వాని కష్టములో లేదు. తనపాండిత్యమును జూపి యుచితగౌరవము నంద వలయునను నూహతో దేవరాయలను దర్శించినాఁడు. ఈపద్యము చెప్పిన కాలము క్రీ. శ. ౧౪౨౬ ప్రాంతమై యుండునని నాయభి ప్రాయము. అప్పటికిఁ గొండవీటిరాజుల యాశ్రయము లేదు. రాజ మహేంద్రవరపు రెడ్ల యాశ్రయము లభింపలేదు. అట్టికాలములో శ్రీనాథుఁ డీపద్యమును జెప్పియుండును. రెండవదేవరాయలను జూచి ద్రవ్యమును సంపాదింపవలయునను కోర్కెతోఁ గాని యాతని యాశ్ర యము నపేక్షించిగాని కర్ణాటకమున కేఁగియుండును. పెదకోమటి భూపాలునకును మొదటిదేవరాయలకును వివాదమున్నట్లు కన్పడదు. రెండవరాయలకు కొండవీటిరాజ్యమును కర్ణాటకములోఁ గలుప వలయునను నాస కలదు. ఆకారణముననో మఱి యేకారణముననో శ్రీనాథున కచ్చట నుచితసత్కారము లభింపలేదు. ఈరాయల కడ నప్పుడు డిండిమభట్టు నుండియుండును. కవిసార్వభౌమ బిరుదము రెండవ దేవరాయల తాతగా రిచ్చినదే యైనను, నాతని యాస్థాన పండితులను జయించినగాథతో సంబంధించిన దగుటచేతను నాతనియాశ్రయముననో యనుగ్రహముననో గోరవచ్చినవాఁ డగుట వలనను అదివఱకుఁ దనకున్న యాశ్రయముపోయి చిక్కులలో నుం డుట మూలమునను వెనుకటిబిరుదులను దలపెట్టక శ్రీనాథుఁడప్పుడా పద్యమును జెప్పియుండును. అచ్చటి పరిస్థితులనుబట్టి తన కాతని యాస్థానమున స్థిరమైన యాశ్రయము లభించునను నమ్మకము లేదు. కావుననే "తెనుంగుభూమి కసమానగతిన్ గొనిపోవువాఁడనై" యని చెప్పియున్నాఁడు.

ఆకాలమున సంస్కృత కావ్యరచనమునందే కవులకును బండి తులకును నెక్కువ యభిలాషముండెడిది. ప్రోలయ వేమారెడ్డి

కాలమున దెలుఁగునకుఁ బ్రోత్సాహము లభించినను దనువాతి రెడ్డి ప్రభువులు సంస్కృతమునందే యెక్కువ యభిమానమును గనుపఱుచుచు వచ్చిరి. అనపోతారెడ్డియొద్దను, ననవేమారెడ్డియొద్దను ప్రకాశభారతీయోగి, త్రిలోచనాచార్యులు మొదలగు సంస్కృత పండితులుండిరి. పెదకోమటిరెడ్డి మొదలగువారి సంస్కృతాభిమానమును గూర్చి పైన వ్రాసియేయుంటిని తెలుఁగు దేశపరిపాలకులగు రెడ్డిప్రభువులకే యిట్లున్నప్పుడు కర్ణాట ప్రభువులమాట చెప్పనేల? సంగమవంశజులు ఒక్క తెలుఁగుకావ్యమునైనను కృతిపొందినజాడ కన్పడదు. సాళువ తుళువరాజులు కర్ణాటక రాజ్యమును బాలింప నారంభించినవాదిగఁ దెలుఁగునకు మంచిదినములునచ్చినవి. శ్రీకృష్ణదేవరాయల కాలములోఁ దెలుఁగుభాషావధూటి యత్యుచ్ఛదశనొంది ప్రకాశించినది.

శ్రీనాథునకుఁ దెలుఁగు కావ్యరచనమునం దభిలాష మెండు. కర్ణాటకమునఁ దెలుఁగునకు బోత్సాహ ముండదనియు, నెట్లయినఁ దెలుఁగు దేశమునకే పోయి మఱియేప్రభువునైన నాశ్రయింప వలసియుండుననియుఁ గూడ నాతఁ డెఱిఁగియుండును. అందుచేఁగూడ "తెనుంగుభూమి" కని చెప్పియుండును. ఇఁక నొక్క మాట.

కనకాభిషేకమునుగోరి శ్రీనాథుఁ డీక్రిందిపద్యమును ప్రభువుపైఁ జెప్పెనని శృంగారశ్రీనాథమున నుదాహరించి యున్నారు.

"చ. జననాథోత్తమ! దేవరాయనృపతీ! చక్రేశ! శ్రీవత్సలాం
ఛనసంకాశ మహాప్రభావ! హరిదశ్వోదక్ష! నాబోఁటికిన్
గున్నృపస్తోత్ర సముద్భవంబయిన వాగ్దోషంబు శాంతంబుగాఁ
గనకస్నానము చేసికాక పొగడంగా శక్యమే దేవరన్."

ఈపద్యములోఁ బ్రభువును "దేవరాయనృపతీ" యనిసంబోధించినాఁడు. నిజముగాఁ బ్రౌఢదేవరాయలే కనకాభిషేకమును జేసియున్నయెడల నీపద్యములో "ప్రౌఢరాయనృపతీ" యని సంబో

ధరించియుండును. చాటుపద్యములలో "ప్రౌఢరాయకీర్తింద?" అని పేర్కొనియున్నారు. దీనినిబట్టి కనకాభిషేక మొనర్చినది మొదటి దేవరాయలనియు దరువాత నతఁడొకప్పుడు ప్రౌఢదేవరాయలని పిలువఁబడియెనని రెండవ దేవరాయలనుగూడ శ్రీనాథుఁడు దర్శించి యుండవచ్చుననియు స్పష్టమగుచున్నది.

శ్రీనాథుఁడు మొదటిదేవరాయలచేఁ గనకాభిషేకమందిన రెండవ దేవరాయలచే ౧౪౩౬ ప్రాంతమున నానాసత్కారములు బడసి, యాస్థానమునఁ గొంతకాలము, యుండిపిమ్మట హరవిలాసమును గృతియిచ్చి పిదప ౧౪౩౫ ప్రాంతమున రాజమహేంద్రవరము వచ్చి యచ్చట రెడ్డిప్రభువుల యాస్థానమునఁ గవియై యుండెనని నిర్ణయించుటయే సమంజసము.

—: పండితాభిప్రాయములు :—

శ్రీనాథుని గౌరవించిన సర్వజ్ఞునిగూర్చియు కనకాభిషేకమునుగూర్చియుఁ బండితుల యభిప్రాయమును దెలిపి సమన్వయించి పైన నేను చేసినసిద్ధాంతములను నిలుపవలసి యున్నది. ఈవిషయములలోఁ దమ యభిప్రాయములను గ్రంథస్థముచేసిన పండితులు మువ్వురు. ౧ శ్రీ ప్రభాకరశాస్త్రిలుగారు ౨ శ్రీ వీరేశలింగముపంతులుగారు ౩ శ్రీవీరభద్రరావుగారు.

ఏడవతరములోని సింగమనాయనికి సర్వజ్ఞబిరుదము లేదనియుఁ దొమ్మిదవతరములోని సింగమనాయనికే యాబిరుదమున్నదనియు శ్రీప్రభాకరశాస్త్రిలుగారి యభిప్రాయము. మొదటియాతనికి సర్వజ్ఞబిరుదమున్నదనుటకు సందేహములేదనియు రెండవయాతనికట్టిబిరుదములేదని కొందఱందురుగాని యాతనికిఁగూడ నాబిరుదమున్నట్లు తలంపవచ్చుననియు శ్రీపంతులుగారు కవులచారిత్రమున వ్రాసినారు. శ్రీవీరభద్రరావుగారు ఆంధ్రులచరిత్రమున "వెలుగోటివారి వంశచరిత్ర గ్రంథకర్తలు సర్వజ్ఞసింగభూపతి యెవరను విషయమును

గూర్చి విశేషముగాఁ జర్చించి వీరని వారని యెవ్వరిని నిర్ధారణ సేయఁజాలక తుదకు సింగమనామధేయుల నిరువురను సర్వజ్ఞులను గావించి విడిచిపెట్టిరి" అని వ్రాసి తుదకు ఏకవతరములోని యాత
నికి సర్వజ్ఞబిరుదములేదని నిర్ణయించినారు ఇట్టియభిప్రాయభేదము లను గలిగిన పండితులు మఱికొందఱుండవచ్చును.

శ్రీనాథుఁడు చూచిన సింగమనాయని నిర్ణయించుటకు సర్వజ్ఞ బిరుదముతోఁ బనిలేదు ఈబిరుదము యజ్ఞముచేసిన పిమ్మట వచ్చెడి సోమయాజి బిరుదమువంటిది. మొదటి సింగమనాయఁడు పండితుఁడై కవియై కవిపండితపోషకుఁడై కీర్తిఁగాంచినపిదప నాతని కీబిరుదము వచ్చినది. కొంతకాలము గడచిన పిమ్మట నాతనిని సర్వజ్ఞుఁడని ప్రజలు పండితులు కవులు పిలువఁజొచ్చిరి. అందుచే నాతనికావ్యముల యందు సర్వజ్ఞబిరుదము కన్పట్టలేదు. అంతమాత్రమున నాతనికా బిరుదము లేదనరాదు శ్రీనాథునకుఁ సార్వభౌమబిరుదమొక ప్రభువుచే నీయఁబడినది అంతకుఁబూర్వపు గ్రంథములలో నాబిరుదము లేదు తరువాతవచ్చినది. సింగభూపతికిఁ బండితులును బ్రజలును నెప్పుడాబిరుదమును బ్రసాదించిరో అప్పటినుండియాబిరుదము వాడుక లోనికి వచ్చినది. అదివఱకాతనికి లేదని యనుకొనినందు వలన ప్రయోజనమేమి?

యజ్ఞమొనర్చిన సోమయాజి మనుమనికి సోమయాజియని పేరుంచినారు. ఇతఁడు పుట్టుసోమయాజి. అట్లే రెండవ సింగభూపతికి జన్మముతోనే సర్వజ్ఞనామము లభించినది. దానినిబట్టి శ్రీనాథాది పండితులందఱు నీతనియాస్థానమున నుండిరని యనరాదు. ఇతఁడు పుట్టుసర్వజ్ఞుడు. అతఁడు పెట్టుసర్వజ్ఞుఁడు.

శ్రీనాథుఁడు చెప్పిన "దీనారటంకాల" యనుపద్యమొక్క టియే, శ్రీనాథసింగమ ప్రభువులకు సంబంధమును గలుపునది. అందు "రావుసింగ మహీపాలు ధీవిశాలు" అనియే యున్నది. సర్వజ్ఞ

శబ్దము పైపద్యమునలేదు. దీనిబట్టి సర్వజ్ఞబిరుదములేని సింగభూపాలునే శ్రీనాథుఁడు మెచ్చెనని స్పష్టమగుచున్నది. శ్రీనాథునకు "కుక్కవో" ఇత్యాది సమస్య నిచ్చిరట్లును. దాని నీ క్రింది పద్యములోఁ బూరించినట్లును జెప్పుచున్నారు.

ఉ. తక్కక రావుసింగవసుధానాథుఁ డర్థుల కర్థమిచ్చుచో
దిక్కులలేని కర్ణుని దధీచిని ఖేచరు వేల్పుమ్రానిఁ బెం
పెక్కిన కామధేనువు శిబిం బలి నెన్నఁగ నేటికి? దిట్టవై
కుక్కవొ! నక్కవో! పసివొ! కోతివొ! పిల్లివొ! బూరుకిల్లివో!

శ్రీనాథునంతటివానికిట్టి సమస్య నిచ్చెననుటయు నాతఁడు పూరించె ననుటయుఁగూడ నమ్మఁదగ్గదికాదు. అయినను నీపద్యమునఁగూడ రావుసింగవసుధా నాథుడనియే యున్నది. కానిసర్వజ్ఞుడనిలేదు. దీనిని బట్టియును శ్రీనాథుఁడు దర్శించినది సర్వజ్ఞబిరుదములేని సింగనృపతియే యని స్థాపితమగుచున్నది. ఇక శ్రీనాథుఁడు సర్వజ్ఞనృపాలుఁడని చెప్పినపద్య మీ క్రిందిదొక్కటియే కన్పట్టుచున్నది.

"క. సర్వజ్ఞనామధేయము
శర్వునకే రావుసింగజనపాలునకే
యుర్విం జెల్లును దక్కొరు
సర్వజ్ఞుండనుట కుక్కసామజమనుటే"

ఇది శ్రీనాథునిదనుట కాధారమేమిగలదు ? ఈపద్యమును జెప్పినపిదప మఱలి రెడ్లయాస్థానమునకు రాగా రెడ్డాతని నిచ్చకాల మారి యని యాక్షేపించిరఁట ! శ్రీనాథుఁ డాపద్యమున కర్థాంతర మున్నదని బదులుచెప్పెనఁట ! ఈయైతిహ్యమును గొందఱు విశ్వసింపకున్నను విశ్వాస్యముకావచ్చునని శ్రీప్రభాకరశాస్త్రిలుగారి యుద్దేశము. ఈపద్యమును రెండవసర్వజ్ఞుని (పుట్టుసర్వజ్ఞుఁడు) కడఁజెప్పి తరువాత శ్రీనాథుఁ డేరెడ్లయాస్థానమునకు వచ్చెనో తెలియదు. కొంత

వీరి రాజ్యము వినుకొండకే యంతరించినది. రాజమహేంద్రవరమున రెడ్డి రాజ్యమస్తమించినదో యస్తమింపనున్నదో! ఈపద్యమందలియంత రార్థస్వారస్యమును గ్రహింపలేనంతటి యజ్ఞానులు సింగభూపతియును, రెడ్డినృపులును గారు. ఇట్టిపద్యములనుబట్టుకొని కాలనిర్ణయము చేయుట సరికాదు. బమ్మెరపోతనామాత్యకృతమని చెప్పఁబడియెడి భోగినీ దండకమును బట్టియు శ్రీనాథుఁడును బోతనయు సమకాలికులని భ్రమ నొందియు, శ్రీశాస్త్రులవారు. రెండవ సర్వజ్ఞసింగమ నాయనికడ శ్రీనాథపోతనలున్నారని యూహించి అట్టిపండితులనాదరించిన యాత నికే సర్వజ్ఞబిరుదము తగియున్నదని యభిప్రాయపడిరి. మల్లినాథ సూరి కాలనిర్ణయము చేయునదే యాతఁడు శ్రీనాథునితోఁ బాటుగా రెండవసర్వజ్ఞుని యొద్దనున్నట్లు శ్రీశాస్త్రులవారు వ్రాసియుండిరి. వారే మఱియొకచోట రసార్ణవసుధాకర కర్తకు మల్లినాథసూరి సమ కాలమువాఁడుగాక శతాబ్దివాఁడుగాని కావచ్చును, అనివ్రాసియు న్నారు. వారే శృంగార శ్రీనాథమున ౧౮౯వ పుటలో నీకనకాభి షేక సత్కారమును ప్రాచీనకాలమునఁ బలువురు విద్వాంసులు పడసినారు. "సర్వజ్ఞసింగభూపతిచేఁ గొలచెలమ పెద్దిభట్టు కాంచెనఁట కాకతిప్రతాపరుద్రునిచే నాతని తాత కాంచెనఁట!" అని వ్రాసి యున్నారు. ప్రతాపరుద్రుఁడు క్రీ. శ. ౧౩౨౩ కుఁ బూర్వపువాఁడు. అతని కాలములోనివాఁడు మల్లినాథసూరి (పెద్దిభట్టు) తాత. ఈతని మనుమఁడు క్రీ. శ. ౧౩౮౦ ప్రాంతమునందుండునుగాని తాతకు తరు వాత ౧౧౦ వేండ్లలోనున్న రెండవసర్వజ్ఞుని యాస్థానము నందుండుట సంభవముకాదుగదా! దీనినిబట్టి మల్లినాథుఁడును శ్రీనాథుఁడును కూడ నొకటి సర్వజ్ఞునివలననే కనకాభిషేకము నందిరని నిశ్చయింపఁ దగియున్నది కొందఱు చరిత్రకారులిదియే సత్యమని తలంచిరి.

ఈవిషయమున శ్రీవీరేశలింగము పంతులుగారు వెలుగోటి వారి వంశచారిత్రములోని "క్షితిలోన సర్వజ్ఞసింగభూపాలుండు"

అనుపద్యము నుదాహరించుచు "ఆంధ్రకవులచరిత్రము ౧౩౬౫-౧౫౦౦ పుటలలో వ్రాసిన వాక్యములనుబట్టి విశ్వేశ్వర కవి చంద్రుడును, బమ్మెరపోతనామాత్యుడును శ్రీనాథుడును సమకాలికులని వారి యభిప్రాయమైనట్లు స్పష్టమగుచున్నది. మొత్తముమీఁద పీఠికలోను ముద్రగను పరస్పర విరుద్ధములైన వాక్యములువ్రాసి విషయమును సంశయాస్పదముగా నిర్ణయింపకపోయిరి. పీఠిక వ్రాసిన దేదియుఁ బైన నేను జేసిన సిద్ధాంతమును బూర్వపక్షము చేయఁజాలదు.

శ్రీ ప్రభాకర శాస్త్రిలుగారు శృంగారశ్రీనాథమున ౧౭౩వ పుటలో "శ్రీనాథుఁడు క్రీ. శ. ౧౪౩౫ ప్రాంతముఁ గనకాభిషేక సత్కారమును గాంచినాఁడని తెలిసికొంటిమి. అప్పుడాతఁడు కర్ణాట దేశమున ననేకస్థలములను దర్శించినాఁడు... ...రాజమహేంద్రవరమున వేమవీరభద్రారెడ్ల యాస్థానకవితాపదము వొందుటకు నీతఁ డిల్లు తిరిగినాఁడు. ఈసంచారమందు రాచకొండలో రాజ్యమేలు చుండిన సర్వజ్ఞసింగభూపతినిగూడ నీతఁడు సందర్శించినాఁడు" అని వ్రాసియున్నారు క్రీ. శ. ౧౪౩౫ నాఁటికే రెడ్డిరాజ్యము చిక్కులలో నున్నది. ౧౪౩౫ తరువాత రాజమహేంద్రవరపు రెడ్డిరాజుల శాసనములు గన్పట్టుటలేదు. ౧౪౩౫ ప్రాంతమునఁ గనకాభిషేక మొందినచో శ్రీనాథుఁడు కర్ణాటదేశమును దిరిగినదెప్పుడు? సర్వజ్ఞసింగభూపాలునిఁజూచిన దెప్పుడు? భీమఖండరచన మెప్పుడు? కాశీఖండ కృతి సమర్పణ మెప్పుడు? ఈ ప్రశ్నలకు సమాధానము లాలోచించు కొనినచో శ్రీశాస్త్రిలువారి కాలనిర్ణయము పొరపాటునకు లోనైనదని చెప్పకతప్పదు

శ్రీవీరేశలింగముపంతులుగారు క్రీ. శ. ౧౪౨౫ ప్రాంతమున రెండవదేవరాయలసభలోఁ గనకాభిషేకము జరిగెననియు, నాకాలముననే పదియవ తరమువాఁడగు రెండవసర్వజ్ఞ సింగమప్రభువుండె ననియుఁ దలంచినారు. ఈసర్వజ్ఞుఁడు పదియవ తరమువాఁ డందుమేని,

౧౪౨౫ నాఁటి కాతఁడు జన్మించియుండఁడు. తొమ్మిదవ తరము వాఁడని నిశ్చయించినను ఆనాఁటి కాతనికి ౨౦సంవత్సరముల వయసుండును. గాని, శ్రీనాథుని గౌరవించుటకుఁ దగినవయసులో నుండఁడు.

శ్రీచిలుకూరి వీరభద్రరావుగారు, ఆంధ్రులచరిత్రము ౨౩౨ పుటలో శ్రీనాథుఁడు మొదటిదేవరాయని ముత్యాలశాలలో స్వర్ణాభిషేకమును గాంచియుండెనని వ్రాసియున్నారు. మొదటిదేవరాయల కాలములో రెండవసర్వజ్ఞుఁడు లేఁడు. ఉన్నను, ౪-౫ యేండ్లకు లోపయినవయసులో నుండును. కావున శ్రీనాథుఁడు చూచినది, రెండవ సర్వజ్ఞునిగాదు. మొదటియాతనినే.

కాశీఖండగద్యమునఁ గవిసార్వభౌమ బిరుదముండి తక్కినవానిలో లేకపోవుటయే కనకాభిషేకకాలనిర్ణయమునఁ బండితులలో భిన్నాభిప్రాయము గల్గుటకు కారణమైనది. శ్రీవీరేశలింగముపంతులుగారీ గద్యలను లెక్కసేయక యాకాలము ౧౩౨౫ అని నిర్ణయించిరి. ముద్రితగ్రంథములనుబట్టి శ్రీనాథునిగద్యల నీక్రిందనిచ్చుచున్నాఁడను.

| | |
|---|---|
| "సకలవిద్యాసనాథ శ్రీనాథభట్ట" | నైషధము. |
| "వినయవిధేయ శ్రీనాథనామధేయ" | హరవిలాసము. |
| "సుకవిజనవిధేయ శ్రీనాథనామధేయ" | భీమేశ్వరపురాణము ౧-౩ ఆశ్వాసములు |
| "సుకవిజనవిధేయ సకలవిద్యాసనాథ శ్రీనాథనామధేయ | భీమేశ్వరపురాణము ౪-౬ ఆశ్వాసములు |
| "సుకవిజనవిధేయ, కవిసార్వభౌమ శ్రీనాథనామధేయ" | కాశీఖండము |
| "సకలవిద్యాసనాథ శ్రీనాథనామధేయ" | శివరాత్రిమాహాత్మ్యము |

ఈగద్యలలో శ్రీనాథునికవిత్వముకొంతయు విలేఖకుల కవిత్వముకొంతయు, ముద్రాపకుల కవిత్వముకొంతయుఁ జేరియున్నట్లు కానిపించుచున్నది. కావున నీగద్యలనుబట్టి విషయమును నిర్ధారణ

సేయఁబూనుకొనరాదు. సత్యాన్వేషణతత్పరుఁడనై పైమువ్వురు చరిత్రకారులయందు విశేషగౌరవముంచుచు వారితో భిన్నాభిప్రాయుఁడనై నాయభిప్రాయములనిట వ్యక్తీకరించితిని.

ఈకాలనిర్ణయమువలన బమ్మెరపోతనామాత్యుని చరిత్రమునకుఁ గలిగినఫలితములను పోతనచరిత్రమున వివరించెదను. శ్రీనాథుఁడు రచించిన గ్రంథములనుగూర్చియు నాతనిచాటువులను గూర్చియునిఁక నించుక వ్రాసెదను.

—: శ్రీనాథునికవితాగుణము :—

"పండితుఁడు కవి కాఁజాల" డనులోకోక్తి శ్రీనాథునిపట్ల వర్తింపదు. తర్కవ్యాకరణములయం దపారపాండిత్యము గడించిన యితఁడు తన పాండిత్యమును దానుసంపాదించిన లోకజ్ఞానమును నాంధ్రకవిత్వమున కుపయోగించి కృతకృత్యుఁ డయ్యెను. గంగాల వారికైన నచ్చటచ్చట సుకులు మెలికెలు నెగుడుదిగుడు లుండు నేమోకాని యీతని కవితాలహరి కట్టివిరోధములు లేక యొక్కరీతిగాఁ బ్రవహించుచుండును. ఎంతదుష్కరప్రాసముతో నారంభించినను, యతిప్రాసలకొఱ కర్థములేనిపదములను దెచ్చిపెట్టక యొక్కధాటిగాఁ బద్యములను వ్రాయుసొంపీతనికిఁ గుదిరిన ట్లేకవికిని గుదురలేదు. ఇతని కవిత్వము సంస్కృతపదబహుళమైనను మృదువై మనోహరముగా నుండును. శృంగారరసవర్ణనమునం దీతని కభిరుచిమెండు. ఈతని గ్రంథములయందు లోకోక్తుల నెన్నిటినో సందర్భానుసారముగఁ జేర్చి తనకవితాకన్య నాంధ్రాలంకారభూషితగా నొనర్చినాఁడు.

శ్రీనాథునికవిత్వము కఠినమైనదని కొంద అందురు. ఆకాఠిన్యముకూడ, చింతలపూడి యెల్లయకవి రాధామాధవకృత్యాదిని:

శా. సూనాస్త్రప్రమదామదస్ఫురిత వక్షోజాతకాఠిన్యమున్
బూనంజాలువచోవిలాసముల నేర్పుల్ చూపి కర్ణాటక

కర్నాటేంద్రు సభన్ గవిత్వవిజయోత్సాహంబు గైకొన్నమా
శ్రీనాథున్ గవిసార్వభౌముఁ గొలుతున్ సేవాంజలుల్ గీల్కొ
నన్.

అనుపద్యమునఁ జెప్పినట్లు శ్లోకదశకమే యగును.

—: శ్రీనాథుని గ్రంథములు: చాటువులు :—

శృంగారనైషధము:— శ్రీనాథుఁడు రచించిన గ్రంథములలో విశేష ప్రఖ్యాతి గాంచినది నైషధము. ఎనిమిదాశ్వాసములుగల యీ యుత్తమకావ్యమును పెదకోమటి వేమారెడ్డికడ మంత్రియైన మామిడి సింగనామాత్యున కంకిత మొనర్చెను. సంస్కృతమున శ్రీహర్షుఁడు రచించిన నైషధకావ్యమున కిది యాంధ్రీకరణము. శ్రీహర్షుఁడు కాశ్మీరదేశపు బ్రాహ్మణుఁడు, చింతామణీ మంత్రోపాసకుఁడు దమయంతీ స్వయంవరానంతరమున సరస్వతీదేవి చింతామణీమహామంత్రమును నలమహారాజున కుపదేశించుచుఁ గొంతకాలమునకుఁ బిమ్మటఁ జింతామణీ మంత్రప్రభావమున, గాశ్మీరదేశమందు సరస్వతీపీఠమున జన్మించెడు శ్రీహర్షుఁ డను బ్రాహ్మణునిచే నీకీర్తి ప్రపంచమున విశేషముగాఁ బ్రకాశించునని యానతిచ్చినట్లు శ్రీహర్షమహాకవి చెప్పిన విషయమును, శ్రీనాథకవి షష్ఠాశ్వాసమున గ్రంథస్థము చేసి యున్నాఁడు. సంస్కృతమున నిది మిగుల కఠినమైనకావ్యము "నైషధమ్ విద్వదౌషధమ్" అని పండితులనుచుందురు. శ్రీహర్షుఁడు మొదటరచియించిన నైషధము విద్వాంసుల కర్థముకాకపోఁగా నాతఁ డద్దానిని జించివైచి మఱల రచియించెననియు, నదియు లోకమున కుపయోగింపకపోవుటచే మఱలరచియించెననియు నిట్లే పలుమాఱులు గ్రంథమును చేయుచువచ్చినను విద్యార్థులద్దానిం జదువ సాధ్యము కాకపోఁగా నంతట శ్రీహర్షునితల్లి తెలికపిండిని శాకముగావండి పెట్టుచు, బచ్చలపాదుక్రింద, బండుకొనుటకుశయ్య నేర్పఱుచుచు నలువదిరోజులిట్లుచేయఁగా శ్రీహర్షునకు బుద్ధిమాంద్యము జనించెననియు,

ఖండనగ్రంథ సంగ్రంథకర్కశబుద్ధి
షట్తర్కమున్నేక చక్రవర్తి

తే. భట్టహర్షుండు ప్రౌఢవాక్పాటవమున
నద్ది రచియించి బుధలోకహితము బొందె
నట్టి నైషధసత్కావ్య మాంధ్రభాష
ననఘ! యొనరింపు నాపేర నంకితముగ.

శ్రీనాథుఁడు శ్రీహర్షునివలెఁ జింతామణి మంత్రితత్త్వముఁ దగునో కాదో చెప్పఁజాలము. కాని యాతఁడు సరస్వతీదేవ్యుపాసకుఁ డని యీక్రిందిపద్యమువలన స్పష్టమగుచున్నది.

శా. బ్రాహ్మీదత్తవరప్రసాదుఁడ వుదుఁ బ్రజ్ఞావిశేషోదయా
జిహ్మస్వాంతుఁడ వీశ్వరార్చన కళాశీలుండ వభ్యర్హిత
బ్రహ్మాండాది మహాపురాణచయ తాత్పర్యార్థ నిర్ధారిత
బ్రహ్మజ్ఞాన కళానిధానమవు నీభాగ్యంబు సామాన్యమే.

నైషధాంధ్రీకరణమునఁ దానవలంబించిన రీతినిగూర్చి శ్రీనాథ కవి గ్రంథాంతమున నిట్లు నుడివియున్నాఁడు.

"మామల్లదేవి నందనుండును, శ్రీహీరరోహణాచల రత్న ప్రరోహంబును జింతామణి మంత్రచింతన ఫలంబును, గన్యాకుబ్జ రాజాస్థాన రంగమంగళాభరణంబును గౌడవిజయకావ్యకర్తయుఁ గవి చక్రవర్తియు ఖండనగ్రంథకారుండును, వైతండికకమలషండవేదండం బును నగు భట్టహర్షమహాకవీశ్వరుండుఁ గవికులాదృష్టాధ్వపాంథుం డొనర్చిన నైషధశృంగారకావ్యం బాంధ్రభాషా విశేషంబున నశేష మనీషిహృదయంగమంబుగా శబ్దం బనుసరించియు, నభిప్రాయంబు గుర్తించియు, భావంబుపలక్షించియు, రసంబుఁ బోషించియు, నలం కారంబు భూషించియు, నౌచిత్యం బాదరించియు, ననౌచిత్యంబుఁ బరిహరించియు మాతృకానుసారంబునఁ జెప్పఁబడిన యీభాషా

ఇందలి మొదటిపాదమునకు సంస్కృతనైషధమునందు "సువర్ణదండైక సితాతపత్త్రీజ్జ్వల త్ప్రతాపావళికీర్తి మండలః" అనియున్నది. ఇట్టి భాషాంతరీకరణమునుజూచి కొందఱుపండితులు నీ "డు, ము, వు"లు నీవు పుచ్చుకొని మానైషధమును మాకిమ్మని శ్రీనాథు నాక్షేపించిరని కథయొకటికలదు. ఆయాక్షేపణము ననుసరించి నైషధ మంతయు నిట్లే యాంధ్రీకరింపఁబడెనని తలంచుట న్యాయముకాదు.

కొందఱు సంస్కృతపండితుల కాంధమనిన తలనొప్పివచ్చును. నేనొకప్పుడొక వృద్ధపండితునితోఁ బింగళి సూరనార్యకృత ప్రభావతీప్రద్యుమ్నమునుగూర్చి ప్రశంసింపఁగా నాయన "ఏమి తెలుఁగు నాయనా! ఏమిసాహిత్యము? ఓదేవాదిదేవా? నీవుత్త ముండవు. నేను పాతకుండను. నీవు పావ కుండవు తెలుఁగిట్లుండును" అని యా శబ్దములను విపరీతముగాఁ బదచ్ఛేదము చేసి, యట్టిశబ్దముల ననేకముల నేకరువుపెట్టెను అట్టిపండితులమాట నటుంచి చూచినచో, శ్రీనాథుని కవిత్వము చాల సరసమైనది యని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. శ్రీనాథునివలె సంస్కృతపద సంకలితముగా నాంధ్ర కావ్యములను రచించినకవులు పెక్కురుకలరు ఆంధ్రకవిత్వమునెడ ననాదరమును జూపు సంస్కృతపండితుల దృష్టితోఁ జూచినచో వారందఱునాక్షేపణార్హులే యగుదురు. భావగాంభీర్యముకలిగినారికేళ పాకమున రచింపఁబడిన సంస్కృతనైషధము నాంధ్రీకరించు నప్పుడా మాత్రపు కాఠిన్య మాంధ్రకావ్యము నందుండుటసహజము. భాషాంతరీకరణము కాక, స్వతంత్రకావ్యమయిన వసుచరిత్రమునం దిట్టి కాఠిన్యము లేదా? సంస్కృతవిద్యార్థులు కావ్యపంచకమును జదివిన పిమ్మట సంస్కృతనైషధము ను జదువ బ్రారంభించెదరు. ఆంధ్ర నైషధ మట్లుక్కఁ బలేకుండ. నాంధ్రభాషయం దొక్కింత పాండిత్య మలవరచుకొనినపిమ్మటఁ జదివి యర్థముచేసి కొనఁదగినదిగా నున్నది. కవయిత్రి యగుమొల్ల చెప్పినట్లు సంస్కృతకావ్యముల నాంధ్రీక

రించునప్పుడు కేవల సంస్కృత సమాసములతోఁ గావ్యములను నింపుట మంచిది కాదనుమాటనిజమే. కాని యాభావమునే మనసునం దుంచుకొని యాంధ్రీకరణముసేయఁ బూనినచో గ్రంథ మధికమై పేలవముగ నుండును. శ్రీనాథుఁడు, తిక్కనాదికవుల భారతాదుల వలె స్వతంత్రింపక సాధ్యమైనంతవఱకుఁ దన యాంధ్రీకరణము మూలానుసారముగ నుండవలయునను నుద్దేశము గలవాఁడగుటచే, శ్రీహర్షునిపదముల యందిమిడియున్న భావమంతయు సమ్యగాంధ్రమునఁ బద్యమును రచించుట కష్టమనితోఁచిన కొన్ని తావులలో మూల మందలిపదములనే యుపయోగించియున్నాఁడు. తనయిచ్చవచ్చినట్లు తెలిగించుట కిదిపురాణముకాదు. ఇందలికథ యత్యల్పము ఇది సాహిత్యము నలవరచుకొను విద్యార్థుల కుద్దేశింపఁబడినది. ఈమాట మనసునం దుంచుకొన్నచో శ్రీనాథుని యాంధ్రీకరణము నెవ్వరు నాక్షేపింపరు. ఇందులకుదాహరణములను జాలఁ జేయవచ్చును. మచ్చునకొక్క యుదాహరణమిచ్చెదను. నలమహారాజును నిద్ర నుండి మేల్కొల్పుటకై వైతాళికులు "గృహారామ ప్రదేశముల యందుఁ గాకులును కోకిలలును గూయుచున్న" వని తెలుపు సందర్భమున శ్రీహర్షుఁడా పక్షులధ్వనులను నైషధమున నీశ్లోకములో నుత్ప్రేక్షించియున్నాఁడు.

శ్లో॥ ఇహ కిముషసి పృచ్ఛాశంసి కిం శబ్దరూప
ప్రతినియమితవాచా వాయసే నైష పృష్టః
భణ ఫణిభవశాస్త్రే తాతజః స్థానికా కా
వితివిహిత తుహీవాగుత్తరః కోకిలో భూత్　　౧౯-౬౦

కాకులు కావ్ కావ్. అనికూయుచుండ నాధ్వని కా. కా. అని ప్రశ్నించుచున్నట్లున్నదనియు, కోకిలధ్వనులు తు. హీ. తు హీ. యని యాప్రశ్నల నుత్తరముల నిచ్చుచున్నట్లున్నదనియు శ్రీహర్షుఁ డుత్ప్రేక్షించియుండెను.

ఈ పద్యోక్తులకు నాధారమైన వ్యాకరణసూత్ర మొకటి యున్నది.

"తుహ్యోస్తాతఙ్ఙాశిష్యన్యతరస్యామ్" ౭-౧-౩౫

ఆదిశేషువలన నుత్పన్నమైన వ్యాకరణ మహాభాష్యలక్షణశాస్త్ర (పాణినీయము) మందలి యీసూత్రార్థమును మనసునందుంచుకొని శ్రీహర్షుఁడు రచించిన పైశ్లోకమును శ్రీనాథుఁడిట్లాంధ్రీకరించి యుండెను.

శా. ప్రాతఃకాలము నాయసంబు ఫణినాథప్రోక్త శాస్త్రంబులోఁ
దాతఙ్స్థానులు సెప్పుఁడెవ్వియనుచుం దంటం బొప్పఁ గాకో యనం
జాతుర్యం బలరార నుత్తరము విస్పష్టంబుగాఁ గోకిల
వ్రాతంబిచ్చెఁ దుహీతుహీయని గృహారామ ప్రదేశంబులన్.

ప్రథమైకాంతమున తు-హి-లకు వైకల్పికముగా 'తాత్'అను రూపమువచ్చునని చెప్పిన పైసూత్రమునందలి "తాతఙ్" శబ్దమునకు స్థానులేవియని (గురువుశిష్యుని ప్రశ్నించినట్లు) కాకులుప్రశ్నించుచున్నవఁట! కోకిలలు తు-హి-అని ప్రత్యుత్తరమిచ్చుచున్నవఁట! కౌముదిని బాగుగాఁజదువుకొనిన వారికేఁగాని యీపద్యమర్థముకాదు. సామాన్యున కర్థమగుటలేదనిగాని, "తాతఙ్" "స్థాని" శబ్దముల వల్లే తెలుఁగుపద్యము నందిమిడ్చెనని కాని శ్రీనాథు నాక్షేపించిన ప్రయోజనమేమి? శాస్త్రవిషయములను గావ్యములలో నిరికించుట యుచితమా యనుప్రశ్నకుఁ బ్రత్యుత్తర మొసంగుట ప్రస్తుతాంశము కాదు.

నైషధము కఠినకావ్యమని యాంధ్రవిద్యార్థులుపేక్ష వహింపక యామూలాగ్రముగాఁ జదివి శ్రీహర్షుని మహోత్కృష్ట భావతరంగముల యందోలలాడి శ్రీనాథుని కవితామృతమును దనివితీరఁ గ్రోలుదురు గాక! సులభముగా నర్థము తెలియని తావులఁ బండితుల నడిగి తెలిసికొని రసాస్వాదనము సేయవలయునేకాని శ్రీనాథుని నిందించుచు నాగ్రంథమునే పరిత్యజించుట చెఱువుపైనీరందదని ప్రక్షాళనమే మానుటయగును.

శ్లో॥ అసిత మేకసురాశితమ ప్రభూ న్నవునశేష పునర్వ్యశదం విషమ్
అపి నిపీయ సురైర్జనితక్షయం స్వయముదేతి పునర్నవమార్ణవమ్
౬౧ చ. స.

ఉ॥ హాలహాలద్వయంబు గలశాంబుధిఁ బుట్టె విసీల పాండుర
జ్వాలలతోఁ దనందొక విషంబొక వేలుపు మ్రింగె నందఱో
వేలుపులోలిమై ననుభవించిన రెండవయీవిషంబు ని
ర్మూలము గాక యున్నయది ముద్దియ! పాంథుల పాపమెట్టిదో
౨ ఆ.

శ్లో॥ యాచమానజనమానస వృత్తేః పూరణాయ బదజన్మనయస్య
తేనభూమి రతిభారవతీయం నద్రుమైర్నగిరి భిర్నసముద్రైః
౮౮ పం. స.

ఉ. దానకళాకలాపసముదంచిత సాంవివేక సంపదన్
మానిత యాచమాన జనమానసవృత్త్యభిపూర్తి బుద్ధి యె
వ్వానికి లేదొకింతయును వాఁడొకరుండు భరంబుధాత్రికిం
గానలుగావు శైలములుగావు పయోధులుగావు భారముల్ ౩ ఆ

శ్లో॥ భూయోర్ధ మేనం యదిమాం త్వమాత్థ తదాపదావాలభసే
మఘోనః
సతీవ్రతై స్త్రీవ్రమి మంతుమంతుమంతః పరం వజ్రిణి మార్జి
తాస్మి ష. స.

చ. తనహృదయాధి నాయకుని దక్కఁగఁ దక్కొరు సన్నుతింపఁగా
వినుట పతివ్రతంబునకు విగ్రహ మిట్టిది ధర్మశాస్త్ర వా
సన యటుగాన నోదివిజ శంభళి యింకిట పట్టి నీకు మీ
యనిమిషరాజు పాదముల యానసుమీ మఱియేమిపల్కినన్ ఆ ౩.

నైషధములోని మఱికొన్ని పద్యములు:—

చ. అటుదగునే సురేశ్వరుని యంతటివాఁ డఖిలాప్సరోంగనా
విటుఁ డొక మర్త్యభామినికి వేడుక సేయుచు నున్నవాఁడు వి

స్ఫుటబహురత్నభూషణ విభూషితు లయ్యును నాచనాఁకిన్
గటకట యారకూటకటకంబు రుచించునె కాక యొక్కెడన్ ఆర

ఉ. ఆదిఁ బరోపకారపరులై చరియించినయట్టి యూండనే
యాదులఁ బోలనైతి సిబు డక్కట దైవతకార్యసిద్ధి వి
చ్ఛేదము నొందె నేమియని చెప్పుదు నింక సమస్తసంక్రమ
న్మాదులు సంఘటింపఁగ సమర్థులె యొరును రాయబారముల్.
ఆ ర.

శా. ఆద్యైత్యాంతకు వక్షమున్ గృహము సారాన్యత్ర్యేకదోషస్ఫుటా
సీదన్మర్కటకీట జాతకృతక క్ష్వేతాతపత్రీభవ
త్రాద్యజిహ్మగల కౌస్తుభా భరణ రత్నస్ఫూర్తిగాఁ బాసి యా
ప్లోవం బొప్పవసించు శ్రీ యితని బాహామధ్య సౌధస్థలిన్. ఆ౨.

చ. వెలయఁగఁ బంచనై షధి విశేషము సేర్పుఱుపంగలేక యా
కులత వహించి యిట్టితఱిఁ గూరిమి నెచ్చెలి యొద్దనుండినన్
దెలియఁగఁ జూచి చెప్పుదు గదే యని డెందమునం దలంచె నిం
పలర నరాళకేళి యమరాలయ హేమమరాళపుంగవున్. ఆ ౯.

శా. చేసెం గావలయున్ విరించి నిఖిల స్త్రీపుంససంయోజనా
భ్యాస ప్రౌఢి ప్రకాశమొందఁ నది యియ్యంబైన సంసర్గమి
ట్లాసంసారపురం ధిపూరుష మిథోహర్షోదయ ప్రేమముల్
పోసెం గావలయున్ మహాంకు హృదయాంభోజంబులన్నిరికిన్. ఆ౾

తే. ఉష్ణశీతాన్నకబళంబు లొకఁడు సూపఁ
బవలొ రాత్రియొ యొడఁగూడ నవసరంబు
దాని కుత్తర మొకలతాతన్వి యిచ్చె
నధరబింబంబు విరిచి సంధ్యాగమమని,

మ. వినుఁడీ నాదుప్రతిజ్ఞ వేల్పులు జగద్విఖ్యాతచారిత్రి నా
తని నేఁ బట్టెద నెద్దియేని నొకరంధ్రం బబ్బెడుంగాక యే

నను వేలంబును గొల్చు దేవతలు జాలా యేమి యావంత ద
ప్పినసైనం గలి గొచ్చుఁగాక మెయి మైఁబోనిచ్చునే యెవ్వరిన్. ౮౭

ఉ. మాపటి భోజనావసరమధ్యమునం గొనియాడ గోస్తనిం
దేనియ సంస్తుతింప వినుతింపను మీగడ ఖండశర్కరా
పానక ముగ్గడింపఁ బ్రతిపక్షచటుల త్రిపిస్థగోపర
క్తానన మైన సీయధర మల్లునొ యంచు మదిందలంపుదున్. ౮౮

—: భీమేశ్వరపురాణము :—

దీనికి భీమఖండమనియు, గోదావరీఖండమనియు నామాంతరములు. స్కాందపురాణములో గోదావరీఖండమను భాగమున కిది యాంధ్రీకరణమని కవి యీక్రిందిపద్యములలోఁ జెప్పియున్నాఁడు.

క. బంధుర సపాదలక్ష
గ్రంథంబై మొదుపదులు ఖండంబులతో
సంధిల్లును స్కాందం బన
సింధువునకుఁ గాల్వ లమరిచిన చందమునన్.

మ. అరవిందాప్త కృతప్రతిష్ఠుఁ డగుదక్షారామ భీమేశ్వరే
శ్వరు మాహాత్మ్యముతోడఁ గూడి భువనశ్లాఘాస్పదంబై యభం
గురమై స్కాందపురాణసార మగు శ్రీగోదావరీఖండమున్
బరిపాటిన్ రచియింపు మాంధ్రజగతీభాషా ప్రబంధంబుగన్.

గోదావరీ మండలమందలి దక్షారామ (ద్రాక్షారామమని యిప్పుడు పిలువఁబడుచున్నది) యొక్కయు నందుఁ బ్రతిష్ఠింపఁ బడియున్న భీమేశ్వరుని యొక్కయు మహిమ లిందు విశేషముగా వర్ణితములైనవి. దక్షుఁడిచ్చటనే యజ్ఞమొనరించెననియు, వీరభద్రుఁడా యాగమును నిచ్చటనే ధ్వంసము చేసెననియు నిందుదాహృతమై యున్నది. ఈపట్టణమున కీనామము వచ్చుటకీ కథయే కారణమని చెప్పుదురు. సందర్భవశమున నీదక్షారామకుఁ బరిసరములయందున్న

కోటిఫలి, సీల, పులుగుర్తి, సంపర, మొదలగు నామములును, గౌతమి, వృద్ధగౌతమి, తుల్యభాగ మొదలగు పుణ్యనదులు నిచటఁ బేర్కొనఁబడినవి. అప్పటికాలమునఁబోలు నావి విఁనుచుండెడివారని యీ మహాకవి వానిసౌందర్య చాతుర్యాదివిశేషములను బహుపద్యములలోఁ బురవర్ణనారంభమున వర్ణించియున్నాఁడు.

వ్యాసుఁడు కాశియం దేడుదినములన్నము దొరకక బాధపడి యాగ్రహముఁజెంది కాశినిశపింపఁబోఁగా నన్నపూర్ణామహాదేవి యాతని కాహారమునొసంగి యాక్రోశమును మాన్చుటయు, శివుఁడామునిపైఁ గోపించి, కాశీక్షేత్రమును వదలిపొమ్మని వ్యాసుని నిలువనీయఁ దగవని యాజ్ఞాపింప నచ్చోటువాసి వ్యాసుఁడు దక్షిణప్రాంతమున కరుదెంచి, యచ్చటనున్న యగస్త్యమహర్షిని సందర్శించి యాతనిచే నీప్రాంతములందలి పుణ్యక్షేత్రాదులను దెలిసికొని, దక్షిణకాశియైన దక్షారామమును, నందలిభీమేశ్వరుని సేవించుచుఁ గాశీత్యాగఖేదమును మాన్పుకొనుటయు నీ గ్రంథమందలి ప్రధానవిషయములు.

ఈక్రింది రెండుపద్యములలో వారణాశిదక్షారామముల కభేదము సూచింపఁబడినది.

క. దక్షిణ వారాణసీనగరము
దక్షారామంబు పీఠధామము ధన్య
త్ర్యక్షక్షోణీమండల
రక్షామణి దానిఁబొగడ బ్రహ్మకువశమే.

సీ. భీమేశ్వరేశ్వర శ్రీమహాదేవుండు
హిమధామమౌళి విశ్వేశ్వరుండు
సప్తగోదావర సలిలప్రవాహంబు
సాక్షాత్కరించిన జహ్నుకన్య
తిరుచుట్టుమాలెలోఁ దిరమైనగణపతి
యేకాంతదుంఠి విఘ్నేశ్వరుండు

దక్షిణంబున నున్నదండపాణిఁ దూ
హింపంగ దండపాణీశ్వరుండు

తే. భైరవస్వామి శ్రీకాలభైరవుండు
నంది నందీశ్వరుండేమి సందియంబు ?
దక్షవాటంబు కాశికాస్థలము గాదె
తీవ్రకరతేజ ! సత్యవతీతనూజ !

ఈపురాణమందలి శైలికొఱకాఁ జుపద్యముల నుదాహరించెదను.

శా. దక్షారామ విలాసనీతతుల సౌందర్యంబు వర్ణింపఁగా
జక్షుశ్శ్రోత్రకులాధినాయకునకున్ శక్యంబె? తచ్చారు ఫా
లక్షేత్రంబును బోలలేక మునిఁగెన్ లజ్జాభరక్రాంతుఁడై
నక్షత్రేశుఁడు శంభుశేఖర సుధాంధస్సింధు పూరంబులన్. ౧ ఆ

ఉ. ఏడుదినంబు లన్నమున కెడ్డముపుట్టిన యంతమాత్రలో
నేడుచుచున్నవాఁడవు మునీశ్వర ! నేఁడును నీదుధీరతల్
పాడరిపోయెనే శివునిభార్యకుఁ గాశికిఁ బుణ్యరాశికిం
గాడునొనర్పఁ జూచెదవు కంఠపుఁగ్రోధము పెచ్చు రెచ్చఁగన్. ౨ఆ

ఉ. ఎక్కడఁ జూచినం సరసి యెక్కడఁజూచిన దేవమందిరం
బెక్కడఁ జూచినం నటిని యెక్కడఁ జూచినఁ బుష్పవాటికల్
ఎక్కడఁ జూచినన్నది మహీవలయంబున భీమమండలం
బెక్కడ యన్యమండలము లెక్కడ భావనచేసిచూచినన్ ౩ ఆ.

శా. శంభుండంబిక పల్కఁగైకొని జగత్సంరక్షణార్థంబు సం
స్తంభించెన్ నిజకంఠగోళమున విశ్వక్షోభసంతాన సం
రంభారంభ విజృంభణాద్భుతకళాకారాదంబుఁ గాకోలమున్
జంభారాతి మణిప్రకల్పిత విశేషానిర్విశేషంబుగన్. ౪ ఆ

మ. కలిదోషంబున నిష్ఠురాత్మకులునున్ గామాంధులుం బాపక
ర్ములు నజ్ఞానదవాగ్నిదగ్ధులునునై పోద్యన్మహాఘోర వా

వలెఁ గూలంగల దుష్టమానసులకున్ వారాణసీముక్తమై
కలుగుం గావుత ముక్తి దక్షపురికిం గారుణ్యసంభావనన్ ౫౮

ఉ. ప్రాణవియోగవేళ నరపక్షిమృగాళికి దక్షవాటికా
క్షోణిఁ దారకంబుఁ జెవిఁ జూదనుఁ దానతియిచ్చుచుండఁగన్
బాణబిసప్రసూనములఁ బయ్యెదనొయ్యన వీచుచుండు నే
ర్వాణి త్రిలోకమాత బలవన్మదనాశ్రమదూరశాంతికిన్. ౬౮

—: కాశీఖండము :—

శ్రీనాథుని గ్రంథములలో నైషధమునకుఁ దరువాతఁ బ్రసిద్ధి గాంచినది కాశీఖండము. సంస్కృతమున నున్న స్కాందపురాణము నందలి ఖండములలోఁ గాశీఖండ మొకటి. దానిని శ్రీనాథుఁడాంధ్రీకరించెను. ఈవిషయమును గాశీఖండ కృత్యాది యందు శ్రీనాథుఁడే క్రిందిపద్యములోఁ జెప్పియున్నాఁడు.

ఉ. స్కాందపురాణ సంహితకు ఖండములేఁబది యందులోన నా
నందవనాను భావకథనంబుగ శ్రోతకు వక్తకున్ శుభా
నంద పరంపరావహము నైజగుణంబునఁ గాశిఖండమా
ఖండమునయ్యె నెఱింగి సముత్కటిఁ గావ్యముగా నొనర్పఁగాన్.

నైషధంవిద్వదౌషధ మన్నట్లుగానే పండితులీ గ్రంథమును గూర్చి "కాశీఖండమయః పిండ" మని (కాశీఖండ మినుపగుండు వంటిది) వక్కాణించుచుందురు. కాశీక్షేత్రమునకు, "ఆనందవన" మని నామాంతరము కలదు. ఈ గ్రంథ మేడాశ్వాసములు కలది. ఇందుఁ గాశీక్షేత్రముయొక్కయు, నందుండు వివిధ దేవతలయొక్కయు మాహాత్మ్యము విశేషముగా వర్ణింపఁబడినది. గోదావరీమండల మందలి ద్రాక్షారామము, కోటిఫలి, పలివెల, రాజమహేంద్రవరము, పట్టిసము, భద్రాచలము మొదలగు పుణ్యక్షేత్రములయొక్కయు గౌతమి, కౌశిక వృద్ధగౌతమి మొదలగు పుణ్యనదులయొక్కయు మహిమలు అగస్త్య మహర్షి తీర్థయాత్రాసందర్భమున భక్తులకానంద దాయకముగా వర్ణిత

ములయినవి ఆశ్వాసమున కొకటిచొప్పునఁ గాశీఖండ శైలి తెలియు పద్యముల నిక్కిందఁ బొందుపఱచెదను.

ఉ. కంటికి నిద్రవచ్చునె? సుఖంబగునే రతికేళి? జిహ్వకున్
వంటకమిందు సేయునె? యితర వైభవముల్ పదివేలు మానసం
బంటునె? మానుషంబుగల యట్టిమనుష్యున కెన్నఁడేనియున్
గంటకుఁ డైన శాత్రవుఁ డొకండు దనంతటివాఁడు గల్గినన్ ఆ ౧

ఉ. దూరముపోయి యెండఁబడి మాపిలివచ్చిన ప్రాణనాథునిన్
ద్వారకవాట గేహళులదాఁక నెదుర్కొని తీర్థమార్చి యా
హారము పెట్టి వీడ్యము సమర్పణచేసి విహారశయ్యపై
నూరువు లొత్తి చిత్తమున కుబ్బొనరించుట ధర్మమింతికిన్. ఆ ౨

శా. నానాశాస్త్రము లభ్యసింపఁగ ననంతద్రవ్యమార్జింప సం
తానంబుం బడయంగఁ బుత్రులకు నర్థంబుల్విభాగించి యీఁ
బౌనఃపున్యమునన్ సుఖంబనుభవింపం బోయెఁ గాలంబు గౌ
రీనాథున్ భజియింప నేరనయితిన్ శ్రీకాశికావల్లభా ఆ 3

చ. అరుణగభస్తిబింబ ముదయాద్రిపయిం బొడతేర గిన్నెలోఁ
బెరుఁగును వంటకంబు వడపిందెలునుం గుడువంగఁ బెట్టుని
ర్భరకరుణాధురీణ యగుప్రాణము ప్రాణము తల్లియున్నదే?
హరహర! యెవ్వరింకఁ గడుపారసి పెట్టెద రీప్సితార్థముల్. ఆ ౪

సీ. కాశీపురికి నుత్తరాశా ప్రదేశంబు
నందునుండుట నుత్తరార్కుఁడయ్యె
నితిహాసమొకటి యయ్యినుని మాహాత్మ్యంబు
సంప్రకాశ మొనర్పఁజాలెడునది
వినిపింతు విను కాశివిప్రుఁడొక్కఁడు సదా
చారసంపన్నుఁడు శాంతిశాలి
యతిథిప్రియుఁడు ప్రియవ్రతుఁ డను పేరివాఁ
డతనిభార్య శుభవ్రతాభిధాన

తే. సంపదలు నాకిఁక నయింపఁ దనయ యోగ్య
మూలనక్షత్రమున యందు మొదటికాలఁ
గేంద్రమున నాంగిరసుఁడుండఁ జంద్రవదన
శాలి నిత్తు రూపసంపదయుఁ దాను. ౮౫

మ. కలశసంభవ! యమ్మహాత్మ! కాశికాపట్టణమున్ శంకరా
కులు గాకాకృతిఁ గాశికేశుల కలా కోర స్వర్గాపకృతిన్
గలహంబాడి కొలంకులోనఁ బడి శోకంబెట్లు శిక్షింపఁగాఁ
గలహాంతర్గుణయున్నదే! స్త్రీసుమిా కాశీ ప్రభావోన్నతుల్. ౮౬

ఉ. ఎట్టిపురాణముల్ చదువ నెన్నఁడుఁ జెప్పితి? యెట్టి వేదముల్
గట్టిగఁ జెప్పితిన్? వివిధ కావ్యము లాదిమ లాఁద భారతం
బెట్టు రచించి? తీవు బుధ! యెట్టులు! శ్రోతృజనంబు మా తెఱఁగోఁ
బొట్టను జేసి త్రిప్పెదవు పుణ్యగుణంబుల నాశి. గాశికిన్. ౮౭

—: హరవిలాసము :—

సంస్కృతభాషలో బాలభారతము, బాలరామాయణము, విద్ధసాలభంజిక, కర్పూరమంజరి యను రూపకములను, కావ్యమీమాంస యను సాహిత్యాలంకార గ్రంథమును రచించి ప్రసిద్ధిగాంచిన రాజశేఖరుఁ డనుమహాకవి హరవిలాసమను గ్రంథమును రచియించి యుండెను శ్రీనాథుఁడు దీని నాంధ్రీకరించెనని కొందఱందురు. సంస్కృతహరవిలాస మిప్పుడెచటను గన్పింపకుండుటచే నిది దాని కాంధ్రీకరణమగునో కాదో చెప్పఁజాలము. శ్రీనాథుని గ్రంథములలోఁ బెక్కులాంధ్రీకరణములే యగుట నిదికూడ రాజశేఖరుని గ్రంథమున కనువాదమైయుండునని యూహ కలుగుచున్నది.

ఇది యేడాశ్వాసముల ప్రబంధము. ఇందుశంకరుని లీలలు వర్ణితములైనవి. మొదటిరెండాశ్వాసములలోను చిఱుతొండనంబి యను వైశ్యుని కథ చెప్పఁబడినది. చిఱుతొండఁడీశ్వరభక్తుఁడు.

జంగముల కోర్కెలను దీర్పఁ బ్రతినవట్టినవాఁడు. ఒకనాఁడొక జంగము వచ్చి యీశ్వరు నభిషేకించుటకై తూమెడు చెఱకురసమును దెమ్మనియెను. చిఱుతొండ డందులకై నూఱు చెఱకుకట్టలను గొని మోపు కట్టుకొని యెత్తుకొనలేకపోయెను. ఈశ్వరుఁడు మానవరూపమున వచ్చి యాకట్టల నొకవైపున నెత్తికొనియెను. రెండవవైపున చిఱుతొండఁ డెత్తుకొనియెను. మోపు నింటికిఁ దెచ్చునప్పటికి చిఱుతొండనికి దేహమునఁ జెమటపట్టెను. ఈశ్వరునకును జెమటపట్టెను. కైలాసమునం దప్సరస్త్రీనాట్యకళా కౌశలము నాలోకించుచున్న శంకరునకును జెమర్చెను. అప్పుడుపార్వతి వేలుపుతేమను జూచుటచే నీశ్వరునకు జెమట వచ్చెనని శంకించి యీర్ష్యంజెంది చేతనున్న పద్మముచే భర్తనొక్కటి గొట్టెను. ఈశ్వరుఁడుపార్వతికిఁగోపంబుదీర్చుటకై దేవతలువినుచుండ, చెఱకుకట్టలు మోయుటచేఁ గలిగినశ్రమవలన దేహము చెమర్చెను గాని కందర్పవికారముచే గాదని చిఱుతొండని వృత్తాంతమును జెప్పెను. ఆభక్తునిఁ జూపుమని పార్వతిశివుని బ్రార్థించెను. శివుఁడు కుష్ఠురోగాన్వితుఁడైన వృద్ధశివయోగి యయ్యెను. పార్వతి గుడ్డి యవ్వ యయ్యెను. ఆనాఁడు కంచియందెచ్చట జంగములు లేరు. ఈశ్వర ప్రీతికొఱకు జంగము నారాధింపనిదే చిఱుతొండఁ డన్నముం డినఁడు. వెదకికొనుచు, వెదకికొనుచు నెట్టకేలకు వృద్ధశివయోగి యున్నయెడకు వచ్చి యాతనిని దనయింటికి శివార్చనకు రమ్మని ప్రార్థించెను. చాలకాలమునుండి నిరాహారవ్రతముతో నుంటిననియు నెవ్వరేని నన్ను శివార్చనఁ జేయుమనినచో, ఉపనీతుఁడైన కుమారుని తనస్వహస్తములతోఁ జంపి, యామాంసమును తనభార్య వండి వడ్డింప నాసహపంక్తిని దానుఁ గొడుకుఁ గుడువవలసియుండుననియుఁ జెప్పెను. చిఱుతొండనంబి యందుల కంగీకరించి తనయేకపుత్త్రునిం జంపి యామాంసమును భార్యచే వండించి వడ్డించెను. అతని కిఁక బుత్త్రులు లేమి పుత్త్రులు లేనివానియింట భుజింపనని యాకపటజంగము నిరాకరింపఁ జేయునది లేక విచారించుచు చిఱుతొండనంబిభార్యను

సీ. ఉండ్రాలు సారించి పుండ్రేక్షులుం దేనె
యరఁటిపండ్లుం బూరియలు ఘృతంబుఁ
పెసరపప్పును బాలుఁ బెరుగోగిరంబులుఁ
బాయసాన్నంబులుఁ బానకములు
నాళికేరంపు బొండాలు మీఁగడయును
నవదధి పిండఖండా ల్లుకములు
లడ్డువంబులు చక్కిలాలు మోహుండలు
ఖండంబు చలిమిడి మండెపప్పు

గీ. లాదిగా భక్ష్యచోష్యలేహ్యాదులైన
బహుపదార్థంబు లర్పించి ప్రీతులైరి
వేలుపులు రాక్షసులును నావిఘ్నపతికి
దుగ్ధపాథోధి మథనోద్యోగవేళ. ౮౬

ఉ. ఆడఁగఁబోవు తీర్థమెదురైనవిధంబున నెల్లియేను రే
పాడియ చంద్రశేఖరునుపాస్తి యొనర్చి యుపాయనంబుతోఁ
జూడఁగవచ్చువాఁడ నయి చూచుచునుండఁగ నీవవచ్చితో
చేడియ యెట్టిపుణ్యములు చేసినవాఁడనొ ప్రాగ్భవంబునన్ ౮౭

—: వల్లభాభ్యుదయము :—

శ్రీనాథమహాకవి వల్లభాభ్యుదయమను నొకగ్రంథమును రచించెనని చెప్పుదురు. అదియిప్పుడెచ్చటను గన్పట్టుటలేదు. భట్లపెనుమర్తి కోదండకవికృత వల్లభాభ్యుదయ మొకటికలదు. అది శ్రీకాకుళాంధ్ర వల్లభుని మాహాత్మ్యమును దెలుపును. శ్రీనాథకవి కృత వల్లభాభ్యుదయము గూడ నీకథనే తెలుపునో కాక వల్లభాభ్యుదయమనుపేర వినుకొండ వల్లభరాయల వంశచారిత్రమును దెలుపునో తెలియదు. ఈవల్లభరాయల కృతమని చెప్పఁబడియెడి క్రీడాభిరామముగాక శ్రీనాథుని వీధినాటకమని యొకపుస్తకము ప్రచారములో నున్నది. దీనినిండ నసభ్యములగు పద్యములే యున్నవి. ఇదియే వల్ల

భాభ్యుదయమనియు శ్రీకాకుళమందలి యాంధ్రదేవుని తిరునాళ్ళలో జరిగెడి వ్యభిచారాది దుష్ప్రవర్తనల నతిరమ్యముగ శ్రీనాథుఁడు చిత్రించి యున్నాఁడనియు గొందఱనుచున్నారు. ఇది విశ్వసింపఁ దగిన విషయము కాదు. అట్టి దుష్కావ్యము నాతఁడు రచించెనని కాని దానికి వల్లభాభ్యుదయమని పేరుపెట్టెనని కాని తలంపరాదు. శ్రీనాథుని వల్లభాభ్యుదయములోనిదని వెలపాటి జగ్గన తన యుదాహరణ గ్రంథములో నీ క్రిందిపద్యము నుదాహరించినాఁడు.

సీ. రజనీవధూటికా రజతతాటంకంబు
వలరాజు ధవళోష్ణవారణంబు
ప్రోషితయువతిహృత్పుట భేదదాత్రంబు
బహుచకోరకుటుంబ భాగపాత్ర
మధుకైటభాసురమథను డాపటికన్న
చక్రవాకంబుల చల్లచేఁపు
దుగ్ధపాథోరాశి తొలుచూలిసంతతి
రోహిణీదేవి తారుణ్యఫలము

గీ. చంద్రకాంతశిలాను విలకృపీట (?)
నిర్జరాంభోవ్యథామోక్ష నియమవైద్యుఁ
డంధకారచ్ఛటా హాలహాలహరుఁడు
చంద్రుఁ డొప్పారెఁ గాంతినిస్తంద్రుఁ డగుచు.

శ్రీనాథుఁడు నందనందన చరిత్రమును రచించెనని రంగరాట్ఛందమున నుదాహృతమైన పద్యమును బట్టి తలంచుచున్నారు. కాని యది నమ్మఁదగినదిగాఁ గాన్పించుట లేదు. ఆ గ్రంథ మిప్పుడెచ్చటను గన్పట్టుట లేదు. అది లభించువఱకు నట్టి పేరుగల గ్రంథమును శ్రీనాథుఁడు రచియింపలేదనుటయే లెస్స. ఈ గ్రంథము నిరోషమేమో !

—: పల్నాటివీరచరిత్రము :—

ఇది మంజరీ ద్విపదకావ్యము. ఇది శ్రీనాథ విరచిత మని కొందరు కాదని కొందఱును జెప్పుచున్నారు. ఈ గ్రంథమును, అక్కిరాజు ఉమాకాన్త పండితులు విపులమగు పీఠికతోఁ గూడఁ బ్రకటించి యున్నారు. ఆపీఠిక యందిది శ్రీనాథవిరచితమనియు, నాతనిరచనములలో నిది కడపటిదనియు, నాతఁడు తన వార్ధక్య దశలో పల్నాడునే నివాసముగాఁ జేసికొనెననియు వ్రాసియున్నారు. ఉమాకాన్తముగారు ప్రకటించినది పల్నాటివీరచరిత్రము నందొక భాగమేకాని, సంపూర్ణ గ్రంథముకాదనియు, శ్రీనాథుఁడు పల్నాటివీరుల చారిత్రమును సంపూర్ణముగా రచియించియుండెననియు నదియొక పెద్దగ్రంథ మగు ననియు, మఱికొందఱు అనుచున్నారు. కాని యదియింతవఱకును బయలు పడలేదు. శ్రీ ఉమాకాన్తపండితుఁడు ప్రకటించినది పల్నాటివీరచరిత్రమునం దొకభాగమే కాని సంపూర్ణము కాదనుట నిశ్చయమే యైనను, ఈభాగమునందుఁ గృత్యాదియు నంతమునుండుటచే నీభాగము మాత్రమే యొక గ్రంథముగా శ్రీనాథుఁడు రచియించినట్లు కన్పట్టుచున్నది. శ్రీనాథుఁడు తక్కినభాగమును గూడ వ్రాసెనని చెప్పుటకు జనశ్రుతితప్ప యితరాధారము లేమియు లేవు

శ్రీనాథుఁడు పల్నాటివీరచారిత్రమును రచియింపనే లేదనియు, అతనిరచనమని యిప్పుడు ప్రచురింపఁబడిన గ్రంథము శ్రీనాథకృతము కాదనియు, నాతనిపేరు పెట్టి యెవ్వరో రచియించి యుందురనియు, వ్యాకరణదోషము లుండుటవలనను, కవిత్వము నిస్సారమై శ్రీనాథుని యితర రచనములతో సరిరాక యుండుటవలనను నిది శ్రీనాథునిచే రచియింపఁ బడలేదనియు నిశ్చయముగాఁ జెప్పవచ్చుననియుఁ గొందఱి వాదము. పల్నాటివీరచారిత్రమునఁ బ్రయోగదోషము లున్నమాట సత్యము. శైలియుఁ బ్రౌఢముగాలేక పేలవముగానున్నది. పల్నాటి వీరచరిత్రము నందలి కృత్యాదిపదముల నీక్రింద నుదాహరించు

చిటికెలకైకోర్కెఁ జిక్కుడువాఁడు చేకొన్నమాచెర్ల చెన్నకేశవుఁడు ।
నాకలలోవచ్చి నయమొప్పఁ బలికె వినవోయి సత్కవి వేడ్క నామాట ।
మనమున నాకు సమ్మతమైనదొకటి అనవినిదేవ మహాప్రసాదంబు ।
ధ్రువముగ నాకతియిష్ట నాకిప్పుడనిన చెన్నకేశవుఁ డప్పుడిట్లనియె ।
కార్యంబు పుణ్యంబు సమకూర్చునట్టి పలనాటివీరుల భాగవతంబు ।
ప్రకటితంబుగ నీవురచియించి మాకు నంకితం బొనరింప ననువొందుమావె ।
యనుచును శ్రీకాంతుఁ డెంతేనిదయను మేల్కాంచి మనమున మేలయ్యెననుచు ॥
విలసిల్లు పలనాటివీరులచరిత జనులెల్ల సక్తిచేఁ జదువుటకొఱకు ।
మంజరిద్విపదగా మన్నించి నేను జెప్పఁబూనితి వహ్నోశ్రీ మెఱయఁగ॥

ఇష్టదేవతాస్తుతి మధ్యమున "ఘన,మేఘశ్యామ నిజమూర్తి యయిన శీలమ్మనాయునిఁ జిత్తమందెంచి" (శీలమ్మపుత్త్రుఁడు ), బ్రహ్మనాయుఁడు-ఇతనినితల్లిపేరుతోఁ జేర్చి శీలమ్మనాయుఁడందురు ) అని కథయందలి చనిపోయిన యొకనాయకుని స్తుతిచేయుటఁ జూడ నీగ్రంథము శ్రీనాథుఁడు చేయలేదనియు నప్రౌఢుఁడగు సామాన్యుఁ డొకఁడీపుస్తకమును జేసి శ్రీనాథునిపేరు పెట్టెననియుఁ జేసెడు వాదమునందు సత్యమున్నదని కృత్యాదిని, గ్రంథమును విమర్శించిచూచినకొలఁదిని దోఁచుచున్నది. అయినను గ్రంథమునందు శ్రీనాథుఁడు రచించినట్లు కన్పట్టుచున్నందునను నిదియాతని రచనమేయని కొందఱు పండితులనినందునను యిట నాగ్రంథమునుగూర్చి వ్రాయవలసివచ్చినది.

పలనాటి చరిత్రమందలి కథనుగూర్చి యొక్కింత యిట వ్రాయుట యప్రస్తుతము కానేరదు. గుంటూరు మండలములోని కొంతప్రదేశమునకు "పలనాడు" అని పేరు. ప్రస్తుతమిది పలనాడు తాలూకాయని పిలువఁబడుచున్నది. దీనికిఁ బ్రధానపట్టణము గురిజాల. పలనాటి వీరులకథను నాస్వంతమాటలతో వ్రాయుటకంటె ఉమాకాన్త పండితుని పీఠికలోని వాక్యముల నిటనుదాహరించుట యుత్తమ మని భావించి యట్లు చేయుచున్నాఁడను,

"ఉత్తరదేశమునఁ బాలమాచాపురి యనుపట్టణము కలదు. జంభనాపురియని దీనికి నామాంతరము. దీనినను౦గు రాజేలుచుం

డెను. ఇతఁడు కార్తవీర్యార్జునుని కేడవతరమువాఁడు. కార్తవీర్యుఁడు చేసినపాపములు శాపింపఁగా ననుఁగురాజు బ్రాహ్మణోత్తముల యాలోచనవలన జీడికానెకుష్ఠముధరించి పశ్చిమ్యుఁడు నామాన్యుఁడు పథముఁడు పకులదేవుఁడు నకుటుంబుఁడనై రాజ్యమువిడిచి పాపపరి హారార్థమై తీర్థయాత్రలకు వెడలి నానాక్షేత్రంబుల సేవించుచు నను లంగా మునుఁగుచునంధదేశమునకువచ్చి యనుకావతిరేవునఁ గృష్ణా నదిలో స్నానముచేయఁగా నల్లనిజీడి కానెకుష్ఠము తెల్లనాయెను. ఇట్లు వస్త్రములు తెల్లనగుటవలన పాపవిమోచనమునకుఁ జిహ్నమని బ్రాహ్మణు లనుఁగురాజునకు బత్తిమమునఁ జెప్పియుండిరి. అనుఁగు రాజప్పుడు చందవోలులో రాజ్యముచేయుచున్న రాజుకూఁతును వివా హమాడెను. ఆమె పేరు మైలాంబ కూఁతునకుఁ జాకవోలురాజు పల్నా డరణమిచ్చినందున ననుఁగురాజగురిజాలరాజధానిగఁ బల్నాటి కధిపతి యయ్యెను. అనుఁగురాజునకు భార్యలు మువ్వురు వీరవిద్యా దేవి (విజ్జలదేవి?) భూరమాదేవి, మైలమాదేవి. వీరవిద్యాదేవి యందుఁ బెదమల్లదేవుఁడు, పినమల్లదేవుఁడు బాలమల్లదేవుఁడు నను మూవురుపుత్రులుగలిగిరి. మైలమాదేవియందునలగామరాజు పుట్టెను. భూరమాదేవియందుఁ గామరాజు, నరసింగరాజు, ఝట్టిరాజు, పెరు మాళ్ళరాజు నను నల్వురుసుతు లుద్భవించిరి. అనుఁగురాజు మంత్రి దొడ్డనాయుఁడు. ఇతఁడు వెలమ బేతినాయుని కుమారుఁడు. దొడ్డ నాయుని కొడుకులు బాదరాజు, బ్రహ్మనాయుఁడు. బాదరాజునకుఁ బెద్దన్నయని నామాంతరముకలదు. సంతానముకలుగకముం దనుఁగు రాజుచే బాదరాజు పెంచుకొనఁబడి. క్షత్రియుండును గంచర్లపురా ధీశుఁడు నైన కృష్ణగంధర్వుని కూతురు లవాంబను బెండ్లాడెను. బ్రహ్మనాయుఁడు విష్ణువుగా భావింపఁ బడుచున్నాఁడు. కురుక్షేత్ర యుద్ధమునఁ గృష్ణుఁడెంత ప్రధానుఁడుగా నుండెనో, పల్నాటియుద్ధ మున బ్రహ్మనాయుఁ డంత ప్రధానుఁడుగా నుండెను. ఈయనపల్నాటి

కృష్ణుఁ డని పేరొక్కనఁ బడుచున్నాఁడు. ఇతనికుమారుఁడు బాలచంద్రుఁడు. కన్నమదాసని మఱియొకఁడు గలఁడు.

ఇట్లు దొడ్డనాయఁడు మంత్రిగ నలుఁగురాజు కొంతకాలము పరిపాలించి మృతినొందెను. దొడ్డనాయఁడుకూడ స్వర్గమున కేగెను. నలగామరాజు పట్టాభిషిక్తుఁ డాయెను. నాయకురాలను నొకయువతి నిజశక్తిచేత నలుఁగురాజు ననుగ్రహమునుసంపాదించి యతఁడు చనిపోయినవెనుకనలగామరాజునొద్దమంత్రిణి యయ్యెను ఈనాయకురాలి యసలుపేరు నాగాంబ. నాయకురాలనియే సాధారణముగ వ్యవహరింపబడుచున్నది. నాయకురాలి జన్మస్థలము పల్నాటితాలూకాలో నాగులేటియొడ్డుననున్న చిట్టగామాలపాడను నొక గ్రామము ఈమె పంటరెడ్ల కులమునఁ బుట్టినది. తండ్రిపేరు చౌదరిరామిరెడ్డి మేనమామపేరు మేకపోతు సింగారెడ్డి. ఈమెయింటి పేరారవల్లివారని చెప్పఁబడినది ఇదితల్లిగారింటిపేరో యత్తగారింటిపేరో తెలియదు ఈమెభర్త నామమెచ్చటను గానరాదు పల్నాటియుద్ధమున కీమెయే కారకురాలు అతిపరాక్రమశాలిని. గురిజాల పురవరాధీశ్వరులగు నలగామరాజాదు లీమెచేతిలోఁ గీలుబొమ్మలవలె నుండువారు. ఈమె బ్రహ్మనాయునికిసుపోటీగా రాజ్యతంత్రమునడపినమహాసమర్థురాలు. యుద్ధావసానమువఱకుఁ జలనమునొందక మగబిరుసుకట్టి యుత్సాహారూఢమై బ్రహ్మనాయునితోఁ బోరసమకట్టిన నిరుపమ శూరురాలు. గ్రంథవిస్తరభీతిచే నీమెచరిత్రము పూర్తిగ వ్రాయఁజాలకున్నాను. ఈమెమంత్రిణి యగునప్పటికి వీరవిద్యాదేవికి జన్మించిన మల్లదేవులు బాలురుగానుండిరి. బ్రహ్మనాయఁడు వీరిని దగ్గరకుఁ దీసి రాజ్యములోఁ గొంతభాగమిప్పించి గురిజాలనుండిపోయి మాచర్లపట్టణము నిర్మించుకొని వారు యుక్తవయస్కులు కానందున వారికి బదులుగఁ దానే పరిపాలించుచుండెను. వారు పెద్దవారైనతరువాతఁ గల్యాణపట్టణాధీశుఁడైన వీరసోమునికుమార్తెల నిప్పించి వివాహముచేసి

పెదమల్లిదేవుని మాచెర్లకుఁ బట్టాభిషిక్తునిఁ జేసెను. అనుఁగురాజు చనిపోవునప్పుడు కొడుకులనందఱను బ్రహ్మనాయుని కప్పగించెను. గాన నలగామరాజు నాయకురాలిని మంత్రిణిగాఁ జేసికొన్నను, మల్లిదేవులకుఁ బెండ్లిచేసినతరువాత బ్రహ్మనాయుఁడు ద్వేషబుద్ధి లేక నలగామరాజునకు భూరమాదేవి పుత్రులకుఁ గల్లుమలినాటకై గురిజాలకుఁబోయెను. వారును దగినవిధముగ గౌరవించిరి. గురిజాలలో బ్రహ్మనాయునికి నాయకురాలు విషముపెట్టించెను. కాని యామె ప్రయత్నము నిష్ఫలమాయెను. మాయచేసి నాయకురా లతనినిఁ గోడిపందెమున కొడఁబఱచెను. ఓడిపోయినావారేడు సంవత్సరములు రాజ్యమువిడిచిపెట్టి పరభూములకుఁ బోవలయునని పందెపటొడఁబడిక. పందెములో బ్రహ్మనాయుఁ డోడి మల్లిదేవులవెంటఁ బెట్టికొని మాచెర్లవిడిచి, కృష్ణానదినిదాఁటి మండాదిపట్టణమునకువలసపోయెను. నాయకురాలు సైన్యమునంపి మండాదిలోనున్న మల్లిదేవుల యావుల మందను బోడిపించెను. కుపితుఁడై బ్రహ్మనాయుఁడు గురిజాలపైకి వెడలి యుద్ధముచేసెను. తరువాత మండాది విడిచి బ్రహ్మనాయుఁడు మల్లిదేవులు మొదలగువారు శ్రీశైలమునకేఁగి యాసీమను బాలించుచుండిన భిక్షావలి వారిదగ్గరఁ గొన్నిగ్రామములు గుత్తకుఁ దీసికొని వీరమేడపియను పట్టణమున (ఇదియిప్పటికిని గలదు) గట్టుకొని యచ్చట నివసించిరి. వీరమేడపిలోఁ గొంతకాలముండి లెక్కలు చూడఁగా నప్పటికివారు మాచెర్లవిడిచి యేడుసంవత్సరములమీఁద నాఱుమాసములాయెను. వలసపోవలసిన దేడుసంవత్సరములే గనుకఁ బైనాఱుమాసముల పన్ను తమకివ్వవలసి యుండుననియు, మాచెర్ల రాజ్యము తమస్వాధీనము చేయవలసినదనియు బ్రహ్మనాయుఁడు నలగామరాజునకు రాయబార మంపెను. రాయబారి యలరాజు. ఇతఁడు మల్లిదేవుని మఱఁదియైన కొమ్మరాజుకొడుకు. కల్యాణపురాధీశ్వరుండగు వీరసోముని మనుమఁడు. నలగామరాజుయొక్క యల్లుఁడు. నాయకురాలు పువ్వులలో విషముపెట్టించి యలరాజును జెర్లగుడిపాటి

చర్లఁ (గురిజాలకు సమీపములో నున్నది) జంపించెను అలరాజు చావునకు మల్లదేవాదులుకోపించి యుద్ధసన్నద్ధులైరి. ఇరుపక్షముల వారు కార్యమపూడివద్ద నాగులేటితీరమున మహాయుద్ధము గావించిరి. మల్లదేవునివైపు ప్రథమమున యుద్ధము చేసినవాఁడు బాలచంద్రుఁడు. తరువాత బాదరాజు కొమ్మరాజు యుద్ధము చేసిరి. ఉభయులపక్షములలోను వేలకొలఁది జనులు మడిసిరి. చిట్టచివరకు నలగామరాజు పరాజితుఁడై బ్రహ్మనాయుని శరణుఁజొచ్చెను. మహావీరుఁడు దయారసపరిపూర్ణుఁడు నిర్మలహృదయుఁడునైన బ్రహ్మనాయుఁడభయంబొసంగి నలగామరాజును సింహాసనమెక్కించెను.

ఈచరిత్రమందలి మఱికొన్ని ద్విపదలు నీక్రిందనిచ్చెదను.

ఓచక్రిశిఖరస్వామి యోకంజనాభ । జలముపైఁ బవళించు సర్వభూతేశ
ప్రమథాధిపతులు బలువీరవరులు । ప్రథనవసుమతిలోఁ బడిలురై నిలిచి
యిష్టము ప్రాణంబులీయని యంచు । వచ్చియున్నారదె వైభవం బలర
పరసింహంబులఁ వీరినాట్యంబు । సేయుమనిప్పుడు స్థిరబుద్ధితోడఁ
బావనహీనమై పరఁగునీభూమి । నిర్దుష్టముగఁ జేయనిన్నువేఁడెదము
నీచరణంబున నెలజనియించి । పావనగంగయై పరఁగి లోకముల
ఘనపవిత్రముచేసెఁగద పూర్వమందు । నాజలరూపమై యమరమేఘంబు
వర్షించి యీభూమిఁ బరపవిత్రంబు । సేసెడునట్లుగా సెలవిమ్ముతండ్రి.

* * *

బాలునిఁగనుఁగొని బలుకోపమునను । గన్నులెఱ్ఱఁగఁజేసి కాఁతయిట్లనియె
నోరి నరాత్మజ యోరిమూర్ఖ । క్రిందుమీఁదెఱుఁగక కెరలుచున్నావు
గర్వమేటికి నీకుఁ గాంతలయెడను । నకిరిగనఁ దినవలెఁ గట్టఁగవలయు
నెఱుకమాలినచేష్టలేల చేసితివి । మఱియంగనేల నీపొఁగల్లఁ జాగఁ
మదిరెమసంబు నీయురపెఁబుగుసింగఁ । దగమల్లభూపతిఘన మెల్లనీకు
పదనంబుఁజేసిన సత్తువమండి । తుళ్ళుచున్నావు దుష్టమానసుఁడ

* * *

కార్యమపురమందు ఘనపరాక్రమతఁ । దండ్రులువిల్చుండి దండుసేయంగ
నేనిటనుండుట నీతియేతల్లి ? । యుండుమంటకు నీకు నొప్పునా మనసు
నీవెఱుంగనిధర్మమే నెఱుగుదుఁనె । ప్రాకృతభామల పగిదిఁబల్కెదవు
వెఱ్ఱితనంబేల వీరునిసతికిఁ । గాయమనిత్యంబు కల్మి హుళక్కి

జలజాసనుఁ డుపేంద్రుఁడు క్షణదాకరుఁడును, షట్చక్రి గిరిస్త్రీలు సకలర్షిగణము
ఘనరత బ్రహ్మేంద్రాదిసర్వదేవతలు, ధారుణియు శైలము పాతాళములు నాకములు
గౌర్యాదిశక్తులు సమయజ్ఞులు సకలభూగణముల్ సహస్రములు.

---

శ్రీనాథుఁడు రచించిన క్రీడాభిరామ మనునాటకము వినుకొండ వల్లభరాయల పేరుతోఁ బ్రచారమందున్నది. దానివిషయమై వల్లభరాయల చరిత్రమునఁ జర్చించెదను.

— శ్రీనాథుని చాటుపద్యములు —

శ్రీనాథరచితములని తలంపఁబడియెడి చాటుపద్యములు విశేషముగా నున్నవి. బ్ర.శ్రీ. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు చాటుపద్యమణిమంజరిలోను శృంగారశ్రీనాథమునను కొన్నిపద్యముల నుదాహరించి యున్నారు. అవిగాక యింక ననేకపద్యములు శ్రీనాథునివని యాంధ్రప్రపంచమునఁ బ్రచారములో నున్నవి. అందుఁ గొంతభాగము స్త్రీలకచ, కుచ, మర్మాంగ సంభోగాది వర్ణనములతోఁ గూడినవి. కొన్ని వ్రాయుటకును జదువుటకునుగూడ ననర్హములై యున్నవి. అవి యన్నియు శ్రీనాథరచితములని యంగీకరింపరాదు ఎవరే పద్యము రచించినను నది శృంగారపరమైనచో శ్రీనాథునకును, హాస్యరసమైనచో తెనాలి రామకృష్ణునకును, వేదాంతపరమైనచో వేమనకును నంటగట్టుచుండుట లోకములోఁ బరిపాటియైనది. శ్రీనాథుని చాటువులలోఁ జాలభాగ మిట్టిదేయని నాయభిప్రాయము. ఆ కాలపుప్రభువు లెంతశృంగార రసాభిలాషులైనను శ్రీనాథుఁడు శృంగారవర్ణనమునం దెంత ప్రీతిగలవాఁడైనను తన్నుఁ గాంతకేళి యిచ్చుటకు వచ్చెడి స్త్రీలను నిరాలకేవ్రున గూర్చుండి నిరాడవచ్చునవనితామణులను నోటవచింపరాని మాటలతో వర్ణించుటయేకాక. వానిని శాశ్వతముగాఁ జేసి తనకీర్తిని స్థిరముగాఁ జేయుటకై (ఁటమును దాటాకును బుచ్చుకొని వానిని లిఖించిపెట్టియో శిష్యులకు బోకము

చెప్పి పఠింపించియో యున్నాఁడని తలంచుట సాహసము. అయిన నీపద్యము లెట్లు వచ్చినవని యడుగవచ్చును. ముద్రణాసౌకర్యము హెచ్చినకొలఁది వీనిప్రచారమును హెచ్చినది. తురగారామకవి రచించినపద్యములు కొన్ని శ్రీనాథునివని తలంపఁబడినట్లు చెప్పుచున్నారు. అట్లే శ్రీనాథునివని తలంచెడిపద్యములలో నింకెందఱు రచయితలున్నారో! కర్తృత్వవిషయమున సంశయమున్నపద్యములను శ్రీనాథునివని యిచ్చట నుదాహరింపరాదని వదలివైచితిని. ఇంతకును నీచాటుపద్యములవలన నయ్యెడు ప్రయోజనము లేదు. వీనిలోఁ జారిత్రక విషయములను దెలుపు పద్యములు లేవు. శ్రీనాథుని కవితాసామర్థ్యము తెలియునన్న నాతని గ్రంథములలోకంటె నీపద్యములవలనఁ దెలియు విశేషములు లేవు. శ్రీనాథుని శృంగారరసాభిలాషము దెలియునన్నది యీపద్యములలోకంటె నాతని శృంగారనైషధాది గ్రంథములయందే యధికముగాఁ గలదు. నైషధమునకు శృంగారశబ్దమును చేర్చినందువలననే యది తెలియుచున్నది. శ్రీనాథునిస్వభావము దెలియునందురేని యీపద్యము లతనివగునో కాదో తెలియకుండ వీనినిబట్టి యాతనిస్వభావమును నిర్ణయించుట న్యాయముకాదు. ఇఁక వినోదమునకొఱకుఁగావలయునందురా! కులాంగనలను నట్లువర్ణించిన యీపద్యములవలన వినోదముకంటె నేవగింపే కలుగునని నాయభిప్రాయము. శ్రీనాథకృతమని యొక వీధినాటకము ప్రచారములో నున్నది. అందలి పద్యములు మిగుల నసహ్యములు. అది యాతనిరచనముకాదు. వ్యాకరణదోషములందుఁ జాల గలవు.

శ్రీనాథునివని చెప్పఁబడియెడిపద్యములలోఁ గొన్ని యిట నుదాహరించెదను. ఇవియన్నియు నాతనివని నాయభిప్రాయముకాదు.

రాజమహేంద్రవరమున కేతెఁడువచ్చి రెడ్ల యాస్థానమునఁ బ్రవేశించినప్పు డీర్ష్యాళువులైన పండితులీతనితో తర్కవ్యాకరణశాస్త్రములలో శాస్త్రార్థములుచేసి పూర్వపక్షసిద్ధాంతములఁ గుదురనీయక సిలుగులఁ బెట్టినట్లు కన్పట్టుచున్నది. దానిపై మోటుఁదనముగ శ్రీనాథుఁ డొక చాటువులో:—

శా. ... ... ... ... ... ... ... ... ... ... ... ...

... ... ... ... ... ... ... ... ... ... .... ....వి

ద్వాంసుల్ రాజమహేంద్రపట్టణమునన్ ధర్మాసనంబుండి ప్ర

ధ్వంసాభావము ప్రాగభావ మనుచుం దర్కింతుర శ్రాంతమున్.

అని చెప్పుటయేగాక భీమేశ్వరపురాణములోఁ గుకవినిరసన వ్యాజమున:—

తే. బోధమల్పంబు గర్వ మభ్యున్నతంబు

శాంతి నిష్ప్రచారంబు మచ్ఛరము ఘనము

కూపమండూకములఁబోలెఁ గొంచె మెఱిఁగి

పండితంమన్యులైన వైతండికులకు.

తే. నికటమున నుండి శ్రుతిపుటనిష్ఠురముగ

నడరి కాకులు బిట్టు పెద్దఱచినప్పు

డుడిగరాయంచ యూరక యుంట లెస్స

సైఁపరాకున్న నెందేనిఁ జనుటయొప్పు.

అని యీసడించియున్నాఁడు.

శ్రీనాథునకు బావమఱఁది వరుసలో భోజనప్రియుఁడైన రామయమంత్రి యుండెనఁట! అతనిపై నీక్రిందిపద్యము చెప్పెనట!

ఉ. గ్రామముచేతనుండి పరికల్పితధాన్యము నింటనుండి శ్రీ

రామకటాక్షవీక్షణపరంపరచేఁ గడతేఱెఁ గాక మా

రామయమంత్రి భోజనపరాక్రమ మేమనిచెప్పవచ్చు నా

స్వామి యెఱుంగుఁ దక్కఁబళచాతురి తాళఫలప్రమాణమున్.

చ. తొలకరిమించుఁదీవగతితోఁప దుకాణమునీద నున్నయ

య్యలికులవేణితోఁ దములపాకులబేరము లాడఁబోయి నే

వలచుట కేమి? శంకరునివంటి మహాత్ముఁడు లింగరూపియై

కులికెడు దానిగబ్బి చనుగుబ్బలసందున నాట్యమాడఁగన్.

శా. హెచ్చెం బింతయు లేని హంసనడతోఁ బొల్పొందు లేనవ్వుతోఁ
బచ్చల్గ్రాపినకుల్కు ముంగరలతో బాగైన కెమ్మోవితో
నచ్చంబైన ముసుంగు వెట్టి చెలితో నామాట లేయాడుచున్
వచ్చెంబో కుచకుంభముల్ గదలఁగా వామాక్షి తాసిళ్ళకున్.

ఉ. పువ్వులు కొప్పునందమిరి ముంగురు గాఁ నసియాడుచుండఁగాఁ
జివ్వనఁ జంగనాచి యొక చేతను కోకలిపూని యొయ్యనన్
నవ్వుముఖంబుతోడఁ దననందనుఁ బాడుచు నాఁథుఁజూచుచున్
సువ్వియసువ్వియంచు నొకసుందరి బియ్యముదంచె ముంగిటన్

సీ. తాటంకయుగ ధగద్ధగిత కాంతిచ్ఛటల్
చెక్కుటద్దములపై జీరువాఱ
నిటలేందుహరినీల కుటిలకుంతలములు
చిన్నారిమోమునఁ జిందుఁ ద్రొక్క
బంధురమౌక్తిక ప్రకటహారావళుల్
గుబ్బచన్నులమీఁద గునిసియాడ
కరకంకణ క్వణక్వణనిక్వణంబులు
పలుమాఱు రాతిపైఁ బరిఢవిల్ల

గీ. ఓరచూపుల విటచిత్త మూఱఁగులాడ
బాహుకుశలతఁ జక్కని మోహనాంగి
పాటఁ బాడుచు గూర్చుండి ఱోటిమీఁద
బిండిరుబ్బెంగ నన్నులఁ బండువయ్యె

సీ. బొమవింటఁ దొడిగిన పూవింటి దొరముల్కి
పోల్కిఁ గస్తురి సోగబొట్టుదిద్ది
చకచక మెఱయు తారకల రేకలువోలె
గొలకులు నెడలఁగ జ్జలముదీర్చి
పొమ్మపుగుబ్బలిమీఁదఁ బాడము నీరెండనా
రంగుచందురుకావి రైక దొడిగి

పిసుకుపొక్కిలి మెఱుకపల్లముగప్పఁ
బాలవెల్లువవంటి చేలఁగట్టి

గీ. అంచకొదమలగమి వెదకించుపోల్కి
నందెచప్పుళ్ళు ఘల్లుఘల్లనుచు మొఱయ
నడుము జవజవలాడఁ గీల్జడఘటించి
వచ్చెముక్కంటిసేవకు మచ్చెకంటి.

—: శ్రీనాథుని చాటుపద్యములు :—

క. రసికుఁడు పోవఁడు పల్నా
డెసగంగా రంభయైన నేకులెవడుకున్
వసుధేశుఁడైన దున్నును
కుసుమాస్త్రుండైన జొన్నకూడే మెసవున్.

ఉ. అంగడియూరలేదు వరియన్నములేదు శుచిత్వమేమి లే
దంగన లింపులేదు ప్రియమైన వనంబులు లేవు నీటికై
భంగపడంగఁ బాల్పడుకృపాపరు లెవ్వరు లేరు దాతలె
న్నంగనుసున్న గాన పలనాటికి మాటికిఁ బోవనేటికిన్.

ఉ. వీరులు దివ్యలింగములు విష్ణువుచెన్నుఁడు కళ్ళిపోతు రా
జారయఁ గాలభైరవుఁడు నంకమశక్తియ యన్నపూర్ణయున్
గేరెడు గంగధార మడుఁగే మణికర్ణికగాఁ జెలంగునీ
కారెమపూడి పట్టణము కాశిగదా పలనాటివారికిన్.

ఉ. దోసెడుకొంపలోఁ బసులత్రొక్కిడి మంచము దూడరేణమున్
బాసినవంటకంబు పసిబాలురశౌచము విస్తరాకులున్
మాసినగుడ్డలున్ దలకుమాసినముండలు వంటకుండలున్
రాసెడు కట్టెలుందలపరాదు పురోహితులింటికృత్యముల్

ఉ. ఫుల్లసరోజనేత్ర! యలపూతనచన్నులఁ జేఁదు ద్రావి నా
డల్లదవాగ్ని మ్రింగితి నటంచును విక్కెదవేల? తిం తినే

పల్లవయుక్తమానుముకు బచ్చలి శాకము జొన్నకూటితో
మెల్లన యొక్క ముద్ద దిగ మ్రింగుమ! నీపస కాననయ్యెడిన్.

గీ. చిన్నచిన్న రాళ్ళు చిల్లర దేవుళ్ళు
నాగులేటినీళ్ళు నాపరాళ్లు
సజ్జజొన్నకూళ్లు సర్పంబులును దేళ్లు
పల్లెనాటిసీమ పల్లెటూళ్లు

క. జొన్నకలి జొన్నయంబలి
జొన్నన్నము జొన్నపిసరు జొన్నలె తప్పన్
సన్నన్నము సున్న సుమీ
పన్నుగఁ బల్నాటిసీమ ప్రజలందఱకున్

క. సిరిగలవానికిఁ జెల్లును
దరుణులు పదియాఱువేలఁ దగఁ బెండ్లాడన్
దిరిపెమున కిద్దరాండ్రా!
పరమేశా! గంగవిడుము పార్వతిచాలున్

—: శ్రీనాథుని సమకాలికులు :—

బ్ర. శ్రీ. వేటూరి ప్రభాకరశాస్త్రిలుగారు శ్రీనాథుని సమకాలపుకవులలో బమ్మెరపోతనను జేర్చినారు. కాని పోతన శ్రీనాథుని కాలమువాఁడు కాఁడు. శ్రీనాథుని యనంతరముఁ గాని పోతన జన్మింపలేదని నాయభిప్రాయము. ఆవిషయమును గూర్చి పోతన చారిత్రమునఁ జర్చించెదను. చెన్నమరాజకవి శ్రీనాథుని శిష్యుఁడనిరి. కాని యది నిజముకాదు అందునుగూర్చి చెన్నమ రాజకవి చరిత్రమున వ్రాసెదను. దగ్గుబల్లి దుగ్గన శ్రీనాథునకు బావమఱఁదియు శిష్యుఁడునైనమాట సత్యమేకాని యితఁడును శ్రీనాథుని జీవితకాలములోఁ గావ్యరచనము చేసినట్లు దోఁపదు. నంది మల్లయ ఘంటసింగయలుకూడ దుగ్గనకాలమువారు. శ్రీనాథుని కాలములోఁ గావ్యరచనము చేసినవారుకారు.

పిల్లలమఱ్ఱి పినవీరన యీతని సమకాలికుఁ డనియు శ్రీనాథుఁడు తన గ్రంథముల నాతనికిఁ జూపెననియు శ్రీ గురజాడ శ్రీరామమూర్తిపంతులుగారు వ్రాసియున్నారు కాని యది నిజము కాదు. శ్రీనాథుఁడు స్వర్గ మలంకరించునప్పటికిఁ బినవీరన పదేండ్లబాలుఁడై యుండును. ఇతఁడు శ్రీనాథుని శిష్యుఁడని కొందఱందురు. కాని యందును సత్యము లేదు

విశ్వంకర కొమ్మన్న, కొండవీటి [illegible] మొదలగువారు కొండ[illegible] వారిని గూర్చి క్రమముగా వ్రాసెదను

—: శ్రీనాథుని స్వభావము :—

శ్రీనాథుఁడు మిగుల జారుఁడనియు, వేశ్యాలంపటుఁ డనియు [illegible]వ్యయము సేయువాఁడనియుఁ గొందఱుతలంచుచున్నారు. ఇట్లనుకొనుటకు ముఖ్యకారణ మాతనివని చెప్పఁ బడియెడి చాటువులే. ఆతని గ్రంథములను జదివినవారెవరును నాతనిని శృంగారప్రియుఁడు కాఁడని చెప్పలేరు. అట్లని యాతఁడు దుర్నీతిపరుఁడని గాని, విధము చెడి నర్తించినవాఁ డనిగాని చెప్పరాదు. కేవలము శ్రీశుకునివంటి వాఁడు కాకపోవచ్చును. రాజాధిరాజుల మహాసభలలో మహాపండితుల సమక్షమున ననుదినమును విద్యాగోష్ఠితోఁ గాలముగడపినవాఁడు. మహామంత్రోపాసకుఁడు. శివభక్తుఁడు. ఆతని గ్రంథములలో శృంగారరసముతో సమానముగ శాంతరసము పోషింపబడినది. భక్తి, నీతి, బోధింపఁబడినవి ఇతఁడు యౌవనమున స్వేచ్ఛావిహారియై తిరుగుటచే నవసానకాలమున దారిద్ర్యము ననుభవింపవలసివచ్చినదని శ్రీవీరేశలింగము పంతులుగారును వారిననుసరించి భీమేశ్వర పురాణ పీఠికాకారులును వ్రాసియున్నారు. శ్రీప్రభాకరశాస్త్రిలుగారును, శ్రీ చి. వీరభద్రరావుగారును నాయభిప్రాయముతో నేకీభవింపలేదు. సంపాదించిన ధనమును గూడఁబెట్టి యుంచవలెనను

కోర్కె యాతనికిలేదు. కొండవీటిలో నున్నప్పుడు తాను విద్యాధికారి యగుటచేఁ దనకొఱకు వచ్చిన పండితులు, శిష్యులు నాతనియింటనే భుజించెడివారనియు, దేవరాయలుస్వర్ణాభిషేకము చేసినప్పుడా ధనమును బ్రాహ్మణులకుఁ బండితులకుఁ బంచిపెట్టెననియు, నిదియేమని యెవరో యడుగఁగా "స్నానోదకమును పానముచేయుట భావ్యముగా" దని చెప్పెననియుఁ దానింత లేనప్పుడు దినవెచ్చము గడపుటకై మైలారురెడ్డిని గోరెననియుఁ జెప్పుదురు. చరమదశయందుఁగూడ నొక గ్రామమును గుత్తకుఁదీసికొని వ్యవసాయముచేయ నారంభించినాఁడు. కాని వానికి డబ్బులో బిస్సు మొత్తమైన కాశీఖండమందలి:—

సీ. అతిథి కిడు నల్పమైనను గనిష్ఠమైన
నీటికే తేఁ బ్రియమందు నెవ్వఁడేని
వానిగాఁన మది గౌరవంబుగాని
కాదు గాంప మాకారగౌరవంబు,

అని వ్రాసినపద్యమునుబట్టి యాతనిస్వభావము తెలియుచున్నది. ఇతఁడు భోజనప్రియుఁడు అనుదినమును బిండివంటలతోఁ దాను భుజించుచు నితరులకుఁ బెట్టుచుండువాఁడని యతని భీమపురాణ కాశీఖండము లందలి పద్యముల వలన మనకుఁ దెలియును. గ్రంథవిస్తరభీతి నిట నుదాహరింపఁ జాలనైతిని. చరమకాలమునఁగూడ "హేమపాత్రాన్న మెవ్వానిపంక్తి" అని చెప్పినాఁడు.

"దానము భోగము నాశము
పూనికతో మూఁడు గతులు భువి ధనమునకున్
దానము భోగము నెఱుఁగని
ధనమునకుఁ గతి తృతీయమె పొసగున్"?

అనుసూక్తి నెఱిఁగిన మహాపురుషు డగుట ద్రవ్యమును నిలువచేయుతలం పాతనికి లేకపోయినది. కలిమిలేము లెంతటివారి కైనను గలుగును. శ్రీనాథుని లేమికిఁ గూడ నదియే కారణ మనుకొనవల

యును గాని స్వేచ్ఛావిహారి యనుకొనరాదు. శ్రీనాథునివని చెప్పెడి చాటువులను మనసునందుంచుకొనక పోయినచోఁ దమకావ్యము యందలి వర్ణములను బట్టి శృంగారముతో నించిన కవులందఱికంటె నెక్కువ దోషము శ్రీనాథునియందుఁ గాన్పింపదు. కవిహృదయమునకు విశ్రాంతియుండదు. వారు ప్రకృతి సౌందర్య వర్ణనాపేక్షయునుఁ దనివినొందరు. విలాసము కొఱకప్పుడప్పుడు చేసెడి పద్యములను రచించిన, వానినిబట్టి కవి స్వభావమును నిర్ణయించుట న్యాయముకాఁజాలదు. తా నాశ్రయించిన కృతిపతులను వారిసన్నిధానవర్తులను, సంతృప్తిపఱుచుటకై శ్రీనాథుఁడు తన గ్రంథములయందుఁ గొన్నిపద్యములను వ్రాసియుండెను. భీమేశ్వరపురాణమున దక్షారామవేశ్యలను బడపద్యములతో వర్ణించియుండెను. అందుచే శ్రీనాథుఁడు వేశ్యాలంపటుఁడని తలంపరాదు. భీమేశ్వరపురాణ కృతిపతి :

క. దక్షారామవధూటీ
వక్షోరుహమృగమదాది వాంఛితవిలస
ద్వక్షకవాట బాంధవ
రక్షావిధ వజ్రపంజరకృపాజలధీ

యైయున్నాఁడు. అతనిసంతృప్తికొఱకు శ్రీనాథుఁ డాపద్యములను వ్రాసియుండెనని తలంపవలసియున్నది. నిష్కళంక చారిత్రుఁడని ప్రఖ్యాతిఁ గనిన బమ్మెరపోతనామాత్యుఁడు సర్వజ్ఞసింగభూపతికై భోగినిదండకమును వ్రాసెననుచున్నారుకదా! (కర్తృత్వము సంశయాస్పదము ఇందునుగూర్చి పోతనచరిత్రమున వ్రాసెదను.) ఇట్లు తమ ప్రభువుల సంతృప్తికై పద్యములను, గ్రంథములను వ్రాసిన కవులెందఱో గలరు. వారికంటె శ్రీనాథుఁ డెక్కువ దోషికాఁడు.

—: శ్రీనాథుని యవసానదశ :—

శ్రీనాథుఁ డవసానదశయందు మిగుల దారిద్ర్యము ననుభవించెననియుఁ గృష్ణానదీతీరమున బొడ్డుపల్లెయను గ్రామమును గుత్తకుఁ

తీసికొని వ్యవసాయము సాగించఁగాఁ గృష్ణానది వరదలవలన పంటలు నాశనమాయి ప్రభుత్వమునకుఁ జెల్లించవలసిన పైకమునీయలేకపోఁగా సర్వాధికారులతనిని బలువిధములఁ బెట్టిరనియు నిట్టిదారిద్ర్య దశయందే యాతఁడు ఇహలోకమును విడిచిపోయెననియు నెట్టికఠిన హృదయునకైనను గన్నుల నీరు గ్రమ్మునట్లు నీక్రింది పద్యములు నాతఁడట్టిదశలో రచియించెననియుఁ దెలియవచ్చుచున్నది

సీ. కవిరాజకంఠంబు కౌఁగిలించెనుగదా
 పురవీధి నెదురెండ బొగడదండ
ఆంధ్రనైషధకర్త యంఘ్రియుగ్మంబునఁ
 దగిలియుండెనుగదా నిగళయుగము
వీరభద్రారెడ్డి విద్వాంసుముంజేత
 వియ్యమందెనుగదా వెదురుగొడియ
సార్వభౌముని భుజాస్తంభ మెక్కెనుగదా
 నగరివాకిటనుండు నల్లగుండు

గీ. కృష్ణవేణమ్మ గొనిపోయె నింతఫలము
బిలబిలాక్షులు తినిపోయెఁ దిలలు పెసలు
బొడ్డుపల్లెను గొడ్డేటి మోసపాటి
నెట్లు చెల్లింతు టంకంబు లేడునూర్లు.

సీ. కాశికావిశ్వేశుఁ గలిసె వీరారెడ్డి
 రత్నాంబరంబు లేరాయఁడిచ్చు
రంభఁగూడెఁ దెనుఁగు రాయరాహుత్తుండు
 కస్తూరికేరాజుఁ బ్రస్తుతింతు
స్వర్గస్థుఁడయ్యె విప్పనమంత్రి మఱి హేమ
 పాత్రాన్న మెవ్వనిపంక్తిఁగలదు
కైలాసగిరిఁబండె (పంట) మైలారువిభుఁడేఁగి (మండె)
 దినవెచ్చ మేరాజుతీర్పఁగలఁడు

గీ. భాస్కరుఁడు మున్నె దేవుని వాలికిఁ జేరఁ
గలియుగంబున నికనుండఁ గష్టమనుచు
దివిజకవివరు గుండియల్ దిగ్గురనఁగ
నరుగుచున్నాఁడు శ్రీనాథుఁడమరపురికి.

ఈపద్యమును బట్టి పన్నులను చెల్లింపలేక పోయినవారి నానాలముగఁ బహువిధములైన బాధలు పెట్టెడువారో తెలియుచున్నది. శ్రీనాథుని యవసానకాలము క్రీ. శ. ౧౪౪౫ ప్రాంతము. అప్పటికిఁ గృష్ణానదీతీరముననున్న బొడ్డుపల్లె యేరాజున్యాక్రమణమునందున్నది? శ్రీనాథునంతటివానిని అట్టిబాధలను పెట్టిన యా ప్రభువెవ్వఁడు? తెలిసికొన వలయునను కోర్కె పాఠకులకుఁ గలుగక పోదు. [illegible] రెడ్డి మొదలగువారిని జయించి ఒడ్డెరాజులు ఆ ప్రాంతమును ఆక్రమించినారనియు, వారే శ్రీనాథుని బాధలను పెట్టినవారనియు నాంధ్రులచరిత్రమునం దున్నది. ఆకాలమున నీప్రాంతమును బరిపాలించిన యొడ్డెరాజులలో మొదటివాఁడు, కపిలేంద్రగజపతి. అతఁడీదేశము నాక్రమించినకాలము క్రీ. శ. ౧౪౫౦ ప్రాంతము. అప్పటికి శ్రీనాథుఁడు లేఁడు. బహామనీ రాజుల సాహాయ్యమునుగొని యన్నదేవచోడుఁడు రెడ్డిరాజులను జయించిన పిమ్మట నాతఁ డెంతయో కాలము రాజ్యము సేయలేదు. ఆతనికిఁ బిమ్మట కపిలేంద్రగజపతివచ్చి జయించువఱకును, కృష్ణానదీతీరభూమి, బహామనీరాజుల పాలనమునందుండినట్లు కన్పట్టుచున్నది. ఆకాలమున శ్రీనాథున కీయవస్థపట్టి యుండునని తలంపవచ్చును. కపిలేంద్రగజపతి శత్రుకంటకుఁడైనను, బ్రాహ్మణుల కనేకాగ్రహారముల నొసంగినవాఁడు. శ్రీనాథునివంటి పండితకవి కట్టిబాధలు కలుగఁజేయఁడని తలంపఁదగును. అయినను నాకాలమున బొడ్డుపల్లె యున్న దేశ మెవ్వరిపాలమున నుండెనను విషయమున నింకను బరిశోధనము జరుగవలసియున్నది.

గోదావరి, కృష్ణా, నెల్లూరుమండలములలో బొడ్డుపల్లెయను గ్రామము లేదు. గుంటూరుమండలమున ఒంగోలు తాలూకాలో

"బొడ్డువానిపాలెము" అను గ్రామమున్నది. కాని యది కృష్ణానదీతీరముకాదు. కర్నూలుమండలములోఁ గర్నూలు తాలూకాయందు "బొడ్డువానిపల్లె" యను గ్రామమున్నది. అందు "వాని" తీసివేసినచో నది శ్రీనాథుఁడు చెప్పిన బొడ్డుపల్లెయే యగును. కృష్ణానది దానికి సమీపముననే యున్నది. ఆది శ్రీనాథుని కాలమున బహమనీ రాజుల క్రింద నుండెనని చెప్పుటకుఁ బెక్కాధారములున్నవి. ఆ కాలమున రెండవ అల్లాయుద్దీన్ కాని, లేదా అతనితండ్రి గాని యా ప్రాంతమును బరిపాలించుచుండెను. ఆ గ్రామము శ్రీశైలమునకుఁ బశ్చిమమున దాదాపుగ నలువదిమైళ్ళ దూరములో నున్నది. శ్రీనాథుఁడు శ్రీశైలయాత్ర కేఁగి శివరాత్రి మహాత్మ్యమును రచియించునప్పుడీ గ్రామమును గుత్తకుఁ దీసికొని వ్యవసాయము చేసెనేమోయని తోఁచుచున్నది. ఇతఁడంతదూరముపోయి వ్యవసాయము చేసెనా? యని సంశయమును గల్గుచున్నవి. కాని శ్రీనాథుని స్వభావమునుబట్టి యాతఁడంతటిపనిని జేసియుండెనని తలంపవచ్చును. ఆ కాలమునాఁ డేఱువందలటంకములు పన్ను చెల్లెడు గ్రామము పెద్దదై యుండుననుటకు సందేహములేదు. ఆ గ్రామము కృష్ణానదికి నలువదిమైళ్ళదూరములో నున్నదనియు నదిదాపుననాలుగువేల యకరముల పరిమాణముగల "బేచిరాకు" గ్రామముగా నుండెననియు కర్నూలుతాలూకాతహశ్శీలుదారుగారు వ్రాసియున్నారు. ఆ కాలమున నేటిగట్టులు మొదలగు సదుపాయములు లేకపోవుటచే వఱదలంతదూరమువఱకుఁ బ్రవహించుచున్నవని తలంపవచ్చును.

ఆ కాలమున గ్రామములు గుత్తకిచ్చెడి యాచారముకలదు. పల్నాటిచరిత్రములో బ్రహ్మనాయఁడు మల్లదేవుఁడు మొదలగువారు శ్రీశైలమునకేఁగి యాసీమను బాలించుచుండిన భిక్షావలివారిదగ్గఱఁ గొన్నిగ్రామములు గుత్తకుఁ దీసికొనిరని వ్రాసియున్నది. కొండవీడు నివాసముగాఁ గలిగియున్నను నిటు రాజమహేంద్రవరమునకును, నటు

రాచకొండకును, నటు శ్రీశైలమునకును సంచారము చేసిన శ్రీనాథున కాపై నెనిమిది యోజనములు వ్యవసాయము చేయుట కేఁగెనన్నచో నాశ్చర్యపడనక్కఱలేదు. ''కిం దూరం వ్యవసాయినాం'' అను సూక్తి యాతనిపట్ల నన్వయించినది. ఎంతటివిద్వాంసునకును దైన్యములోను బడినచో శోభింపదుకదా!

ఇతని కొండవీటిరాజ్యమున మహామాత్యుఁడైనవానివలెఁ దెలిసి కొనవచ్చియున్నది. వీరారెడ్డి కాశీఖండకృతిపతియగు వీరభద్రా రెడ్డియనుటకు సందియములేదు. బాస్కరుఁడు కాటయవేమునియొద్ద మంత్రిగానున్న రాయని భాస్కరుఁడని నిశ్చయింపవచ్చును. అతని చేత శ్రీనాథుఁడు బహుమతుల నంది యుండును. విప్రనమంత్రి యెవ్వరో తెలియదు. ముప్పదియిద్దఱు మంత్రులలో నితఁడొకఁడు.

మైలారరెడ్డి ముమ్మడిరెడ్డి యొక్క కుమారుఁడు. ఇతనితల్లి ముంగాంబ; తాత పోతారెడ్డి; సూరారెడ్డియు తాత; ఇతఁడును తండ్రి యును వహించిరాను పలువుత్రైనట్లు శా. శ ౧౩౪౮ సంవత్సరపు శాసనమువలనఁ దెలియుచున్నది. (నె. శా. సం పుట ౧౦౬౫) ఇది నెల్లూరు మండలమునఁ గందుకూరు తాలూకాలోనున్నది. ఇతఁడు పెదకోమటి వేమారెడ్డికి సామంతుఁడుగానుండి యాతనియనంతర మునఁ గొండవీటిరెడ్డి రాజ్యమును స్వాధీనము చేసికొనుటలోఁ బ్రౌఢ దేవరాయలకు సాహాయ్యము చేసియుండును. ఈతనికోర్కెపైని గుండ్ల కమ్మ నదీతీరమందున్న పోలవరము తిక్కెళ్ళవాడు అను గ్రామము లను శా. శ ౧౩౭౦ కీలక సంవత్సరమున మహాశివరాత్రినాఁడు దేవరాయలు బ్రాహ్మణులకు దానముచేసి శాసనము వ్రాయించెను. (నె. శా. సం. ౧౮౯ పుట) ఆశాసనము నందీ మైలారరెడ్డి దేవరా యలకు యుద్ధములలోఁ జేసినసాహాయ్యము వర్ణితమైనది. ఈమైలార రెడ్డి యీదేవరాయలచేతఁ జెదలువాడ శ్రీరఘురామునకొక గ్రామము నిప్పించెను.

ములోని పూర్వుఁడగు "సాళ్వమంగు" అను పరాక్రమవంతుఁడు మజిల సంపాదించి యాతనికిచ్చి సాంపరాయ ప్రతిష్ఠాపనాచార్య బిరుదమునుపహించెనని పిల్లలమఱ్ఱి పినవీరన్న యీక్రిందిపద్యములోఁ జెప్పియున్నాఁడు.

సీ. దుర్గములో దక్షిణసురతాణు వెదిరించి
కొనివచ్చి సాంపరాయనికి నిచ్చి
సామ్రాజ్యమున నిల్పి సాంపరాయస్థాప
నాచార్యబిరుద విఖ్యాతిఁ గాంచె

* * *

సాహసంబున నుప్పొంగు సాళ్వమంగు.

సాంపరాయ నామధారులగు నిరువురు నొకవ్యక్తియేయని శ్రీ వీరేశలింగము పంతులుగా రాంధ్రకవుల చరిత్రమున వ్రాసియున్నారు. శ్రీ రామయ్యపంతులుగారును, శ్రీ లక్ష్మణరావు పంతులు గారునుగూడ నట్లే యభిప్రాయపడిరి. కాని యది వాస్తవము కాదు. వీరిరువురును భిన్నులు. సాళువమంగుచే రాజ్యమునుబడసిన సాంపరాయలు ఉత్తరార్కాడు మండలములోని కాంచీపుర ప్రాంత రాజ్య పరిపాలకుఁడు. శంబువరాయ సంతతిలోనివాఁడు. ఆవంశమువారి కందఱకు శంబువరాయలని వారినామాంతమునఁ జేర్చుచుందురు. తిక్కనసోమయాజి నిర్వచనోత్తర రామాయణమునఁ జోడతిక్కరాజును వర్ణించుపట్టున

"శంభురాజాది ప్రశస్తారి మండలి
కముఁ జెర్చి యేలఁడె కంచిపురము."

అనిచెప్పిన శంభురాజీవంశములోనివాఁడే. సాళ్వమంగరాజు ననుగ్రహమును సంపాదించిన సాంపరాయలుకూడ నీవంశములోనివాఁడే. (శంబు, సాంపశబ్దము లేకార్థబోధకములు.) ఇతఁడు క్రీ. శ. ౧౩౫౦ ప్రాంతమువాఁడు. ఇతనికిఁ దెలుఁగురాయఁడను కుమారుఁడు లేఁడు.

సింహాచలమునందు తెలుఁగురాయని శాసనమొకటి యున్నది. "స్వస్తిశ్రీ శకవర్షంబులు ౧౩౪౦ అగునేఁటి ప్లవ సంవత్సర ఫాల్గుణ కృష్ణ ౩ గురువారానను కన్నడదేశమండముల సంబురాయని కొడుకు తెలుంగురాయండు తనకు అభీష్టార్థసిద్ధిగాను శ్రీరంగనాథునికి నిత్యము సన్నిధిని వెలుంగను అఖండదీపాలు రెండుసమర్పించెను"

శ్రీపంతులుగారీశాసనము నుదాహరించుచు నితఁడు కాంచీపురపు శంబువరాయలకొడుకనిరి. కాని యది పొరపాటు. ఇతని శాసనము క్రీ. శ ౧౪౧౮ నాఁటిది తండ్రికొడుకుల నడుమ నెనుబది సంవత్సరముల వ్యవధియుండుట అసంభవము. కాంచీపురము కన్నడ దేశములోనిది కాదు. అచ్చటిభాష యరవము. కావున నాశంబువ రాయలితఁడు కాఁడు.

శ్రీనాథునకుఁ గస్తూరినిచ్చిన తెలుఁగురాయలు, నెల్లూరు మండలములోని పొదిలితాలూకాను, దానిని జేరియున్న కర్నూలు మండలములోని ప్రదేశమును బరిపాలించిన యొకసంస్థానాధిపతి. ఇతని పరిపాలనలోని దేశమునందు కర్ణాటకమును నాంధ్రమునుగూడ నుండెను. అందుచేతనే సింహాచల శాసనమునఁ గన్నడదేశమను టయు శ్రీనాథుని చాటువులోఁ "కర్ణాటాంధ్రాధిప!" యని సంబోధించుటయు వచ్చినవి.

పొదిలితాలూకా కూచిపూఁడిలో శంబువరాయల శాసన మొకటి యున్నది "స్వస్తిశ్రీ శకవర్షంబులు ౧౩౪౮ అగు నేఁటి పరాభవ సంవత్సర చైత్ర శు ౧ ఆ. స్వస్తిశ్రీ మన్మహామండలేశ్వర మేదినీమీసరగండ కఠారి సాళువశంబురాయ దేవమహారాజు తమ తండ్రి రాయవిభాళ దేవమహారాజుకుం బుణ్యముగాను ఆంధ్రరామ లింగ దేవరలకు గట్టించెను" (నె. శా. సం. పుట ౧౧౮౪)

పొదిలితాలూకా తిప్పలదేవిపల్లి గ్రామములోఁ దెలుఁగురా యని రెండవసోదరుఁడైన పెదరాయవిభాళుని కుమార్తె తిప్పలిదేవి

చెఱువును ద్రవ్వించి శా. శ. ౧౩౬౦ వ సంవత్సరములో వ్రాయిం చిన శాసనమొకటికలదు. (నె. శా. సం. పుట ౧౨౮౫)

బాపట్లతాలూకా సంతరావూరునందు శా. శ. ౧౩౫౦ లో తెలుఁగురాయని శాసనమింకొకటియున్నది. శ్రీనాథునకుఁ బ్రసక్తి నొసంగినది పైనఁజెప్పిన తెలుఁగురాయఁడేగాని యన్యుఁడుకాఁడు. ఈతనితండ్రి కూచిపూఁడి శాసనకర్తయగు శింబువరాయఁడే కాని, కాంచీపురపు శంబువరాయలు కాఁడు.

పోతులపాడు గ్రామమునఁ దెలుఁగురాయల శాసనమింకొకటి యున్నది. అది శా. శ. ౧౩౬౫వ సంవత్సరమునాఁటిది. అతఁడా సంవత్సరమునందో మఱుచటిసంవత్సరమునందో చనిపోయెనని, యాతనికి సుకృతముకొఱకని చెన్నయ్యయను నాతఁడు శా. శ. ౧౩౬౬ రక్తాక్షి సంవత్సర పుష్య బ ౭ ఆదివారమునాఁడు వ్రాయించిన సంతరావూరు శాసనమువలనఁ (A R. 473 of 1915) తెలియుచున్నది. దీనినిబట్టి శ్రీనాథుఁడు క్రీ. శ. ౧౪౪౪ వఱకు జీవించి యుండునని స్పష్టమగుచున్నది. పోతులపాడునందే శంబువరాయల మనుమఁడును తెలుఁగురాయల కుమారుఁడునగు తిరుమలరాయల శాసనములు మూఁడు గన్పట్టుచున్నవి. (A. R. 754, 756, 759 of 1922). అవి శా. శ. ౧౪౬౪ సంవత్సరమునాఁటివి. ఆతిరుమలరాయలతండ్రి యీతెలుఁగురాయలు కాఁడు. తండ్రికొడుకులనడుమ ౧౦౦ సంవత్సరముల యంతరముండదు. ఇతఁడాతనికిఁ బ్రపౌత్రుఁడై యుండును. శ్రీనాథుఁ డెచట చనిపోయెనో తెలియదు పైరెండుపద్యములు నేక కాలమున రచించెనని చెప్పలేము. బొడ్డుపల్లె కీయవలసిన పన్ను చెల్లించెనో లేక యాఋణమును దీర్పకుండఁగనే స్వర్గమున కేఁగెనో తెలియదు.

శ్రీనాథుఁ డంతటిహైన్యస్థితిలోనున్నను, నాతనిహృదయమున దైన్యమావరింపలేదు. ఆతఁడు దైన్యమనునది యెఱుఁగనే యెఱు

నిజము. చనిపోవునప్పుడుకూడ "దివిజకవివరుగుండియల్ దిగ్గురనఁగ నరుగుచున్నాఁడు శ్రీనాథుఁడమరపురికి" అని చెప్పి, తనహృదయ గాంభీర్యమును విడలేదు.

ఈమహాకవి క్రీ. శ. ౧౪౪౫ ప్రాంతమున స్వర్గము నలంకరించెనని నాయభిప్రాయము. శ్రీప్రభాకర శాస్త్రిలుగారు శ్రీనాథుఁడు ౧౪౬౫ వఱకు నుండెనని వ్రాసిరి. కాని యందులకాధారములు నాకులభింపలేదు. ఆమహాకవి యప్పటివఱకు జీవించియుండినచో నాతనినాటి యంతికాల మూరక యుండదు. అట్టినిదర్శనము లేనియు లేవు. శ్రీనాథునిజననము ౧౩౭౦-౭౫ ప్రాంతమని కొందఱును ౧౩౬౦ ప్రాంతమనికొందఱు నను చున్నారు. ఆతఁడు ౧౪౬౫ వఱకు జీవించియున్నచో, మొదటివాని ననుసరించి ౧౦౦ ఏండ్లును రెండవవాని ననుసరించి ౯౦ సంవత్సరములును శ్రీనాథుఁడు జీవించి నట్లు తేలుచున్నది. ఇది రెండును గూడ నసంభవములే. ఇమ్మహాకవి ౭౦-౭౫ సంవత్సరములు జీవించి, కీర్తికాయుఁ డయ్యెనని నాయుద్దేశము.

పైపద్యమునందలి "బొగడదండ" ను గూర్చి పలువురు పలు విధములుగా నర్థముచెప్పియున్నారు. తుదకు "ముండ్లవలె గ్రుచ్చు కొనుచు, నినుముతో పుష్పములవలెఁ జేయబడిన గొలుసువంటి" దని నిర్ధారణము చేసియున్నారు. కారాగారమునందున్న ఖయిదీలు తమపైయధికారుల యాజ్ఞల నుల్లంఘించినచో, మెడలో బరువుగల యినుపగొలుసులను వేయుపద్ధతి యీకాలమునఁ గూడఁ గలదుగదా! ఇంతకంటె నెక్కువ బాధాకరముగా నుండు శిక్షాయుధమని బొగడ దండ కర్థము. ఎండలో నిలువఁబెట్టి పాదములకు, చేతులకు సంకెలలు వేసి భుజముపై నినుపగుండు పెట్టి మెడలో నీ బొగడదండను వైచి శ్రీనాథుని బాధపెట్టిరఁట! ఎంతవిచారకరమైనవిషయము! మొదటి పంట వరదచేపోయినది. రెండవపంటకు, నువ్వులు, పెసలుచల్లించి

నాఁడు కొంచోలును వాసము శ్రీనాథుండు! వానిని బిలబిలాక్షులు తినిపోయిరంట! బిలబిలాక్షులనఁగా నేవియో తెలియలేదు. ఆకాలమున గ్రామాంతములయందుకదా వ్యవసాయముండుట. వన్యమృగములు వచ్చి తినివేసెనేమో! లేదా ఆమొలకలు పుట్టుచుండఁగనే మిడుతలు మొదలయినవి కొట్టివేయుచుండును కావున బిలబిలాక్షులనఁగా మిడుతజాతిలో చేరినవో అయియుండును

—: శ్రీనాథుని కుటుంబము :—

శ్రీనాథునకుఁ బుత్రసంతతి యున్నట్లు కన్పట్టదు. కుమార్తెయు దౌహిత్రులు కలరని, శ్రీప్రభాకరశాస్త్రిలుగారు శృంగార శ్రీనాథము న వ్రాసినదానినిబట్టి తెలియుచున్నది.

"శ్రీవంగూరి సుబ్బారావుపంతులుగారు శ్రీరామాభిషేక మను గ్రంథ మొకటి తమదగ్గఱఁ గలదని దానినుండి కొన్ని పద్యములను నాకొసఁగినారు ఆశ్రీరామాభిషేక గ్రంథకర్త యిప్పటికి నూఱేండ్ల క్రిందటివాఁ డగునేమో! ఆపద్యములు మిక్కిలి దుష్టములుగా నున్నను శ్రీనాథకవీశ్వరుని కుటుంబవిషయమును నెఱిఁగించుచున్నవి. ఆపద్యముల సారమిది:—కొండవీడు వాస్తవ్యుఁ డగునాత్రేయగోత్రజున కొకనికి శ్రీనాథుండు కూఁతు నొసఁగెను. వారికిఁ బుత్రసంతతి కలదు. శ్రీనాథుఁ డాదౌహిత్రుల నింట నుంచుకొని పెంచెను. ఆకారణమునఁ దత్సంతతికి శ్రీనాథుని వారని యింటిపేరువచ్చెను. వారి వంశపరంపరలు మిక్కిలి పెంపొందెను. ఆపరంపరలలో మాధవమంత్రి యనువాఁడు ప్రఖ్యాతుఁడయ్యెను. అతనికయిదవ తరమువాఁడు శ్రీరామాభిషేక గ్రంథకర్త. ఆపద్యము లివి.

ఉ. ఆమునినాథు వంశకలశాంబుధిపూర్ణసుధాకరుల్ గుణ
స్తోములు సత్యసంధు లతిశోభితచిత్తు లుదారులున్ మహో
ద్దాములు పుట్టిరందు నొకధన్యుని వంశములోన నొక్కఁడున్
బ్రేమతోఁ గొండవీట నరిభీమఁడునై తనరారుచుండియున్.

శా. వాగ్రాశిగరీయుఁ డుజ్జ్వలకళాపారీణుఁ డైనట్టి శ్రీ
నాథుం డన్నకవిక్ష్వేళోత్తమసుతన్ సందంబుగాఁ బెంపెయై
నాథుస్తోత్రగుణైక సూనులను భాస్వత్తేజులం గాంచె భూ
నాథుల్ మెచ్చఁ బ్రసంచశాలులను సన్మార్గైకమూలోలుతన్.

క. నాలుమూర్తామహుఁ డతి
హరిమహితో విజ్ఞ నించుకొని కొంచుబచే
రామాక్షిగ శ్రీనాథుని
నామైన త్రైని గోసి విబుధాగ్రణులన్.

క. నాకలవంశైకసంపద
లారూఢిగ విస్తరించె నతివిభవమునన్
నాశిలో మాధవమంత్రియు
ధారుణిలోఁ బాగుగ గనియెఁ ధన్యాత మెఱయన్ ''

రామాభిషేకము నాకు లభింపకపోవుటచే నీవిషయమున నిఁక నేమియు వ్రాయఁజాలను.

శ్రీనాథకవి చారిత్రమున వ్రాయవలసిన విషయము లింక ననేకములున్నవి. అయిన నిది యిదివఱకే యతివిస్తరమైనందున నింతతో నీతనిచరిత్రమును ముగించుచున్నాఁడను.

—: అనపర్తి శాసనము :—

శ్రీనాథునిచారిత్రమును బూర్తిచేసినపిమ్మట నేను రెడ్డిసంచికలోఁ బ్రకటితమైన "అనపర్తి" శాసనమును జూచుట తటస్థించినది. అందు రెండు మూఁడు ముఖ్యాంశములున్నందున వానినీక్రిందఁబొందు పఱుచుచున్నాఁడను. ఈగ్రామము గోదావరిమండలమున రామచంద్రపురము తాలూకాలోనున్నది. దానకాలము శా. శ. ౧౩౧౨ వైశాఖ శుక్లసప్తమి (క్రీ శ. ౧౩౯౦) ఈశాసనమువలనఁదెలియు విషయములు.

౧. అనపోతారెడ్డికుమారుఁడైన కుమారగిరిరెడ్డికి నీ అనపోతారెడ్డి అను కుమారుఁడు కలఁడు. అతనిని తన తొడలమీఁదఁ గూర్చుండఁ బెట్టుకొని కుమారగిరి ద్రాక్షారామమునందు తులాపురుషదానము గావించెను.

౨. కుమారగిరిరెడ్డి, తనకుమారునకుఁ గొంత రాజ్యమును సంపాదింప వలయునను నుద్దేశముతోఁ దనబావమఱఁదియు, సమర్థుఁడు నగు కాటయవేమునకుఁ బూర్వదిశనున్న రాజులను, సింహాచలమున కావలనున్న రాజులను జయించి, యా రాజ్యములను తనరాజ్యములోఁ గలిపివేయవలయునని యాజ్ఞాపింప నాతఁడు ప్రచండసైన్యముతో రాజమహేంద్రవరమునకువచ్చి అచ్చట శౌక బ్రహ్మచే స్థాపితుఁడైన గోపాలస్వామిని దర్శించి, తనజైత్రయాత్రయందు జయము నొసంగుమని ప్రార్థించి, తూర్పుదిశనున్న రాజులను. ఉత్తరమున వింధ్యాద్రి దక్షిణమున సింహాద్రిమధ్యనున్న దేశములను జయించెను. కటకము రాజధానిగాఁగల గజపతి (నాల్గవ వీరనరసింహదేవుఁడు) యొద్దకప్పమును గైకొని. మదపుటేనుగులను, గుఱ్ఱములను, నమూల్యరత్నాభరణాదులను గ్రహించి, తెచ్చి కుమారగిరిరెడ్డికి సమర్పించెను. కుమారగిరి చాలసంతసించి తనబావమఱఁదిని మిగుల గౌరవించి క్రొత్తగా సంపాదించినరాజ్యమునకుఁ దనకుమారుఁడైన వీరాన్నపోతారెడ్డిని రాజప్రతినిధిగ నియమించి యతనికిఁ దోడుగఁ గాటయవేముని రాజమహేంద్రవరమున నుండున ట్లేర్పాటు గావించెను.

3 రాజమహేంద్రవరము వంచలిగోపాలస్వామి యనుగ్రహమునఁ దనకీవిజయము సంప్రాప్తమైనదని తలంచి తనయేలికయగు వీరాన్నపోతారెడ్డితోఁ జెప్పి యాస్వామికి అనపర్తియను గ్రామమునిప్పించి కాటయవేముఁ డీశాసనమును వ్రాయించెను. శాసనకావ్యకర్త మనుమదుర్గమనుమఁడును. చిన్నయార్యుని కొడుకు నగు అన్నయ

కవి ఈశాసనకర్త వీరాన్నపోతారెడ్డియే యైనను నిందుఁ గొమర గిరియే వ్రాలు చేసియుండెను.

ఈశాసనమువలన క్రీ. శ. ౧౩౯౦ నాఁటికి కొమరగిరిరెడ్డి కొడుకు అనపోతారెడ్డి జీవించియున్నట్లు తెలియుచున్నది అతని జీవితకాలములో నాతనికి సాహాయ్యముగఁ గాటయవేమారెడ్డి రాజమహేంద్రవరమున నుండెను కుమారాన్నపోతారెడ్డి ౧౩౯౦-౧౪౦౩ నడుమఁ జనిపోయి యుండును. అతనియనంతరమునఁ గాటయ వేమునకు రాజమహేంద్రవర రాజ్యమును కుమారగిరిరెడ్డి యిచ్చియుండును. కుమారగిరిరెడ్డి తనసోదరికి రాజ్యము నరణముగా నిచ్చియుండ లేదని స్పష్టమగుచున్నది. అనితల్లి కలువచేఱు శాసనవిషయముల నీయనప్రశస్తి శాసనము బలపఱుచుచున్నది క్రీ. శ. ౧౩౯౦కి, ఇంచుకపూర్వమే కాటయవేముఁడు కళింగాదిరాజ్యములను జయించెననుటకూడ నిశ్చయము రాజమహేంద్రవరమును దత్ప్రాంతప్రదేశములును నదివఱకే, కొమరగిరిరెడ్డి పరిపాలనములో నున్నవని యంగీకరించినను, అంతకుపూర్వ మా ప్రదేశమును గాటయ వేమున కిచ్చియున్నట్లు తెలంపరాదు. అట్లిచ్చియున్నచో వీరాన్న పోతారెడ్డిని రాజమహేంద్రవరమున రాజప్రతినిధిగ నియమించుట జరిగి యుండదు. వీరాన్నపోతారెడ్డి స్వాభావికముగఁ గాలధర్మము నొందెనో యే యుద్ధములోనైన నిహతుఁ డయ్యెనో తెలియదు. అతనికిఁ బరిణయమయ్యెనో లేదో తెలియదు. కుమారగిరిసోదరీనామ మనప్రశస్తి శాసనమువలనఁ గూడఁ దెలియలేదు.

—: అలభ్యములైన శ్రీనాథునికృతులు :—

శ్రీనాథునికృతులలో నిప్పుడు మనకు దొరకుచున్నవానినిం గూర్చి పైనవ్రాసియుంటిని. ఇఁక లభ్యముకాని కృతులాఱుకలవు. ౧ మరుత్తరాట్చరిత్ర. ౨ పండితారాధ్యచరిత్రము. ౩ శాలివాహన సప్తశతి. ౪ నందనందనచరిత్రము ౫ మానసోల్లాసము ౬ ధనంజన

విజయము. ఇందుఁ బండితారాధ్యచరిత్రమును మామిడిపెద్దయ్యకును, ధనంజయవిజయమును గన్నభూపాలునకును గృతియిచ్చినట్లు గ్రంథస్థనిదర్శనము లుండుటచే వానినిగూర్చి నేను వ్రాసియుంటిని. మరుత్తరాట్చరిత్రమును శాలివాహనసప్తశతిని దాను రచియించితి నని శ్రీనాథుఁడు చెప్పియున్నాఁడు. కాని వాని కృతిపతులెవ్వరో చెప్పలేము. వీనినిగూడ మామిడి పెద్దయ్యకే కృతి యిచ్చెనేమో చెప్పలేము.

మరుత్తుఁడను రాజుచరిత్ర భారతాశ్వమేధపర్వమునను, మార్కండేయ పురాణమునను గలదు. ఐతరేయ బ్రాహ్మణమునను గలదఁట! ఈ రాజనేక యజ్ఞములను గావించుచుండ నందులకు సహింపలేక దేవేంద్రుఁ డాతని జన్నమునకు విఘ్నమొనర్ప యత్నించుచు బృహస్పతిని మరుత్తునియజ్ఞమునం దుపద్రష్టగా నుండవలదని యాజ్ఞాపించెను. ఇంద్రునకును బృహస్పతికిని భయపడి మఱియెవ్వరును మరుత్తుని యజ్ఞమును జేయించుట కంగీకరింపరైరి. నారదుఁ డా రాజు కడకువచ్చి "బృహస్పతిచే నవమానితుఁడై యాతనిసోదరుఁడు సంవర్తుఁడను వాఁడు తపము గావించుచున్నాఁడనియు, నాతఁ డున్మత్తుని వలెఁ దిరుగుచుండుననియు నాతనిని బ్రతిమాలి యంగీకరింపఁ జేసినచో నాతఁడు జయప్రదముగ నీయధ్వరమును గొనసాగించుననియుఁ" జెప్పెను. మరుత్తుఁ డట్లే యొనర్చి సంవర్తునిచే యజ్ఞమును గొనసాగించెను. ఇది మరుత్తుఁడను రాజుకథయందలి ప్రధానాంశము. శ్రీనాథుఁ డీకథనే విస్తరించి యీగ్రంథమును రచించియుండును. శ్రీనాథుని బాల్యరచనములు లభింపకపోవుట ఆంధ్రలోకమునకు విచారకరమైన విషయము.

శాలివాహనసప్తశతి యను గ్రంథమును నూత్నయౌవనమున రచియించితినని శ్రీనాథుఁడు చెప్పియున్నాఁడు. సాతవాహనుఁ డను నాంధ్రరాజు ఏడువందల యార్యావృత్తములు గలయొక శృంగార గ్రంథమును బ్రాకృతభాషలో రచియించెను. సాతవాహనునకు

హాలుఁడని శాలివాహనుఁడని నామాంతరము లున్నవని యందురు. సాతవాహన శాలివాహనులు భిన్నులని కొందఱిమతము. పద్యములో "శాలి" అనియే యున్నది కానిదానిని "సాత" అనిదిద్దిన దిద్దవచ్చును. ఈవిషయమైన చర్చ యిట నప్రస్తుతము. ఇది యొక కథతోఁ గూడిన కావ్యము కాదు. నాయికానాయకుల హావభావలీలావిలాసాదులు శ్లోకమున కొకవిధముగా నిందు వర్ణితములైనవి ఏశ్లోకమున కాశ్లోకమే యొకకథ యనుకొనవచ్చును. ఇం దనుస్యూతమైన యొకకథ లేదు. ఈ గ్రంథ మిప్పుడెచ్చటను కనుపట్టుటలేదు. లక్షణగ్రంథములం దుదా హృతమైన యీ కింది పద్య మొక్కటియే యిప్పుడు లభించుచున్నది.

ఉ. వారణ సేయఁ జాలగ నవా! నవవారిజ ముంచుఁ దేటి క్రొ
వ్వారుచు నుంట నీవెఱుఁగవా! ప్రియ! హా! తెఱగంటి కంటికె
వ్వారికిఁ గెంపు రాదె! తగవా మగవారల దూఱ! నివ్విధం
బారసి నిజం బెఱుఁగువంతకు నంతకు నోర్వు! నెచ్చెలీ!

ప్రాకృతసప్తశతియందలి ప్రశస్తములైన నూఱుశ్లోకములకుఁ బెదకోమటి వేమారెడ్డి వ్యాఖ్యరచియించెనఁట !

శ్రీనాథుఁడు నందనందన చరిత్రము, మానసోల్లాసము అను గ్రంథములను రచియించెనని వాడుక కలదు. కాని గ్రంథస్థ నిదర్శనములు నాకులభింపలేదు. నందనందనచరిత్రమున శ్రీకృష్ణునికథలు వర్ణితములై యుండుననుమాట స్పష్టము. శైవుఁ డగునీతఁడు కృష్ణ కథను రచించియుండునా ? యని కొందఱు ప్రశ్నించుచున్నారు. పల్నాటి వీరచరిత్రమును చెన్నకేశవునికిఁ గృతియిచ్చిన ట్లంగీకరించితి మేని, నందనందనచరిత్రమును రచియించెననియు నంగీకరింపవచ్చును. వైష్ణవమతాభిమాని యైన మైలారరెడ్డిచే దినవెచ్చమును గైకొనిన శ్రీనాథుఁడు నందనందనచరిత్రమును రచించినాఁడనుటలోఁ దప్పులేదు. ఇంతవఱకు నాగ్రంథము లభింపనప్పుడు విశేషచర్చతోఁ బనిలేదు.

మానసోల్లాసము నితఁడు రచించెనో లేదో అందలి విషయమేమి యో తెలియదు. భూలోకమల్ల బిరుదాంకితుఁడగు సోమేశ్వరుఁడను పశ్చిమచాళుక్య చక్రవర్తి అభిలషితార్థచింతామణి యను నామాంతరముగల మానసోల్లాసమను సంస్కృత గ్రంథమును రచియించెనందురు. శ్రీనాథుఁడు దీని నంగీకరించెనేమో!

—:0:—

## 64. వినుకొండ వల్లభరాయలు

ఇతఁడు నియోగి బ్రాహ్మణుఁడు; అశ్వలాయన సూత్రుఁడు; కామకాయన విశ్వామిత్రగోత్రుఁడు; తిప్పయామాత్యచందమాంబలకుఁ బుత్రుఁడు. ఇతనితండ్రి ఋగ్వేదమును సాంతముగాఁ జదివిన వేదవిదుఁడు. భైరవ మంత్రోపాసకుఁడు.

ఈకవి దాదాపు మూఁడువందలగద్యపద్యములుగల క్రీడాభిరామము ను వీథినాటకమును రచియించెను. ఇందుఁ దనను గూర్చి కవియిట్లు చెప్పుకొనియున్నాఁడు.

సీ. మూఁడు గ్రామగ్రాసములతోడఁ గూడంగ
మోపూరు పాలించె ముల్కినాఁట
నాశ్వలాయనశాఖయందు ఋగ్వేదంబు
కరతలామలకంబుగాఁ బఠించె
బ్రత్యక్ష మొనరించి భైరవస్వామిచే
సిద్ధసారస్వతశ్రీ వరించె
కామకాయనస విశ్వామిత్రగోత్రంబు
వంశగోత్రంబుగా వార్తకెక్కె

స్తంభగజంబు తిప్పన యఖండితకీర్తినిధి గాంచెఁ బుత్రులన్
శాంభవకల్పవృక్షముల నైచన వల్లభ తిప్ప మంత్రులన్. ౨౦
(శ్రుతిపర్వత మనఁగా వినుకొండ)

కవికిఁ దాతయుఁ దాత యైన చంద్రామాత్యుఁడు కర్ణాటక దేశపురాజగు పెద్దబుక్కరాయలయొద్ద మంత్రిగా నున్నట్లు క్రింది పద్యములవలన నెఱుఁగ నగుచున్నది

శా. ఆమంత్రీశ్వరుకూర్మినందనుఁడు చంద్రామాత్యుఁ డంభోజభూ
భామారత్నకటాక్షభద్ర్యయ కేళీ వాలంబనై పద్మమా
త్రామాత్యాదిభాగీరథీప్రకటవాక్యశ్రీనిధానాహిత్య వి
ద్యాసారాపాదిత్య విలాసముద్రిత విద్వన్మానసుం డిద్ధరన్. ౧

శా. కర్ణాటక్షితినాథుఁ డైన పెదబుక్కక్ష్మాపదేవేంద్రుని
ర్భవ్యామాత్యుని దానఖేచరుని జంద్రాఖ్యాను బంధుప్రియున్
వర్ణించున్ గవికోటి శంకరజటావాటీతటాంతర్నదత్
స్వర్ణద్యంబుతరంగరింగణాల సత్సాహిత్యసాహిత్యమై ౨

కవికిఁ బెదతండ్రి యైనలింగనమంత్రికూడ హరిహరరాయల యొద్ద మంత్రిగానున్నట్లు క్రింది పద్యములోఁ జెప్పియున్నాఁడు.

మ. కనకాద్రిప్రతిమానధైర్యనిధి లింగక్ష్మాప మంత్రీంద్రుతో
వనజారాతి కృపాలమంత్రిజనతావాహంకారి తారాహిమా
నుకృతిశ్రీ రూపరవీందుకీర్తి హరిహరక్షోణీంద్రసామ్రాజ్యవ
ర్ధనుతో నాటి సమాన మీఁడు గలరా రాజన్యసైన్యాధిపుల్. ౧౪

చంద్రామాత్యుని మంత్రిగాఁ జేపట్టినబుక్కరాయలు సంగమరాయలమూఁడవకుమారుఁ డైనబుక్కరాయలనియు, లింగనమంత్రిని జేపట్టినహరిహరరాయలు మొదటిహరిహరరాయలనియుఁ గొందఱి యభిప్రాయము. బుక్కరాయలు సంగమరాయని తండ్రి బుక్కరాయలనియు హరిహరరాయలు రెండవ హరిహరరాయలనియు నాయుద్దేశము. ఈవిభేదము సులభముగాఁ దెలియుటకై రెండువంశవృక్షముల నిక్రిందనిచ్చుచున్నాఁడను. ఈవిమర్శనము కవికాలనిర్ణయమున కవసరమగుచున్నది. పెదబుక్కరాయలనఁగా మొదటి బుక్కరాయల కగ్రజుఁడైన హరిహరరాయలే యనువాదముకూడఁ గలదు.

## సంగమ వంశము.

బుక్క-రాయలు.

- సంగమరాయలు
  - మొదటి హరిహరరాయలు ౧౩౩౬-౧౩౫౪
  - కంపరాయలు
  - బుక్క-రాయలు (మొదటి) ౧౩౫౪-౧౩౭౯
    - రెండవ హరిహరరాయలు (౧౩౭౯-౧౩౯౯)
      - రెండవ బుక్క-రాయలు (౧౩౯౯-౧౪౦౬)
      - విరూపాక్ష
      - మొదటి దేవరాయలు (౧౪౦౬-౧౪౧౨)
      - చిక్క-రాయలు
    - రెండవ కంపరాయలు (౧౩౬౮-౧౩౭౫)
    - ఇంకను ౫ గురు
  - మారప్ప
  - ముద్దప్ప

## వినుకొండ నాగవంశము.

చండామాత్యుడు

- మంచెన్న
  - సింగన
  - తిప్పన
  - మల్లన
    - వల్లభ
    - లింగన హరిహరరాయలు మంత్రి
    - తిప్పన హరిహరరాయలు రత్నభాండాగారాధపతి
      - వల్లభామాత్యుడు
    - సంగన
    - భైరవ
  - చెన్న మంత్రి

ఈవంశవృక్షమునుబట్టి చంద్రామాత్యుని మంత్రిగాఁ జేకొనినవాఁడు సంగమరాయుల తండ్రియైన బుక్కరాయలే కాని సంగమరాయుల కుమారుఁడైన బుక్కరాయలు కాఁడనియు, లింగన, తిప్పనలు రెండవ హరిహరరాయలయొద్దనే యుండిరనియు. స్పష్టమగుచున్నది

సంగమరాయల కుమారుఁడైన బుక్కరాయలయొద్దఁ జంద్రామాత్యుఁడు మంత్రియయ్యెనేని. ఆయన మునిమనుమఁడైన లింగన బుక్కరాయలకుమారుఁడైన రెండవహరిహరరాయలయొద్దమంత్రిగా నుండుట యసంభవము. అందుచేఁ జంద్రామాత్యుఁడు సంగమరాయల తండ్రియైన బుక్కరాయలయొద్దనే మంత్రిగానుండినట్లు నిశ్చయింపఁ దగియున్నది. అయితే. ఆబుక్కరాయలకాలము నాఁటికిఁ గర్ణాటరాజ్యము సంగమవంశీయులలో లేదు. అతనికాలము క్రీ. శ. ౧౨౫౦–౧౨౭౦ ప్రాంతమగును. అప్పుడుకర్ణాటరాజ్యముకాకతీయుల వశమందున్నది. ఆపక్షమున పెద్దబుక్కరాయలు కర్ణాటక్షితినాథుఁ డెట్లగునని సంశయము కలుగవచ్చును. కాకతీయులవలనఁగాని ఆకాలమునఁ గర్ణాటకదేశమును బరిపాలించుచున్న మఱియేప్రభువుల వలనఁగాని యీబుక్కరాయలు కర్ణాటరాజ్య రక్షణమున నియోగింపఁబడియుండునని తలంపవలసియున్నది. తనతండ్రి, పెదతండ్రులు కర్ణాటప్రభువులయొద్ద మంత్రులుగానుండుటచేఁ దనపూర్వుఁడైన చంద్రామాత్యుఁడు కర్ణాటప్రభువుల మూలపురుషుఁడైన బుక్కరాయల మంత్రియని కవిచెప్పియుండును ఈబుక్కరాయలమనుమఁడైన మొదటి హరిహరరాయలయొద్ద జంద్రామాత్యుని మునిమనుమఁడైన లింగన మంత్రిగానుండుటకూడ నసంభవమే. కావున లింగన తిప్పనలు మంత్రులుగానున్న యాతఁడు రెండవహరిహరరాయలే కాని మొదటిహరిహరరాయలుకాఁడు. ఈకవినివాసముగా నెన్నఁబడుచున్న గ్రామము మోపూరు. నెల్లూరుమండలములో వెంకటగిరి తాలూకాయందు మోపూరున్నది. కాని యది ములికినాఁటిలోనిది కాదు.

ఈ గ్రంథమును వల్లభరాయఁడు రచించలే దనియు, శ్రీనాథ మహాకవి రచియించి యాతని పేరుపెట్టెననియుఁ బ్రతీతి కలదు. బ్ర. శ్రీ. మానవల్లి రామకృష్ణకవిగారును వేటూరి ప్రభాకరశాస్త్రిగారును వీరేశ లింగము పంతులుగారును మఱికొందఱును ఈనాటకము శ్రీనాథకృతము కాదనియు వల్లభరాయఁడే దీనిని రచియించెననియు నిర్ధారణ మొనర్చి యున్నారు. మానవల్లి రామకృష్ణకవిగారీ గ్రంథము నొకసారి ముద్రించి యున్నారు. శృంగార గ్రంథమాలవా రధికమూల్యము చేకూర్చి సామాన్యప్రజ కందకుండునటుల తక్కువ ప్రతులను ముద్రింపించుచు వేఱొక ముద్రిత ప్రతిని ప్రకటించినారు. దాదాపు ౩౦౦ పేజీలుగల యీముద్రిత ప్రతికిఁ గేవలము సత్యాన్వేషణమే మనసునందుంచుకొని శ్రీప్రభాకర శాస్త్రులవారు గ్రంథములోని వానికంటె నెక్కువ యసభ్యములుగా నున్న మఱికొన్ని పచ్చిశృంగారపు పద్యముల నుదాహరణముకొఱకందుఁ జేర్చుటకైన నంగీకరించి నూటముప్పదిపుటలపీఠికను రచియించి తుద కీ గ్రంథము వల్లభరాయకృతముగాదనియు ముమ్మాటికిని శ్రీనాథకృతి యే యనియు ఘంటాపథముగ వక్కాణించియున్నారు. శ్రీ కే. రాఘవా చార్యులుగారు మొదలగు కొందఱు శ్రీశాస్త్రిగారి యూహ నంగీకరించిరి. పోల్చిచూచుటకు వల్లభరాయకవి రచించిన మఱియొక గ్రంథము లేదు. ఈ వీథినాటకములోని పద్యములు శ్రీనాథుని కవితాశైలిని గలిగియున్న మాట వాస్తవము. శ్రీ శాస్త్రులవారి పీఠికను జదివిన పిమ్మట నియ్యది శ్రీనాథకృతమని యెట్టివారు ననకమానరు. ఇందలి సత్యాసత్య నిర్ణయమున కా విషయములను పాఠకలోకము నెదుటనుంచవలయు ననినచో ననభ్యములైన యీ గ్రంథమునందలి పద్యములను నట్టివే మఱికొన్ని పద్యములను మరల నిందు వ్రాయవలసినవాఁడ నగుదునని యీపనికిఁ బూనుకొనలేదు. ఇంతకును నందువలన నయ్యెడు ప్రయోజనము లేదు. శైలిని బట్టియుఁ బ్రయోగములను బట్టియు నీయంశమును నిర్ధారణ మొనర్పనిశ్చయించుకొన్నచో నీ గ్రంథము శ్రీనాథకృతమని చెప్పక

తప్పదు. లక్షణ వేత్తలలోఁ గొందఱిది వల్లభరాయకృతమనియుఁ గొందఱు శ్రీనాథకృతమనియుఁ దమతమ గ్రంథములలో నుదాహరించియున్నారు. వారి యుదాహరణము లీ వివాదమును బరిష్కరింపుటకుఁ దోడ్పడవు

రావిపాటి త్రిపురాంతకుని సంస్కృత ప్రేమాభిరామ మిప్పు డెచ్చటను గన్పట్టుటలేదు. అందుచే నీగ్రంథకర్త మూలము నెంత వఱకనుసరించెనో, ఎంతవఱకు స్వేచ్ఛను గైకొనెనో చెప్పుటకుపీలు లేదు. కీ. శే. చిల్లాపగడ సూర్యనారాయణ రావుగారు త్రిపురాంతకుని ప్రేమాభిరామముకూడ నాంధ్రభాషలోనిదే యనియు, దాని ననుసరించి వల్లభామాత్యుఁ డీరూపకమును రచించియుండునవియు వ్రాసియున్నారు. కాని యది యంగీకరింపఁదగినదికాదు. పైనఁ వ్రాసిన వచనములో "ప్రేమాభిరామ నాటకంబుననుసరించి క్రీడాభిరామం బనురూపకంబు తెనుంగుభాసరచించినవాఁడు" అనియున్నది. ప్రేమాభిరామముకూడఁ దెలుఁగులోనున్నచో "తెనుంగుబాస రచయించినవాఁడు" అని చెప్పియుండడు. అది సంస్కృతంబులో నున్నదిగనుకనే యిది తెలుఁగులో రచియించెనని చెప్పవలసివచ్చినది.

ఈరూపకము శ్రీనాథకృతమే యైనచో నెప్పుడు రచియించియుండును? అనువిషయమునఁ బండితులుభిన్నాభిప్రాయులుగానున్నారు. భీమేశ్వరపురాణ రచనానంతరమున క్రీ. శ. ౧౪౩౫ ప్రాంతమున నీగ్రంథము రచియించెనని కొందఱిమతము. వారు క్రీడాభిరామములోని:—

"గార్గ్యసిద్ధాంతమత ముమఃకాలకలన
శకునమూనుట యది బృహస్పతిమతంబు
వ్యాసమతము మనఃప్రసాదాతిశయము
విప్రజనవాక్యమరయంగ విష్ణుమతము"

# 65 నిశ్శంక కొమ్మన్న

ఈకవి శ్రీనాథునితో సమకాలికుఁడు. ఇతఁడు శివలీలావిలాస మను నొకపద్యకావ్యమును రచియించెను. ఇది రెండాశ్వాసములు గాఁ జేసి యభివర్ణింపఁబడినది. దాని నాంధ్రసాహిత్య పరిషత్తువారు ప్రకటించుచున్నారు. ఆశ్వాసాంతమునందలిగద్య యిట్లున్నది.

"ఇది శ్రీమదష్టభాషాకవితాప్రవీణబుధజనస్తుత్యనిశ్శంకకొమ్మనామాత్య ప్రణీతంబైన శివలీలావిలాసంబు"

ఈకొమ్మనామాత్యునిగూర్చి యింకేమియుఁ దెలియరాలేదు. అమాత్యశబ్దము నుపయోగించుకొనుటచే నితఁడు నియోగిబ్రాహ్మణుఁ డనుటకు సందియము లేదు. గోత్రమేదియో తెలియరాలేదు. ఇది గోదావరీమండలమునందుండుటచేతను గోదావరిమండలమున నమలాపురము తాలూకాలోని పోలవరము గ్రామమున నియోగి బ్రాహ్మణులు నిశ్శంకలవా రున్నారు. వారిది శ్రీవత్సగోత్రము. గోదావరిమండలమునందే యింకొకపోలవరమున్నది. ఇది వీరభద్రేశ్వరునకునికిపట్టగు పట్టిసక్షేత్రమున కనతిదూరమునందున్నది. ఈక్షేత్రమే ఘోరయుద్ధాంకుఁడును, వీరభద్రారెడ్డికి గురువునగు భీమగురుని నివాసము. ఈభీమగురుని కవి శివలీలావిలాసమున మూఁడుపద్యములలో వర్ణించియున్నాఁడు. బహుశః యీభీమగురుఁడు కవికిఁగూడ గురువై యుండును.

ఈ పోలవరమునందున్న యొకశాసనములో నిశ్శంక కొమ్మయ్య పేరు మహానందీశ్వరస్వామియొక్క ధర్మకర్తయని యుదాహృతమై యున్నది. ఆశాసనము శా. శ ౧౩౩౦ నాఁటిది. ఈకవికిని నాకొమ్మయకును సన్నిహిత సంబంధముండియుండును. (A. R. 293 of 1920) దీనినిబట్టికవి పోలవర నివాసియని చెప్పనొప్పును.

నిశ్శంకకొమ్మన్న వీరమాహేశ్వరములోనివని ప్రబంధరత్నావళి లోఁ గొన్నిపద్యము లుదాహృతములైనవి. శివలీలా విలాసమునకువీర

గీ. మది గనుంగొని పాయఁగాఁ బట్టి నెపాహ
మిచ్చ నొదవించు నెవ్వానియిల్లు విల్లు ?
బెరయు నెవ్వానిపలుకులు జేసియగుచు
నెంతు నెవ్వాని సేవింతు రెల్లసురలు ?

సీ. దైతేయకాంతలశిఖకుఁ గెమ్మోవుల
పిటికాశోలకు పీడకోలు
వేల్పుటిల్లాండ్ర కొవ్వొకపుఁ జన్నులమీఁది
యలువు పయ్యెదలకు నిలువనీడ
విశ్వజగత్త్రయీవిజయలక్ష్మిగా నె
ఓరువోత్సవములకుఁ బెండ్లివిందు
పరిపంథివాహినీ పరిచితపరిభవ
వార్త్రిషంకిలములఁ బాయఁద్రోవ,

గీ. నేసి యెయ్యది పిలసిల్లుఁ జిత్రమహము ?
నది ప్రయోగింప నెత్తైనయ్యచ్యుతుండు
విలయసమయసముద్భూత విస్ఫులదవాన
దారుణస్పర్శనంబు సుదర్శనంబు.

సీ. తల్లిదండ్రులతోడి తగు లొల్లకుండియుఁ
దల్లితండ్రులతోడి తగులువలచి
కందర్పుమీఁది యక్కటికంబు సెల్లియుఁ
గందర్పుమీఁది యక్కటిక మొదవి
సంసారకేళీప్రసక్తిఁ బోఁదట్టియు
సంసారకేళీప్రసక్తి గలిగి
సగుణవిశేషయోజనము ఘటించియు,
సగుణవిశేషయోజనము మరగి

గీ. సగము పురుషుండు కంజాక్షి సగముగాఁగ
నర్ధనారీశ్వరాకృతి నమువు పఱచి

పరిమళపికులు వివిధరూపములతోడ
వాసన... ... ...ద్యలఘుగతులు
వెలయఁ గోటానకోటులు గొలిచి వచ్చి
రతఁడు హరుఁ గొల్వు సేవించు ననసరముగ

సీ. కలశకుచీకేకులసురాంగల నట్లుసూడగ
నటియించి మాటిక త్రాగు నెలతకంబు
పొట్టేటిరాయని బొళయంబు గదలించి
సాహస్రలి గదలెడిసై భవంబు
క్రతుభాగములు తెచ్చి కైతప్పగాకుండ
వేల్పుల కందించు వెరవుసొంపు
మూఁడుమూర్తులుదాల్చి మురువుతోడసన్నంబు
వేదిపైఁ గొలువుండు విభ్రమంబు
నిక చెల్లు నోఁకల నిత్తోడినాటికిఁ
జేకుఱుచ్చి యెన్న లేరుజగతి
పశమె నిన్నుఁ బొగడ స్వాహాపమాకుచా
భ్యన్నతప్రకాశ . యోహాంతాశ !

శివలీలావిలాసము:—

ఉ. శ్రీవిభుసెజ్జ మేదినికిఁ జెల్వగుపట్టము దివ్యసన్నార
త్నావలిమన్కిపట్టు దివిజాదులకున్ దగుమట్టి వాహినీపతుల్
భావము గట్టుతావు బడబాగ్నులకంబున వంటయిల్లు నాఁ
గా ఖిలసిల్లు నారసనిధిగాథమహాత్మ్యము చెప్ప నొప్పగున్.

చ. వరయశుఁ డింకఁగల్గుఁ గురువంశమునన్ జనమేజయుండు నాఁ
బాఁగి పరీక్షితాత్మజుఁడు పాయక యాతఁడు సర్పయాగము
న్దగ మతిఁ నప్పుడతిదుస్సహతద్గహనార్చులందు సో !
దరహితపుత్రపౌత్రసహితంబుగ మగ్గుఁడు మీర లందఱున్.

ఉ. అశ్వముజాడఁగానక భయంపడి యాసగరాత్మనందనుల్
విశ్వసహాస్థలిన్ వదననీరజముల్ గమలంగ నొత్తమై
యాశ్వయహూపయానమున నక్కడ నక్కడ కేఁగి యేఁగి యా
విశ్వవసుంధరాస్థితి గవేషణచేసిరి పెక్కుభంగులన్.

ఉ. తన్మదిరాక్షివిభ్రమము దక్కక కన్నులఁ గ్రోలఁ జొచ్చెఁ బ్రే
మన్మనుచేత బిట్టడరి మానస మాకుల మయ్యె నిట్లు గ
న్నన్మనసున్ వశంబులయి నూల్కొనమిన్ బహిరంతరంబులన్
దన్మయిచెంగటం బజ్జఁడు దండడి వేడ్కలు సందడింపఁగన్.

చ. మును జలలోక దంపతులమస్త్రముల న్విదళించి పాంథభీ
కరముగ నత్తికట్టిన ప్రకాశము నొందెనువన్న లీల ని
ర్భరరుధిరాభిషేకపరిభాసితచక్రముఁ బోలె నత్తఱిన్
వరుణునిదిక్కునందు దిననాయకమండల మొప్పె శోణమై.

ఉ. ఆరవివంశవల్లభుఁడు దగ్రత నూర్వర యేలె నిర్మల
స్ఫారయశంబు దిక్కులకుఁ బాయని చందనచర్చగా మహో
దారనిరూఢి దీనులకు దీప్తనిధానముగా సముల్లస
ద్వీరగుణంబు శ్రుతులకు దేవపురీపథదర్శనంబుగన్.

ఉదాహృతపద్యములనుబట్టి కొన్నమనకవిత్వము ప్రౌఢమై సము సంస్కృతాంధ్రపదసంయుతమై యనర్గళధారకలిగి నూతనభావములతో మనోహరముగ నున్నదని విదితమగుచున్నది.

వీరమాహేశ్వరము నెవరికిఁ గృతియిచ్చెనో తెలియదు. శివలీలావిలాసమును దొడ్డారెడ్డికి మనుమఁడును అల్లాడరెడ్డికిఁ గుమారుఁడును శ్రీనాథకవికృత కాశీఖండకృతిపతి యగు వీరభద్రారెడ్డికిఁ దమ్ముఁడును నగు దొడ్డారెడ్డికిఁ గృతియిచ్చెను. ఈదొడ్డారెడ్డిని గవి యీక్రింది సీసపద్యములో వర్ణించియున్నాఁడు.

సీ. పెద్దకోమటివేమపృథ్వీశు వెను సూచి
యతనిపలపదలెల్ల నపహరించి

ఈపోడ్డారెడ్డి మిగులఁ బరాక్రమవంతుఁడు. ఇతఁడు గుఱ్ఱపుస్వారిచేయుటలో సాటిలేనివాఁ డనియు నిరువదినాలుగు మూరల మారమును గజ్జమును దాటించెనని శ్రీనాథుఁ డీక్రిందిపద్యములోఁ జెప్పియున్నాఁడు.

"మ. హరిదాటించెఁ బరోపకంఠమున వాహ్యాళిప్రదేశంబునం
బరుదే యల్లయరెడ్డినందనుఁడు దొడ్డయ్యార్కమాధీశ్వరుం
డిరువైనాలుగుమూళ్ళమేర యదిపో లెక్కింపఁగా నేలయ
శ్రీశైలాధిపకీర్తి దాఁటెఁ గను నద్దండించి బ్రహ్మాండమున్."

ఈవిషయమునే కొమ్మనామాత్యుఁడు శివలీలావిలాసమున:—

మ. అరరే యల్లయపోడ్డభూవిభుఁడు వాహారోహరేవంతుఁడిం
పుదారస్వాడి మూలగూరెనడ వాహ్యాళిస్థలిన్ రాజకుం
జరసింహం బనువారువంబును యశశ్చాతుర్యలీల దాఁటింపఁడే
తిరమై యిర్వదినాల్గుమూళ్ళనిడు పుత్తేకంబు చేయొత్తుగన్.

అనుపద్యములో వర్ణించియున్నాఁడు.

ఈకాలమునఁ గళింగరాజ్యమును బరిపాలించుచున్నవాఁడు కళింగగాంగవంశములోనివాఁడును గజపతియు నగుభానుదేవుఁడు. రాజమహేంద్రవరపు రెడ్డిరాజు లీభానుదేవుని జయించి తమరాజ్యమును మహానదివఱకును వ్యాపింపఁజేసిరి. ఈభానుదేవుని తరువాతఁ గళింగసింహాసన మధిష్ఠించినవాఁడు కపిలేంద్రగజపతి. ఇతఁడు భానుదేవుని మంత్రియని కొందఱును స్వయందత్తుఁ డనికొందఱు ననుచున్నారు. ఈవిషయమునుగూర్చి మఱియొకతావున వ్రాసెదను.

శివలీలావిలాస కృతిపతియైన పోడ్డారెడ్డి, గుంపిపియను గ్రామమును, అల్లయపోడ్డపురమని పేరుపెట్టి బ్రాహ్మణుల కగ్రహారముగా నిచ్చె నని యొకశాసనముకలదు. ఈతామ్రశాసనపుత్రేకులు గోదావరి మండలమందలి రామచంద్రపురము తాలూకాలోనికొంకుదురులో లభించుటచే దీనికి కొంకుదురుశాసన మనిపేరు వచ్చినది. దానమిచ్చిన గ్రామము ప్రస్తుతము రాజోలు తాలూకాలోనిది. ప్రతిగ్రహీతలలో

సీ. చిత్తనేత్ర పాదశోభాచారంబుల
ఎవ్వనిచిత్తంబు రంజితముసేయుఁ
బ్రతివత్సరంబు నుద్యద్వసంతోత్సవ
శ్రీలదిక్చయము వాసితము సేయు
నయశోభిమాపుల నయకీర్తినింబదా
నతత్పృథ్వీకరజనోన్నతులఁ జేయు
హేమాద్రిదానక్రియామాహాత్మ్యంబుఁ
విప్రుల నతిసశాస్త్రజ్ఞులఁ జేయు
నతఁడు గోవిందామాత్యుఁ డితనిమాహాను
ప్రకట సింహాచలోత్తర భాగలిఖిత
విదితజయశాసనాక్షరానేక
సిద్ధగుణుఁడు డిల్లవిభుని దేవేశ్వరుఁడు.

శ్రీ నిడుదవోలు వేంకటరావుపంతులు M. A. గారీపద్యము నుదాహరించుచు రెడ్డిసంచికయందు "సింహాచలోత్తరభాగలిఖిత" మైన శాసనమిదియేయని యాశాసనమును బ్రకటించియున్నారు. ఆశాసనమంతయు నిట నప్రస్తుతము. దీనినిగూర్చి శ్రీనాథచారిత్రమునఁ గొంతవ్రాసియుంటిని. ఆశాసనకాలము శా. శ. ౧౩౫౬ (క్రీ. శ. ౧౪౩౪) శ్రావణశు ౧౪ అల్లయవేమారెడ్డి శా. శ. ౧౩౫౬ శ్రావణ శు ౧౪ - పుష్యపదమునఁ బరిపోయియుండునని వ్రాసియుంటిని. శివలీలావిలాసములోని వర్ణనమునుబట్టి యప్పటికాతఁడు జీవించియున్నట్లు తోఁచుచున్నది. కావున నామధ్యకాలముననే దొడ్డారెడ్డికి కృతిప్రదానము జరిగియుండునని నిశ్చయింపఁ దగియున్నది.

శివలీలావిలాసమున నీశ్వరునిలీలలు ముప్పదియాఱు వర్ణితములైయున్నట్లు గ్రంథాదిని కవిచెప్పిన వాక్యములవలనఁ దెలియుచున్నది. లభించిన రెండాశ్వాసములలోను పదకొండు లీలలున్నవి. ఇఁక నెంత

గ్రంథమున్నదియో తెలియరాదు. పండితారాధ్యచరిత్రమునను సోమనాథకవి యిరువదిమైలారులకే చెప్పియున్నాఁడు.

కృతిపతి మైలారురెడ్డి యెవ్వఁడో చరిత్రమేదో తెలియదు. క్రీ. శ. ౧౪౦౦ ప్రాంతమునఁ గొండవీటి రాజులతో సంబంధము గలవారిలో నాతఁడొకఁడై యుండునని తోఁచుచున్నది.

# 66. భైరవకవి

ఇతఁడు శ్రీరంగమాహాత్మ్యము, రత్నశాస్త్రము, కవిరాజగజాంకుశము ననుమూఁడు గ్రంథములను రచియించెను. ఇందు రత్నశాస్త్రమును శ్రీరంగమాహాత్మ్యమును ముద్రితములైనవి. కవిరాజగజాంకుశము నందలి ౭౮ పద్యములు మాత్రము ముద్రితములైనవి. లిపిముద్రితప్రతులు (ఆంధ్రపరిషత్పత్రిక సం ౧౭.) శ్రీమానవల్లి రామకృష్ణకవిగారియొద్దను, మదరాసునందలి అడయారు పుస్తకభాండాగారమునను గలవని కవిగారు శ్రీరంగమాహాత్మ్య పీఠికలో వ్రాసియున్నారు. శ్రీరంగమాహాత్మ్యమునఁ గృతిపతి దనను గూర్చి పలికినట్లు కవి వ్రాసికొనిన యీక్రిందిపద్యము వలనను, శ్రీరంగమాహాత్మ్యగద్యవలనను, ఇతఁడు గౌరనామాత్యుని తనయుఁ డనియు, గౌతమగోత్రుఁ డనియుఁ శ్రీభ్రమరాంబా ప్రసాదలబ్ధసిద్ధసారస్వతగౌరవుఁ డనియుఁ దెలియవచ్చుచున్నది. ఈ భ్రమరాంబాప్రసాదము గౌరనకైన కావచ్చును.

మ. కృతవిద్యాఖురళీపరిశ్రమకళాకేళీవిలాసుం జన
స్తుతచారిత్రుని గౌతమాన్వయపవిత్రుం గౌరనామాత్యస
త్సుతుఁ గల్యాణకవిత్వలక్షణసమర్థున్ సూక్తిముక్తాఫలా
తతకాంతిస్ఫుటచంద్రికోల్లసితదిగ్వైశాఖవున్ భైరవున్.

గద్యము:— ఇది శ్రీమద్భ్రమరాంబికావరప్రసాద లబ్ధసిద్ధసారస్వత విలా
సగౌరవ గౌరనామాత్యపుత్ర సుధీవిధేయ భైరవ నామధేయప్రణీ
తంబైన శ్రీరంగమహాత్మ్యంబనుపురాణకథ యందు... ...
రత్నపరీక్షయందు: దననుగూర్చి కవి వ్రాసికొనిన పద్యము లివి:—

క. భ్రమరాంబాదేవికృపన్
సముచితనిరవద్యహృద్యసాహిత్యకళా
క్రమవిమలప్రతిభాగానఁ
క్రమమైభవశాలియైన గౌరనసుతుఁడన్.

క. భైరవుఁడ నభయవిద్యా
పారీణుఁడ లోభిభవనభవహూము ద్యా
పారసవిశారదుమఱి
ఘోరపిశాచముల దఱుమ భైరవుఁడనే.

కవినిగూర్చిన విశేషము లీగ్రంథములనుండి యింకేమియుఁ దెలియలేదు. ఈతఁడు రచించిన కవిగజాంకుశము పూర్తిగా నాకు లభ్యముకాలేదు. తంజావూరునందలి యముద్రిత గ్రంథభాండాగారమున కవిగజాంకుశముయొక్క యముద్రితప్రతియొకటి కలదని యాగ్రంథములపట్టిక వలనఁ దెలియుచున్నది. గ్రంథకర్తనామ మీక్రిందిపద్యములోఁ జెప్పఁబడియున్నది.

మ. గణవర్ణాదుల మేలు కీడు తెలియంగాఁ జెప్పి సాహిత్యల
క్షణదీక్షాగురుఁ డైనగౌరనసుధీ[1] సంస్తుత్యుఁ డత్యుల్లస
ద్గుణరత్నాభరణుండు భైరవకవీంద్రుం డెందుఁ దజ్ఞుల్ దనున్
బ్రణుతింపం గవితాగజాంకుశము భూప్రఖ్యాతిమై మించఁగన్.

ఇతఁడు తానదివఱకు రచించినగ్రంథముల పేరుల నేగ్రంథములోను జెప్పియుండలేదు. కాని శ్రీరంగమాహాత్మ్యములోని యీక్రిందిపద్యమువలన గణవర్ణఫలములు కాలములు మొదలగు నియమములను

---

౧ 'పంజాతు' అనియుండవలయును.

క. ఆవిశ్వేశ్వరు పేరిట
నావల కేదారపుత్త్రిఁ డని భక్తులు సం
భావింప నధికవిద్యా
ప్రావీణ్యం బైన వీరభద్రుం జెలమిన్

క. తన్నుం బ్రియమార వేఁడిన
మున్ను ముకుందుఁ డిల కగస్త్యముని చెప్పినయా
సన్నుత మణిలక్షణములు
చెన్నుగఁ గ్రోడీకరించి చెప్పెదఁ దెలియన్.

ముదికొండ నైజాము రాష్ట్రములోనిది.

రత్నశాస్త్రమాండలికవిత్వశైలి తెలియుటకై రెండుపద్యముల నుదాహరించెదను.

ఉ. నీరదముల్ దిగంతములు నిండి పటుస్ఫుటగర్జితంబులే
పార మహోగ్రవృష్టి గురియన్ బ్రభవించు నితాంతకాంతితో
నారయ కుక్కుటాండసమమై పడు ముత్యము లంతరిక్షసం
చారులు పట్టుకొందురు వసుధన్ బడకుండఁగ నేర్పుపెంపునన్.

ఉ. దాకటిమీఁదఁ బెట్టి పెడిసంబుగ సమ్మెట వేయ భిన్నమై
పోక జలంబులో మునిఁగిపోవక యెప్పుడు లోహపత్త్రికన్
జేకొని వ్రాయ రేఖ నిలసిల్లనివజ్రము శుద్ధ మిద్ధరన్
బ్రాకటరీతిఁ దాల్ప నట భర్గుఁ డొసంగు శుభంబు లెప్పుడున్.

ఇతఁడు రచించిన శ్రీరంగమాహాత్మ్య మైదాశ్వాసములుకలది. ఇందు సుప్రసిద్ధవైష్ణవపుణ్యక్షేత్ర మగు శ్రీరంగముయొక్క మాహాత్మ్యము వర్ణితమయినది. ఈశ్రీరంగమాహాత్మ్యము గరుడపురాణమున మూఁడధ్యాయములలోను బ్రహ్మాండపురాణమునఁ దొమ్మిదధ్యాయములలోను జెప్పబడియుండెను. కట్టా వరదరాజకవియును, ఈభైరవకవియును గరుడపురాణము ననుసరించి పద్యకావ్యములను వ్రాసియుండిరి. బ్రహ్మాండపురాణము నాధారముగాఁ జేసికొని ముకుందయోగి

ద్విపదకావ్యముగను, భాగవతులరామయకవి, కుంటిముక్కల జగన్నాథ కవి ప్రభృతులు పద్యకావ్యములుగను శ్రీరంగమాహాత్మ్యమును రచి యించి యుండిరి. శ్రీరంగమాహాత్మ్య మాంధ్రవచనమున కూడ గలదు.

భైరవకవి గరుడపురాణమనుసరించి యీగ్రంథమును వ్రాసిన ట్లాతఁడు రచించిన యీక్రిందిపద్యములవలనఁ దెలియుచున్నది.

శా. వ్యాసప్రోక్తమహాపురాణములు మున్న్యాత్రేయుం డంటియుండఁగా జగ
ద్వ్యాసుం డైన పరమాదిమనోహరమహాత్త్వవ్యక్తిమూలంబులై
భాసిల్లుం దనరాలు గరుడను బహూపాఖ్యానవిఖ్యాతమై
యా సౌపర్ణపురాణ మొప్పు బహువేదాంతార్థగంభీరమై.

వ. అందుఁ బురాణసారంబై శ్రవణమంగళంబగు శ్రీరంగమాహాత్మ్యంబు మదంకితంబుగా నాంధ్రభాషా కౌశలంబు పచరించి రచియింప వలయు."

ఈ శ్రీరంగమహాత్మ్యము చాగయకుమారుఁ డైన రాఘవామాత్యున కంకిత మీయఁబడినది. ఈతఁడు మాన్యుఁడై యుండెను. ఈతని వంశమును గవి పెక్కుపద్యములలో వర్ణించియున్నాఁడు. అం దీక్రింది పద్యములయందుఁ దక్క దక్కినవానిలో చారిత్రమున కుపయోగపడు నంశములు లేవు. ఈక్రింది రెండుపద్యములును కృతిపతికి సోదరుఁ డైన విఠ్ఠలమంత్రిని వర్ణించినవి. కవికాలనిర్ణయమునకుఁ దోడుపడునని తలంచి యిట వ్రాయుచున్నాఁడను.

మ. పటుధాటీముఖజృంభమాణకలహా ప్రౌఢార్వసంఘాతవి
స్ఫుటరింఖాపుటకోటిఘట్టన పరిక్షుణ్ణాత్మమోద్యద్విశం
కటధూళీపటలప్రశోషిత మహాకర్ణాటసేనాసము
ద్భటపాథోనిధి విఠ్ఠలేంద్రుఁ బురణింపన్ మంత్రులేరీ ధరన్ ?

సీ. చండదిగ్వేదండకాండ ఘూర్జ్యామహీ
మండలోద్ధరణసమర్థ మగుచు,
మన్వాదికథిత సద్వ్యవహారదుర్గ్రా
హ్యవ్యవహారక్రియానిపుణ మగుచు,
వేదాదివిద్యావినోద విద్వజ్జనా
మోదాతిశయ సముత్పాది యగుచు,
జంభజిన్మదకుంభికుంభీనసాధీశ
శంభుభూభృద్ద్యుతిస్వచ్ఛ మగుచుఁ
బరఁగు నేమంత్రి తిప్పజలజాక్షిశౌర్య
దానసత్కీర్తు లక్ష్మీనివాసమహిమ
నాతఁ డిమ్మడిసైపఖానాధిరాజ్య
భారధుర్యుండు విఠ్ఠలప్రభువరుండు.

ఈపద్యములలో విఠ్ఠలుఁడు "ప్రశోషితమహాకర్ణాటసేనాసముద్భటపాథోనిధి" యనియు. "ఇమ్మడిసైపఖానాధిరాజ్యభారధుర్యుఁ" డనియు వర్ణింపఁబడినాఁడు. బ్ర. శ్రీ. వీరేశలింగముపంతులుగారు ఇమ్మడి యనఁగా సంగమవంశములోని రెండవ దేవరాయలని యర్థము చెప్పి దానినిబట్టి కవికాలనిర్ణయ మొనర్చినారు. కాని యది పొరపాటని తోఁచుచున్నది. ఆ "యిమ్మడి" శబ్దము సైపఖానునకు వర్తించును. అనఁగా రెండవసైపఖానుఁ డని యర్థము. ఈరెండవ సైపఖానునికడ మంత్రిగానుండి విఠ్ఠలుఁడు కర్ణాటసేనాసముద్రము నింకింపఁజేసినవాఁ డని యూహింపఁదగియున్నది. "ఇమ్మడి" శబ్దమును వేఱుగా విడదీసి రెండవప్రౌఢదేవరాయలని యర్థమును జెప్పినచో సైపఖానుశబ్దమర్థములేనిదై పోవును. కావున నాశబ్దమునకు రెండవసైపఖానుఁ డను నర్థమును గ్రహించుటయే మంచిది. కాని యీసైపఖానుఁ డెవ్వఁడో తెలియదు. ఇతఁడుకర్ణాటరాజులతో యుద్ధమొనర్చిన యొకమహమ్మదీయ సామంతుఁడై యుండును. ఆతనికడ నీవిఠ్ఠలుఁడుమంత్రిగానుండి

హరిశ్చంద్రచరిత్రము, నవనాథచరిత్రమునను ద్విపదకావ్యములను రచించిన గౌరనమంత్రి యీభైరవకవికిఁ దండ్రియా? యనువిషయమునందు నేఁటికాలమునుండి చరిత్రకారులు సంశయమును జూపుచు నిదమిత్థమని నిర్ణయింపకపోయిరి. ఈభైరవుని గ్రంథములనుబట్టి యీతని తండ్రి గౌతమగోత్రుఁడును భ్రమరాంబా వరప్రసాదముచే సాహిత్యకళాకౌశలుఁడునునై యున్నట్లు స్పష్టమగుచున్నది. పైనఁజెప్పినద్విపదకావ్యకర్తయు గౌతమగోత్రుఁడే భ్రమరాంబా వరప్రసాద కవితాశక్తియుక్తుఁడే. గౌరనకాలము క్రీ. శ. ౧౩౮౦-౧౪౪౦ ప్రాంతమని పూర్వకవిచరిత్రమున నిర్ణయించియుంటిమి. భైరవకవికాలమును నిర్ధారణముగాఁ జెప్పఁజాలకపోయినను, యీతఁడు రచించిన కవిగజాంకుశమును ముద్దరాజు రామన్న, లింగమకుంటతిమ్మకవి మొదలగులాక్షణికులు దాహరించియుండుటచేతను, మల్లారెడ్డిషట్చక్రవర్తిచరిత్రమున "మందబుద్ధిదియని ముందె చెక్కలిఁగొట్టి కవిగజాంకుశ మిందఱికిఁ జూపు" అని శ్లేషించుచుఁ గవిగజాంకుశమును దడవయుండుటచేతను నీతఁడు వారికంటెఁ బూర్వుఁడనిస్పష్టమగుచున్నది. అందుచే భైరవకవిద్విపదకావ్య కర్తయగు గౌరనసుతుఁడని తలంచుటకుఁ గాలమాటంకము కలుగఁజేయదు. కాలము, కులము, గోత్రము, భ్రమరాంబావరప్రసాదము,నివియన్నియుసరిపోవుటచే, నీభైరవకవిహరిశ్చంద్రచరిత్రద్విపదకావ్యకర్తయగు గౌరనసుతుఁడని నిశ్చయింపవచ్చును కానియిందులకొక్కప్రతిబంధకము గన్పట్టుచున్నది. గౌరనమంత్రిరచించిన లక్షణదీపికయనుఛందోగ్రంథములోఁగవిగజాంకుశమునందలి యాంధ్రపద్యములు నాల్గుదాహరింపఁబడి యున్నవనియుఁ దండ్రికుమారుని గ్రంథములోనుండి పద్యముల నుదాహరించుట యసంభవమనియు మానవల్లి రామకృష్ణకవిగారుపీఠికలో వ్రాసియున్నారు. వారియొద్దవివిధదేశములయందలినాల్గువ్రాఁతప్రతులున్నవఁట! నాల్గునుసమగ్రములైమంచిస్థితిలోనున్నవట. నాల్గిటిలోనుగూడఁగవిగజాంకుశములోనివనినాల్గుపద్యములు నుదాహరింపఁ బడియున్నవఁట! వారియొద్ద గవిగజాంకుశముల

క. ఫణి మృత్యుంజయుఁ బద్యాదిని
మృతసక్తంబు లిడిన మేనుఁ సౌఖ్యా
ప్త్యాయుః పదవు సమృద్ధియుఁ గలుగ న
ప్రీతిమయము లగు లోకములఁ బద్యాది నిడన్. ౩

ఆ. గ్రహము మఱికి గణము గఱి యక్షరము పింజ
పద్య మొసఁగుకోల చోద్యమైన
జిహ్వావిల్లు సలుకనిజని లక్ష్యంబు
ఘూర్తజనుఁడు సుకవివార్త జోదు. ౪

సీ. అవని గణాలి గణావలి కధిదేవ
తలును వన్నెలు గ్రహంబులును వాని
కోమలుల ఫలములు కూర్మలు పగలును
చుక్కపొత్తులు సమ్మగ నెఱింగ
పంచ మహాభూతబీజ చింతనమును
వర్ణవర్గగ్రహ నిర్ణయంబు
నక్షత్రవేధయు నరిమిత్రశోధన
క్రమముఁ దత్ఫలవిచారమును దెలిసి

తే. తమకు నెదురు లేక తప్పించి ధారుణీ
విభులసభల బుధులు వివిధగతులఁ
జెలఁగి పొగడఁ గవిత చెప్పెడువారు స
త్కవులు గాక యితరకవులు కవులె ? ౫

క. మగణంబు పద్యముఖమున
సగణయుతోఁ గూర్చి చెప్పఁ జనుఁగృతియొండెన్
దగఁబద్యమిడిన భర్తకు
నగణితముగ వర్ధసిద్ధులగు సత్యముగన్. ౬

క. ఒనుకచుఁ లక్షణమొప్పఁగ
గొనుకచుఁ బ్రాసంబు వడియుఁ గూడకయుండన్
దెనకచుఁ బదసంఘములు చెడ
ననుకచు నెతికివిలిచెప్ప నేరఁడు గవియౌ. ౬

క. కమలహితుఁ డస్తమించె
తగిను మొదలుగ నేఁడుదోషతమములు నడుమన్
బ్రిమదప్రదములు పెంచెం
డమరఁగ నశుభములు తొలఁగిపోవఁ బద్యాదిన్. ౭

క. నక్షత్రగ్రహగణము
త్రాక్షర గుణదోషవిన్నయంబు బ్రాసరింపన్
దక్షులు దానిది గాదని
శిక్షించిన గన్ను లెఱ్ఱఁజేతురు కుకవుల్. ౮

ఇందలి 3. ౫ పద్యములు పరిషత్తువారు ప్రకటించిన ౭౦ పద్యములలో లేవు.

ఈభైరవకవితండ్రియగుగౌరన నవనాథచరిత్రమును శ్రీగిరికవి రచించినయాంధ్రపద్యనవనాథచరిత్రము ననుసరించి ద్విపద గా వ్రాసెనని గౌరనకవిచారిత్రమున వ్రాసియుంటిని. ఆశ్రీగిరికవియే శ్రీరంగమాహాత్మ్యమును పద్యకావ్యముగా రచియించెనని తెలియుచున్నది. భైరవకవి యాగ్రంథమును జూచియుండకపోవచ్చును. లేదా, శ్రీగిరి బ్రహ్మాండపురాణము ననుసరించి వ్రాసియుండఁగాఁ దాను గరుడపురాణమును బట్టి రచించియుండును. శ్రీగిరిగ్రంథము లభింపకపోవుటచే నేమియుఁ జెప్పఁజాలను. శ్రీగిరికవిచారిత్రమును నాల్గవసంపుటమున వ్రాసియుంటిని.

ఈభైరవకవిరచించిన కవిరాజగజాంకుశము పరిషత్తువారుప్రకటించిన ౭౦ పద్యములుమాత్రమేనా? ఇంకనుకొంత గ్రంథముగలదా?

మని యందిరాయము గలదనుచున్నది. శైలీక పద్యములు బట్టి చూడ నతఁడు పదునాలుగవ శతాబ్దమునం దుండవలయునని తోఁచుచున్నది. అన్య విశేషములు లేవు.

---

## 67 కొలని గణపతిదేవుఁడు

ఇతఁడు శివయోగసార మనుగ్రంథమును రచియించెను. ఇది పూర్వోత్తరము లను రెండుభాగములుగ గలది. పూర్వభాగ మెనిమిది యాశ్వాసములు. ఉత్తరభాగము నాల్గాశ్వాసములు. ఉత్తరభాగము పట్టంగల్లునందలి శైవ ప్రచారిణీసభవారు ప్రకటించియున్నారు. పూర్వభాగము వారికి లభింపనందున వారు దానిని ముద్రింపలేదు. పూర్వభాగము లభింపకపోవుటచేఁ గవిచరిత్రము వ్రాయుటకు వారికి నవకాశము లేకపోయినది. పూర్వభాగ తాళపత్రప్రతి బ్రహ్మశ్రీ వేమూరి విశ్వనాథశర్మ ఎం. ఏ. యల్. టి గారియొద్దఁ గృత్యాదితోఁ గూడియున్నదఁట. దానిని జూచి, చిలుకూరి వీరభద్రరావుపంతులుగారు కవిచారిత్రమును 1927 సంవత్సరములో 'సుభాషిణి' యను పత్రికలో నొక వ్యాసమును బ్రకటించియున్నారు. ఆవ్యాసమును శైవ ప్రచారిణీవారు ఉత్తరభాగముద్రితప్రతిలోఁ బునరుద్ధరించియున్నారు. ఈకవిని గూర్చియుఁ గృతిభర్తను గూర్చియు, గొన్నియంశములను చిలుకూరి వీరభద్రరావుపంతులుగారు ఆంధ్రులచరిత్రమున వ్రాసియున్నారు.

ఉత్తరభాగమందలి యీ క్రిందిపద్యములవలన పూర్వభాగ మెనిమిదియాశ్వాసములును ఉత్తరభాగము నాలుగాశ్వాసములును గలిగియున్నట్లును, కవి గణపతిదేవుఁ డయినట్లును గ్రంథమందలి విషయము దెలియుచున్నది.

ఆ. శైవయోగశాస్త్రసారసముచ్చయ
ప్రకరణములయర్థభావ మెల్ల

తెనుఁగుకవిత తేట తెలివిగా నే భవ
దాజ్ఞ విన్నవింతు నవధరింపు.

చ. గణపతిదేవనామమునఁ గల్గిన యీ శివయోగసారముం
బ్రణుతమహాప్రబంధముగఁ జెప్పితి నాకృతియుఁ బూర్వభాగముం
త్రిణయనభక్తి తో ననుఁ గ్రహింపు సదాశివయోగనాథ శ్రీ
మణి యన రూఢి కెక్కె గరిమించుగ నుత్తరభాగ మొప్పఁగన్.

శా. విశ్వేశస్థిరభక్తి వర్ధిలఁగ నర్థిం బాహ్యాభ్యాస్తరం
ఖ్యాత్యాశ్వాసంబులఁ గర్మయజ్ఞము దపోయజ్ఞ ప్రకారంబు స
త్త్వైశ్వర్యప్రదమై తనర్చు జపయజ్ఞాచారముం గూడఁగా
విశ్వస్తుత్యగతిం బ్రబంధ మమరెన్ విద్వత్పరిగ్రాహ్యమై

క. ఈయుత్తరభాగంబున
నాయతి రచియింతు నాలుగాశ్వాసములం
బాయక ధ్యానజ్ఞాన మ
హాయజ్ఞద్వయము యమిజనానందముగన్.

క. శివయోగ మిందు నెంతయు
నవిరళమై వెలయుటన్ దదనుకూలముగాఁ
బ్రవిమలమతి నాత్మస్థిత
శివలింగముఁ గొలుతు మొదలఁ జిన్మయలీలన్.

ఈ గ్రంథమును కవి, తనకు మేనమఱఁదియు, గురువు నగు, ఈడూరి నూకనారాధ్యునకుఁ గృతి యొసంగెను. అతఁడు తనను బిలిచి చెప్పినట్లు కవి వ్రాసికొనిన పూర్వభాగమందలి యీక్రిందిపద్యముల వలనఁ గవిగోత్రాదికము దెలియుచున్నది.

సీ. తన మేనమఱఁదియుఁ దనశిష్యుఁడును లోక
మాన్యుండు నైన కౌండిన్యగోత్రు
సురుచిరాపస్తంబసూత్రుని నిందులూ
రన్నయదేవునియన్నమునమ

గన్నయకు దమ్మాకాంతుని గణపతి
దేవుని మాదిమూర్తికిని సద్గు
ణాన్వయ యగులక్కమాంబకుఁ బుత్రుఁడఁ
దిరఁ జెలుప్ప గణపతిదేవవిభుని

తే. గీ. సహితగణపల్లెరాయ చౌహత్త సల్లు
నభినవాకారు శ్రీను సన్యాంగనా స
హోదరుని నన్ను రావించి యుచితవృత్తి
నస్మదీయగ్రామంబు లాదరించి.

ఈకవి సోమయాగి బ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; కౌండిన్య గోత్రుఁడు. ఇతనితండ్రి ఆదిమూర్తి (ఇతనిని ఆదిమూలనామాత్యుఁడనియందురు. ఈయంశము క్రిందిగద్యవలనఁ దెలియనగును.) తల్లిలక్కమాంబ. తాతగణపతి; ఆతనితండ్రి రుద్రదేవుఁడు. ఆతనితండ్రి గన్నయ. ఈగన్నయను, మనుమగన్నయయని పిలచెదరు. ఈమనుమగన్నయ, ఇందులూరి అన్నయదేవుని కగ్రజుఁడు. ఇంతవఱకుఁ బైపద్యమునుబట్టి కవివంశావళి తెలిసినది.

గద్య. ఇది శ్రీగురుచెన్నసదాశివ యోగీంద్రపాదారవిందమధుకరాయ
మాన నిరంతరశివభక్తిసమాధాన కొలనియాదిమూలనామాత్య
పుత్ర అన్యస్తుతిపరాఙ్ముఖ శివస్తుతిసుముఖ సుకవిజనమిత్ర
సరసకవిత్వరచితభావ గణపతిదేవ ప్రణీతం బైన
శివయోగసారంబు.

“సుభాషి”పత్రికలో చిలుకూరి వీరభద్రరావుగారీ క్రిందివంశవృక్షము నిచ్చియున్నారు.

మహావిష్ణు
|
బ్రహ్మ
|

చిర్రోత్రోలో చెప్పబడెను. ఈ వంశవృక్షమును ఋజువుచేయు శివయోగ సారమందలి పద్యములన్నియు నా వ్యాసమునఁ బొందుపఱుపఁబడలేదు. అయినను శ్రీ [illegible] పంతులుగారు చారిత్రకచతురాననులగుటచే వంశవృక్షమును శివయోగసారమందలి పద్యములను బట్టి సరిగా వ్రాసి యున్నారని [illegible] యున్నది. పైన వ్రాసిన సీసపద్యములో అన్నయదేవుని [illegible] యన్నయ. అన్నయ [illegible] బడియున్నది. ఈ వంశవృక్షమును [illegible] చూచినచో [illegible] యన్నయ. యన్నయదేవునకుఁ గేవల ము గజపతిగారి [illegible] కుమారుఁడైనట్లు కనబడుచున్నది. వంశవృక్ష మీ సరియైనదైనయెడల పై సీసపద్యమునకు, అన్నయను భావముతో వ్రాయఁబడినదైనను, [illegible] వలసియున్నది. అన్నయదేవుఁడు కాకతీయ వంశస్థుఁడైన గణపతిదేవునికుమార్తెయగు రుద్రాంబను చాళుక్య వంశములోనివాఁడైన వీరభద్రమహారాజునకును గలిగిన రుయ్యాంబయను కన్యకను బరిణయమాడినట్లు చిలుకూరి వీరభద్ర రావుపంతులుగారు కాకతీయాంధ్ర యుగమున వ్రాసియున్నారు. అన్నయదేవుఁడు నియోగిబ్రాహ్మణుఁడు; కాకతీయులు శూద్రులు. చాళుక్యులు క్షత్రియులు. ఈవివాహ మెట్లుజరిగినదను సంశయము కలుగుచున్నది. బ్రాహ్మణుఁడు నాలుగువర్ణములవారిని వివాహ మాడవచ్చునను సూత్రమిక్కడనన్వయించెనని తలంపవలసియున్నది. అన్నయదేవుఁడు రుద్రాంబనే కాకుండ పార్వతి, లక్ష్మమ్మ అను స్వజాతీయులనికువురనుబరిణమాడెనని శివయోగసారమందలియీక్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

"కాకతి రుద్రాంబ గాదిలిసుతయైన
రుయ్యాంబఁ బెండ్లాడి రూఢి కెక్కె
ఆ ద్విజ, లకుమాంబ లనవిలసిల్లెడు
కులభామినులను మక్కువ వరించె."

పైనిఁ గనుపఱచినవంశములోఁ గవివంశమునకు మూలపురుషుఁ డైన నావగొమ్మ్యఁడు ఇందులూరివిభుఁడై నిజామురాష్ట్రములోని

చ. ఇల బహుసైన్యముల్ గొలువ నేకశిలాపురి తూర్పుదిక్కునం
గలిగినరాజు లెల్లఁ గొని గర్వముమై (...) గాడిమండలే
శుల నకలింపఁ గోలి మఱి గోగులనాఁటును గొల్చి వీడు నా
వెలిగినవ్వులఁ గొనుచు వేగమె కొండిమిదాఁటి యిమ్ములన్

క. మాడిము ... గొని యా
నాడెసినన్నింటను మన్నెయిములు నొడిచి తా
నాడె కక్కింగనుపీమను
గూడినఘనిఁ గొనియె సోమకులముఖ్యుఁడొగిన్

ఆ. చిం(?)గొలని మండలీకుల నెసఁబోలి
గొలనిపేరు దాను గొనుటఁ జేసి
కాకతీశుఁడైన గణపతియండను
కొలని సోముఁ డనఁగ వెలసె జగతి.

ఈసోమ సామాత్యుఁడు కాకతీయగణపతియొక్క ప్రధానమంత్రి గను దండనాయకుఁడుగ నుండి, ఓరుగల్లునకుఁ దూర్పునఁ గళింగము వఱ కున్న ప్రదేశమును జయించినట్లును, కొలనువీఁడు మండలేశ్వరులను బారఁదోలి యాదుర్గమును గైకొనుటచే నాతనికికొలనిసోముఁ డని ప్రఖ్యాతి వచ్చెననియుఁ బైపద్యములలోఁ జెప్పఁ బడినది. కొలనువీఁ డనఁ గా నిప్పటి యేలూరుపట్టణమే. సోమయామాత్యునిమూలమున నీతని వంశీయులకు నిందులూరివా రనునింటిపేరు మాఱిపోయి కొలనువారను పేరువచ్చినది. ఈసోమయామాత్యుని యనుజుఁడైన పెదగన్న భూపతికూడ గణపతిదేవునియొద్ద మంత్రియుఁ దండనాయకుఁడుగా నుండినట్లు శివయోగసారమున నున్నదని చిలుకూరి వీరభద్రరావుపంతులుగారు కాకతీయాంధ్రరాజయుగ చారిత్రమున వ్రాసియున్నారు.

ఈపెదగన్నామాత్యునికుమారుఁడైనఅన్నామాత్యుఁడు ప్రసిద్ధపురుషుఁడు. ఇతనినిగూర్చి వీరభద్రరావుగారు కాకతీయాంధ్రరాజయుగచరిత్రమునం దీవిధముగా వ్రాసియుండిరి.

"అనేకపరాక్రమముతో నాంధ్రదేశమును ముప్పదిరెండు లేక నలువదిసంవత్సరములు పరిపాలనముచేసి ప్రఖ్యాతిఁగాంచిన కాకతీయ రుద్రమదేవి చక్రవర్తిని కల్గుటకు, కాకతీయప్రతాపరుద్రచక్రవర్తికిఁ బినతల్లి యైయు టియునగు నయిదువలూరి అన్నమాంబామాత్యుఁడు (అనఁగా అన్నయదేవుఁ డని పూర్వనామము) గణపతిదేవచక్రవర్తి మంత్రియును, సైన్యాధ్యక్షుఁ డుగానుండి కళింగదండయాత్రలు నడిపించిన సోమనామాత్యునకుఁ దమ్ముఁడును, అతనిప్రసిద్ధసేనాపతులలో నొక్కఁడునగు ఇద్దగన్నమా మాత్యునిపుత్రుఁడునైన ప్రతిభాశాలి యితఁడు రుద్రమదేవికాలమునను రెండవప్రతాపరుద్రదేవునికాలమునను, మహోన్నతపదవిని వహించు టయేగాక తనప్రతిభావిశేషముచేఁ గాకతీయాంధ్రసామ్రాజ్యమును బ్రోచుచు తుదకా మహాసామ్రాజ్యముతో నె యస్తమించినమహావీర సైన్యాధిపతియు మహామాత్యుఁడునై యున్నవాఁడు. స్వామిభక్తియు బాహుబలసంపన్నుఁడు మాత్రమేగాక మంచిరాజనీతి విశారదుఁడునై యాకాలమున విశ్వేశ్వరశివదేశికుని యపరావతారముగ సజ్జనులచేఁ బరిగణింపఁబడు చుండినవాఁడు. కనుకనే కొలనిగణపతిదేవకవిచే రచింపఁబడిన "శివయోగసారంబను వేదాంతగ్రంథముననవతారికలో నీతనిని తనపూర్వులలోనివానిగఁ జెప్పుచు నిట్లభివర్ణించియున్నవాఁడు.

సీ. అత్యుత్తమం బైనయత్యాశ్రమస్థుండు
కారణజన్మ సంగతి వహించె
ప్రకటసామ్రాజ్యసంపదలు సకలబంధు
కోట్లతోడను పంచుకొని భుజించె
మోపురిరాజుల నేపణంచుచు రాయ
చౌహత్తమల్లుఁడై జగతిఁబరగె
స్థలగిరివనదుర్గ జలకోటమల్లుఁడై
గ్రక్కునఁ బెక్కుదుర్గములు గొనియె
నొప్పి తురకలఁ గెలిచి ప్రతాపరుద్ర
మనుజనాయకుకోట నేమరక కాచె

సహసదాశివయోగి నాఁ బరఁగునట్టి
యిందులూరి నాగయమంత్రి కెవ్వ రీడు

ఆ. వె. ప్రాజ్ఞ కొమ్మరాజ పుత్రి పతివ్రతా
తిలకమైన గౌరిదేవి మొదట
పడసె లక్ష్మిదేవిఁ బెండ్లియై వేడుక
యందఁ గలిగె సత్పుత్రహాత్ములఁ గలను.

ఈపద్యములలోఁ గుండలీకరించిన భాగములు సుభాషితత్రిశతిలోఁ గూడఁ గుండలీకరింపఁబడియే యున్నట్లు శివయోగసారపీఠికనుబట్టి తెలియుచున్నది. మాతృకలో లేనిభాగమును, ఇతరులు పూరించినప్పుడిట్లు కుండలీకరించుట వ్రాయసకాండ్ర సంప్రదాయము. పైపద్యములలో "ఇందులూరి" యనుగృహనామము ఒక్కతావునమాత్రమే యున్నది. అదికుండలీకరింపఁబడిన భాగములోనిది కావున నాభాగమును వీరభద్రరావుపంతులుగారో మరియెవ్వరో పూరించియున్నట్లు తోఁచుచున్నది. అట్లు పూరించినవారికి "ఇందులూరి" యనిపూరించుటకాధారము లేమియున్నవో తెలియ లేదు. కాకతీయాంధ్రరాజయుగచరిత్రము సంచిక ౨౨౦ వ పేజీలో "నిరుడప్రోలునుబరిపాలించినచక్రవర్తిబిరుదాంకితులగు చాళుక్యరాజులకు మంత్రులుగా నుండెడివా రిందులూరివారని శివయోగసారమను గ్రంథమున నీక్రిందిపద్యములలో వరుసక్రమమున నిందులూరి నాకరాజును వానికుమారుఁడు బల్లప్రెగడను, వానికుమారుఁడు నాగయామంత్రిని జెప్పఁబడియున్నాఁడు" అనివీరభద్రరావుపంతులుగారు వ్రాసి, పైనివ్రాసినపద్యములలోని మొదటిమూఁడు పద్యముల నుదాహరించియున్నారు. కానియామూఁడుపద్యములలోను "ఇందులూరి" యనుశబ్దము లేదు. కావున శివయోగసారకృతిభర్త గృహనామము "ఇందులూరి" కాదని నిశ్చయ మగుచున్నది. ఆతని యింటిపేరు "ఈడూరి" యైనట్లు క్రిందివాక్యములలోనాగ్రంథపీఠికాకారులువ్రాసియున్నారు. అది సత్యమనుటకు సంశయము లేదు.

ఈ గౌరిగారి వంశవృక్షము క్రింద నిచ్చెదను.

భాస్కరామాత్యుడు




ఇందులో గౌరిభర్తయైననాగయ్య కాశిలో పాశుపతవ్రతమునుస్వీకరించి, తనకు సన్యాసాశ్రమస్వీకారముచేసి యజుర్వేదగురువను నామధేయమువహించెను. నిరవద్యపురప్రభువులును నిడుదవోలు పురప్రభువులును పూర్వచాళుక్యవంశీయులే.

కవి గ్రంథరచనాకాలమును జెప్పియుండలేదు. కవికి ముత్తాతయైనరుద్రదేవుడు ప్రతాపరుద్రునియొద్ద మంత్రిగా నుండెనని పైనిం జెప్పియుంటిని. ప్రతాపరుద్రునిరాజ్యము క్రీ. శ. ౧౩౨౬ లో నంతమొందినది. రుద్రదేవునితమ్ముని మునిమనుమం డైన గణపతిదేవ కవి క్రీ. శ. ౧౪౦౦ ప్రాంతమునం దుండెనని నిర్ణయించుటలో బ్రమాదముండనేరదు. కావున గ్రంథరచనాకాలము పదునైదవ శతాబ్దియందు ప్రథమభాగ మని నిశ్చయింపవచ్చును. వీరేశలింగముపంతులుగా

రీశవివి యాధునికకవులలోఁ జేర్చి "యిన్నూఱుసంవత్సరములకుముందే యుండినవాఁడయినట్లూహింపఁదగియున్నాఁడు" అని వ్రాసియున్నారు. శివయోగసారకృత్యాది వారికి లభింపకపోయియుండును. అందుచే వారట్లువ్రాసియుందురు. ఈకవిని అనియాదిగణపతిదేవునిచే, కేసంతు లుగారు పేర్కొనియున్నారు ఆదిభట్టారలు.

ఇచ్చట మఱియొక ముఖ్యవిషయమును గూర్చి చెప్పవలసియున్నది. కృతిపతికిఁ బ్రపితామహుఁడగుబల్లపెగ్గడనిరవద్యపురమానవనాథులయొద్ద మంత్రిగానుండెనని పైపద్యములలో నొకదానియందు జెప్పియున్నాఁడు నిరవద్యపురమనఁగా నిడుదవోలు పట్టణమనిచరిత్రకారు లందఱును నభిప్రాయపడియున్నారు నేనును నట్లేతలంచి, యీకవితరంగిణియందచ్చటచ్చటనట్లేవ్రాయుచువచ్చితిని. కానితరువాత నావిషయమున నొక్కింత సంశయముకలిగినది. గోదావరీమండలమందలి తణుకుతాలూకా మల్లిపూడిగ్రామమును నిరవద్యపురముగానుదాహరించుచు నందలియగస్త్యేశ్వరస్వామి కఖండదీపమునునిల్పికొమ్మన పెగ్గడ యొకశాసనమును శా.శ. ౧౨౨౯లో వ్రాయించెను. (A. R. 537 of 1929) ఈశాసనము మల్లెపూడి యందేయున్నది. ఈగ్రామమునందే తూర్పుచాళుక్య సర్వలోకాశ్రయ విష్ణువర్ధన మహారాజను పృథ్వీవల్లభ మహారాజుశాసనమొకటిశా. శ. ౧౨౧౦లో కలదు. ఈ గ్రామమున కత్యంతసమీపముననె జుత్తిగయను గ్రామమున్నది. ఈ గ్రామమునఁ గాకతిరుద్రాంబభర్తయైనచాళుక్యవీరభద్రుఁడు దావ్రాతుఁడైన శాసనమున్నది. ఈచాళుక్యులరాజధానినిరవద్యపురమనునామాంతరముగల మల్లెపూడి యనియు జుత్తిగకూడ రాజధానినగరమునం దొకభాగమై యుండుననియుఁ బిమ్మట వారిరాజధానినినిడుదవోలునకు మార్చిరనియు దోఁచుచున్నది. ఈమార్పు క్రీ. శ. ౧౩౦౦ వ సంవత్సరప్రాంతమున జరిగియుండును.

శివయోగసారకృతిపతులను వర్ణించుటలో బల్లపెగ్గడను "నిరవద్యపుర మానవనాథులయొద్ద మంత్రియనియు" నాతనికుమారుఁడైన

నాగమంత్రిని "నిరుడ ప్రోలిచక్రవర్తుల రాజ్యమహిమ" దాల్చెనని యు వర్ణించుటచేత నాగమంత్రికాలములో రాజధానీనగరమును మార్చినట్లు కన్పట్టుచున్నది. నిరవద్యపుర, నిరుడవోలునగరము లొక్కటి కావని యిందువలన స్పష్టమగుచున్నది.

గణపతిదేవుని కవిత్వము ప్రౌఢమయి హృద్యముగా నున్నది శివయోగసారమున శివ ప్రతిపాదక మైన యాధ్యాత్మిక విషయము, కర్మయజ్ఞము తపోజపధ్యానజ్ఞాన యజ్ఞములును, పంచయజ్ఞములరూపమున వివరింపఁబడినది. ఇందు పూర్వభాగము నాకులభింపనందున వీరేశలింగము పంతులుగారాంధ్రకవులచరిత్రమున నుదాహరించినమూఁడు పద్యములను, ఉత్తరభాగమునుండి నాలుగుపద్యముల నీక్రిందనుదాహరించుచున్నాఁడను.

చ. పరమదనుత్తో నొకింతయినఁ బాతునకేగి మహాఫలంబగున్
బరమసి యపారవిత్తము లపాత్రునకిచ్చినఁ గీడుపొందు ఘా
సము నొసఁగంగ దుగ్ధములఁ జాలఁగ ధేనువులిచ్చువట్టి దు
గ్ధములొసఁగన్ విసంబొలుకుఁగాదె భుజంగమయూధమిమ్మహిన్.

ఉ. ఈక్రియఁ గర్మమేర్పడిన నెంతయుభీతి జనింపుచుండఁ జిం
తాకులచిత్తయై కటకటా యిదియేమినిమిత్తమొకొ దా
నాకని కన్నుఁదమ్ముల ఘనమ్మగబాష్పము లేగు దేరఁగా
శోకభరాబ్ధిలో మునిఁగి సుందరికోకిలవాణి యేడ్వఁగన్.

మ. ఎవయన్ జీవనచింతఁ బొట్టుపొరలై యేప్రొద్దువర్తించు నీ
చుని యందుంగల శీలసూనృతగుణస్తోమంబులిట్లన్నియున్
దనరంబక్వముకాని కుంభమున యత్నంబార నిండంగఁ బో
సిన వారాంబరముభంగి నాశమగుఁజర్చింపంగ దేహంబుతోన్. 3 ఆ

ఉత్తరభాగము:—

ఉ. ఆపరమేశ్వరున్ శివుని నగ్ని దివాకరచంద్రమండల
స్థాపితచిత్స్వరూపు విలసద్గురునాథకృపావలోక నో

ద్దీపిత నిర్మలాత్ముఁడయి తీగతి నెవ్వఁడెకేఁగి దేసృష్టమై
నోపి భజించుచుండు నతఁడొందు ననుఁత్తబిమోక్షసౌఖ్యముల్. ౧౪

క. సంకల్పవికల్పములే
వంకం బాయఁగ నీక వైరాగ్యపిరా
తంకమతి జేయుకర్మము
గొంకక సంగతిప్రిదంబగుఁన్ విమలాత్మా. ౨౪

ఉ. రేచకపూరకంబులవి రెండునడంచిమనఃప్రచారప
ద్ధ్వాచి వ్యాప్తికనాశనము వేగమచేయఁగఁ జాలు కేవలం
బైచను కుంభకంబు సముదంచితబుద్ధిఁ దదీయశుద్ధి వి
ద్యాచతురత్వశుద్ధిగలయాతని కెందు నసాధ్యమున్నదే. ౩౪

తే. గీ. వేదములు శాస్త్రములు బహువిధపురాణ
ములును నసమానగణికలను బోలెనుండు
శాంకరీ విద్యయొకటి యీజగతిలోన
గుప్తమై కులస్త్రీ వోలెఁగొమరు మిగులు. ౪౪

ఈకవిచారిత్రమును ముగించుటకుఁబూర్వము పేరు తెలియని యొకకవిజీవితము నిటఁ జెప్పవలసియున్నది. భైరవాచార్యపుత్త్రుఁడగు మనుమంచిభట్టునతఁడు హయలక్షణవిలాసమనుకావ్యమును రచియించెననికవిచరిత్రకారులు వ్రాసియున్నారు. ఆగ్రంథతాళపత్రప్రతులు మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునను, రాజమహేంద్రవరమునందలిగౌతమీగ్రంథాలయమునను గలవు. ౧౯౧౧వసంవత్సరమున నీగ్రంథము ముద్రితమైనది. ఈముద్రితప్రతిలోను దాళపత్రప్రతులలోనుగూడ నిరువురుకవులు రచించిన రెండుగ్రంథములు మిళితములైయున్నవి. ఒకటి హయలక్షణవిలాసము, వేఱొకటి అశ్వలక్షణసారము. ముద్రితప్రతిలో శీర్షిక అశ్వలక్షణసార మనియున్నది. గద్యలో హయలక్షణవిలాస మనియున్నది. కొన్నితాళపత్రప్రతులలో నీగ్రంథము అధికారములుగా విభజింపఁబడియున్నవి. ముద్రితప్రతులలో నంకురా

ములుగా భాగింపఁబడినది ఈరెండుగ్రంథములను రచించినవారిలో నొకఁడు మనుమంచిభట్టు రెండవవాని పేరు తెలియదు. మనుమంచి భట్టు గ్రంథకృతిపతి కంపభూపాలుఁడు. రెండవ గ్రంథకృతిపతిగన్నయామాత్యుఁడు. గన్నయకృతిసందిన గ్రంథములోని:

క. నాలుగుకాళ్ళుం గొనచెవి
వాలము వదనము విశాలవక్షము తెలుపై
కాలునది యష్టమంగళి
వేలిసపతి యేలు ధరణివేలిసపతులన్.

అనుపద్యమును శాలిహోత్రములోనిదని మడికిసింగన తనసకల నీతిసమ్మతమునను నాహరించియుండుటచే నీగ్రంథముసింగనకవికంటెఁ బూర్వము రచియింపఁబడినది. కంపభూపతికంకితమైన రెండవగ్రంథము క్రీ శ ౧౪౨౦ ప్రాంతమునాఁటిది.

ముద్రితప్రతిలో రెండుగ్రంథములిమిడియున్నవని చెప్పుటకుఁ గొన్నిపద్యములలో "గన్నయభూపా !" యనిసంబోధనముండుటయుఁ గొన్నిపద్యములలో "సాళువకంపా" ఇత్యాదిగా కంపభూపతిసంబోధనము లుండుటయు నిదర్శనములు. ఇంతేకాదు ప్రథమాంకురములో:—

క. ఉరమున నుపరంధ్రంబుల
శిరసున రంధ్రంబులందుఁ జెలువుఁగ రెండే
నరయఁగ నెదుటను మూతిని
బసువడి యొకటొకటియున్నఁ బదిధృవులయ్యెన్.

అనుపద్యములోనిభావము నే ద్వితీయాంకురములో

క. ఉరమున శిరమున రంధ్రో
పరంధ్రముల రెండు ప్రస్థానములో

మొదటి గ్రంథము పేరేదియో తెలియదు. దీనియందీయనే మడికి సింగనకవి యొకపద్యమును గ్రహించి దానికి "శాలిహోత్రీయము" అని పేరిడినాఁడు. కావున నీ గ్రంథనామము "శాలిహోత్రము" అనియే నాయూహ. ఈ గ్రంథమునందలి రెండవపద్య మిది:—

చ. అనఘుఁడు శాలిహోత్రుఁడు హయంబులకున్ మును జెప్పినట్టి యా
యనుపమలక్షణంబులు వయఃపరిమాణము రోమజంబులన్
దెనుఁగున నశ్వవారలకుఁ దేటపడన్ రచియింతు సత్కవుల్
విని కొనియాడ నాదిగుణవిశ్రుత గన్నయమేడపేశ్వరా!

ఈపద్యమును బట్టి శాలిహోత్రుని గ్రంథము ననుసరించిన దగుటచే దీనికి "శాలిహోత్ర" మనియే గ్రంథకర్త నామకరణము చేసె ననియు "అశ్వలక్షణసారము" అను పేరును విలేఖకులో ముద్రాపకులో నుంచిరనియుఁ దలంపవచ్చును. ఈపద్యములో లక్షణములును వయఃపరిమాణమును సుడులును జెప్పఁ దలంచినట్లు కవి చెప్పియున్నాఁడు. ఈగ్రంథమందలి ౧౫౨ పద్యములలోను, నీమూఁడువిషయములును క్లుప్తముగా నున్నవి. కావున నిది సంపూర్ణ గ్రంథమని యెంచిన నెంచవచ్చును.

ఈపద్యములోని గన్నయయను పదమును గంపయయనిమార్చి యాంధ్రకవుల చారిత్రమునఁ బ్రకటించియున్నారు. తక్కిన గ్రంథముతో ననుగుణముగ నుండుటకై శ్రీవీరేశలింగము పంతులుగారీమార్పును గావించియుందురు. ఇంకననేకతావుల గన్నయయనుశబ్దముండుటచే దీనిని మార్పరాదు. ఈశాలిహోత్ర గ్రంథకర్త యెవ్వరో తెలియదు. తెలిసికొనుట కాధారము లిప్పటివఱకు నాకులభింపలేదు.

ఇఁకఁ గృతిపతినిగూర్చి యాలోచింతము. శాలిహోత్రమునఁ గృతిపతిని నీక్రిందివిధముగా సంబోధించియున్నాఁడు.

౧ గన్నయమేదినీశ్వరా! ౨ గన్నవసుధాధీశా! ౩ గన్నదండాధినాథ! ౪ అరిబలభీమ! ౫ గన్ననృపతి! ౬ గన్నభూప! ౭ దండనాయకతిలకా! ౮ మల్లయామాత్యపుత్త్ర! ౯ మల్లచమూపతి మహితహస్త మల్ల! రాయసాహత్తిమల్ల ౯ ప్రియసుత భీమాంబపుత్త్ర! పరమపవిత్రా! ౧౦ కొంకణపతియిభరిపుశౌర్యా.

పైవానిబట్టి గన్నయ దండాధినాథుఁడనియు, మల్లయామాత్యభీమాంబలకుఁ బుత్త్రుఁడనియుఁ గొంకణపతియనియు, రాయసాహత్తిమల్లబిరుదాంచితుఁ డనియుఁ దెలియుచున్నది. గన్నయలు పెక్కురున్నారు. మడికిసింగన కవికృత పద్మపురాణ కృతిపతి యగు కందనామాత్యుని పూర్వులలో గన్నయ కలఁడు గాని యతనితల్లి గౌరాంబ. అందుచే నాతఁ డీతఁడు కాఁడు. మారనకవికృత మార్కండేయపురాణ కృతిపతిగన్నయయున్నాఁడు కాని యాతఁడు బ్రాహ్మణుఁడు కాఁడు.

కొలను గణపతిదేవుని పూర్వులలో గన్నయలున్నారు. ఇందుకొఱకుఁ బైన వ్రాసిన వంశవృక్షము నొకసారి పరికింతము. ఇందుఁ గనుపడుచున్న గన్నయలలో మనకుఁ గావలసిన గన్నయ లేఁడు. కాని, పినమల్లిదేవుఁ డున్నాఁడు. ఇతఁడే మల్లయామాత్యుఁ డనియు, ఇతని భార్యభీమాంబ గావచ్చుననియు, వీరికొమారుఁడే శాలిహోత్రకృతిపతియగుగన్నయయనియు నాయభిప్రాయము. పెదమల్లవిభుని కుమారుఁడు పెదగన్నభూపతి వంశవృక్షములోఁ గనుపడుచున్నాఁడు. పినమల్లదేవునికుమారుఁడు పినగన్నభూపతి యుండుటవలననే యాతనిని పెదగన్నభూపతియనివాడఁ జొచ్చిరనియు, వీరు కాకతీయుల యొద్ద దండాధిపతులయినను భూపతులనియు మేదినీశులనియు నృపతులనియుఁ బిలువఁబడిరనియుఁ దలంపవచ్చును. సాహత్తిమల్లబిరుద మీ వంశీయులకున్నట్లు పైని వ్రాసిన పద్యములవలనఁ దెలియుచున్నది. కొంకణదేశము నిజాము రాష్ట్రము లోనిది. పినమల్లదేవుఁడు కాకతి రుద్రదేవునియొద్ద దండనాయకుఁడుగా నుండినట్లు పైని వ్రాసిన తరలపద్యములో నున్నది. ఈతనికుమారుఁడును దండనాథుఁ డై రుద్రదేవమహా

[illegible]యెనో యీతనితరువాత కాకతి గణపతిదేవునియొద్దకో దండాధిపతియై కొంకణదేశపాలనమున నియమింపఁబడి యుండును. శాలిహోత్రము [illegible] గ్రంథములన్నియు [illegible]పోయినవి. కావున సాక్ష్యా[illegible] శాలిహోత్రకృతికర్త పినమల్లామాత్యుని [illegible] మొదలగు [illegible] చేత [illegible] వలసి వచ్చినది.

---

## 67. వెన్నెలకంటి అన్నయ్య

ఇతఁడు దాఉవేలనియోగి బ్రాహ్మణుఁడు. ఆపస్తంబసూత్రుఁడు. హారితసగోత్రుఁడు; అన్నయామాత్య పౌత్రుఁడు; సూరామాత్య పుత్త్రుఁడు.

ఇతఁడెనిమిదాశ్వాసములు గల షోడశకుమారచరిత్ర మను నుత్తమప్రబంధమును రచియించి తనతండ్రియైన సూరామాత్యున కంకితము చేసెను. ఈగ్రంథకృత్యాదియుఁ దృతీయ చతుర్థాశ్వాసములును లభింపలేదు. తక్కినభాగము ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికలోఁ బ్రకటితమైనది. ప్రథమాశ్వాసమున నచ్చటచ్చటఁ గొంతభాగము శిథిలమైపోయినది.

కృత్యాది లేకపోవుటచే నీకవిచారిత్రము తెలియుటలేదు ఆశ్వాసాద్యంతపద్యములును గద్యయు నీతనిచరిత్ర కాధారములు. వాని నీక్రింద నిచ్చుచున్నాఁడను.

మ. జగదానందవిహార! హారమకుటచ్ఛత్రాదిసంపన్న! ప
న్నగభూషార్పితభావ! భావజకళానైపుణ్య! పుణ్యక్రియా!
సుగమాచారగభీర! ధీరహిత తేజోదీవ్యమానక్షమా!
గగనాభోగదిశాంత! శాంతమదరాగద్వేషద్వేషోదయా!

క. ఆఖ్యానకల్పితకథో
పాఖ్యానాఖ్యాయికా ప్రపంచరహస్య
వ్యాఖ్యానవ్యవహారణ
ప్రఖ్యాతచరిత్ర! వికచపంకజనేత్రా!

మా. శమదమగుణహారీ! శైవసిద్ధాంతవేదీ!
సముచితనయబుద్ధీ! సంవిదైశ్వర్యసిద్ధీ!
యమనియమధురీణా! యజ్ఞకర్మప్రవీణా!
శమితమదితవేగా! శాశ్వతాష్టాంగయోగా! ౧ ౮.

క. శ్రీమద్విరించిరాణీ
కోమలవీణా వినాదకూలంకష వా
గ్ధామాభిరామ! సుకవి
స్తోమనుతౌన్నత్య! యన్నసూరామాత్యా!

శా. తారానాయకబింబరత్నకలశీధారాళ నిర్యత్సుధా
సారాధరీకృత దుగ్ధవార్ధిలహరీసంతాననిత్యప్రభా
పారంపర్యపరాభవారభటిక ప్రాగల్భ్యభాస్వద్యశో
హారశ్రేణిపరిష్కృతాఖిల దిశాహస్తీంద్రకుంభస్థలా!

క. శ్రీరామాయణ భారత
పారాశరసూక్తి కావ్యనాటకప్రముఖా
సారపురాణవిలోచన
గౌరవమతిధన్య! మంత్రిగణమూర్ధన్యా!

మా. శరదమృతమయూఖశ్లాఘతేజోమయాంగా!
హరిహరపదపద్మధ్యాన ధన్యాంతరంగా!
నరపతినయ విద్యానర్తకీనాట్యరంగా!
పరబలతిమిరాళీ భంజనోద్యత్పతంగా! ౨ ౮

క. శ్రీచరణాంబుజసేవా
వైచిత్రీనిరత! శిష్యవర్గమహా శ్రీ

ప్రాచుర్యమూల కరుణా
సూచితమాహాత్మ్య! యన్నసూరామాత్యా!

శా. ఆపస్తంబపవిత్రసూత్ర! హారితఖ్యాతాన్వవాయామృతా
 స్వారాగామకభూజ! భక్తిపరతక్షోణీశచూడామణీ
 దీపారాధితపాదపీఠ ధరణీతేజః ప్రతిష్ఠాపన
వ్యాపారావన! సల్లుహాప్రకులచూడాకల్పరత్నాంకురా!

క. మరకతపర్వతాక్షిత్వకవిప్రము
కుసుమందమహేంద్రశిల గోమేధిక వి
స్ఫురితమణి ఖచితభూషణ
పరితోషణ సుకవిలోక! భవ్యవివేకా!

ఉత్సాహ. బంధురప్రబంధ బంధభవ్య నవ్యభాషణా!
 సింధుసమగభీరతా విశేషనిత్యభూషణా!
 సింధురాత్త్రప్రచుర తురగ సేవ్యవాజిశిక్షణా!
 బంధుమితసుకవి నికరపాలనా విచక్షణా! ఆశ్వా

క. శ్రీహర్షముఖ్యసుకవిక
మాహితకావ్య ప్రపంచమాధుర్యసుధా
గాహన లీలారసిక
వ్యాహారవిహార! మంత్రియన్నయసూరా!

ఉ. భట్టియుగంధరాది నగపాలకమంత్రిమహాప్రవాహసం
ఘట్టనధీధురంధర! వికారవిమోహ! విలాసబంధురా!
పట్టపటావళీకనకభద్రమదావళ భూరిభూషణా!
రట్టజవాజిరత్న నికరక్రమ పూజిత కాలకంధరా!

క. శారదనీరద నారద
పారదబిసశారదాబ్జ భాసితశ్రీయశః

ప్రారఘనసారపూరిత
సారసగర్భాండభాండ సదవనశౌండా !

మందారదామము. సంగీతసాహిత్య నానాస్వగోలా !
శృంగారలక్ష్మీవశీకారలీలా !
అంగాధిపౌదార్య హారి ప్రధానా !
అంగీకృత శ్రీమదానిష్ఫిధానా ! ౭౬

క. శ్రీభార్గవ కామందక
వైభావసమోపధార్య ! నాఁడవముంత్రి
ప్రాభవ విడంబన్ఫురణ
శోభితపాణ్డిత్య ! యన్నసూరవరేణ్యా !

మ. సరసానందన సత్కళాగమపరీక్షాకల్పకందార ! భా
స్వరనానారసభావ నిర్మథనభోజక్ష్మాప ! విద్యానిరం
తరగోష్ఠీజగదేకమల్ల ! బహుశాస్త్రగ్రంథ సిద్ధాంతవి
స్తరవిజ్ఞానకవిత్వకావ్యకలనా సర్వజ్ఞసోమేశ్వరా !

క. వీణావాదన చలదలి
వేణీవేణీ ప్రసూన విహరన్మధుప
శ్రేణీగానాకర్ణన
ఘోణీకృతచేతః ! మానితగోత్రపవిత్రా ! ౭౮

క. శ్రీభాసమాననానా
వైభవజయలాభ ...... నవితాంత
స్వాభా.. త సౌరభ
శోభితపాండిత్య ! యన్నసూరామాత్యా !

ఉ. ... ... ... ... ... ... ... ... ప్రీతిమానదాన వి
ద్యామహనీయవైభవ కృతార్థిత సత్కవిరాజమత్సరో
ద్దామవిరోధిమంత్రి జనతాదృఢమంత్ర రహస్య
... ... ... ... ... ... ... ...

సమలానందుని బోధించెను. కాన సింహాచలమాహాత్మ్యము పదునాల్గవ శతా బ్దాంతమున రచియింపఁబడియుండును.”

దీనినిబట్టి పదునాల్గవశతాబ్దియో, లేక యింకను కొంచెము పూర్వపు కవికాలమని పీఠికాకారుల యభిప్రాయమనుట స్పష్టము. 194[illegible]వ సంవత్సరము మార్చినెల 30వ తేదీగల యాంధ్ర పత్రికయందు “విద్యా రత్న” పండితులీ యన్నయకవి, యాంధ్రకవితరంగిణి మూఁడవ సంపుటములోఁ జెప్పఁబడిన వాఁడని యభిప్రాయ పడినారు. కాని వారంశములకు హేతువులను జూపలేదు.

విష్ణుపురాణమును రచించిన వెన్నెలకంటి సూరయామాత్యుఁ డీ గ్రంథకృతిపతి యనుట పొసఁగదు. ఆసూరయామాత్యుని తండ్రి యమరయ్య. ఈసూరయ్య జనకుఁడు అన్నయ. విక్రమార్క చరిత్ర యందు జక్కయకవిచే:

ఉ. వెన్నెలకంటి సూర్యుఁడు వివేకగుణాఢ్యుఁడు వేదశాస్త్రసం
పన్నుఁడు రెడ్డివేమ నరపాలకుచేత మహాగ్రహారముల్
గొన్న కళంక కుంజరుఁ డకుంఠిత తేజుఁడు పెద్దతండ్రిగా
సన్నుతిఁ గన్న సిద్ధనకు సంతతదానకళావినోదికిన్.

అనుపద్యమునం దుదాహృతుఁడైన సూరయ నొకనిని మన మిది వఱకెఱుఁగుదుము. కాని యాసూరయయే షోడశకుమార చరిత్ర కృతిపతియని నిశ్చయించుటకుఁ బై నివ్రాసినయాశ్వాసాద్యంత పద్యములలో వేమారెడ్డి విషయముగాని అగ్రహారముల మాటగాని సూచనగానైన లేకపోవుటచే నవకాశము లేకున్నది. అతఁడే యాతఁ డైనచో నావిషయమిందు తప్పక యుండియుండును.

అనపోతారెడ్డి కాలమునందలి వెన్నెలకంటి వారిని గూర్చి చెప్పిన:

ఉ. ఈనిఖిలంబు మెచ్చ నమరేశ్వరు దేవుఁడు చూడఁ గృష్ణవే
ణీనది సాక్షిగా ననికి నిల్చిన రావుతు గేసభూవిభుం

సూరనార్యునినాయిక పరిభావతి. అన్నయార్యునినాయిక హంసావళి. పరిభావతిని మన్మథుఁడు సృష్టించెనేమో యనిసూరన:—

ఉ. వెన్నెలతేటనిగ్గు నరవిందపుఁజేకుఱ్ఱమృదుత్వముం బదా
ర్వన్నెయజాళువాపసిఁడిరంగు మెఱుంగులధాళధళ్యమున్
గన్నియరూపుగాఁ గరువుగట్టినసోఁజుఁడు పోఁతఁబోయఁబో
లు న్నిఱవేర్పుతోఁ ననుట లోకుల పల్కఁది చాలదేమియున్.

అని యుత్ప్రేక్షించినాఁడు. అన్నయహంసావళిని అట్లే మన్మథుని సృష్టియని:—

సీ. నెలచందురునికాంతి నెమ్మోమునఁబ్రజియించి
యకలంకవిలసనం బలవరించి
కలువ రేకులమించు కన్నులు గావించి
నిత్యవికాసంబు నెఱపు గొలిపి
చక్రవాకవిభూతిఁ జన్నులుగల్పించి
పాయనిపొప్పులు పరఁగఁజేసి
కరికుంభవిస్ఫూర్తిఁ గటిచక్రి మొనరించి
కోమ రారు నునుజిగి గుమురుగొలిపి
వనజభవుసృష్టి సిచ్చఁ గైకొనక తాన
మీనకేతుండు వేడ్కఁ నిర్మించెఁ గాక
మూఁడుజగములఁ గలుగుపూఁబోఁడులందు
మాళవేశ్వరకన్యకఁ బోలఁ గలరె!

ప్రద్యుమ్నుని రూపమును, పార్వతి చిత్రఫలకమున వ్రాసి పరిభావతికి స్వప్నముననిచ్చినది. హంస యారూపమును బోల్చి చూచి, ప్రద్యుమ్నుఁడని తెలిపినది. ఇట నాయకుని రూపమును నాయిక విహరించు నాట్యమండపమందలి కుడ్యభాగంబునఁజిలుకయే వ్రాసి, యారూపము గలపురుషుఁడున్నాఁడా? యనినాయిక ప్రశ్నింప నాయకుని రూపురేఖలు వర్ణించి యాతనివృత్తాంతమును దెలిపినది.

కవిత్వము నిర్దుష్టమైనది. ఉభయభాషాప్రౌఢి మెఱయుచున్నది. శైలి మంచనకేయూరబాహుచరిత్రమును, జక్కన విక్రమార్కచరిత్రమును, కేతనదశకుమారచరిత్రమును బోలుచుండును. పద్యములు హృద్యములై ధారాశుద్ధి కలవిగానున్నవి."

అన్నయకవి కవిత్వశైలి తెలియుటకై యాశ్వాసమునకొకపద్యము నిట నుదాహరించుచున్నాఁడను.

చ. అమరులకెల్లఁ దత్పరిధరామరి నల్లభు లెక్కడంట త
క్ష్యము తలఁపంగ నాగమవిధానములై తనరారు తారు ని
త్యమునొనరించుదానముల యజ్ఞములం బరితృప్తిఁ బొంది సం
భ్రమమునఁ దేలి వారువడిఁ బ్రస్తుతిసేయఁగఁ బెంపుఁ జెందుటన్ ౧౩

ఉ. లాలితరూపయౌవనవిలాస మనోహరుఁడైన తనక్కు సీ
లాలకనిఁ ద్రవోవఁగని మాడటఁగౌఁగిటఁ మేలుకొన్పఁగాఁ
జాలక యాత్మఁ దక్కిన విచారములొందఁగ నూరకుండ నా
కూళఁడు కామరాజ్యమునకు న్వెలిగాఁ దెతలంచి చూడఁగన్. ౨౮

మ. తరుణీ! నీసుతుఁ బెట్టెలోపలను గృపద్వారంబునం బెట్టి మె
వ్వరునుంగానకయుండ నిప్పుచని తేవంగాంచి సూర్యప్రభుం
డుగు తేజంబున వానిఁజూచి మదిలో నుప్పొంగుచుం బుత్రుఁగా
నిరవద్యోత్సవలీలమైఁ బెనుచు వీని న్నాదుదివ్యాజ్ఞమై ౪౮

శా. ఏచందంబున నబ్బునో యబలయం చేనాత్మనూహింపఁగా
వాచాటత్వము నాదుకర్ణముల కత్యానంద మొందించిన
న్వాచాలత్వ మెలర్ప హేమపురము న్వర్ణించి యేఁగంటి నం
చాచంద్రాస్యవరించు వాఁడనిది కార్యంబంచు ధైర్యంబునన్. ౬౮.

ఉ. ఈసరసోక్తులీమహిమ యీయవికారత యీవిలాసమీ
రాసికి యీయుదారత ధరావరులెవ్వరియందుఁగల్గునే

లబ్ధమంగళములఁ బాలించుకొఱకు ను
చితనిత్య సౌఖ్యసంసిద్ధికొఱకు
నొసరఁ గాంతాసమ్మితోపదేశంబునఁ
బ్రీతిమై హితమాచరించుకొఱకు

సమ్యఁగానఁ బ్రస్థలాచరించెదనంచు
చేసుకొలఁదిఁ గృతిసేయనర్పఁబూని
యస్మదీయకృతికి నధిపతిగావింప
నర్హుఁ డెవ్వఁడొకో-యని తలంచి.

సీ. నూతనంబయ్యుఁ బురాతనకృతులట్లు
సంతతశ్రావ్యమై జరుగుననియు
నాదిరాజసమానుఁడగు భోజభూపతి
చరిత మీకవితాప్రసంగమనియు
నిందుఁజెప్పెడికథ లన్నియు నోలిఁబ్ర
శస్తధర్మోపదేశంబు లనియు
సకలజగన్నాథుఁడగు నహోబిలనాథుఁ,
డీపుణ్యకృతికి నధీశుఁడనియుఁ

బృథివి నెల్లజనులు ప్రియభక్తియుక్తిఁ బా
టింతురనియు నూఱడిల్లి యేను
బరమసౌఖ్యమైన భవదాభిముఖ్యంబు
నెమ్మిఁబడసి యధికనిష్ఠతోడ.

ఛందోదర్పణ చతుర్థాశ్వాసమందు:

ఉ. శ్రీనిధి చక్రవర్తి గురుశేఖర పుణ్యకటాక్షలబ్ధ సు
జ్ఞానుఁడనంత ధీమణిలసన్మణి భోజచరిత్ర చెప్పి ల
క్ష్మీనరసింహుఁగూర్చిన ప్రసిద్ధుఁడు వేడుకతోనొనర్చె ఛం
దోనుతి యోగివాద్రివిమలతోయజపత్రకనంతమూర్తికిన్.

అని చెప్పియుండుటచే, మొదట భోజరాజీయమును బిమ్మట ఛందోదర్పణమును, బిమ్మట రసాభరణమును రచియించినట్లు చెప్ప దగియున్నది. రసాభరణము శ్రీసోమేశ్వర కంకితమైనదని యీగ్రంథ మందలి యుదాహరణ పద్యములందు సహజముగా శ్లేషాదుల సంబోధన ములను బట్టి చెప్పవచ్చును. భోజరాజీయ గ్రంథాంతమునందు యాశ్వాసాంతమున రచనాకాలము నీక్రిందివిధముగా చెప్పియున్నాఁడు.

శా. జానొందన్ శకవత్సరంబుల్ ఋతునేత్రాగ్నీందుసంఖ్యన్ బొప్పారఁగా న
య్యానందాబ్దమునందు మాఘసితపక్షైకాదశీభౌమయు
క్తానూరాధమ్ముతి వేళ నీకృతి యనంతాఖ్యుండు సమ్యగ్రస
శ్రీనిండన్ ధవళపట్టనాథునకిచ్చెన్ భక్తిప్రాగల్భ్యంబుగన్

ఇందుఁ జెప్పఁబడిన కాలము హూణశకము ౧౪౩౫ సంవత్సరమున జనవరి నెల ౨౫ తేదీయైనది. అప్పటికిఁ గవి ౫౦ సంవత్సరముల వయసువాఁడైనని తలంపవచ్చును. ఇది నిజమయినచో నితఁడు శ్రీనాథునకంటె వయసునఁ గొంచెము చిన్నవాఁడైనను నాతనికాలమున నితఁడు గ్రంథరచనను చేసినవాఁడని చెప్పుటకు సంశయము లేదు. ఇతనిగురువు చక్రవర్తియను శ్రీవైష్ణవుఁడైనట్లు వైపద్యము వలనఁ దెలియుచున్నది.

ఛందోదర్పణము నాలుగాశ్వాసములు కలది. ఈగ్రంథమును ౧౯౨౧ వ సంవత్సరములో వావిళ్ళవారు ముద్రింపించి యున్నారు. దీనికి గిడుగు వెంకటసీతాపతిగారు ౮౩ పుటలుగల పీఠికను వ్రాసి గ్రంథమునకు వన్నె తెచ్చియున్నారు. ఈఛందోదర్పణమును "అనంతుని ఛందము" అని వాడుదురు. సులక్షణసారాప్పకవీయాదు లలోవలె నీగ్రంథమునందలి లక్షణములకు లక్ష్యముల నితరకవులనుండి గైకొనక లక్ష్యములనుగూడ నితఁడే రచించియున్నాఁడు. ఈగ్రంథము భగవంతున కంకితమీయఁబడినది. ఈగ్రంథపీఠికలో బయ్యన బిరుదు

"భవ్యభారవి" అనియున్నది. భవ్యభారతి కాని భారవికాదు. ఇది యచ్చుపొరపాటైయుండును.

ఈనాభారణముకూడ నాల్గాశ్వాసములు కలదియే. ఇది ధ్రువ పట్టణమందలి యీశ్వరునకు అంకితమీయఁబడినది. ఈధ్రువపట్టణ మేదియో తెలియదు. ఏగ్రామనామమునో సంస్కృతీకరించి ధ్రువ పట్టణమనినాఁడని తోఁచుచున్నది. తండ్రినివాసము పెనుమకూరు అని పైని వ్రాసియుంటిని. ఇదికృష్ణామండలములోని బెజవాడ తాలూకాలోనున్న పెనమకూరుగాఁ గొందఱుభావించిరి. కానియాగ్రామములోఁ బూర్వము కవులున్న జాడలేదనియు ననంతామాత్యుని తండ్రి నివాసమదియేయని నిశ్చయించుటకుఁ దగినయాధారములు గానరావనియు నాగ్రామములో నప్రాచీనమైన చెన్నమల్లేశ్వరాలయము దక్క వైష్ణవాలయములు లేవనియు నాయూరఁ గౌండిన్య గోత్రులగు బ్రాహ్మణులు లేరనియు నాగ్రామవాస్తవ్యులును విద్వాంసులునగు పెనమకూరు సుబ్బారావుగారు వ్రాసియున్నారు. కావునఁ గవినివాసము పెనమకూరు కాఁజాలదు.

తనతండ్రిగ్రామము కృష్ణవేణ్ణా మలాపహారిణీ భీమరథ్యంత ర్వేది సంస్థితమై యున్నదని పైపద్యములోఁ గవి చెప్పియున్నాఁడు. ఈమూఁడు నదులును గలిసిన తావున నిది యున్నదని తలంపరాదు. వేణ్ణా, మలాపహారిణి, భీమరథీనదులు కృష్ణ యుపనదులు. కృష్ణాతీర మందే యీగ్రామముండెనని భావింపవలసియుండును. పెదకోమటి మాచారెడ్డి కుమారుఁడైన తిప్పారెడ్డి వ్రాయించిన చెఱకుపల్లి శాసనములోఁగూడ "కృష్ణవేణ్ణామలాపహారిణీ భీమరథ్యంతర్వేది సంస్థితమ్. భోగైశ్వర్యాష్ట సంయుక్త మేకమూరుం పురోత్తమమ్" అని వాడియున్నాఁడు. పెరమగూరు శ్రీకాకుళమునకు సమీపమున నుండియుండును. కవితండ్రియైన తిక్కనామాత్యుఁ డీ శ్రీకాకుళము నందలి యాంధ్రదేవునకు భక్తుడు కవికూడ పెరమగూరు వాసుఁడై

శ్లో. శృంగారహాస్యకరుణా । రౌద్రవీరభయానకాః
బీభత్సాద్భుత శాంతాఖ్యా । నవాఽప్యుక్తా । ముదాహృతాః ॥

నవరసలక్షణములును వానియందు శ్రేష్ఠమగుటచే శృంగారరసవిషయ సందర్భమున హావభావాది విషయములును నాయికానాయక లక్షణములు సోదాహరణముగా నిందుఁ జెప్పఁబడినవి. విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణియందు పంచమ ద్వితీయోల్లాసములయందును తృతీయోల్లాసమున గొంతవఱకును జెప్పిన విషయములే యిందును జెప్పబడినవి. లక్షణములు నుదాహరణములు నిచ్చుటలోఁ గొన్ని తావులఁ బెద్దనకంటె ననంతునిదే పైచేయియైనదని నా యుద్దేశము పెద్దన శైలికంటె ననంతుని శైలి సులభమై సామాన్యులకుఁ గూడ తెలియునట్లున్నది. పెద్దన శైలి కృతిపతి నామముముద్ర వలయునను నియమము లేకున్నచోఁ జక్కగానుండియుండును. రసాభరణము సంస్కృతగ్రంథమున కాంధ్రీకరణముగాక స్వతంత్ర గ్రంథమువలెఁ గన్పట్టుచున్నది

అనంతామాత్యుఁడు రచించిన భోజరాజీయము సప్తాశ్వాసములు గలది. అహోబలనరసింహున కంకితమైనది. ఇందు భోజరాజు పూర్వజన్మ వృత్తాంతమును నిజజన్మమున నాతఁడొనర్చిన యద్భుత కార్యములును ప్రసక్తానుప్రసక్తముగ ననేకచిత్రకథలును జెప్పబడినవి. ఈకావ్యమందలి వర్ణనలు స్వభావోచితములై లోకోక్తులతోఁ గూడి మనోహరముగా నుండును. ఈకవికవిత్వము ద్రాక్షాపాకమున నిర్దుష్టమై పాఠకుల కింపు గల్గించుచుండును. ఉత్తమ కావ్యములలో నిదియొకటిగా నెన్నఁదగినది. ఇతివృత్తమును సొగసుగా నున్నది. ఇందు నీతిని బోధించు పద్యములును కథలును పెక్కులున్నవి. శృంగారము ప్రధానరసమైనను నది పచ్చిగాలేక యుచితరీతినున్నది.

ఈతని కవిత్వశైలి తెలియుటకై యీతని గ్రంథముల నుండి కొన్ని పద్యముల నుదాహరించి యీకవిచారిత్రమును ముగించెదను.

సాభరణము: శాంతరసము:

ఉ. మ్రొక్కిన వెక్కిరించినను మోదినగందము దెచ్చి పూసినఁ
బ్రొక్కిన నెత్తుకొన్నఁ గృపతోఁ గుడిపించినఁ బస్తువెట్టిన
న్నిక్కను సుక్కలేక తెగఁజేసములఁ గనుమ మాత్రికులందుఁ దా
నొక్కవిధంబుగా మెలఁగుచుండు మహాత్ములఁ జెప్పనొప్పగున్.

విప్రలబ్ధము:

ఉ. హేమసంపదాఢ్యుఁడగు నంతియకాదు వదాన్యుఁడౌ జగ
ద్భావమంత్రి సద్గుణశాలి భుజాపరిఘుండు నౌ కళా
కౌశలుండు నౌ మురారి యటఁ జెప్పఁగనేల ప్రియోక్తులల్పమా
మాత్రిః చాలుఁ జాలు మఱితూపులు దాఁకినఁ దాఁక నీతుదిన్.

అనేకము :—

చ. అడరఁగ గోపకృష్ణుని వివాహమహోత్సవభేరి మ్రోయఁ గాఁ
బడఁతులు చూడ వేడ్కపడి భాసురరత్నవిభూషణాఢ్య ము
త్స్వేడ వెడ సంతరించుచును వీథ్యాడఁ బూనుచు సంభ్రమింపుచు
న్వడిఁ జనుదెంచి యెక్కిరి సువర్ణమయోన్నత సౌధశృంగముల్.

ముగ్ధ :

చ. అతులతపః ప్రభావమహితాత్ముల కైనను గానరాని య
చ్యుతుఁడు లతాంగి నెమ్మనము సొచ్చి సుఖస్థితి నున్నవాఁడు నేఁ
డతని భజింతమంచు శ్రివణాదులు దద్గతవృత్తినుంట నా
యతివ సఖీజనంబు భయమందగ నున్నది నిశ్చలాకృతిన్.

పరకీయ :

ఉ. అత్తియు నూరలేదు మగఁడా మఱి మందకుఁబోయి రాఁడు నే
నిత్తఱినొంటి నుండుదనియోఁ జనుదెంచితిఁ గృష్ణరాయ ని
చిత్తమెఱింగి మూలదెసఁ జీఁకటి దాఁచినదాన వెన్న గో
డొత్తునమండి యేల నను నూరకె చూచెదు తొంగిచూపులన్.

# హిందూ ధర్మ శాస్త్ర గ్రంథ నిలయము
## కపిలేశ్వరపురము తూర్పుగోదావరి

**దుర్గేశనందిని** రచయిత:— శ్రీ చాగంటి శేషయ్యగారు

ఇందు పఠానులకును రసపుత్రులకును జరిగిన కలహము —రాజా మాన్‌సింహుని పుత్రుడగు జగత్సింహుని మహావీరత్వము —చక్కని శైలితో తెనుగుభాషలో మేటినవలా రత్నమనుటకు సందియములేదు. ఇది సప్తమముద్రణము. (టెక్స్టుబుక్ కమిటీ వారిచే లైబ్రరీలు ఉపయోగించుటకు అంగీకరింపబడినది) రు 2-50

**నవాబు నందిని** రచయిత:— శ్రీ చాగంటి శేషయ్యగారు

దుర్గేశనందని యందలి మిగిలిన కథా విశేషములన్నియు "నవాబు నందని" యందు చదువవలయును. వెల రు 2-50

**రాధారాణి** రచయిత:— శ్రీ చాగంటి శేషయ్యగారు రు 0-50

నిరుపేద బాలిక "రాధారాణి" — గొప్పధనవంతుడు దేవేంద్ర నారాయణరాయ్ దైవికసమావేశము— వీరిరువురి ప్రణయగాథ.

**శ్రీ** (ద్వితీయముద్రణ)

రచయిత— శ్రీ చాగంటి శేషయ్యగారు

చక్కని చారిత్రాత్మకమైన నవల.

మహమ్మదుపురము శత్రువుల హస్తగతమైన పిదప అద్వితీయ ప్రతిభాశాలియు, మహారాజునగు సీతారామరాయ లెట్లుప్రవర్తించెనో ఏరూపముతో నెట్టియవస్థయం దెట్టి కార్యములాచరించుటలో బ్రవృత్తుడయ్యెనో యిందు మనోహరమైన శైలిలో హృదయరంజకముగా వర్ణింపబడినది ప్రకృతియొక్క రీతి, నీతులిందు వివరింపబడినవి.

చక్కని అచ్చు మంచిగ్లేజుకాగితం వెల రు 2-50 న పై.

**విశ్వప్రయత్నము**

రచయిత:—శ్రీ చాగంటి శేషయ్యగారు

ఇందలి రంగములును పాత్రములును నాంధ్రదేశమునకు సంబంధించినవి. కథాకల్పనము పాత్రగుణపోషణము, మొదలగునవి యిందు చక్కగా బ్రదర్శింపబడినవి. ఇది సాంఘిక నవలయైనను, నవబాధ పరిశోధక నవలాలక్షణములచే నతి మనోహరముగ నలరారుచున్నది. మంచి గ్లేజుకాగితము, చక్కని అచ్చు! 366 పేజీలు రు 3-00

## మాతృమందిరము

(తృతీయముద్రణ)

రచయితలు:— శ్రీ వేంకటపార్వతీశ్వరకవులు

ఈ మాతృమందిరము భౌతిక ప్రపంచమున ప్రతిఫలించుచున్న భావనా ప్రపంచమందలి పవిత్ర చిత్రమందిరము

ఇందలి ప్రభోదానందస్వామి స్వాభావికస్వరూపముచే సాక్షాత్కరించుచున్న సనాతన విజ్ఞానమయ దివ్యమూర్తి. ఇందలి ముఖ్య వృత్తము 'అహింసాపరమోధర్మః ఆత్మవత్సర్వభూతాని— పరోపకారార్థమిదం శరీరం' అనునవి మొదలుగాగల దివ్యశ్రుతులు—అనన్యనామ రాజ్యము.

అక్షరరూప విలసితమగు ఈమాతృమందిరమునందలి పరమార్థమును ఆంధ్రసోదరులందరు గ్రహించి మాతృదేశము నానందమందిరముగ జేసికొని ఆనందించెదరుగాక!

చక్కనిఅచ్చు, గ్లేజు కాగితము 366 పేజీలు వెల రు 2—50 న. పై.

## పద్యకావ్యములు



## ఏకాంతసేవ

శ్రీ వేంకట పార్వతీశ్వరకవులు పరమేశ్వరునిగూర్చి పాడినపాట. భక్తిరస ప్రపూరితములగు నీగీతామృతమును ప్రతియాంధ్రుడును గ్రోలి యానందింప దగినది. ప్రకృతి లీలాస్వరూపుడగు పరమేశ్వరు నారాధించుటలో రవీంద్రుని గీతాంజలివలె వన్నెకెక్కినది. మృదుమధురము కడు హృద్యమమునగు నీప్రకృతి శృంగారకావ్యము నెల్లరు భక్తితన్మయులై చదువవలసినదే!

## కావ్యకుసుమావళి

శ్రీ వేంకట పార్వతీశ్వరకవులచే నేటివఱకును రచింపబడిన ఖండకావ్యములన్నియు భాగములుగ ప్రకటింపబడినవి. ఈ కవిద్వయము నవశకవియుగకర్తలై ఆంధ్రలోకము నలంకరింపజేసిన మృదుమధుర వాఙ్మౌక్తికతరంగములన్నియు నిందుపొందుపఱుపఁబడినవి. భాషాభిమానులగు ప్రతియాంధ్రునకు, ప్రతిపుస్తకభాండాగారమునకు నీమహాకవుల కావ్యసంపుటములన్నియు నమూల్యాలంకారములు.

## బృందావనము

రచయితలు:— శ్రీ వేంకట పార్వతీశ్వరకవులు.

ఇందలికథ పురాణప్రసిద్ధమైన బృందాదేవియొక్క ప్రేమగాథ. ఆ మేఘశ్యామసుందరుఁడగు శ్రీకృష్ణపరమాత్మునివలచి, వలపించి, వరించిన దివ్యచారిత్రమే ఈమహాకావ్యము. భక్తిశృంగారరసప్రపూరితమై మధురాతి మధురమై చల్లగ నానందతన్మయుల జేయుననుట యతిశయోక్తికాజాలదు. వెల 1—50

## చిత్రకథాసుధాలహరి 1-00

రచయితలు:— శ్రీ వేంకట పార్వతీశ్వరకవులు.

మనోజ్ఞమైనకథాకల్పనలతో—చక్కనిపాత్రౌచిత్యము గలిగి—శృంగారాదిరసపోషణతో మృదుశైలిలో మనోహరమైనపద్యకావ్యము.

## భావసంకీర్తనము 1-00

రచయితలు:— శ్రీ వేంకట పార్వతీశ్వరకవులు.

ఇందలి భక్తిపూరితములగు సీసపద్యమాలికలు గద్యరచనలం బోలి సరళములై మృదుమధురములై పఠనీయములై విలసిల్లుచున్నవి.

---

ఆంధ్రప్రచారిణీ లిమిటెడ్
రామచంద్రపురం, తూర్పు గోదావరి